SWEEYA JNANAM - J. KRISHNAMURTI

Telugu translation of: *On Self-Knowledge*
*Translated by* Sarojini Premchand



*Published by :*
Krishnamurti Foundation India
First Edition : April 2001

*Cover design :* Bujjai

*Price :* **Rs. 75-00**

*Printed at :*
Stree Seva Mandir Press
13/1, K. Karunanidhi Road
Saligramam, Chennai - 600 093.

# ఈ పుస్తకం గురించి.....

జె. కృష్ణమూర్తి ప్రసంగాలలో కొన్నింటిని 'దశాబ్దాల నుండి సేకరణ' (సెలెక్షన్స్ ఫ్రమ్ ది డికేడ్స్) అనే శీర్షిక క్రింద కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియావారు ప్రచురిస్తున్నారు. ఇప్పటికి మూడు సంపుటాలను ఇంగ్లీషులో ప్రచురించారు. అందులో మొదటిది 'ఆన్ సెల్ఫ్ నాలెడ్జ్' దానికి తెలుగు అనువాదమే ఈ 'స్వీయజ్ఞానం'.

ఈ సంపుటంలో 1947, '48, '49 లలో మన దేశంలోని వివిధ నగరాలలో చేసిన ప్రసంగాలు పొందుపరచి వున్నాయి. మన దేశ చరిత్రలోనూ, కృష్ణమూర్తి బోధనల నవ వికసనంలోనూ 1947 ప్రముఖంగా పేర్కొనదగిన సంవత్సరం. దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిందే తప్ప దురాశా, దోపిడీ తత్వమూ వంటి శక్తులు మనిషిని పీడిస్తూనే వున్నాయి. పరాయి పాలన నుండి విముక్తి లభించింది. అయితే అసూయ, ద్వేషం, స్వార్ధపరత్వం వంటి కల్మషాలను మానవ చేతనలో నుండి తొలగించినప్పుడే మనిషికి నిజమైన స్వేచ్ఛ లభిస్తుంది. అది చట్టాల వల్లా, నిర్బంధాల వల్లా జరిగే పని కాదని కృష్ణమూర్తి సుస్పష్టంగా చెప్తారు.

శాంతి పూరితమైన ఒక నవ్య ప్రపంచాన్ని సృష్టించుకోవాలంటే, ప్రస్తుత ప్రపంచంలో పరివర్తన రావాలంటే ప్రతి మనిషిలోనూ సంపూర్ణమైన మార్పు జరగాలి. మనిషిలో అటువంటి మార్పు రావాలంటే అతడు తనని తాను తెలుసుకోవాలి. స్వీయజ్ఞానం లేకుండా పరివర్తన జరగదు. ఆదర్శాలు, సిద్ధాంతవాదాలు, సామాజిక సంస్కరణలు మొదలైనవి ఏవీ కూడా మానవ సమస్యలను లోతుల దాకా వెళ్ళి స్పృశించకుండా, పైపై మార్పులతో సరిపెట్టుకుంటున్నాయి. మానవ చేతనలో ప్రగాఢమైన విప్లవానికి స్వీయజ్ఞానం తప్పనిసరి 'అని కృష్ణమూర్తి నొక్కి చెప్తున్నారు.

కృష్ణమూర్తి జీవితకాలం (1895 - 1986) ఈ శతాబ్దంలోని మహా సంక్షోభ భరితమైన సమయం – రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి, సిద్ధాంత వాదాలు ఛిన్నాభిన్నమైపోయాయి. మహా దారుణమైన తీరులో భూమిని విధ్వంసం చేయడమూ, మానవ జీవితాల్లోని ప్రతి ఒక్క అంశమూ దిగజారిపోవడమూ జరిగింది. అయితే ఈ శతాబ్దంలోనే సాంకేతిక రంగంలో అద్భుతమైన పురోగతి జరిగింది. ముందు నుంచీ కృష్ణమూర్తి తమ దూరదృష్టితో జరగబోయే పరిణామాలను గురించి హెచ్చరిస్తూనే వచ్చారు. ప్రస్తుతం భూమి ఎదుర్కొంటున్న ఈ విపత్తులను గురించి మనం మేలుకొనక

మునుపే కృష్ణమూర్తి పాఠశాల విద్యార్థులకు భూమిని జాగ్రత్తగా కాపాడుకోవాలనీ, నేల మీద అడుగులు సున్నితంగా, పదిలంగా వేయమనీ ప్రబోధిస్తూ వుండేవారు. ''మానవ మస్తిష్కాన్ని (మెదడును) కంప్యూటర్లు పూర్తిగా ఆక్రమించినప్పుడు మనిషి ఏమైపోతాడు ?'' అని 1970 ల ఆరంభంలోనే ప్రశ్నించారు.

ప్రస్తుత గ్రంథంలోని పుటలలో, ఆధునిక జీవితంలో మతవ్యవస్థ స్థానమేమిటి, క్రమశిక్షణ స్వేచ్ఛకు వ్యతిరేకమైనదా, విగ్రహాలను గాని మత చిహ్నాలను గాని పూజించడంలో అర్థం ఏమిటి - మొదలైన ఆసక్తికరమైన ప్రశ్నలకు కృష్ణమూర్తి ప్రతిస్పందనలు వున్నాయి. ఇవి పాఠకులలో పూర్తిగా కొత్త దృష్టిని కలిగిస్తాయి. వీటితో పాటుగా, దైనిక జీవితంలో ప్రతిక్షణమూ సజీవంగా వుండటం, ఆలోచనలు నిరంతరంగా ఎందుకు సాగుతుంటాయి, నిశ్చలనమైన మనసు సాధ్యమా, వివాహ సంబంధాల్లో ఘర్షణలకి మూల కారణం ఏమిటి అనే అస్తిత్వ సమస్యలనేకం గురించి వివిధ ప్రసంగాలలో, సమాధానాలలో వివరించడం చూడవచ్చు.

కాలగమనంలో దశాబ్దాలు గడిచిన కొద్దీ బోధనలలో మార్పులు కలిగాయా అని ప్రశ్నించినప్పుడు కృష్ణమూర్తి ఇట్లా అన్నారు ; ''లేదు, వ్యక్తీకరణలో, మాటల ప్రయోగంలో, భాషలో, చేతుల కదలికలలో మార్పులు జరిగాయి - అవన్నీ మీరు గమనించే వుంటారు - కానీ ప్రారంభం నుండీ ఇప్పటివరకూ కూడా అసలు ప్రధానమైన విషయాలలో మాత్రం ఏ మార్పూ లేదు.'' (ఫైర్ ఇన్ ది మైండ్ 16 పే)

శక్తిమంతమైన ప్రసంగాలు వున్న ఈ 'స్వీయజ్ఞానం' సంపుటిని కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియావారు వుత్సాహ పూర్వకంగా తెలుగు పాఠకులకు సమర్పిస్తున్నారు.



# వి ష యా లు



## 1947 లో ప్రసంగాలు



## 1948 లో ప్రసంగాలు



## 1949 లో ప్రసంగాలు



*సేకరణ : కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి 4, 5, 6 సంపుటాల నుండి*

*కెండాల్ / హంట్ పబ్లిషింగ్ కం. యు.ఎస్.ఎ.*

# 1947 లో ప్రసంగాలు
# మద్రాసు

**అక్టోబరు 22**

ప్రస్తుతం ప్రపంచం ఎదుర్కొంటున్న ఈ సంక్షోభం సామాన్యమైనది కాదు. గతంలో ఇటువంటి విపత్కర పరిస్థితులు చాలా కొద్దిసార్లు మాత్రమే వచ్చాయి అని చెప్పవచ్చు. ఒక మనిషి జీవితంలో తరచుగా వచ్చే సాధారణ విపత్తుల వంటిది కాదు ఈ ప్రస్తుత సంక్షోభం. ఇది ప్రపంచమంతటా వ్యాపించిపోయి వున్న అస్తవ్యస్త స్థితి కేవలం ఇండియాకి గానీ, కేవలం యూరపుకి గానీ పరిమితమైనది కాదు. ప్రపంచంలోని ప్రతి మూలమూలకూ వ్యాపించిపోయి వున్నది. మనిషి శారీరక స్వరూపంలోనూ, మనస్తత్వంలోనూ, నీతి విషయకంగానూ, ఆధ్యాత్మికం గానూ, ఆర్థిక సామాజిక రంగాల్లోనూ దిగజారిపోవడం, గందరగోళమూ నెలకొని వున్నాయి. ప్రమాదకరమైన కొండ అంచుల మీద నిలబడి వట్టి అల్పమైన వ్యవహారాలను గురించి తర్జనభర్జనలు చేస్తున్నాం. ఈ ప్రపంచ సంక్షోభం మహాభయంకర మైనదనీ, పెనుకల్లోలాన్ని రేకెత్తించేది అనీ, ఇది చాలా అసాధారణమైనదనీ ఎవ్వరూ గ్రహిస్తున్నట్లు లేదు కొందరు ఈ అల్లకల్లోలాన్ని కొంతవరకు గ్రహించి, ప్రమాదకరమైన ఆ కొస అంచుల పైనే నిలబడి, జీవిత విధానాలను కొద్దిగా మార్చుకొని మరోరకంగా సర్దుకోవడంలో మునిగిపోయి వున్నారు. అయితే, తామే గందరగోళపు స్థితిలో వుండటం వల్ల మళ్ళీ మరికొంత గందరగోళాన్ని సృష్టిస్తున్నారు. మరి కొందరు ఏదో ఒక ప్రత్యేకమైన సూత్రాన్నో, వామపక్ష విధానాన్నో, మరో పక్షపు విధానాన్నో లేదా ఈ రెండు అతివాదాల మధ్యగా వుండే సూత్రాలనో పట్టుకొని ప్రస్తుత సమస్యని పరిష్కరించాలను కుంటున్నారు.

వీటివల్ల ఫలితమేమీ వుండదు. ఎందుకంటే, సమస్యలు – అంటే మానవ సమస్యలు చలనం లేకుండా నిలబడి వుండవు. కానీ సూత్రాలూ, విధానాలూ వున్నవి వున్నట్లుగా స్థిరంగా నిలబడి వుంటాయి. ఒక సూత్రాన్ని అనుసరించి జరిగే విప్లవం అసలైన విప్లవం అవదు. మేధావంతులైన ఈ శాస్త్రవేత్తలూ, గొప్ప నిష్ణాతులైనవారూ ప్రపంచాన్ని రక్షించలేరు. మనిషి అనే మొత్తం ప్రక్రియలో ఒక భాగం మాత్రమే అయిన ఈ మేధస్సు పరిష్కారం చూపడంలో విఫలమవక తప్పదు. ఎందుకంటే అది చూపే పరిష్కారాలు పాక్షికంగా వుంటాయి : కాబట్టి సత్యమైనవి కావు. విధానాలు కానీ, సూత్రాలు కానీ, సిద్ధాంతాలుగా రూపొందించుకున్న ఆలోచనలు కానీ మనిషిని ఏనాటికీ కాపాడలేవు.

ఈ విపత్తు, ఈ సమస్య కొత్తగా తలెత్తినది కాబట్టి ఒక కొత్త దృక్పథం అవసరం అవుతుంది – ఒక సజీవమైన, శక్తిమంతమైన దృక్పథం – ఒక వ్యవస్థతో కానీ, ఒక విధానంతో కానీ ముడిపడి లేకుండా వున్నటువంటి దృక్పథం అవసరం అవుతుంది. మానవ సమస్య ఎప్పుడూ రూపాంతరం చెందుతూ వుంటుంది. అది ఒక చోట స్థిరంగా నిలబడి వుండదు. ఒక నిర్ణయాన్నో, ఒక సూత్రాన్నో మీద వేసుకొని మోస్తున్న మనసు సజీవమైన సమస్యను ఏనాటికీ ఆకళింపు చేసుకోలేదు. అటువంటి మనసుకు, ఈ సమస్యా, సంక్లిష్టమైన మనిషి అనే ఈ జీవి ప్రధానం కాదు. విధానాలూ, సూత్రాలూ సజీవమైన దానిని చలనం లేని జడమైన స్థితిలోకి నెడతాయి. అందువల్ల మనిషిలో మరింత గందరగోళాన్నీ, మరింత క్షోభనూ పెంచుతాయి.

మహా విపత్కరమైన ఈ ప్రమాదం ఏదో యాదృచ్ఛికంగా పుట్టుకొచ్చినది కాదు. దీనిని తయారు చేయడంలో మనలో ప్రతి ఒక్కరి పాలూ వున్నది – మన ఈర్ష్యా వుద్రేకాలతోనూ, అత్యాశతోనూ, అధికారం పైనా, ఇతరుల మీద పెత్తనం చలాయించడం పైనా మనకున్న వ్యామోహంతోనూ, పోటీలతోనూ, నిర్దాక్షిణ్యంతోనూ, బాహ్యేంద్రియాలకి సంబంధించినవీ, తాత్కాలికంగా సంతృప్తిని కలుగజేసేవీ అయిన విలువలతోనూ కూడుకున్న మన రోజువారీ కార్యకలాపాల ద్వారా మనం సృష్టించినదే ఈ విపత్తు.

అతి భయంకరమైన ఈ దైన్యస్థితికీ, ఈ అస్తవ్యస్త స్థితికీ మనమే బాధ్యులం. మరెవరో కాదు. మీరూ నేనే. ఎందుకంటే, ఆలోచనా రహితంగా, గ్రహింపు అనేది లేకుండా, మీ మీ ఆకాంక్షల్లోనూ, ఇంద్రియాను భూతుల్లోనూ, వ్యాపకాల్లోనూ మునిగిపోయారు కాబట్టి ; తాత్కాలికంగా తృప్తిని కలిగించే విలువలనే పట్టుకొని అందులో మునిగిపోయి వున్నారు కాబట్టి. అతి ప్రచండంగా, అంతటినీ ముంచి వేసేస్తున్న ఈ విపత్తును మీరు సృష్టించారు. మన నిత్యజీవితమే – పోటీలతోనూ, విరోధాలతోనూ, సామాజికమైన జాతీయమైన విభజనలతోనూ కూడుకున్న మన నిత్య జీవితమే భయానకమూ, ఘోరమూ అయిన యుద్ధంగా రూపొందుతున్నది. మీరే ఈ అల్లకల్లోలానికంతటికీ కారణం ; ఎవరో కొందరు ప్రత్యేకమైన ప్రజలూ కారు, కొందరు కొందరు వ్యక్తులూ కారు – మీరే. జనం అంటే మీరే. మీరే ప్రపంచం. మీ సమస్యే ప్రపంచపు సమస్య.

సమస్య కొత్తది కాబట్టి దానిని సరికొత్తగా సమీపించాలి. ఆలోచనల్లోనే విప్లవం రావాలి. ఈ విప్లవం ఏదో ఒక సూత్రాన్ని ఆధారం చేసుకొని వుండకూడదు. ఇది స్వీయజ్ఞానం ద్వారా రావాలి. అంటే మీ సంపూర్ణ అస్తిత్వం అనే మొత్తం ప్రక్రియను

తెలుసుకోవడం ద్వారా జరగాలి. ఏదో ఒక భాగాన్ని గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేయడం వల్ల గానీ, అందులో ప్రత్యేక నైపుణ్యం సంపాదించడం వల్ల గానీ మొత్తాన్ని తెలుసుకోవడం జరగదు. స్వీయజ్ఞానం ద్వారా సవ్యంగా ఆలోచించడం జరుగుతుంది. విప్లవం అంటే అదే. సృజనాత్మకత అంటే అదే.

సమగ్రమైన వైయక్తిక క్రియ వేరూ, వ్యక్తిని కేంద్రంగా చేసుకున్న వ్యక్తిగత క్రియ వేరు. రెండూ భిన్నమైనవి, పరస్పరం వ్యతిరేకించుకునేవి. వ్యక్తిగతమైన క్రియ అంటే అత్యాశ, అసూయ, దుర్బుద్ధులూ మొదలైనవాటిని ఆధారంగా చేసుకున్న ఆచరణ క్రియ ; ఒక భాగానికి చెందిన క్రియ. సమగ్ర వైయక్తిక క్రియ అంటే మొత్తం ప్రక్రియనంతా అవగాహన చేసుకోవడం ద్వారా జరిగేది. వ్యక్తిగత అంటే వ్యక్తిని కేంద్రంగా చేసుకున్న క్రియ సంఘ విద్రోహకరంగానో, విద్వేషపూరితంగానో లేదా మరొకరిని వ్యతిరేకించేదిగానో వుంటుంది. ఈ వ్యక్తిని ప్రధానం చేసుకున్న కార్యకలాపాలే మనిషిని ప్రస్తుతం వున్న ఈ అల్లకల్లోలంలో, ఈ బాధల్లో పడవేశాయి. ఈ వ్యక్తి సంబంధిత కార్యకలాపాలకు ప్రతిక్రియగా అనేక రకాలైన సమష్టివాదం బయలుదేరింది. మన అస్తిత్వం అనే సంపూర్ణ ప్రక్రియను అవగాహన చేసుకోవడంలోనే - అంటే స్వీయజ్ఞానంలోనే మనకు విమోచనం లభిస్తుంది.

మొత్తం ప్రక్రియను అవగాహన చేసుకోవాలంటే నిరసించడం గానీ, తప్పొప్పులు నిర్ణయించడం గానీ, ఫలానాది అని గుర్తించడం గానీ వుండకూడదు. మీ కొడుకుని అర్థం చేసుకోవాలంటే అతన్ని పరిశీలిస్తూ వుండాలి. పోల్చి చూడటమూ, నిరసించడమూ అనేవి లేకుండా అధ్యయనం చేయాలి. అదేవిధంగా మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవాలంటే మీ కార్యకలాపాలని గురించీ, మీ మనోద్రేకాలను గురించీ, ఆలోచనలను గురించీ నిరసించడం - అంటే ఖండించడం లేకుండా వుండే ఎరుకతో వుండాలి. ఇట్లా చేయడం చాలా కష్టమైనదీ, శ్రమతో కూడుకొన్నదీ, ఎందుకంటే మన చదువూ, శిక్షణా మనకి ఖండించాలనీ, తప్పొప్పులు నిర్ణయించాలనీ నేర్పించి, మనల్ని నిబద్ధుల్ని చేశాయి. ఖండించడం - లేక నిరసించడం అనేది అవగాహనకు అడ్డు తగులుతుంది. కాబట్టి ఈ నిబద్ధీకరణాన్ని గురించి మనం తెలుసుకొని వుండాలి. ప్రయత్నం వల్ల విముక్తి రాదు. సత్యాన్ని చూసి గ్రహించడం వల్ల విమోచనం లభిస్తుంది. సత్యమే విమోచనానికి దారి తీస్తుంది తప్ప విముక్తి పొందాలనే మీ ప్రయత్నం కాదు. స్వీయజ్ఞానం వల్ల కలిగే సృజనాత్మకమైన ఆలోచన ద్వారా మన బాధలకు పరిష్కారం జరుగుతుంది. ఎందుకంటే అదే సత్యాన్ని - సంతోషానికి వుచ్ఛ్వాస నిశ్వాసాల వంటి సత్యాన్ని విప్పి చూపుతుంది. సరియైన ఆలోచన ధ్యానానికి దారి

చూపుతుంది. ఆ ధ్యానంలో సృజనాత్మకత, సత్యం, దైవం లేదా మీరు ఏమంటారో అది - అక్కడ ఆ ధ్యానంలో ప్రాణం పోసుకుంటుంది. ధ్యానం అంటే మనల్ని మనం సమ్మోహపరచుకోవడం కాదు. సాధారణంగా జరిగేది అదే. కానీ అది సరి కాదు. ధ్యానంలో మనం అహ్వానించనిది ఏదో అస్తిత్వంలోకి వస్తుంది. మనం ఆహ్వానిస్తున్నామంటే అది మనం స్వయంగా చిత్రించుకున్నదే అయుంటుంది. అటువంటిది చాలా క్షణికమైనదీ, వట్టి భ్రమా. యదార్థతత్వం లేదూ దైవం మన వద్దకు రావాలే తప్ప దానిని మనం పొందలేము. ఈ నిజమే కనుక లేకపోతే జీవితం పూర్తిగా బాధామయమూ, అల్లకల్లోలమూ, వినాశకరమూ అయిపోతుంది. ఈ ప్రసంగాల సందర్భంగా నిజమైన శ్రద్ధ వున్నవారితో కలిసి మనం సవ్యమైన ఆలోచనను ప్రయోగపూర్వకంగా అవలంబించి చూద్దాము. అదొక్కటి మాత్రమే మన సమస్యలను శాశ్వతంగా పరిష్కరిస్తుంది. నిజమైన శ్రద్ధ మారిపోతూ వుండే మనోస్థితుల మీదా, పరిస్థితుల మీదా ఆధారపడివుండదు. అసలు సమస్యే చిత్తశుద్ధి అత్యావసరమని ఘోషిస్తూ వుంటుంది. ఎందుకంటే సమస్యలోనే పరిష్కారం కూడా వుంటుంది కాబట్టి.

ప్రశ్న : ప్రతి ఒక్క వ్యక్తికీ ఆహారమూ, వస్త్రాలూ, ఇంటి వసతీ అనేవి లోటు లేకుండా కల్పించి, స్వంతానికి ఆస్తి వుండటాన్ని నిషేధిస్తే, ప్రజలకి సుఖజీవితాన్ని ప్రసాదించే పరిపాలన దేశంలో స్థాపించవచ్చని కమ్యూనిస్టులు నమ్ముతున్నారు. దీనికి మీరే మంటారు ?

కృష్ణమూర్తి . గమ్యం ఏదో అదే సాధనం. అవి రెండూ విడిగా వుండవు. సవ్యమైన మార్గం ద్వారా సవ్యమైన గమ్యం సాధ్యమవుతుంది. సవ్యమైన పరిపాలనను ఏర్పాటు చేయాలంటే, సవ్యమైన మార్గాన్ని అవలంబించాలి. సాధనం సవ్యమైన ఆలోచన నుండి వేరుగా వుండదు. మనిషి అనే మొత్తం ప్రక్రియను - అంటే అది మీరే - దానిని పూర్తిగా అవగాహన చేసుకున్నప్పుడు సవ్యమైన ఆలోచన కలుగుతుంది. కొంత భాగాన్ని మాత్రమే అర్థం చేసుకోవడం మొత్తాన్ని ఆకళింపు చేసుకోవడం కాదు. ఆహారమూ, వస్త్రాలూ, గృహవసతీ ప్రతివారికీ అవసరమే. తప్పక వుండి తీరాలి, నిస్సందేహంగా మనిషికి కావలసిన నిత్యావసరాలను ఒక ప్రపంచ వుమ్మడి నిధి కిందకు తీసుకొని రావాలి. వాటి పంపిణీకి సవ్యమైన సంవిధానం ఏర్పడాలి. మనిషి ముఖ్యావసరాలకు కావలసినవన్నీ పండించడానికి తగిన శాస్త్రవిజ్ఞానం ప్రస్తుతం వున్నది. కానీ, అత్యాశ, స్వజాత్యభిమానం, అధికారం కోసమూ హోదా కోసమూ పడే వ్యామోహం ఈ మానవాళి అంతటికీ కావలసిన ముఖ్యావసరాల వుత్పత్తికి ఆటంకంగా నిలుస్తున్నాయి. అసలు ప్రతి మనిషికీ

ఆహారమూ, వస్త్రాలూ ఇవ్వాలి, ఇంటి వసతి కల్పించాలి అనే విషయం మనం పట్టించుకోవడం లేదు. ఏదో ఒక ప్రత్యేక విధానాన్ని పట్టుకొని, దాని ద్వారా అందరికీ తిండీ, బట్టా, ఇల్లూ దొరుకుతాయనే ఆలోచనల్లో మునిగిపోయి వున్నాం. మనిషికి ఖచ్చితంగా భద్రతని ఇచ్చే సూత్రం ఇదా అదా అని అతివాద వామపక్షమూ, ఇతర పక్షాలూ వాదించుకుంటున్నారు. కాబట్టి మనిషి సుఖసంతోషాలని గురించిన అక్కర నిజంగా వారికి లేదు. మనిషికి సుఖసంతోషాలు కలిగేది ఏ సూత్రం ద్వారా అన్నదే వాళ్ళ గొడవ అంతా

ప్రతి ఒక్క మనిషికీ తిండీ, బట్టా, ఇంటి వసతీ కల్పించడం కోసం ఒక వుమ్మడి ప్రపంచ నిధిని ఏర్పాటు చేయడానికి ఈ మేధావంతుల సూత్రాలూ, విధానాలూ, ఈ స్వజాత్యభిమానమూ, అత్యాశా, అధికారం పైనా హోదా పైనా వుండే వ్యామోహమూ – ఇవన్నీ అడ్డు తగులుతున్నాయి. ప్రతి మనిషికీ తిండీ, బట్టా, గృహవసతీ కల్పించాలంటే చేపట్టవలసిన మార్గాలను, సాధనాలను కనిపెట్టడం కోసం ధనం వ్యయం చేయటానికి బదులు, మారణాయుధాల కోసమూ ఒకరినొకరు పేల్చివేసుకోవడానికీ, అణుబాంబుల తయారీకీ, ముందు ముందు జరగనున్న యుద్ధాలకి సంసిద్ధపరచుకోవడానికీ పెద్ద మొత్తాలలో ధనం ఖర్చు పెడుతున్నారు. ఇదంతా చూస్తుంటే సిద్ధాంత సూత్రాలకూ, తమ తమ దేశాలకూ, తమ తమ ఆస్తులకూ అంకితమైపోయినవారికి మనిషి సుఖసంతోషాల ప్రసక్తి మీద అక్కర లేదని తెలుస్తున్నది.

అంతే కాకుండా, మనిషి బ్రతకడానికి కావలసినది ఒక్క ఆహారమేనా ? అతని సంతోషమంతా ఇంద్రియాలకి సంబంధించినది మాత్రమేనా ? సామాన్యమైన అవసరాలకు, వాటికి మించిన ప్రాముఖ్యతను అంటగట్టి లేనిపోని గందరగోళాన్నీ, దురవస్థలనూ తెచ్చిపెడుతున్నామని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆహార సౌకర్యాలను కల్పించే ఏర్పాట్లు జరగకుండా మానవ మనస్తత్వానికి సంబంధించిన కారణాలే చెడగొడుతున్నాయి. ఈ కారణాలను అర్థం చేసుకోకుండా, కేవలం ఆహారానికి ప్రాముఖ్యం ఇవ్వడం అంటే మనిషికి శారీరిక రక్షణ ఇవ్వకుండా అడ్డుతగలడమే. శారీరిక భద్రత కోసం మనం వూరికే ఆరాటపడుతున్నకొద్దీ అభద్రతాభావం ఇంకా ఇంకా ఎక్కువవుతూ వుంటుంది ఎందుకంటే ఎక్కడయితే అభద్రత వుండాలో – మానసికంగా, ఆధ్యాత్మికంగా – అక్కడ శాశ్వతత్వం కోసం, భద్రత కోసం మనం కాంక్షిస్తుంటాం.

కాబట్టి, మనిషికి తిండీ, బట్టా, ఇంటి వసతీ తప్పకుండా కల్పించాలంటే ముందుగా మానవులు నెలకొల్పుకున్న ఈ మనోతత్వ సంబంధిత విలువలను గురించి గట్టిగా యోచించాలి. మానసికమైన, ఆధ్యాత్మికమైన నిబద్ధతనుంచి మానవుడిని విముక్తి

చెందించినప్పుడు, ప్రతి మనిషికీ తిండీ, వస్త్రాలూ, ఇంటి వసతీ తప్పనిసరిగా కల్పించేటటువంటి సమాజాన్ని కూడా అతడు స్థాపించుకోవడం జరగక మానదు.

ప్రభుత్వం అంటే ఏమిటి ? అనునిత్యం మన సంబంధ బాంధవ్యాల్లో మనం సృష్టించుకునేదే కాదూ ? మనలో నాది, నా స్వంతం అనే భావమూ, అసూయ, నిర్దాక్షిణ్యాము కనుక వుంటే, దానికి ప్రాతినిధ్యాన్ని ఇచ్చే ప్రభుత్వాన్నే మనం తయారు చేసుకుంటాం మనిషి చాలా సంక్లిష్టమైన జీవి. అందులో ఒక భాగాన్ని తీసి, దానికే ప్రాధాన్యత ఇవ్వడం – ఆ భాగానికి శ్రద్ధ చూపవలసిన అవసరం ఎంత వున్నా సరే – అది మనిషికే హానికరంగా తయారవుతుంది.

ప్రశ్న : ప్రస్తుతం వున్న విపత్కర పరిస్థితులతో పోరాడటానికి గాను సహృదయులూ, మహాత్ములూ, వివేకవంతులూ అయినవారంతా కలిసి ఏకమై, ఒకటిగా ఏర్పడవలసిన తరుణం ఇదని మహాత్మాగాంధీ మొదలైనవారు నమ్ముతున్నారు. చాలా మంది మన ఆధ్యాత్మిక ఆచార్యుల్లాగే మీరూ ఈ కర్తవ్యం నుంచి దూరంగా పారిపోతున్నారా ?

కృష్ణమూర్తి : సహృదయులైన వారందరూ కలిసి ఒకటిగా చేరాలన్నది స్పష్టంగా కనబడుతున్న, అత్యవసరమైన సంగతి. అయితే, దురదృష్టం ఏమిటంటే సహృదయులైన వారు కూడా మనుష్యులే. వారిలో కూడా అందరు మనుష్యుల్లోలాగే మనోద్రేకాలు, వారికి లాభసాటిగా వుండే అభిరుచులూ, వారి వారి సూత్రాలూ, ప్రణాళికలూ వుంటాయి. నిర్మలమైన హృదయం కలవారు చాలా కొద్దిమంది. పైగా విపత్కర పరిస్థితిని అధిగమించే మార్గాలను ఏర్పాటు చేస్తున్నప్పుడు సహృదయులు తమ సహృదయతను పోగొట్టుకుంటున్నట్లుగా అనిపిస్తున్నది. అన్నింటికంటే, మంచితనం కంటే కూడా మార్గాలే ప్రధానం అవుతున్నట్లుగా కనబడుతున్నది.

ఆధ్యాత్మిక నాయకత్వం ఆధ్యాత్మికత్వానికి విరుద్ధమైనది. యదార్థతత్వానికి – అందులోనే అసలైన ఆనందం వున్నది – దానికి మార్గాలు లేవు, మిమ్మల్ని చేయి పట్టుకొని దానివద్దకు ఎవరూ తీసుకెళ్ళలేరు. ఎవరయినా అట్లా చేస్తామని ముందుకు వస్తే, వారికి సత్యమేమిటో తెలియదనమాట. సంఘ వ్యతిరేక చర్యలకు కారణమైనవీ, సత్యం దర్శించకుండా నిరోధిస్తున్నవీ అయిన బంధాలన్నింటి నుండీ మిమ్మల్ని మీరే స్వతంత్రుల్ని చేసుకోవాలి. మీకు మీరే రక్షకులు. మరెవరో కాదు. ప్రస్తుత విపత్కర స్థితికి ఆవలగా, వున్నతంగా పోవాలంటే మిమ్మల్ని మీరే సమూలంగా, సంపూర్ణంగా మార్చుకోవాలి. ఈ మహావిపత్తు అనే అగాధంలో పడిపోకుండా ఏ వ్యవస్థా, ఏ

నాయకుడూ – ఆధ్యాత్మిక నాయకుడు గానీ, రాజకీయ నాయకుడు గానీ – ఎవ్వరూ మిమ్మల్ని రక్షించలేరు. మీకుమీరే దీపమై వెలుగు నిచ్చుకోవాలి. నడిపించే నాయకుడు కూడా తాను నడిపిస్తున్నవారిలాగే ఎటూ తోచని స్థితిలోనే వున్నాడు. చేతితో తయారు చేసినవాటి పైన కానీ, మనసుతో తయారు చేసిన వాటిపైన కానీ విశ్వాసం వుంచడం వల్ల లాభం లేదు. మేము తప్పించుకొని పారిపోవడం లేదు. మేము సూచిస్తున్నదేమిటంటే – కొండ కొస అంచున నిలబడి చేసే పనులు జారి కింద పడిపోవడానికే దారితీస్తాయి అనీ, ఆ కొస అంచునుండి ఇవతలగా వచ్చేయడంలోనే భద్రతా, సుఖమూ వున్నాయి అనీ. ఇది గ్రహించిన కొద్ది మందైనా సరే, వారు ఈ అగాధానికి దూరంగా కాంతి దర్శక కేంద్రాలుగా ఏర్పడాలి.

ప్రస్తుత విపత్కర పరిస్థితి నుండి, మనిషి ఎదుర్కొంటున్న సమస్యలన్నింటి నుండీ బయటపడే అవకాశం వున్నది. తప్పించుకొని పారిపోవడం కానటువంటి ఒక అవకాశం వున్నది. అదే నిరంతరమైన నిశ్చలానందానికి దారి తీస్తుంది.

ప్రశ్న . యువకులు మళ్ళీ మళ్ళీ నన్ను ఒకటే ప్రశ్న అడుగుతున్నారు – ''నిరాశా నిస్పృహలలో మేము పూర్తిగా మునిగిపోయి వున్నాం. ప్రస్తుత విషమ పరిస్థితుల్లో ఏం చేయాలో పాలుపోవడం లేదు. – నాయకులు మాకు దారి చూపించలేక పోతున్నారు. ఎందుకంటే వారే గందరగోళపు స్థితిలో వున్నారు. రాజకీయ స్వాతంత్ర్యం మీదా, ముస్లింలీగుతో చేసుకున్న ఒడంబడిక మీదా ఎన్నో ఆశలు పెట్టుకున్నాం.''

కృష్ణమూర్తి : ఇందులో చాలా ప్రశ్నలు ఇమిడి వున్నాయి. కనుక ఒక్కటొక్కటే పైకి తీసి చూద్దాం. నిరాశా నిస్పృహలు అంటే మీ అర్థం ఏమిటి ? అంటే, మన మనసులో, హృదయంలో నిలుపుకున్న ఒక దానిని పొందనీయకుండా, దానిని అందుకోనీయకుండా మానసికంగా నిరోధింపబడటమే నిరాశ అంటే. మనకి ఒకటి కావాలి – అది ఒక ఆదర్శమో, ఒక గెలుపో, ఒక హోదానో, అంతర్గతంగా వున్న ఒక వాంఛ నెరవేరడమో – అటువంటిది ఏదో ఒకటి. దానికి ఆటంకం కలిగితే ఆశాభంగం చెందుతాము, నిస్పృహలో పడతాం. అంతా శూన్యంగా అనిపిస్తుంది. పెద్ద ఓటమి చెందినట్లుగా అనిపించడం మొదలవుతుంది. ఇట్లా జరగాలి అనే కోరికలోనే, దాని అంతర్గత గుణంలోనే ఆశాభంగానికి బీజం వుంటుంది. మన కార్యకలాపాలన్నింటికీ వెనకన దాగివున్న ఒంటరితనపు వేదన అన్నా, నాలో ఏమీ లేదు అనే ఒక వింత భయమూ, శూన్యత్వమూ అన్నా మనకి ఏవగింపు. అది తెలుసుకొని, ఆ గ్రహింపు తెలిసో తెలియకుండానో మనలో వుండటం వల్ల – సాంఘిక కార్యకలాపాల ద్వారా కానీ, వ్యక్తిగతమైన సుఖసంతోషాల అన్వేషణ ద్వారా కానీ, సన్యసించడం ద్వారా కానీ, దేవుడిని

కనిపెట్టే అన్వేషణ మొదలైన వాటి ద్వారా కానీ వాటిని దాచాలనో, దాటవేయాలనో, వాటి నుంచి పారిపోవాలనో ప్రయత్నిస్తుంటాం. ఈ కార్యకలాపాలను కానీ, ఈ అన్వేషణను కానీ అనుమానించి, ప్రశ్నించినప్పుడు లేదూ ఆశించిన ఫలితాలను అవి అందుకోలేక పోయినప్పుడు – ఆ శూన్యత్వం, ఆ ఖాళీతనం బయటపడతాయి మనలో వున్న ఈ శూన్యత్వపు స్పృహ మనకు తెలిసిరావడాన్నే నిరాశా నిస్పృహలనే పేరుతో పిలుస్తుంటాం.

సరే, ఈ శూన్యాన్ని నింపడం కానీ, ఈ శూన్యానికి బదులుగా మరొకదాన్ని ఆ స్థానంలో వుంచడంగానీ చేయగలమా ? ఏదో ఒకవిధంగా ఖాళీని భర్తీ చేయాలని చేసిన ప్రయత్నం విఫలం అయింది. కాబట్టి, ఇట్లా ఖాళీని నింపడానికి చేసే ప్రయత్నాలన్నీ వృధా అని తెలియడం లేదూ ? అసలు ఎప్పటికైనా ఆ ఖాళీని పూరించగలమా ? అది కనుక్కోవాలంటే నింపడం మానేయండి. దానినుంచి పారిపోవడం ఆపండి. ఆ ఖాళీ తనం అంటే ఏమిటి అన్నది అర్థం చేసుకోండి. అర్థం చేసుకోవాలంటే ఖండన వుండకూడదు. అది ఫలానా అని పేరు పెట్టడమూ వుండకూడదు. ఏవిధంగానైనా సరే, ఈ ఖాళీని నింపడం అసలు సాధ్యమేనా అని మనల్ని మనమే ఎన్నడూ ప్రశ్నించుకోలేదు. మన అక్కర అంతా ఈ ఖాళీని ఎట్లా నింపాలీ అని. దాని నుంచి మీరు పారిపోగలరే తప్ప దానిని మీరు అర్థం చేసుకోలేక పోతున్నారు. కాబట్టి ఆ శూన్యం అట్లాగే వుండిపోయింది. చిల్లుతో వున్న ఒక బాల్చీని నీళ్ళతో నింపాలని ప్రయత్నిస్తున్న వ్యక్తిని గురించి మీరేమనుకుంటారు ? అదే విధంగా ఈ శూన్యానికి అడుగు లేకపోవచ్చును. మీరు నింపినా కొద్దీ అది ఇంకా ఖాళీగా అనిపిస్తూ వుంటుంది.

ఆశాభంగంలో వుండే నిస్పృహ గురించి మనకందరికీ తెలుసు. దాని మూల కారణాన్ని అర్థం చేసుకుని, ఆ విధంగా దానిని అధిగమించడానికి బదులు ఒకదాని తర్వాత మరొక దానిమీద ఆశను పెంచుకుంటూ పోతాం. విఫలమవుతూనే వుంటాం. ప్రశ్న వేసినవారు లేవనెత్తిన మరొక అంశం ఏమిటంటే – ''మన నాయకులు మనకి దారి చూపలేకపోతున్నారు, ఎందుకంటే వాళ్ళే గందరగోళంలో మునిగివున్నారు కాబట్టి'' అనేది. నాయకుడిని సృష్టించినది అనుసరించేవాడే. అంటే మీరే. మీరే ఒక గందరగోళపు స్థితిలో వుండటం వల్ల, అటువంటి గజిబిజి స్థితిలో వున్న నాయకుడినే మీరు తయారు చేసుకుంటారు. పరిస్థితులూ, రకరకాల శక్తులూ ఈ నాయకుడిని తయారు చేయడంలో పాత్ర వహిస్తాయి. అయితే ఆ రకరకాల శక్తులకీ, పరిస్థితులకీ బాధ్యులు మాత్రం మీరే. తనలో స్పష్టత వున్న వ్యక్తికి, తనలో వివేకకాంతి వుదయించిన వ్యక్తికి నాయకుల అవసరం లేదు. అతడు నాయకులని తయారుచేయడు. గందరగోళంలో పడిన వ్యక్తే

నాయకుడు కావాలని కోరుకుంటాడు. అందుకని, తన ఈ గందరగోళంలో నుంచి ఒక నాయకుడిని తయారు చేసుకుంటాడు. అసలు మీకో నాయకుడు ఎందుకు కావాలి ? ఫలానాది మీరు చేయాలి, ఫలానాది చేయకూడదు, ఈ విధంగా నడుచుకోండి అని చెప్పడానికే కదూ నాయకుడు తయారయ్యేది ? మీలో వున్న గందరగోళాన్ని మీరు అర్థం చేసుకోలేకపోతున్నారు కాబట్టి, ఇందులో నుండి బయటకు దారి చూపగల ఒకరు మీకు కావాలి. మీరు చికాకులో వున్నారు కాబట్టి గందరగోళపు కంఠాన్నే మీరు వినగలుగుతారు. గందరగోళాన్ని పెంచి పోషిస్తున్నది మీరే. మీరే దానికి బాధ్యులు ; లోపలా, ఆ కారణంగా బయటా కూడా వున్న గందరగోళానికి మీరే బాధ్యులు. అదంతా సరిచేయడమూ మీ వల్లే సాధ్యం. మరెవరి వల్లనో కాదు. రాజకీయవాదుల వల్లా కాదు, మత సంబంధమైన వారి వల్లా కాదు. అంతా గందరగోళంగా వుంది. పరిస్థితి దుర్భరంగా వున్నది. దానిని సూటిగా ఎదుర్కొనడానికి బదులు దారి చూపడానికి ఎవరోకావాలని కోరుకుంటున్నాం. శ్రమలేని జీవితం కావాలని కోరుకుంటున్నప్పుడే, సోమరిగా జీవిస్తున్నప్పుడే, ఆలోచనా రహితంగా జీవితం గడుపుతున్నప్పుడే, ఆధిపత్య స్థానంలో ఒకరు వుండాలనే కోరిక మీలో బయలుదేరుతుంది. అసలు ఈ ఆలోచనా రాహిత్యమే మీలోని ఈ బాధాకరమైన గందరగోళానికి కారణం. మరొకరి ఆధిపత్యాన్ని కోరుతున్నప్పుడు, వారిని అనుసరిస్తున్నప్పుడు ఈ గందరగోళం అట్లాగే కొనసాగిపోతూ వుండిపోతుంది. మీరు ఏమిటో అదే మీరుగా బయటపడుతుంది తప్ప ఎవ్వరూ మిమ్మల్ని కాపాడలేరు. సూత్రాలు కానీ, సూత్రాలకి ప్రత్యక్ష స్వరూపాలు అని మీరనుకుంటున్న నాయకులు కానీ మిమ్మల్ని కాపాడలేరు. విప్లవం ఆలోచనల్లో రావాలి, ఆ విధంగా ఆచరణలో కూడా. అంతే తప్ప నాయకులని మార్చడం కోసం కాదు విప్లవం. స్వీయజ్ఞానం ద్వారా మాత్రమే సవ్యమైన ఆలోచన కలుగుతుంది తప్ప పుస్తకం ద్వారా రాదు. ఒక ప్రత్యేకమైన విధానం ద్వారానూ రాదు. సదాలోచన మాత్రమే మిమ్మల్ని ఈ విషమ స్థితిలో నుండి కాపాడుతుంది.

ఇక ఈ ప్రశ్నలోని మూడవ భాగం : ''రాజకీయ స్వాతంత్ర్యంలోనూ, ముస్లింలీగుతో చేసుకున్న ఒడంబడికలోనూ ఎన్నో ఆశలు పెట్టుకున్నాం.''

మీకు స్వపరిపాలన సిద్ధించింది కాబట్టి అత్యాశ, దోపిడీ వంటి శక్తులు మటుమాయమైపోవు. అసూయ నుండి, దుర్బుద్ధుల నుండి, లౌక్యంతో నిండిన పద్ధతుల నుండి విముక్తి ప్రభుత్వాల మార్పిడి జరగడం ద్వారా రాదు. చట్టాల ద్వారా, నిర్బంధాల ద్వారా అత్యాశనూ, దోపిడీ పద్ధతులనూ ఒక స్థాయి వరకూ లేకుండా చేయవచ్చునేమో. కానీ అవి మరొకచోట తలెత్తుతూనే వుంటాయి. చట్టాల ద్వారా,

నిర్బంధం ద్వారా మనస్తత్వ సంబంధిత వాస్తవాలను నిర్మూలించలేము. వాటిని పట్టించుకోకుండా వున్నామంటే మన బాధలూ, విపత్తులూ ఇంకా ఎక్కువైపోతాయి. మనిషి మనిషిని దోపిడీ చేయడం కేవలం ఆర్థిక విషయాలకే పరిమితమై లేదు. దాని మూల కారణాలు మనోతత్వ సంబంధిత అంశాలలో లోతుగా పాతుకొనిపోయి వున్నాయి. మనిషి సంతోషంగా, ఆరోగ్యకరమైన మతిస్థిరత్వంతో బతకాలంటే ఆ అంశాలను అర్థం చేసుకోవాలి, అధిగమించాలి. మానసికమైన లేమిలో నుండి, మానసికమైన కొరతలో నుండి స్వంతం చేసుకోవాలనే తత్వమూ, పరాధీనతత్వమూ కలుగుతాయి. ఇవి రకరకాలైన సమాజ విద్రోహ చర్యలుగా రూపుదాలుస్తుంటాయి. దీని మూలకారణం మన లోపలే వున్నది. నిర్బంధం వుపయోగించీ, చట్టాలు చేసీ వీటిని నిర్మూలించలేము. స్వీయ జ్ఞానం ద్వారా, సవ్యమైన ఆలోచనల ద్వారా మాత్రమే అది జరుగుతుంది.

మనిషికీ మనిషికీ మధ్య విభజనలు వుండాలని ఒప్పుకున్నామంటే, ఇక లెక్కలేనన్ని దుర్మార్గాలకు మీరు తలుపులు తెరచినట్లవుతుంది. వీటిల్లో యుద్ధం అతిభయంకరమైన దుర్మార్గం. ఏ దేశమైనా ఒకసారి యుద్ధంలో పాల్గొన్నదంటే, ఇక అందులో నుండే కొత్త కొత్త దుర్మార్గాలూ, ఆపదలూ పుట్టుకొస్తాయి. ఈ కులమత విభేదాలూ, వర్గజాతి విభజనలూ, బ్రాహ్మణ అబ్రాహ్మణ విచక్షణా, ఉన్నత నిమ్న తరగతులూ, బలవంతులూ బలహీన వర్గాలూ మొదలైన ఎన్నో అవకతవకలు మనిషిని అపరిమితమైన క్షోభకు గురిచేశాయి. మనిషి లోనవుతున్న ఈ ఘోరావస్థలకు అసలు బాధ్యత అంతా మూఢ విశ్వాసాలతో, నమ్మకాలతో నిండిపోయివున్న ఈ మత వ్యవస్థదే. రాజకీయ విభజనలూ, వామపక్షాలకూ వామేతర పక్షాలకూ మధ్యన సంఘర్షణా – ఈ రకరకాల విభజనలలో, ఈ ఘోర రక్తపాతాల్లో, పోరాటాల్లో మిమ్మల్ని – అంటే మనిషిని మర్చిపోతున్నారు. మనిషికంటే వ్యవస్థావిధానాలే ముఖ్యమైపోయాయి. ఈ వర్గ జాతి విభేదాలనుండి, రాజకీయ విదేశ, స్వదేశ విభజనల నుండి, వ్యవస్థా రూపం దాల్చిన మతాలు తెచ్చిపెడుతున్న వేర్పాటు తత్వాలనుండి మీరు స్వేచ్ఛ పొందనంతవరకు మీకు సుఖసంతోషాలు వుండనే వుండవు. కేవలం అల్లకల్లోలమూ, దురవస్థలూ మాత్రమే వుంటాయి.



## 1947 లో ప్రసంగాలు
## మద్రాసు

**నవంబరు 2**

సమాజ సంస్కరణ వ్యక్తిని పునరుజీవింప జేయడం ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. మనం ఆశిస్తున్నది వ్యక్తి ద్వారా, అంటే మీ ద్వారానే జరుగుతుంది తప్ప ఒక విధానం ద్వారానూ కాదు, ఆదర్శ సమాజం కోసం వేసుకున్న లిఖిత ప్రణాళిక ద్వారానూ కాదు, మతవ్యవస్థ ద్వారానూ జరగదు. మీ ద్వారా అంటే వ్యక్తుల ద్వారానే జరుగుతుంది. మీకూ మరొకరికీ మధ్యనున్న సంబంధ బాంధవ్యమే సమాజం అంటే ఇదే ప్రభుత్వాన్ని తయారు చేస్తున్నది. ప్రభుత్వం అంటే మననుంచి విడిగా ఎక్కడో వుండేదీ, ఎవ్వరూ అదుపు చేయలేనిదీ కాదు. వ్యక్తిగతమైన ఆలోచనలలో నుంచి, ఆచరణలలో నుంచి అది ఏర్పడుతుంది. ప్రాణికోటి అంతా సమానులు, ఒకర్నొకరు ప్రేమగా చూసుకోవాలి, సోదరభావం పెంపొందించుకోవాలి అని గట్టిగా మళ్ళీ మళ్ళీ నొక్కి పలుకుతూ వుంటాం. కానీ, వాస్తవంలో మనిషికీ మనిషికీ మధ్యన వున్న పరస్పర బాంధవ్యం ఇంద్రియ సంవేదనలకు సంబంధించిన విలువల మీదే ఆధారపడి వుంది. ఈ ఐంద్రియ విలువలతో వున్న బాంధవ్యాల వల్లనే యుద్ధాలు, నిర్దాక్షిణ్యము, సంఘర్షణ, అల్లకల్లోలం పుట్టుకొచ్చాయి మనిషి యొక్క స్వీయయత్నమూ, స్వయం సాధనా - దీనికి వ్యతిరేకంగా వుండే సమష్టి కృషీ - రెండూ కూడా ఇంద్రియ సంవేదనల మీద ఆధారపడిన విలువల కారణంగా జనించినవే.

మనిషి, అంటే వ్యక్తి - అంటే - మీరు - వామపక్ష కార్యకలాపాల వలన గానీ, వామేతర పక్షపు కార్యకలాపాలవలన గానీ శాశ్వతమైన సుఖసంతోషాలను పొందలేకపోయారు. నిస్పృహతో, గందరగోళంతో, దుఃఖంతో పూర్తిగా నిండిపోయి వున్నాడు మనిషి . ఇంద్రియసంవేదనల మీద ఆధారపడిన విలువల్లో సుఖసంతోషాలను పొందగలడా మనిషి ? అంటే, చేత్తో చేసిన వస్తువుల ద్వారా గానీ, మనసు తయారు చేసిన వాటి ద్వారా గానీ మనిషి సుఖసంతోషాలు పొందగలడా ? స్వీయజ్ఞానం ద్వారా మాత్రమే ఈ ప్రశ్నలోని నిజానిజాలని మనం కనిపెట్టగలుగుతాం. మళ్ళీ మళ్ళీ పునరుక్తి చేయడం వల్ల సత్యం సత్యంగా మిగలదు. దానిని స్వయంగా అనుభూతి చెందాలి, అనుభవం పొందాలి. స్వీయజ్ఞానం అంటే స్వీయాన్ని -తనని కనిపెట్టడం. స్వీయజ్ఞానం ద్వారా మాత్రమే సత్యాన్నీ, శాశ్వతమైన సంతోషాన్నీ ఆవిష్కరించుకో గలుగుతాం. మీ సంపూర్ణ అస్తిత్వం అనే అసలు ప్రక్రియ ఎడల ఎంపిక లేని అంటే

నిర్వికల్పమైన ఎరుక కలిగి వుండటమే స్వీయజ్ఞానం. పుస్తకాల్లో చదివిగానీ, మరొకరు చెప్పడం వల్లగానీ ఈ స్వీయజ్ఞానాన్ని పొందలేరు. మీరు అనబడే ఆ మొత్తం ప్రాణి గురించి ఎరుకతో వుండటం - ఆలోచనలతో, మనోభావాలతో, తక్కిన కార్యకలాపాలతో కూడుకొని, చేతన మానసంలోనూ, అచేతన మానసంలోనూ కూడా జరుగుతున్న ఈ ప్రక్రియ అంతటినీ ఎరుకతో చూస్తుండటం - అదే స్వీయజ్ఞానం అంటే. మీ మానసికమైన, వుద్వేగసంబంధితమైన కార్యకలాపాలన్నింటి ఎడలా ఎరుకతో వుండటమే స్వీయజ్ఞానానికి ఆరంభం.

స్వీయజ్ఞానం లేనప్పుడు ఆలోచనలకూ, క్రియకూ ఆధారం వుండదు. అన్ని ఆలోచనలకూ క్రియలకూ స్వీయజ్ఞానమే పునాది అవాలి. మీ గురించి మీకే తెలియకపోతే సరియైన ఆలోచనా, సవ్యమైన క్రియా వుండవు. విలువలలోనే విప్లవాత్మకమైన మార్పు రావాలంటే స్వీయజ్ఞానం లేకుండా అది జరగదు. విలువలలో విప్లవం వచ్చినప్పుడు మాత్రమే ప్రపంచ సమస్యలను పరిష్కరించగలుగుతాం. ప్రపంచం అంటే మీరే కనుక, మీకూ మరొకరికీ మధ్యనున్న పరస్పర బాంధవ్యమే సమాజం కనుక, స్వీయజ్ఞానం వల్ల మీరు తీసుకొని రాగలిగిన ఈ విలువల విప్లవం జరగకుండా శాంతీ వుండదు, సమస్థితీ, క్రమతా వుండదు. ఈ గందరగోళంలో నుంచీ రోజుకీ రోజుకీ పెరిగిపోతున్న ఈ బాధల నుంచీ బయటపడే ఆశ వుండదు. కాబట్టి, మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడమే అత్యంత ప్రధానమైన విషయం. స్వీయజ్ఞానం లేకుండా సమాజాన్ని మార్చివేయాలనుకోవడం వృధా ప్రయాస. ప్రపంచం వేరూ మనం వేరూ అని భావిస్తూ, ప్రపంచపు సమస్యలని పరిష్కారం చేసి తీరాలి అని గట్టిగా మాట్లాడుతూ వుంటాం. మనలో ప్రతి ఒక్కరం ఈ సంఘర్షణకి, ఈ గందరగోళానికీ, ఈ విద్వేషాలకు, పెరిగిపోతున్న ఈ వున్మాదానికీ దోహదం చేసిన వాళ్ళమే, కారణభూతులమే. ఈ సమస్యలని గురించి ఏ విధంగా ఆలోచించాలో, వాటితో ఎట్లా తలపడాలో, ఏ విధంగా పరీక్షించాలో తెలియకపోతే వాటిని అంతమొందించడం సాధ్యం కాదు. అసలు సమస్య కంటె దాన్ని ఏ విధంగా ఎదుర్కొంటున్నాము అనేది ముఖ్యం. అసలు సమస్య ప్రపంచం కాదు, మీరే. ఈ సమస్య వెంటనే ఎదుర్కొనవలసినదీ, తక్షణమే పరిష్కరించవలసిన అత్యావసర స్థితీ అని మీరు గ్రహించనంతవరకూ సమస్యని గురించి మీరు సవ్యంగా ఆలోచించలేరు. అది ఏదో బయటి విషయం అనుకోవడం వల్ల సమస్య గురించిన స్పృహ మీకు లేకపోవచ్చు. సమస్యని సృష్టించినది మీరే. కాబట్టి సమస్య అంటే మీరే అనే స్పృహ మీకు కలగాలి. మీలో వున్న గందరగోళం చక్కబడాలి. ఎందుకంటే గందరగోళపు స్థితిలో ఏ పని చేసినా అది చికాకులను మరింత ఎక్కువ చేస్తుంది.

పరివర్తనా, పురుజ్జీవనమూ మీలోనే ఆరంభం అవాలి. మరొకరిలో కాదు. అదే సరియైన దృష్టి మీలోని మానసికమైన, వుద్వేగపూరితమైన కార్యకలాపాలను గురించీ, మీ దినసరి అలవాట్లనూ, వూహలనూ గురించీ, తిరిగి తిరిగి మీలో కలిగే భయాలను గురించీ, వర్గ, కుల, మత విభజనలను గురించీ, జాతీయ పరమైన, జాతిభేద సంబంధమైన విద్వేషాల గురించీ గ్రహింపు కలిగి వుండండి. ప్రపంచంలో శాంతి నెలకొనే ముందు, మీలోపల శాంతీ, క్రమతా నెలకొల్పుకొనడం అవసరం.

ఎన్నడూ కనీ వినీ ఎరగనంతటి మహావిపత్తు ఇప్పుడు మన ఎదురుగా నిలబడి నిలదీస్తున్నది విపరీతమైన గందరగోళం ఎట్ట ఎదురుగా వున్నది. వీటిని ఎదుర్కోవడానికి రకరకాల విధానాలనూ, ఈ పక్షం వారో, ఆ పక్షం వారో తీర్మానం చేసిన నిర్ణయాలనూ ప్రయోగిస్తున్నాం. ఇటువంటి అల్లకల్లోలంలో శాంతీ, క్రమతా నెలకొల్పాలంటే విలువలలో విప్లవం రావాలి ఇంద్రియ సంవేదనలకు చెందిన విలువలు మనల్ని లోబరచుకొని, నడిపిస్తుండటం వల్ల ఈ గందరగోళం తయారయింది. శాశ్వతమైన విలువలని మళ్ళీ మనం పునరుద్ధరించుకోవాలి. ప్రతి ఒక్కరూ ఈ శాశ్వతమైన విలువలని తమకి తాముగా కనుగొనాలి. ఈ సంస్కరణను ప్రతివారూ తమతోనే ఆరంభించుకోవాలి. ప్రతి ఒక్క ఆలోచన ఎడలా, మనోభావం ఎడలా, ఆపైన ప్రతి ఒక్క క్రియ ఎడలా కూడా ఎరుక కలిగి వుండాలి ఎందుకంటే సత్యం ఎక్కడో దూరంగా లేదు ; ఇక్కడే మన దగ్గిరే వున్నది.

ప్రశ్న . ఈ మధ్య ఒక ప్రఖ్యాత పత్రికా విలేకరి రాసిన వ్యాసం చదివాను. వివేకమూ వ్యక్తిగతమైన ఆదర్శ జీవనమూ ప్రపంచ సమస్యల్ని పరిష్కరించడానికి కొంతవరకే తోడ్పడతాయి తప్ప, పూర్తిగా కాదు. అని ఆయన రాశారు. మీరేమంటారు ?

కృష్ణమూర్తి . ఈ ప్రశ్నలో ఎన్నో ముఖ్యమైన అంశాలు దాగి వున్నాయి కాబట్టి మెల్లగా విశ్లేషణ చేద్దాం. ఈ పత్రికా రచయితలకి వాళ్ళకి వుండే పాత విరోధాలు కొన్ని వాళ్ళకీ వుంటాయి. అందువల్ల వాళ్ళు మనకి ఎట్లా ఆలోచించాలి అనేది చెప్పకుండా, ఫలానా విషయాలే ఆలోచించండి అని అటుగా మళ్ళిస్తూ వుంటారు. సాధారణంగా, చదివినవన్నీ మనకి నిజాలుగా తోస్తాయి. అదే మన దౌర్భాగ్యం. ప్రస్తుతం వున్న ఈ విద్యావిధానం మనం ఆలోచించుకోడానికి, మనం స్వయంగా తెలుసుకోవడానికి సహాయపడటం లేదు. మన దృష్టిలో రచయితలకీ, పత్రికా విలేకరులకూ ప్రాముఖ్యం చాలా పెరిగిపోయింది. అచ్చు అయిన ప్రతిదానికీ తల వూపడం అనే లక్షణం మనలో వున్నదనే గ్రహింపు మనకి కలగాలి ఈ పత్రికా విలేకరే కాదు, ఇంకా ఇతరులు కూడా

రాజకీయ చర్యలనూ, వ్యక్తిగతమైన ఆదర్శ ఆచరణలనూ ప్రముఖంగా చూపుతున్నారు. ఒక వ్యక్తిలో వున్న ఆదర్శనీయమైన ఆచరణా, రాజకీయ చర్యలూ ప్రపంచ సమస్యల్ని పరిష్కరించడానికి సరిపోవు. అంతకంటె చాలా ప్రధానమైనదీ, సమూలమైనదీ జరగవలసిన అవసరం వున్నది.

వ్యక్తిని ఆదర్శంగా తీసుకున్నప్పుడు, అందులో అనుకరణ, లోబడి వుండటం అనేవి అంతర్గతంగా వుంటాయి. ఒక ఆదర్శానికి కట్టుబడి వుండటం వల్ల దుఃఖభారం ఏ మాత్రం తరిగిపోదు. గొప్ప విషమ పరిస్థితి ఎదురైనప్పుడు, ఒక వ్యక్తిని ఆదర్శంగా తీసుకోవడం వల్ల ఏమీ ప్రయోజనం వుండదు. అనుకరణ ద్వారా ఆలోచనలను అదుపు చేసి, ఒక దారిలో పెట్టడం వల్ల వివేకం వుదయించదు. వివేకానికి ఒక స్థిరనివాసమంటూ వుండదు. ఎక్కువగా చదవడం వలన కూడా వివేకం కలగదు. రాజకీయమైన చర్యలు ఎప్పుడూ పాక్షికంగానే వుంటాయి. అవి అసంపూర్ణమైన చర్యలు, కాబట్టి నిజాలు కావు పైగా వాటి వలన గందరగోళమూ, బాధలూ ఎక్కువవుతాయి. ఇప్పుడు నిజంగా అవసరమైనది ఆలోచనల్లోనూ మనోభావాల్లోనూ విప్లవం. సృజనాత్మకమైన ఇటువంటి విప్లవాన్ని కొద్దిమంది నాయకులు తీసుకొని రాలేరు. రాజకీయ కార్యక్రమాలూ, వ్యక్తిగత ఆదర్శాలూ కూడా ఈ విప్లవాన్ని తీసుకొని రాలేవు. కేవలం వ్యక్తిని మేలుకొలపడం ద్వారా మాత్రమే ఇది జరుగుతుంది. వ్యక్తిగత ఆదర్శం కానీ, ఏదో ఒక సిద్ధాంతాన్ని అనుసరించి జరిగే రాజకీయ చర్య కానీ ఈ మహా విపత్తు నుండి ప్రపంచాన్ని కాపాడలేవు. మనిషి ఒక విధానాన్ని నమ్ముతున్నాడు ; ఒక పార్టీలోనో, నాయకత్వంలోనో నమ్మకం పెట్టుకుంటున్నాడు. అవి నిస్సందేహంగా విఫలమవుతూ వచ్చాయి. మీరు మిమ్మల్నే నమ్ముకోవాలి, మీలోనే ఆశలు పెట్టుకోవాలి తప్ప మరొకరిలో కాదు.

ఇది ఆర్థిక రంగానికో, రాజకీయ రంగానికో చెందిన విపత్తు కాదు. ఇది మానవాళికి కలిగిన విషమస్థితి. మనిషి మొత్తం అస్తిత్వానికి ప్రమాదకరం ఇది. ఏదో ఒక రంగానికి చెందిన అతని కార్యకలాపాలకు కాదు. ఈ సమస్య ప్రపంచ సమస్య కాదు, మీరే ఈ సమస్య. తీర్మానాలు చేయడం, సూత్రాలు సిద్ధాంతీకరించుకోవడం, విధానాలూ, పద్ధతులూ అనే దృష్టితో మీరు ఆలోచిస్తున్నారు కాబట్టి మీకూ, ఆ విధంగా ఈ ప్రపంచానికీ కూడా గందరగోళమూ, బాధల రూపంలో మరింత ముప్పు తెచ్చి పెట్టారు. వ్యక్తిగత ఆదర్శాలు సంఘర్షణ నుండి, వేదన నుండి మిమ్మల్ని విడిపించలేవు. సృజనాత్మకమైన ఆలోచనల ద్వారా విలువలలో విప్లవం రావడం చాలా కష్టసాధ్యమైనది కాబట్టి మనం ఇతరమైన వాటి వైపు మొగ్గుతాం. అంటే

నాయకులవైపు, ఆదర్శ పురుషుల వైపు. మనం చేసే ఆలోచన అంతా మనలోని నిబద్ధీకరణకు మనం చూపే ప్రతిచర్యే. కాబట్టి అది ఆలోచనే కాదు. మీరు హిందువులు కాబట్టి ఒక ప్రత్యేక పద్ధతిలో ఆలోచించడానికీ, ప్రవర్తించడానికీ నిబద్ధులై వున్నారు. అట్లాగే ముస్లిములూ, క్రైస్తవులూ తక్కినవారు కూడా. ఇది ఆలోచించడం ఏ మాత్రమూ కాదు. నిబద్ధీకరణం నుండి – చేతనావస్థలోని నిబద్ధతే కాదు, లోపల దాగివున్న నిబద్ధతనుండి కూడా స్వేచ్ఛ పొందినప్పుడే ఆలోచనల్లోనూ, మనోభావాల్లోనూ సృజనాత్మకమైన విప్లవం జరుగుతుంది. ఏ వాదాలకు గానీ, రాజకీయ, మత విధానాలకుగానీ – దేనికీ కూడా కట్టుబడి వుండటం మానివేయాలి. సాంఘికమైన, ఆర్థికమైన వర్గ విభజనలు వట్టి బూటకాలు. మీరు వాటిని అధిగమించినప్పుడే సృజనాత్మకంగా ఆలోచించగలుగుతారు. నేను చెప్పేదానితో మీరు ఏకీభవించి, బహుశ ప్రతి ఆదివారమూ ఇక్కడికి వచ్చి వింటూ వున్నాకూడా దౌర్భాగ్యం ఏమిటంటే, నిలదొక్కుకొనిపోయిన మీ పాత పద్ధతుల ప్రకారమే ఆలోచిస్తారు, ప్రవర్తిస్తారు. కాబట్టి మీరు చూపే అంగీకారం లోతైనది కాదు. దాని వలన ఏమీ లాభం లేదు. విధానాలని, పద్ధతులనీ ప్రశ్నించడం ఆరంభించి, క్రియలో కూడా పెడితే, నిస్సందేహంగా ఇక్కట్లూ, ఇబ్బందులూ ఇంకా ఎక్కువవుతాయి. ఈ సంగతి గ్రహించారు కాబట్టే పైపైకి మాత్రం ఒప్పుకున్నామని అంటారు. ప్రపంచం అంతా అల్లకల్లోలంలో వున్నది, ఈ విషయంలో ఏదయినా చేయాలి అని మాటల్లో మాత్రమే వుద్ఘాటిస్తూ వుంటారు.

కాబట్టి, అసలు సమస్య మీరే. ఎందుకంటే ప్రపంచం అన్నా, ప్రజా బాహుళ్యం అన్నా, ప్రభుత్వం అన్నా మీరే. మీ లోపల సంఘర్షణా, దుఃఖమూ వున్నాయనీ, గందరగోళమూ, బాధా వున్నాయనీ గ్రహించి, వాటిని అధిగమించినప్పుడు ప్రపంచ సమస్యలని మీరు పరిష్కరిస్తున్నారన మాట. వీటితో పోల్చినప్పుడు, వ్యవస్థకు సంబంధించిన సమస్యలనూ, రాజకీయ సమస్యలనూ పరిష్కరించడమే తేలిక. కేవలం సిద్ధాంతాలూ, పుస్తక పరిజ్ఞానమూ మీకు గానీ, తద్వారా ఈ ప్రపంచానికి గానీ గందరగోళం నుంచీ, బాధల నుంచీ విడుదల ఇవ్వలేవు. ప్రత్యక్షంగా అవగాహన చేసుకోవడానికీ, చర్య తీసుకోవడానికీ పుస్తక పరిజ్ఞానం అవరోధంగా నిలబడుతుంది. మీలోని నిబద్ధీకరణాన్నీ, మీ కోసం మీరే సృష్టించుకొన్న ఆ క్షుద్ర విలువలనూ మీరే ఛేదించుకొని బయటపడాలి. విధానాల వల్ల కానీ, నాయకుల వలన కానీ, రాజకీయ చర్యల వలన కానీ, ఆదర్శ వ్యక్తిత్వాల వలన కానీ ఏమీ లాభం లేదు. ఆశా, నమ్మికా మీపైన మాత్రమే పెట్టుకోవాలని తెలుసుకోండి.

ప్రశ్న : వర్తమానాన్ని గతంలోకి గానీ, భవిష్యత్తులోకి గానీ వెళ్ళే త్రోవగా మనం వుపయోగిస్తున్నామని మీరంటున్నారు. అంటే అర్థం ?

కృష్ణమూర్తి : గత ఆదివారం నాడు మాట్లాడుతూ, వర్తమానాన్ని గతానికో, భవిష్యత్తుకో పోయే త్రోవగా వుపయోగించడం వలన ఘోర ప్రమాదాల్నీ, బాధల్నీ తయారు చేస్తున్నామని నేను అన్నాను. ఒక గమ్యం చేరడానికి సాధనంగా వర్తమానాన్ని మనం వుపయోగిస్తున్నాం, మానసికంగానూ, భౌతికంగానూ కూడా. వర్తమానాన్ని గతంలోకీ భవిష్యత్తులోకీ వెళ్ళే మార్గంగా మాత్రమే వుపయోగిస్తున్నాం. వర్తమానం గతం కారణంగా కలిగిన ఫలితమే. ఇప్పుడు మీరు ఆలోచిస్తున్నదానికి ఆధారం గతంలో వున్నది మీ అస్తిత్వం గతం ఆధారంగా నిర్మించబడింది. ఎప్పుడూ గతమే వర్తమానం గుండా అల్లుకుంటూ పోయి భవిష్యత్తు అవుతున్నది. భవిష్యత్తు అంటే వర్తమానం ద్వారా నిబద్ధం చెందిన గతం. వర్తమానం ద్వారా మాత్రమే గతాన్ని అర్థం చేసుకోగలుగుతాము. గతానికి ద్వారం వర్తమానంలో నుండే తెరచుకుంటుంది. గతం యొక్క విశేష్యత తెలుసుకోవాలంటే వర్తమానాన్ని ఆకళింపు చేసుకోవాలి. అంతే తప్ప భవిష్యత్తు కోసం వర్తమానాన్ని వర్జించకూడదు. భవిష్యత్తులో ఆదర్శ ప్రపంచం నిర్మించడం కోసం గాను వర్తమానాన్ని త్యాగం చేసే రాజకీయ పక్షాలూ, మతవాదులూ మానవాళికి ఘోరవిపత్తులనూ, క్షోభలనూ తెచ్చిపెడుతున్నారు. భవిష్యత్తు కోసం వర్తమానాన్ని వర్జించడంలో వుండే ఘోర అనర్థాలు సుస్పష్టంగా కనబడుతున్నాయి. మార్గమే గమ్యం. సాధనలోనే గమ్యం వున్నది. గమ్యాన్నీ మార్గాన్నీ విడదీయలేము.

నిరంతరంగా వుండేది వర్తమానం. కాలరహితమైనది వర్తమానం. కాలం ద్వారా దానిని చేరలేము. అయినా మీరు అపారమైన దానిని చేరుకోవడానికి, కాలరహితమైన దానిని చేరుకోవడానికి గతం, వర్తమానం, భవిష్యత్తు - అనే కాలాన్ని సాధనంగా వుపయోగిస్తున్నారు. భవిష్యత్తు కోసం వర్తమానాన్ని వర్జించడంలోని భ్రాంతినీ, భవిష్యత్తు వర్తమానం కంటె భిన్నంగా వుంటుందనే భ్రమనీ గ్రహించుకోవాలి. ఇప్పుడు కనుక అవగాహన చేసుకోకపోతే భవిష్యత్తులో కూడా అవగాహన కలగదు. వివేకం ఎప్పుడూ వర్తమానంలోనే వుంటుంది తప్ప భవిష్యత్తులో తిష్ఠవేసుకొని కూర్చోదు.

- గతంలో నుంచి పుట్టుకొచ్చినదే ఆలోచన, అంటే గతానికి ఫలితం. ఆలోచనను అవగాహన చేసుకొని, ఆ విధంగా దానిని గతం నుంచి విడిపించడానికి, మీరు ప్రస్తుతంలో ఏమిటి అన్నదీ, మీ ఆలోచనలూ, మనోభావాలూ, క్రియలూ ఏమిటి అన్నదీ గ్రహించి, వాటి ఎడల ఎరుకగా వుండండి. అప్పుడు వర్తమానాన్ని కేవలం ఒక త్రోవగా మీరు వుపయోగిస్తున్నారని చూస్తారు. ఈ కాలం అనే ప్రక్రియ ద్వారా కాలరహితమైన దానిని చేరలేరు. ఎందుకంటే మార్గమే గమ్యం కనుక. తప్పు మార్గాన్ని మీరు తయారు చేసుకుంటే, అప్పుడు మీరు సృష్టించుకొనే గమ్యం కూడా తప్పుదే అవుతుంది. సరియైన,

సవ్యమైన మార్గమే సవ్యమైన గమ్యాన్ని సృష్టిస్తుంది. యుద్ధం ద్వారా శాంతిని నెలకొల్పాలనుకోవడం అనేది తప్పు మార్గం. మార్గమే గమ్యం. గమ్యాన్ని మార్గం నుంచి విడదీసి వేయలేము. కాలరహితమైన దానిని అవగాహన చేసుకోవాలంటే కాలానికి కట్టుబడిన ఆలోచన, తనని తాను గతాన్నుంచి విడిపించుకొని స్వేచ్ఛను పొందాలి. అట్లా చేయనప్పుడు గతమే వర్తమానం ద్వారా భవిష్యత్తుగా మారుతూవుంటుంది.

ప్రశ్న : దేశాన్ని దోపిడీ చేస్తున్నవారిలో ప్రధాన పాత్ర వహిస్తున్నది స్వదేశ సంస్థానాలను ఏలుతున్న ప్రభువులూ, జమీందార్లూ, పెట్టుబడీదారులూ అనీ, వీరందరినీ హతమారిస్తే తప్ప ప్రజలందరికీ అన్నవస్త్రాలూ, ఆశ్రయమూ కల్పించడం సాధ్యం కాదనీ కమ్యూనిస్టులు అంటున్నారు. తమ ఆధీనంలో, తమ ఏలుబడి కింద వున్న ప్రజలకి ఈ జమీందార్లూ రాచరికం వారూ, పెట్టుబడీదారులూ ధర్మకర్తల వంటివారు కాబట్టి, వారిని ఇదే విధంగా కొనసాగనివ్వాలని గాంధీగారు అంటున్నారు. మీ అభిప్రాయం ఏమిటి ?

కృష్ణమూర్తి : ఒక విషయం చాలా వింతగా తోస్తున్నది. ప్రపంచమంతటా కూడా ప్రజలకి తమ నాయకులూ, తమ తమ పక్షంవారూ – అది వామపక్షం అవచ్చు, మరో పక్షం అవచ్చు – వాళ్ళు ఏ విధంగా ఆలోచిస్తున్నారో తెలుసు. కానీ తాము స్వయంగా ఏమి అనుకుంటున్నారు అన్న సంగతి మాత్రం వారికి తెలిసినట్లు లేదు. ఇతరులు, ముఖ్యంగా ప్రముఖులు అని పిలువబడేవారు చెప్పేమాటలకు ప్రజలు చాలా విలువనిస్తారు తప్ప తమ స్వంత ఆలోచనలను అంతగా పట్టించుకోరు. అసలు ముఖ్యమైన విషయం ఏమిటంటే, మీరు ఏమి ఆలోచిస్తున్నారు, ఎట్లా భావిస్తున్నారు అన్నది. ఎందుకంటే ఇది మీ జీవితం. ప్రస్తుత సమస్య మీ బాధల్నీ మీ సంఘర్షణల్నీ గురించి. ఇంతకు ముందు ఏ పుస్తకమూ చదవలేదని అనుకుంటూ, ఈ గొప్ప గొప్ప నాయకుల వుపన్యాసాలను మనం ఎన్నడూ వినలేదని భావిస్తూ, అన్నింటినీ అవతలకు నెట్టివేసి, ఈ ప్రశ్నను ఇప్పుడు మనం పరికిద్దాం. ప్రశ్న దోపిడీ తత్వానికీ, దీనిని ఎట్లా నిర్మూలించాలీ అన్న దానికి సంబంధించినది. ఒకరు జమీందారు అవడం గానీ, మహరాజా అవడంగానీ ఎట్లా జరుగుతున్నది ? ప్రజలని అన్యాయంగా దోచుకోవడం ద్వారా అని అనడంలో సందేహం లేదు. మీకు అవసరమైన దాని కంటె ఎక్కువ సంపాదించడమే దోపిడీ అవుతున్నది. అన్నవస్త్రాలూ, ఆశ్రయమూ అవసరం. నిజమే. కానీ తమని తాము గొప్పవాళ్లుగా చేసుకోవడానికి అవి సాధనాలుగా వుపయోగిస్తున్నప్పుడు దోపిడీ మొదలవుతుంది. అధికారమూ, హోదా, ఆధిపత్యమూ, పెత్తందారీతనమూ సంపాదించడానికి మరొక మనిషిని వుపయోగించుకోవడం దోపిడీ. అసలు సమస్య దోపిడీ తత్వం. ఎవరు దోపిడీ చేస్తున్నారు అన్నది కాదు. పెట్టుబడీ

దారులు, మహారాజాలు, జమీందార్లూ మీవంటి మనుష్యులే. మీకే గనుక అవకాశం వుంటే మీరూ వారిలాగే తయారవుతారు. విజయ సింహాసనం ఎక్కగానే, లాభాలు సంపాదించిన మరుక్షణమే మీ లోని వుదారగుణాన్నీ, మీలోని ప్రేమనీ మీరు కూడా పోగొట్టుకుంటారు.

ఈ పెట్టుబడీ దారులూ, ఈ జమీందార్లూ, సంస్థానాలు ఏలుతున్న ప్రభువులూ నిజంగా ధర్మకర్తలేనా ? ధర్మకర్తృత్వం అంటే సంపూర్ణ విశ్వాసం ; అందులో ప్రేమ వుంటుంది. అయితే అత్యాశ మొదలవగానే, పెత్తనం చలాయించాలనే కోరిక రేకెత్తగానే, అధికారం ప్రయోగించాలని అనుకోగానే ప్రేమ మాయమవుతుంది. నాయకుల మనీ, జమీందార్లమనీ మీకు మీరే గొప్పతనం ఆపాదించుకోగానే ప్రేమ మాయమవుతుంది. నాయకులూ, నడిపించబడేవారూ ఇద్దరూ అన్యాయం చేస్తున్నారు. మహారాజాలూ, పెట్టుబడిదారులూ కూడా. ఇతరులు చెప్పే మాటలు విని ఆ ప్రకారంగా ఆలోచించకండి. మీరే స్వయంగా యోచించండి.

సమస్య ఏమిటంటే దోపిడీ తత్వం. సమష్టి చర్యల వలన దోపిడీనీ, అన్యాయాన్నీ అరికట్టగలమా, వ్యక్తిగతమైన యత్నం వలన అది ఎక్కువవుతుందా ? వ్యక్తిలో వున్న అత్యాశా, అధికార లాలసా ప్రపంచాన్ని ఇంతటి గందరగోళంలో, దుఃఖంలో ముంచివేశాయని మనకు తెలుసు. సమస్త అధికారాలనీ చేజిక్కించుకున్న ప్రభుత్వాలు ప్రజలని దోపిడీ చేయగలవనీ, చేస్తాయి అనీ, ఆవిధంగా మరి కొన్ని రకాలైన సంఘర్షణలనూ, దుస్థితినీ కలిగిస్తాయనీ కూడా తెలుసు మనకి. వ్యక్తిలోనూ, ప్రభుత్వాలలోనూ, సమష్టిలోనూ కూడా వున్న ఈ అత్యాశా, అధికార లాలసా వినాశహేతువులనీ, క్రూరమైనవనీ మనం చూడగలుగుతున్నాం. సమష్టి స్థాయిలో ప్రజల నిత్యావసరాలను ఏర్పాటు చేయడంలో మనిషి అస్తిత్వమూ, అతని ఆలోచనలూ, అతని మనోభావాలూ కూడా దోపిడీకి గురి అవుతున్నాయి. సంపద కూడబెట్టుకోవడంలో అన్యాయమూ, దోపిడీ వుండి తీరుతాయి. కూడబెట్టుకోవాలనే లాలస దోపిడీ తత్వాన్ని పెంచుతుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు. సంపద కూడబెట్టడం అన్నది మానసిక తత్వం. సంపాదించి, కూడబెట్టే జీవిగా, అది వ్యక్తి అవచ్చు, సంస్థ అవచ్చు – ఆస్తిపాస్తులు సంపాదించాలి అనే పట్టుదల వున్నప్పుడు దోపిడీ తత్వం కూడా వుంటూనే వుంటుంది. అంటే అర్థం – మనిషి భౌతిక సంక్షేమం కోసం మనం కృషి చేయకూడదు అని కాదు. అయితే ఈ కృషి చేస్తున్నవారు తమ సంస్థను ఆస్తులూ, సంపదా ఆర్జించే సాధనంగా వుపయోగిస్తే, అప్పుడు అతడూ, ఆ సంస్థా కూడా దోపిడీలూ, అన్యాయాలూ చేసే పరికరాలుగా తయారవుతారు.

స్వంతానికి కూడబెట్టుకోవడం లేని అంటే దోపిడీ తత్వం లేని పరస్పర బాంధవ్యాలలో మనుష్యులు జీవించగలరా ? స్వంతానికి ఆస్తులు లేకుండా సమాజంలో మీరు జీవించగలరా ? ఇంకా ఎక్కువగా, ఎక్కువెక్కువగా కావాలనుకోకుండా జీవించగలరా ? అధికారానికీ, హోదాకీ, మానసిక భద్రతకీ చిహ్నాల వంటి ఆస్తిపాస్తులు ఇంకా ఎక్కువెక్కువగా మీ స్వార్థానికీ, మీరు గొప్పవాళ్ళవడానికీ వుపయోగించుకోకుండా వుండటానికీ మీరు ఒప్పుకోవడం లేదు కాబట్టి, వామపక్షమూ రెండో పక్షమూ కూడా వారి వారి పద్ధతుల్లో మిమ్మల్ని హతమారుస్తున్నాయి. అయితే, హతమార్చడమూ, హత్యలూ మార్గం కావనడంలో సందేహం లేదు.

అందువల్ల, కూడబెట్టుకునే తత్వాన్ని స్వచ్ఛందంగా విసర్జించగలమా ? అట్లాగే, అధికారలాలసను – చేతితో తయారు చేసిన వస్తువుల ద్వారా వచ్చే అధికారం గానీ, మనసుతో తయారు చేసిన వస్తువుల ద్వారా వచ్చే దానిని గానీ – వదిలివేసేయగలమా ? అట్లా చేయకపోతే, సమాజమూ, ఇతరులూ – వారిలో కూడబెట్టుకునే తత్వం వుంది కాబట్టి మిమ్మల్నీ ఒత్తిడి చేస్తారు. అప్పుడు మీరు ఈ యంత్రంలో భాగమైన ఒక మరమేకు అవుతారు – ఇప్పుడున్నలాగే – సమాజం అనే ఒక పెద్ద యంత్రంలో చిన్న మరమేకు అవుతారు. ఉక్కిరిబిక్కిరి చేస్తున్న ఈ గందరగోళంలో నుండి బయట పడాలంటే కూడబెట్టుకునే తత్వాన్ని స్వచ్ఛందంగా, తిరిగి వెనక్కి చూడకుండా వదిలివేసెయ్యడమే మార్గం. భద్రత కోసం పడే ఆరాటంలో నుండే ఈ కూడబెట్టుకునే తత్వం వస్తుంది. మీలో ఎంత ఎక్కువగా గందరగోళం వుంటే అంత ఎక్కువగా భద్రత కోసం కోరిక వుంటుంది. అయితే, భద్రత అనేది అసలు వున్నదా ? భద్రత కోసం, మానసికమైన భద్రత కోసం పాకులాడాము కాబట్టి ఈ గందరగోళాన్నీ, ఈ బాధలనీ మన చుట్టూ తయారు చేసుకున్నాం. మీ అంతట మీరే స్వచ్ఛందంగా కనుక కూడబెట్టుకునే తత్వాన్ని వదిలేయకపోతే, ప్రభుత్వం మిమ్మల్ని తన కట్టుబాట్ల క్రింద వుంచి, ఒక క్రమశిక్షణలోకి నొక్కేస్తుంది. అప్పుడు, వ్యక్తుల వల్లనో, సంస్థల వల్లనో కాకుండా సమష్టి చేత దోపిడీకి గురవుతారు. మీ అంతట మీరే కనుక స్వచ్ఛందంగా, తెలివిగా, స్వంతానికి సంపద కావాలనుకునే ఈ లాలసను పక్కకు నెట్టి వేయకపోతే నిర్బంధాలూ, దోపిడీ తత్వమూ అనే పునాదుల మీద నిర్మించిన సమాజాన్ని మీరు తయారు చేసుకుంటారు.

నవ్య సమాజాన్ని నిర్మించాలంటే మీ ఈ ప్రస్తుతపు విలువలను సమూలంగా మార్చివేసుకోవాలి. అందుకు మృదువుగా వుండే అప్రమత్తత, విస్తృతమవుతూ వుండే ఎరుక చాలా అవసరం. అయితే మీలో నిరుత్సాహమూ, అలక్ష్యమూ చోటు చేసుకొని వుండటం వలన మీ మీద ఒత్తిడి ప్రయోగించడం, దారి మళ్ళించడం జరుగుతూ

వుంటుంది. ప్రపంచ సమస్యలని, అంటే అవి మీ సమస్యలే – వాటిని నిర్బంధాల ద్వారా పరిష్కరించలేము. దోపిడీ తత్వంలో అంతరంగా, లోతుగా పాతుకొనిపోయి వున్న మనోతత్వ సంబంధిత విషయాలను అవగాహన చేసుకోవడం చాలా కష్టతరమైన పని. అయితే ఈ అవగాహన లేకుండా ఒక దోపిడీ దారుడిని తొలగించి మరొకరిని ఆ స్థానంలో భర్తీ చేయడం అంటే ఇవే ఘర్షణలూ, బాధలూ అట్లాగే కొనసాగించడం అనమాట. మానసికంగా, అంతర్గతంగా మీలో లేమి వున్నది కాబట్టి, ఒంటరితనంతోనూ, ఖాళీతనంతోనూ బాధపడుతూ వుంటారు కాబట్టి చేతితో తయారుచేసిన వస్తువులనో, మనసుతో తయారుచేసిన వస్తువులనో స్వంతం చేసుకొని దాచుకోవడం అతి ముఖ్యమైపోతున్నాయి. ఎప్పుడూ వదలకుండా వెంటవుండే ఈ బాధాకరమైన శూన్యాన్ని ముఖాముఖిగా ఎదుర్కొని అర్థం చేసుకోవాలి. అప్పుడే మనస్తత్వపు లక్షణమైన ఈ దోపిడీ తనం అంతరించిపోతుంది.

ప్రశ్న : మీ బోధనలు కేవలం సన్యసించినవారి కోసం మాత్రమేనా, లేక కుటుంబాలూ, బాధ్యతలూ వున్న మాలాంటి వారి కోసం కూడానా ?

కృష్ణమూర్తి : ఈ బోధనలు అందరి కోసమూ వుద్దేశించి చేసినవి. ఈ ప్రపంచాన్ని త్యజించిన వారికీ, ఈ ప్రపంచంలోనే వున్నవారికీ కూడా. వర్జించిన వారు కూడా లౌకికమైన వ్యక్తులలాగే ఇంకా కోరికలతో వేగిపోతున్న ప్రపంచంలోనే వున్నారు. ఇద్దరూ బంధాలలో చిక్కుకొని పోయే వున్నారు. ఆ బంధం ఇంద్రియమైన విలువలది అవచ్చు, లేదా మనసు అల్లిన బంధం అవచ్చు. ఈ బోధనలు ఇద్దరికీ విముక్తి కలిగించి స్వేచ్ఛ నిస్తాయి. చేతితో తయారు చేసిన వస్తువులలో కానీ, మనసుతో తయారు చేసిన వాటిలో కానీ యదార్థత లేదు. సత్యం – 'ఉన్నది' అనే సత్యం విడుదల కలిగిస్తుంది. అర్థం చేసుకోవలసినది ఉన్నది'ని – అంటే – గాఢోద్రేకాలనూ, అసూయలనూ, దుర్బుద్ధులనూ, కూడపెట్టుకునే తత్వాన్నీ. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడం వల్లనే దానినుండి విడుదల ప్రాప్తమవుతుంది. చాలా అరుదైన క్షణాల్లో – అంటే మనసు తన గురించిన వ్యాపకంలోనే తాను మునిగిపోయి లేనప్పుడు, 'నేను' లేనప్పుడు విడుదల కలిగించే ఆ సత్యాన్ని మనం గ్రహించకలుగుతాం.

కుటుంబం వున్న వ్యక్తి తన బాధ్యతల ప్రపంచంలో చిక్కుకొనిపోయి వుంటాడు. అతని చుట్టూరా ఎంత ఎక్కువ గందరగోళం వుంటే అంత ఎక్కువగా అతను తన కుటుంబ విషయాల గురించీ, తన గురించీ చింతిస్తూ వుంటాడు. ఆ కారణంగా భద్రత కావాలని వెతుక్కుంటూ వుంటాడు. ఇదంతా మొదలే వున్న గందరగోళాన్ని ఇంకా ఎక్కువ చేస్తుంది. ఈ గందరగోళానికి వెనక వున్న అర్థం ఏమిటి అనే విషయం తాను అర్థం

చేసుకోకుండా, తన కుటుంబ భద్రత గురించి ఆరాటపడతాడు. అదే తన బాధ్యత అని అంటూ వుంటాడు. తన లోపల శాంతీ, సక్రమస్థితీ నెలకొల్పుకోవాలి తప్ప, వున్నదో లేదో తెలియని భద్రత కోసం వెదకడంలో పడి అసలు వాస్తవం నుండి పారిపోకూడదు. ఈ లౌకిక ప్రపంచం నుండి సన్యసించిన వ్యక్తి కూడా భద్రత కావాలనే కోరికలో చిక్కుకొని పోయి వున్నాడు. అతనూ తక్కిన వారి వంటి వాడే, ఏమీ భేదం లేదు. ఎందుకంటే అతను కూడా అతని మనసు తయారు చేసుకున్న విషయాల భారాన్ని మోస్తునే వున్నాడు. అవి కూడా గందరగోళాన్నీ, దుఃఖాన్నీ అతనికి తెచ్చిపెడుతున్నాయి. మనసు వీటిని తయారు చేయడం ఆపివేసినప్పుడే సృజనాత్మకత, యదార్ధత వుంటాయి.

అత్యాశ, దురాలోచనలూ లేకుండా, మూర్ఖత్వం లేకుండా, మనిషిని నాశనం చేసే విపరీతోద్రేకాలు లేకుండా ఈ ప్రపంచంలో నివసించడం సాధ్యమేనా ? ఆఁ, సాధ్యమే. మీరు నవ్వచ్చు గాక, కానీ అది సాధ్యమే సాధ్యం అవునోకాదో ప్రయత్నించి చూడండి. అత్యాశ, చెడుబుద్ధీ లేకుండా నివసించాలంటే మీరు చాలా అప్రమత్తంగా వుండాలి. ప్రతి ఆలోచన ఎడలా, ప్రతి మనోభావం ఎడలా ఎరుకగా వుండాలి. ఒక నాయకుడిని అనుసరించడమూ, కొన్ని నిర్ణయాలనూ, సూత్రాలనూ అంగీకరించడం మనలో ఎరుక లేదనే సంగతిని సూచిస్తాయి. ఎరుక ఒక్కటే మిమ్మల్ని సంఘర్షణ నుండీ, బాధల నుండీ తప్పించగలుగుతుంది. ప్రేమ లేనప్పుడు కుటుంబ జీవితానికి అర్థం లేదు. ప్రేమ మాత్రమే పునర్జీవనాన్నీ, సుఖసంతోషాల ప్రపంచాన్నీ తీసుకొని రాగలుగుతుంది.

ప్రశ్న : పంజాబులో ఒకప్పుడు జరిగిన అతి విషాదకరమైన సంఘటనలను గురించి మీకు తెలిసేవుంటుంది. అటువంటివి ఇప్పుడూ జరుగుతునే వున్నాయి. స్వీయజ్ఞానం కలవారూ, సత్ ఆలోచనలు కలవారూ వాటి ఆధారంగా నడుచుకొనే వారూ – కొద్దిమందే వున్నారు. ఆ కొద్ది మంది చర్యలు పంజాబు సమస్యా పరిష్కారం మీద ఏ విధంగా ప్రభావం చూపుతాయి ?

కృష్ణమూర్తి : పంజాబులో ఏం జరుగుతున్నదో ప్రపంచమంతటా అదే జరుగుతున్నది. ఇది ప్రత్యేకంగా ఒక్క భారతదేశానికే చెందిన సమస్యేమీ కాదు. ఇది మనిషి తోటి మనిషి ఎడల చూపించే అమానుషత్వం. విషాదకరమైన ఈ దుస్థితికి బాధ్యులెవ్వరు ? మనలో ప్రతి ఒక్కరం – ప్రతి ఒక్కరం ఏదో ఒక మతపరమైనదో, జాతి పరమైనదో, దేశపరమైనదో అయిన మూర్ఖత్వానికి కట్టుబడి వుంటాం కాబట్టి. మీరూ అట్లాగే హిందువులమనో, ముస్లింలం అనో, లేదూ జర్మనులమనీ, ఇంగ్లీషువారి మనీ భావించడం లేదూ ? మనం మానవులం కాదు, మనం ఫలానా అని రాసి మెడలకి

తగిలించుకున్న పట్టీలం. ప్రపంచం అంతటా స్వజాతీయ అభిమానాలూ, దేశభక్తి ఎక్కువవుతున్నాయి. వాటివల్ల సంఘర్షణలూ, అల్లకల్లోలమూ, ద్వేషవిద్వేషాలూ కూడా ఎక్కువవక మానవు. ప్రతి వ్యాధికీ వెనుక ఒక కారణం వుంటుంది. ఆ కారణాన్ని కనుక్కొని తొలగించే దాకా స్వస్థత చేకూరదు. తరతరాలుగా మన ఆలోచనలన్నీ తప్పుదారిన నడిచాయి. సహజంగానే అదంతా సంఘర్షణలకూ, అమితమైన బాధలకూ దారి తీసింది. ఇంద్రియ సంవేదనలకు సంబంధించిన విలువలను పెంచి పోషించుకోవడం యొక్క ఫలితమే ఈ అల్లకల్లోలమూ, దైన్యస్థితీ. కారణాన్ని గ్రహించినప్పుడు ఆ కారణమే అంతమైపోతుంది. అయితే కారణాన్ని అంతర్హితం చేయడం కాలంతో సంబంధించిన విషయం కాదు, పరిపక్వత చెందడానికి సంబంధించిన విషయమూ కాదు. అది తక్షణమే కలిగే పరిగ్రాహ్యత. తక్షణమే మనం గ్రహించకపోవడానికి అనేక కారణాలున్నాయి. వాటిలో ఒకటి భయం. వెంటనే చర్య తీసుకోవడం వల్ల ఏం జరుగుతుందో అనే భయం. కాబట్టి, తక్షణమే గ్రహించే శక్తిసామర్థ్యం మనకి వున్నా, ఇంకా పాత మూర్ఖపు విధానాలే పట్టుకొని పోతూ వుంటాం. ఎందుకంటే అదే మనకి సౌకర్యంగా వుంటుంది. కాబట్టి శ్రమ పడవలసిన అవసరం వుండదు. కాబట్టి, బాధలకీ, విపత్తులకీ కారణాలను గ్రహించే జాగృతిని తెచ్చుకోవాలి. అది రేపెప్పుడో కాదు, ఇవాళే జరగాలి. మీ జీవన తత్వాన్ని కాలం మీద నిర్మించకండి. 'ఉన్నది' ఎడల ఎరుకగా వుండండి. అదే ఆలోచనను అనంతత్వానికి నడిపిస్తుంది.

ప్రశ్న : క్రమశిక్షణ స్వేచ్ఛకు వ్యతిరేకమైనదని మీరంటున్నారు. కానీ అసలు స్వేచ్ఛకు క్రమశిక్షణ అవసరం కదా ?

కృష్ణమూర్తి : తప్పు దారిన వెళ్ళినప్పుడు గమ్యం కూడా సబబైనది అవదు. సరియైన దారి మాత్రమే సరియైన గమ్యానికి చేరుస్తుంది. దారీ, గమ్యమూ రెండు వేరు వేరు విషయాలు కావు. వాటికి పరస్పర సంబంధం వున్నది, అవి అసలు ఒకటే.

ఆలోచనను కనుక క్రమశక్షణలో పెడితే, నియమ నియంత్రణలో పెడితే, అలవాటు అనే గాడిలో నడిపితే – అప్పుడది నిబద్ధం చెందిన దానిని, పరిమితమైన దానిని మాత్రమే గ్రహించ గలుగుతుంది, అర్థం చేసుకోగలుగుతుంది. ఒక నమూనా పద్ధతిలో మీ మనసుకు శిక్షణ ఇస్తే, అప్పుడు మీరు సాధించే గమ్యం కూడా ఆ మార్గంలోనుంచి తీసుకున్న అంశమే అవుతుంది. భయం వలన కానీ, అత్యాశ వలన కానీ మిమ్మల్ని మీరు ఒక క్రమశిక్షణలో పెట్టుకుంటారు. అప్పుడు గమ్యం కూడా మీ ప్రయోజనాలకు అనుగుణంగా, ఆ ధోరణిలోనే తయారవుతుంది. కాబట్టి భయమూ, అత్యాశా వున్న చోట యదార్థత వుండదు.

అయితే మీరు ఇట్లా అడగవచ్చు – "రోజువారీ జీవితాన్ని నేను ఒక పద్ధతిలో పెట్టుకోవాలి. లేకపోతే ఏ పనీ చేయలేను. మరి ఈ విధమైన పద్ధతి కూడా ఒక రకంగా క్రమశిక్షణ కాదా ?" అని. సమర్ధవంతంగా పనిచేయడం కోసమూ, చేయవలసిన పనులన్నీ చేయడానికి వీలుగానూ మీ కార్యకలాపాలన్నీ ఒక పద్ధతిలో పెట్టుకుంటారు. ఒక ఫలితాన్ని పొందడం కోసం మిమ్మల్ని మీరు ఒక పద్దతిలో పెట్టుకోవడం, క్రమశిక్షణ అలవరచు కోవడం చేస్తారు. ఈ విధంగా ఒక పద్ధతి ప్రకారం జీవించడం ఎటంటే అటు మెత్తగా వదిగిపోయే గుణానికి ఆటంకమవుతుంది. ఈ మెత్తని గుణం కలది మాత్రమే కలకాలం నిలిచివుంటుంది. సరే, సత్యం అంటే ఒక దానికి ఫలితంగా కలిగేదా ? అది నిజంగా ఫలితంగా కలిగేది కనుక అవుతే ఒక మార్గం ద్వారా దానిని సాధించవచ్చును. ప్రతి ఫలితానికీ వెనుక ఒక కారణం వుంటుంది. అయితే వెనకాల కారణాన్ని కలిగి వున్నది యదార్ధం ఎంత మాత్రం కాలేదు. స్వేచ్ఛ నిచ్చేది సత్యం తప్ప క్రమశిక్షణ కాదు. క్రమశిక్షణ ద్వారా సత్యం వుండదు.

ఈ సమస్యని మరొక రకంగా చెప్పాలంటే మత్తు లేకుండా, స్పృహగా వుండటం అంటే ఏమిటో తెలుసుకోవడానికి త్రాగుబోతు అవడం అవసరమా ? క్రమశిక్షణ తప్పక అవసరమవడానికి గల కారణాలనూ, వాటిలో వున్న బాగోగులనూ పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ఏదో సాధించాలీ, విజయం పొందాలీ, ఒక ప్రత్యేక దిశలో పోవాలీ అనే కోరికా, భయమూ మొదలైనవి అనుకరణకు, అంటే క్రమశిక్షణను అవలంబించడానికి గల కొన్ని కారణాలు. ఈ కారణాలను గురించిన ఎరుక కలిగినప్పుడు వాటి ప్రభావమూ, ఆ క్రమశిక్షణా, ఆ లొంగిపోయి అనుసరించడమూ మాయమవుతాయి. ఇప్పుడు సమస్య ఆ కారణాలను అంతమొందించడం వైపు మళ్ళుతుంది. ఇది కాలాన్ని తయారు చేయదు.

ఎరుకగా వుండటంలో స్వేచ్ఛ కలుగుతుంది. ఈ విడుదల క్రమశిక్షణకు వెనుక గల కారణాల నుంచి మాత్రమేకాదు, జీవితం అనే మొత్తం ప్రక్రియలో స్వేచ్ఛ కలుగుతుంది. మనసు తనకు తానుగా సృష్టించుకున్న నిబద్దీకరణం నుంచి విముక్తి చెందినప్పుడు మాత్రమే, ఏ ఆలోచనా పద్ధతులలోనూ మనసు నిబద్ధం చెంది వుండనప్పుడు మాత్రమే స్వేచ్ఛ రాగలుగుతుంది. అవగాహన ఎప్పుడు కలుగుతుంది, కొత్తది ఎప్పుడు కనిపెట్టగలుగుతారు ? స్వేచ్ఛ వున్నప్పుడే ; కోరికలు అనే వరవడికి కట్టుబడి, ఆ విధమైన అలవాటులోనే మీ ఆలోచనలూ, మనోభావాలూ పడి వుండనప్పుడు మాత్రమే బంధాలలో వున్న మనస్సు అశాంతిగా, అస్థిమితంగా, చికాకులతో అటూ ఇటూ పరుగులు పెడుతూ వుంటుంది. మనసుకి, తన ఈ

తిరుగు బోతుతనానికి గల కారణాలను గురించిన ఎరుక కలిగినప్పుడు - స్వేచ్ఛ పొందడం జరిగిపోయిందన మాట.

సత్యం అంటే ఏమిటి అని అర్థం చేసుకోవడం గానీ, దానిని సూత్రీకరించడం గానీ ఆలోచన చేయలేదు. సత్యం మీ వద్దకు రావాలి మీరు సత్యాన్ని చేరలేరు. దానిని స్వీకరించడానికి స్వేచ్ఛ వుండి తీరాలి. ఖండిస్తూనూ, ఇది ఫలానా అని గుర్తిస్తూనూ వుండేటటువంటి ఎరుక కాదు. ఒక దానిని ఎంపిక చేసుకోవడం లేనటువంటి ఎరుక వుండి తీరాలి. అప్పుడే విముక్తి కలుగుతుంది. ఆ స్వేచ్ఛలో మాత్రమే యదార్థమైనదీ, కొలతలకు అందనిదీ వుండగలుగుతుంది.



# 1947 లో ప్రసంగాలు
# మద్రాసు

**డిసెంబరు 14**

వినడంలోను, ఆలకించడంలోను భేదం వున్నది. ఆలకించడం అంటే ఆత్మగతమైనది, వినడం అంటే వస్తుగతమైనది. కేవలం మాటలని మాత్రమే ఆలకిస్తూ, వాటిలోని అంతరార్థాన్ని వినకపోతే, అప్పుడు ఈ ప్రసంగాల వల్ల ఏమీ ఫలితం వుండదు. భావ ప్రసారం ఎప్పుడూ ఒకే స్థాయిలో ఒకే సమయంలో మాత్రమే జరుగుతుంది. ప్రేమ వున్నప్పుడే అన్యోన్యత ఏర్పడుతుంది. ఊహాలతో మనసునూ హృదయాలనూ మలచుకుంటే అవగాహన చేసుకోలేము. అరలు అరలుగా విభజించి ఆలోచించడం సంతోషానికి ఆటంకంగా నిలబడుతుంది సంతోషం అంటే దుఃఖాన్ని నిరాకరించడం కాదు, దుఃఖాన్ని అవగాహన చేసుకోవడం. సంఘర్షణల వలనా, కష్టాల వలనా కలిగిన బాధలకు మనసు హృదయమూ మొద్దుబారిపోతాయి. కష్టాలు పడటం వలన తెలివితేటలు పెరగవు. కష్టాల వలన అవగాహనా రాదు. కష్టాల వలన ఆలోచనా శక్తీ, తెలివి తేటలూ పెరుగుతాయనుకోవడం అజ్ఞాన లక్షణం. బాధల వల్ల అవగాహన పుట్టుకొస్తుందా ? బాధపడుతున్నప్పుడు అసలు మనలో ఏం జరుగుతుంది ? అసలు బాధపడటం అంటే అర్థం ఏమిటి ? మానసికమైన అలజడి కలుగుతుంది. పైపైన వుండే బాహ్యామైనదీ అవచ్చు, లేదా బాగా గాఢమైన లోతుల్లోనూ అవచ్చు, దానికి అనేక కారణాలు వుండచ్చు. చాలా ప్రియమైన వారిని పోగొట్టుకొనడం వల్లనో, నిరాశ ద్వారా కలిగిన నిస్పృహ వల్లనో, జీవితానికి అర్థం లేదు అని అనిపించినప్పుడో – వర్తమానంలో అర్థంలేదని అనిపించినప్పుడు గతం కానీ, భవిష్యత్తు కానీ చాలా ప్రాధాన్యం సంతరించుకుంటాయి. దుఃఖం అంటే గందరగోళంతోనూ, పరస్పర వైరుధ్యాలతోనూ నిండిన జీవితం. దుఃఖం అంటే ఖాళీతనంతోనూ, అజ్ఞానంతోనూ నిండిపోయిన జీవితం. కూడబెట్టుకునే తత్వమూ, ఆకాంక్షా పరత్వమూతో నిండిన జీవితమే దుఃఖం అంటే. ఇంద్రియ సంబంధమైన విలువలతో కూడిన జీవితమే దుఃఖం అంటే.

సరే, బాధపడుతున్నప్పుడు అసలు జరిగేది ఏమిటి అన్నది చూద్దాం. దుఃఖానికి మన లోపలినుంచి వచ్చే తక్షణ ప్రతి స్పందన దానికి దూరంగా పారిపొమ్మని. ఏదో ఒక నమ్మకం పెట్టుకోనో, సూత్రాలూ, వ్యాఖ్యానాలూ తయారు చేసుకొని వాటి మీద ఆధారపడటం ద్వారానో, కర్మకాండలూ, పురోహితుల ద్వారానో, సంగీతమూ, గురువులూ, ఆచార్యులూ – ఇట్లా ఏదో ఒకటి పట్టుకొని దుఃఖానికి దూరంగా పోవాలని

ప్రయత్నం చేస్తూ వుంటాం. బాధలకి గల కారణాలను పరిశోధించడం కూడా మేధాసంబంధమైన, మాటల రూపంలో వుండే పలాయనంగా తయారవవచ్చు. ఎందుకంటే మనకి కనుక గ్రహింపు వుంటే అసలు కారణాలని వెంటనే తెలుసుకుంటాం. కారణమూ, దాని ఫలితమూ దూరదూరంగా వుండవు, విడివిడిగా వుండవు. బాధితుడు పారిపోవడంలో నేర్పు సాధిస్తాడు. బాధలనుంచి రక్షించుకోవడంలో మంచి ప్రావీణ్యాం సంపాదిస్తాడు. ఈ వంచననీ, పారిపోవడంలో చూపించే ఈ నేర్పునీ తెలివి తేటలు వృద్ధి చేసుకోవడం అని అనుకుంటుంటారు. పారిపోవడం ద్వారా కొత్త కొత్త గమ్యాలని ఏర్పరచుకోవడం పరిణతి అని కూడా అంటూవుంటారు. అయితే బాధలు మాత్రం కొనసాగుతునే వుంటాయి. బాధలని అవగాహన చేసుకోవడం ఎట్లా ? వాటి వెనక వున్న కారణాలను వెతికి పట్టుకున్నంత మాత్రాన బాధలు మాయమవవు. ఏవేవో కావాలని కోరుకునే వ్యామోహాల వలన బాధలు కలుగుతున్నాయి. ఈ వ్యామోహాలు రకరకాల రూపాల్లో బయటపడతాయి. అత్యాశలు, అపోహలు, లౌక్యంగా వుండటం, శాశ్వతంగా వుండిపోవాలనే కోరికా మొదలైన రూపాలు అవి. వెనక వున్న కారణాలు ఏమిటి, వాటి వల్ల కలిగే ఫలితాలు ఏమిటి అని సమాచారం సేకరించడం వలన బాధలు లేకుండా పోవు.

బాధలకి బాగా దగ్గరగా చేరి, పరిచయం చేసుకొని, బాగా 'ప్రేమ' చూపించి, ఇంకా ఇంకా ఎక్కువగా వాటిని ఆహ్వానిస్తూ, వాటితో సంభాషిస్తూ వుంటేనే వాటిలో వున్న పరిమళమూ, వాటి విశిష్టతా మనకి అవి అందిస్తాయి. మతపరమైన, వైజ్ఞానిక సంబంధమైన రకరకాల దారులు ఎన్నుకొని, వాటిలో పడి దూరంగా వెళ్ళిపోయినా, నా బాధలకి బదులుగా ఆ స్థానంలో మరేవేవో వుంచి భర్తీ చేసుకున్నా బాధలు మాత్రం అట్లాగే కొనసాగుతాయి. బాధలని అవగాహన చేసుకోవాలే తప్ప, తట్టుకొని దాట వేయాలనుకోకూడదు. ఎందుకంటే వాటిని మళ్ళీ ఎదుర్కొన్నప్పుడు మళ్ళీ జయించవలసి వస్తుంది. స్వీయజ్ఞానం ద్వారా మాత్రమే బాధలని అర్థం చేసుకోగలుగుతాము. వాటికి అతీతంగా వెళ్ళగలుగుతాము. స్వీయజ్ఞానం ద్వారా సరియైన ఆలోచన కలుగుతుంది. ఖండించడం గానీ, ఫలానా అని పేరు పెట్టడం గానీ వున్నప్పుడు సవ్యమైన ఆలోచన వుండదు. సౌందర్యాన్ని మీరు నిరాకరించరు. అయితే, సౌందర్యం అంటే వికృతరూపాన్ని నిరాకరించడం కాదు. బాధలని వద్దని కనుక మీరు నిరాకరిస్తే, సంతోషాన్ని కూడా వద్దన్నట్లే. ఎందుకంటే సంతోషం బాధలకి వ్యతిరేకమైనది కాదు. సవ్యంగా ఆలోచించడం ద్వారా బాధలంటే అవగాహన కలుగుతుంది. ప్రతి ఆలోచన ఎడలా, మనోభావం ఎడలా, క్రియ ఎడలా ఎరుకగా వున్నప్పుడు సవ్యంగా, సరిగా ఆలోచించడం జరుగుతుంది. ఈ సవ్యంగా ఆలోచించడమే బాధలకీ, కష్టాలకీ వెనక వున్న కారణాలను కరిగించి వేస్తుంది.

ప్రశ్న : పోయిన ఆదివారంనాడు మీ ప్రసంగంలో ద్వైదీభావం గురించీ, దాని వలన కలిగే బాధ గురించీ మాట్లాడారు. అయితే ఈ ద్వంద్వాలను అధిగమించడం ఎట్లా అనేది మాత్రం మీరు వివరించలేదు ఈ విషయాన్ని మరికొంత విస్తరించి చెప్తారా ?

కృష్ణమూర్తి : ద్వంద్వాలలో వుండే సంఘర్షణ గురించి మీకు తెలుసు. ద్వంద్వాలనుండి బయటపడాలని నిరంతరంగా ప్రయత్నిస్తూ బాధ అనే ఒక దీర్ఘ సొరంగంలో చిక్కుకొనిపోయాం, ఇదీ మన జీవన అస్తిత్వం, ద్వంద్వాల మధ్య సమరం. నేను ఇప్పుడు ఇట్లా వున్నాను, మరొకలాగా అవాలని కోరుకుంటాను ; నేను ఇప్పుడు ఇట్లా లేను, అట్లా అవాలనుకుంటాను. గుమాస్తా మేనేజరు అవడం కోసమూ, చెడ్డవాడు మంచివాడిగా అవడం కోసమూ - ఇటువంటి రకరకాల వాటి కోసం - నిరంతరంగా జరిగే పోరాటం ఇది ఈ ప్రక్రియ అంతా ఎట్లా జరుగుతుందో ప్రతివారికీ బాగా తెలుసు

సరే, అసలు ఈ ద్వంద్వాలు అనేవి వున్నాయా ? నిజంగా ఏది వున్నదో అదే వాస్తవం వ్యతిరేకమైనది అంటే 'ఉన్నస్థితి'కి ప్రతికూలంగా స్పందించడం. వ్యతిరేకమైనది తనకు తానుగా వుండదు. మరొకటిగా 'అవడం' అనే దానితోపాటు అది వునికిలోకి వస్తుంది. వ్యతిరేక మైనది అసలు వాస్తవికమైనది కాదు. 'ఉన్నది' నిజం. ఆదర్శం - అది అనుకూలమైనదైనా, ప్రతికూలమైనదైనా - దానికి తనదైన వునికి లేదు. 'ఉన్నది' స్థితి ఏదో అదే నిజం ఈ 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడంలోనే స్వేచ్ఛ ఆరంభమవుతుంది. పొగరూ, గర్వమూ అనే మనోభావాలు మనలో తలెత్తుతూ వుంటాయి. అదే నిజం, అదే వాస్తవం. దీనికి ప్రతికూలంగా మనలో కలిగే ప్రతిస్పందనే వినమ్రత. అది ఒక ఆదర్శం, అది ఇంకా అస్తిత్వంలోకి రాలేదు. వినమ్రత అనే ఈ వ్యతిరేక భావానికి మన ఆమోదాన్ని ఇస్తాం ఎందుకంటే నీతి పరంగానూ, సాంఘికపరంగానూ, మతపరంగానూ కూడా పొగరుమోతుతనాన్ని ఒక దుర్గుణంగా నిరసిస్తారు కాబట్టి. అంతేకాకుండా పొగరుమోతు తనం వల్ల సంఘర్షణా, బాధా కలుగుతాయి. అందువల్ల ఈ పొగరు మోతుతనాన్ని పోగొట్టుకోవాలనే కోరిక కలుగుతుంది. పైగా దానివలన ప్రయోజనం కూడా ఏమీ లేదని తెలుసుకున్నాం కాబట్టి, దానికి వ్యతిరేకమైన వినమ్రతను చేపట్టాలను కుంటాం, కాబట్టి అసలు జరుగుతున్నది ఏమిటంటే, నేను పొగరుమోతుని ; కానీ వినయవంతుడినిగా అయిపోవాలనుకుంటుంటాను. వినయం ఒక వూహ, అంతే తప్ప అది మనోతత్వమైన ఒక వాస్తవంగా ఇంకా అవలేదు పొగరు అనేదే నిజం దానికి వ్యతిరేకమైనది వునికిలో లేదు అయితే, నేను వినయంగా అవాలని కోరుకుంటున్నాను కాబట్టి ఈ అవాలనుకునే కోరికె వ్యతిరేకమైన దానిని సృష్టిస్తున్నది. అంతే తప్ప ఈ వ్యతిరేకమైనది - సాధించాలనుకుంటున్న ఈ ఆదర్శం - వునికిలో లేదు.

ప్రేమ అంటే ద్వేషానికి వ్యతిరేకమైనది కాదు. అట్లా కనుక అయితే అప్పుడది ప్రేమ కాదు. వ్యతిరేకత లోపల మళ్ళీ దానికి వ్యతిరేకమైనదాని బీజం వుంటుంది. వినయం అనే వ్యతిరేక భావం పొగరు కారణంగా కలిగిన పర్యవసానం. కాబట్టి వినయంలోదానికి వ్యతిరేకమైనదాని యొక్క బీజం వుంటుంది పొగరుమోతు తనంలోని అంతరార్థం ఏమిటి అన్నదానిని, ఖండించకుండా, దానిని తిరస్కరించడం కోసంగాను దానికి వ్యతిరేకమైన దానిని తీసుకొనిరాకుండా, అర్థం చేసుకోవడం ఆరంభిస్తే, అప్పుడు ద్వైదీభావం – ద్వంద్వాలు – పరస్పర వ్యతిరేకతలు – అనే సంఘర్షణ పూర్తిగా ఆగిపోతుంది. అసలు అస్తిత్వంలో వున్నది ఏమిటంటే పొగరు. దానిని కనుక నేను అవగాహన చేసుకుంటే, అప్పుడు మరొకటి అవడం కోసం నేను సమరం చేయనక్కరలేదు. మరొక విధంగా చెప్పాలంటే. వర్తమానం గతం యొక్క ఫలితం. వర్తమానాన్ని అవగాహన చేసుకోకపోతే, అప్పుడు భవిష్యత్తు అంటే 'ఉన్నది'కి, వర్తమానానికి కేవలం వ్యతిరేకమైనదిగా అవుతుంది కానీ, భవిష్యత్తు అంటే వర్తమానంలో నుండి ప్రవహించిన గతం కాబట్టి వర్తమానంలో నాటిన బీజాన్నే భవిష్యత్తు చూపుతుంది. వర్తమానానికి వ్యతిరేకమైనది అయిన భవిష్యత్తు ఇంకా కాలం అనే వలలోనే వుంటుందన మాట. వర్తమానం అటు భవిష్యత్తుకు గానీ, ఇటు గతానికి గానీ దారి తీసే ఒక మార్గం. ఈ చలనాన్ని అవగాహన చేసుకుంటే, అప్పుడు వర్తమానానికి వ్యతిరేకమైన గతంలో గాని, లేదా భవిష్యత్తులో గాని ఆలోచన చిక్కుకొని పోయి వుండదు. 'ఉన్నది'ని అంటే ప్రస్తుతం వున్న పొగరుమోతు తనాన్ని అర్థం చేసుకోవాలంటే, నా మొత్తం సావధానతను, నా మొత్తం అస్తిత్వాన్ని దానికి ఇవ్వాలి. అంతే తప్ప, దానిక్ వ్యతిరేకమైన దాని పైకి నా ధ్యాసను మళ్ళించకూడదు.

మనోభావానికి ఒక పేరు ఎందుకు పెడతాం మనం ? ఒక ప్రతిస్పందనకు కోపం అనీ, అసూయ అనీ, పొగరు అనీ, ద్వేషం అనీ ఇంకా ఇటువంటివే మాటలు ఎందుకు వుపయోగిస్తాం ? దానిని అర్థం చేసుకోవడానికి లేదా ఫలానా అని గుర్తించడం కోసం లేదా దానిని గురించి ఇతరులకు చెప్పడానికి – ఇట్లా ఒక పేరు పెడతామా ? ఆ మనోభావం స్వతంత్రంగా, ఆ పేరుతో సంబంధం లేకుండా వుంటుందా, లేక ఆ పేరు ద్వారానే దానిని అర్థం చేసుకుంటున్నారా ? ఆ మనోభావాన్ని – ఆ మాట ద్వారా, ఆ పేరు ద్వారా కనుక మీరు అర్థం చేసుకుంటున్నట్లయితే, అప్పుడు ఆ మాటే ముఖ్యమవుతుంది ; మనోభావానికి ప్రాముఖ్యత వుండదు. మనోభావానికి పేరు పెట్టకుండా వుండటం సాధ్యమేనా ? సాధ్యం కనుక అయితే అప్పుడా మనోభావం ఏమవుతుంది ? పేరు పెట్టడం వలన ఆ మనోభావాన్ని ఒక ప్రత్యేకమైన చట్రంలో పట్టి బిగించినట్లవుతుంది. కాబట్టి సజీవమైనది కాలపు జాలంలో చిక్కుకొనిపోతుంది. దానివలన స్మృతి, అంటే 'నా'

మరింత బలం పుంజుకుంటుంది. ఒక మనోభావానికి, ఒక ప్రతిస్పందనకు మీరు ఏ పేరూ పెట్టనట్లయితే, ఏ మాటా వాడనట్లయితే, అది ఏమవుతుంది ? అంతరించి పోదూ ? అది వాడి రాలిపడిపోదూ ? దయచేసి ఇదంతా మీరే ప్రయోగాత్మకంగా చేసి చూడండి. ఏమవుతుందో మీరే కనిపెట్టండి. ఒక సవాలుకి మనలో కలిగిన ప్రతిస్పందన ఏదయినా సరే - దానికి మనం ఒక పేరు పెట్టనప్పుడు, ఫలానా అనే ఒక చట్రంలో బిగించి వుంచనప్పుడు ఆ ప్రతిస్పందన అంతమైపోతుంది.

బాధాకరమైన, దుఃఖదాయకమైన ప్రతిస్పందనలను ఎట్లా తొలగించుకోవాలో ఇప్పుడు మీరు నేర్చుకున్నారు కదా ! అయితే సంతోషకరమైనది అని అనబడే మనోభావానికి మీరు ఒక పేరు పెడతారు కదూ ? సంతోషకరమైన ఒక మనోభావం మనలో పైకి లేచినప్పుడు, దానికి ఒక పేరు పెట్టకపోతే, అదీ అట్లాగే అంతరించిపోతుంది ; వాడి, రాలిపోతుంది. కాబట్టి సంతోషకరమైన ప్రతిస్పందనలూ, బాధాకరమైన ప్రతిస్పందనలూ అన్నీ కూడా, వాటికి మీరు పేర్లు కనుక పెట్టకపోతే, వాటిని ఫలానావి అనే చట్రాల్లో ఇమడ్చకపోతే, వాడి వడలి రాలిపోతాయి. ఇది మీరే ప్రయోగం చేసి తెలుసుకోండి, మీరే కనిపెట్టండి. అయితే ప్రేమ ఇటువంటి ప్రతిస్పందనా ? పేరు పెట్టకుండా వదిలేసే, వడలి రాలిపోనీ లెమ్మనుకునే ప్రతిస్పందనా ? అది కనుక ద్వేషానికి వ్యతిరేకమైనదవుతే వాడి రాలిపోతుంది. ఎందుకంటే, అప్పుడది ఒక సవాలుకు నిబద్ధతతో కూడి వచ్చిన ప్రతిస్పందన మాత్రమే కాబట్టి. అది కనుక కేవలం ఒక ప్రతిచర్య మాత్రమే అయితే అప్పుడది ప్రేమ అవదు. ప్రేమ ఒక అస్తిత్వపు స్థితి. దాని నిరంతరత్వమే అది. మనలో చాలామంది దయాత్ములుగా, వుదారులుగా, క్షమాశీలురుగా అవాలని ప్రయత్నిస్తూ వుంటారు మరొకలాగా అవాలని ప్రయత్నించడం ఎప్పుడూ ద్వంద్వాల - పరస్పర వ్యతిరేకాల కారణంగా జరుగుతుంది. ప్రయత్నం అనుకూలమైన దానికోసం అవచ్చు, ప్రతికూలమైనదాని కోసం అవచ్చు. ప్రేమను అలవరచుకోలేము. క్షమాగుణాన్ని అలవరచుకుంటే అప్పుడది క్షమాగుణం కాదు. అప్పుడు అందులో దానికి వ్యతిరేకమైనది - అంటే ద్వేషం - వుంటుంది. ద్వంద్వాలను పుట్టించే 'మరొక లాగా అవడం' అనేది లేనప్పుడు ప్రేమ వుంటుంది.

ఆలోచనా రాహిత్యం వలన, సవ్యమైన తీరులో ఆలోచన లేకపోవడం వలన అల్లకల్లోలాన్నీ, దుఃఖాన్నీ వెంటపెట్టుకొని వచ్చే ఈ ద్వంద్వాలు అనే సంఘర్షణ పుట్టుకొస్తున్నది. ఉన్నది' యొక్క ప్రాధాన్యతను అవగాహన చేసుకోవడంలోనే ద్వంద్వాలు అంతరించిపోతాయి. 'ఉన్నది'ని అంటే వర్తమానాన్ని నిరాకరించినప్పుడు ద్వంద్వాలు వునికిలోకి వస్తాయి. 'ఉన్నది'లో వుండకుండా, లేనిదిగా అవాలనుకోవడంభ్రాంతికి

దారితీస్తుంది. 'ఉన్నది'ని – పొగరును – పైపైన మాత్రమే కాదు. చేతన లోలోపలి పొరలలో అంతటా గొప్పతనం మొదలైన రూపాల్లో వున్నదానినంతా – పేర్లు పెట్టకుండా, ఆ మనోభావాలకు కొన్ని మాటలను వుపయోగించకుండా అవగాహన చేసుకుంటే – అప్పుడదంతా వాడి రాలిపోతుంది. సంతోషకరమైన వాటిని వెంటాడి, బాధాకరమైన వాటిని తిరస్కరించడం సంఘర్షణకూ, దుఃఖానికీ మాత్రమే దారి తీస్తుంది. అప్పుడు మనసూ, హృదయమూ మొద్దుబారి పోతాయి.

ప్రశ్న : గాంధీజీ ఈ మధ్యన రాసిన ఒక వ్యాసంలో ఒక వ్యక్తికి మతమూ, దేశాభిమానమూ రెండూ సరిసమానంగా ప్రేమపాత్రమైనవి అని అన్నారు. ఒక దానిని పొందడం కోసం మరొకదానిని పణంగా పెట్టలేమని కూడా ఆయన అన్నారు మీరేమంటారు ?

కృష్ణమూర్తి : ఈ విషయంలో మీ ప్రతిస్పందన ఏమిటో నాకు తెలుసుకోవాలని వుంది. నాయకులు అని మీరు పిలుస్తున్నారే – వారిని నిలబెట్టి ప్రశ్నిస్తారా ? సత్యాన్ని కనిపెట్టాలంటే విమర్శించడమూ, విచారణ చేయడమూ వుండాలి కదూ ? అయితే, మనల్ని మనం విమర్శించుకోవడం వల్ల ఇబ్బందులూ తప్పవు. ఎరుకగా వుండటమూ, అర్థం చేసుకోవడమూ కంటె అనుసరిస్తూవుండటమే మీకు సులభంగా, సౌకర్యంగా వుంటుంది. ఆధిపత్యాన్ని ఒప్పుకోవడం అంటే గుడ్డితనాన్ని తెచ్చుకోవడం. అది అవగాహనను అంతం చేసి వేస్తుంది. అవగాహనలో మాత్రమే ఆనంద ప్రాప్తి వున్నది. అప్రమత్తంగా వుండే, స్వీయ విమర్శనాత్మకంగా వుండే ఎరుకను కనుక పోగొట్టుకుంటే సత్యాన్ని కనిపెట్టడం సాధ్యం కాదు. అటువంటప్పుడే నాయకులని – మతసంబంధమైన లేదా రాజకీయ సంబంధమైన నాయకులని పెంచి పోషించడం, వారిని అనుసరించడం అనే వంచనా, ప్రమాదమూ జరుగుతుంటాయి. నాయకుడికీ, అనుచరులకీ మధ్య స్వప్రయోజనాల కోసం దోపిడి చేసుకోవడం వుంటుంది. ఇండియాలోనూ ఇతరత్రా కూడా ఈ నాయకులు తయారవడం, ఎదిగిపోవడం చూస్తుంటే ఆశ్చర్యంగా వుంటుంది. మతం పేరు చెప్పి, వ్యవస్థ పేరు చెప్పి నియంతలుగా తయారవుతుంటారు. అధికారం సంపాదించిన కొద్దీ వారిలో దుర్మార్గం కూడా ఎక్కువవుతూ వుంటుంది. సత్యాన్ని అన్వేషించాలంటే హృదయ ద్వారం తెరచివుండాలి, కాలుష్యం అంటని మనసు వుండాలి. అంటే ఒక విధానానికి గానీ, ఒక నమ్మకానికి గానీ, ఒక వ్యక్తికి గానీ కట్టుబడి, దాస్యం చేస్తూ వుండని మనస్సు వుండాలి. సత్యాన్ని కనిపెట్టాలంటే దారీ, తెన్నూ ముందుగా నిర్దేశించి లేని విశాలమైన సముద్రాలలో సాహసంతో పయనించాలి. మనం ఇప్పుడు ప్రత్యేకించి ఏ ఒక్క నాయకుడినీ ఎత్తి చూపడం లేదు. ఆధిపత్యం గురించి విచారణ

జరుపుతున్నాం. ఆధిపత్యం అనే చట్రంలో సృజనాత్మకతకు ఆస్కారం వుండదు. ఆధిపత్యం అనే వేడిలో సృజనాత్మకత వడలి, రాలిపోతుంది. యాంత్రికమైన ప్రతిస్పందనలుంటాయేమో తప్ప మీలో సృజనాత్మకత ఆగిపోతుంది. ఆధునిక నాగరికతలో వున్న విషాదాంశాలలో ఇదొకటి. మిమ్మల్ని మీరు ఒక మతాచార్యుడికో, ఒక రక్షకుడికో, ఒక విధానానికో, ఒక విశ్వాసానికో అప్పగించుకుంటే మీలో స్పందన, సజీవత్వం సమాప్తమైపోతాయి. మనుష్యులుగా మీ అస్తిత్వం ముగిసిపోయినట్లే. ఆధిపత్యం వెనుక పరుగులు పెట్టడం ద్వారా మీ సంఘర్షణలకూ, మీ దుఃఖాలకూ పరిష్కారం దొరకదు.

సరే, మతమూ దేశాభిమానమూ రెండూ మనిషికి చాలా ప్రేమ పాత్రమైనవని అంటున్నారు. ఒకదాని కోసం మరొకదానిని పణంగా పెట్టలేమని కూడా అంటున్నారు. దీనిని వ్యతిరేకించడం కానీ, సమర్ధించడం కానీ చేయకుండా ఇందులో వున్న నిజం ఏమిటో చూద్దాం. ఎందుకంటే సత్యం ఒక్కటే విడుదల కలిగిస్తుంది. అది మాత్రమే ఆనందాన్ని ఇవ్వగలుగుతుంది. మతం అంటే అసలు ఏమిటి ? చేతితోనో మనసుతోనో చేసిన బొమ్మను పూజ చేయడం కాదు మతం అంటే. గుడికో చర్చికో వెళ్ళడంలో లేదు మతం. పవిత్ర గ్రంధాలు పఠించడంలోనూ లేదు. కొన్ని మాటలనో, మంత్రాలనో మళ్ళీ మళ్ళీ వల్లించడంలోనూ లేదు. మతధర్మం అంటే విశ్వసించడమూ కాదు.

యదార్థతత్వం లేక దైవం లేదూ దానికి మీరు ఏ పేరు పెట్టినా సరే - దానిని అన్వేషించడమే మతం అంటే. వ్యవస్థలుగా ఏర్పడిపోయిన ఈ మతాలూ, వాటిలోని విశ్వాసాలూ, ఆ పూజా పునస్కారాల తతంగాలూ, ఆ భయాలూ, ఆ దోపిడీలూ అన్నీ యదార్థతత్వాన్ని కనిపెట్టడానికి ఆటంకాలుగా నిలబడతాయి. ఎందుకంటే అవి మనసునీ, హృదయాన్నీ కూడా తమ తమ ప్రత్యేక పద్ధతుల్లో నిబద్ధతకులోను చేస్తాయి. మతం అంటే యదార్థమైన దానిని అన్వేషించడమూ, ఆవిష్కరించుకోవడమూ - అంతే తప్ప పూజా పునస్కారాల తంతులు చేయడం కాదు. ఒక గురువునో, ఒక ఆచార్యుడినో, ఒక రక్షకుడినో అనుసరించడం కాదు. సత్యాన్ని చేరాలంటే నగుణాత్మకంగా - ఇది కాదు అని తోసివేస్తూ - పోవాలి. ఎందుకంటే సగుణాత్మకమైన క్రియ తెలుసుకున్నదాని మీద ఆధారపడి వుంటుంది. తెలుసుకున్న దెప్పుడూ యదార్థం కానే కాదు. యదార్థతత్వం అజ్ఞేయమైనది, ఒక మార్గంలో పోయి దానిని చేరలేము. ఎందుకంటే మార్గాలు అన్నీ మునుపు తెలుసుకున్నవే ; కాబట్టి, తెలియని దాని వద్దకు సగుణాత్మకమైన తీరులో చేరడం సాధ్యం కాదు. ఎందుకంటే సగుణాత్మకం అంటే తెలిసినది. తెలిసినది సమాప్తం అయినప్పుడే సత్యం వుంటుంది. అనంతమైన దానిని

కాలం ద్వారా సమీపించలేము. కాలం ఆగిపోయినప్పుడే కాలరహితమైనది వుంటుంది. అంటే కాలం కారణంగా పుట్టిన ఆలోచన అంతమైనప్పుడు. దేశాభిమానం, జాతీయవాదం అంటే ఒకదానితో కలిసిపోయి ఆ విధంగా గుర్తింపు కోసం పడే కాంక్ష. ఒక ప్రజాసమూహంతోనో ఒక ప్రత్యేక జాతితోనో, ఒక దేశంతోనో అనుబంధం - అంతేకదూ ? ఒక వ్యక్తి తనకంటె గొప్పదైన దానితో - ఇండియా లేదా ఇంగ్లండు మొదలైన వాటితో మమైకం చెందాలనుకోవడంలో తాను శాశ్వతంగా కొనసాగాలనే కాంక్ష వున్నది.

ఒక హిందువు అనో, ముస్లిం అనో, క్రిస్టియను అనో మీకు మీరు ఒక పేరు పెట్టుకుంటుంటే ఆ పేరు, ఆ మాట మీకంటే గొప్ప ప్రాముఖ్యం కలవి అని సూచించినట్లే కదూ ? ఈ పేరు, ఈ ముద్ర మీ అంతర్గతంలోని పేదరికాన్ని దాచి వుంచుతున్నాయి. మీలో అల్పత్వం, డొల్లతనమూ వున్నాయి. ఈ విధంగా మమైక్యత చెందడం ద్వారా మీలోని ఖాళీతనం నుంచి పారిపోవాలని మీరు ఆశిస్తున్నారు. కాబట్టి పేరో, దేశమో, భావమో చాలా ముఖ్యం అయిపోతాయి. దానికోసం చనిపోడానికి, మరొకరిని చంపడానికీ కూడా మీరు సిద్ధంగా వున్నారు. ఈ మమైక్యం చెందడం కోసం మీరు పడే కాంక్షను కొందరు తమ స్వప్రయోజనాల కోసం వాడుకోవడం జరుగుతున్నది. జాతీయవాదం, ఆర్థికరంగంలో గీసే సరిహద్దులు యుద్ధానికి దారితీయక తప్పదు. దేశాభిమానం, జాతీయాభిమానం అన్నది ఇటీవల కాలంలో పుట్టుకొచ్చిన విషయం. ఈ విషం మనిషిని సర్వనాశనం చేస్తున్నది. మనిషికి మనిషిని శత్రువును చేస్తున్నది. జాతీయవాదం ద్వారా మనుష్యుల్లో ఐక్యత సాధించడం సాధ్యం కాని పని. మానవ సహోదరత్వాన్ని జాతీయవాది ఎన్నటికీ అర్థం చేసుకోలేడు. ఈ జాతీయవాదం ఇప్పుడొక కొత్త మతం అయింది. ఇది ద్వేషాన్నీ వినాశనాన్నీ మాత్రమే పెంచి పోషిస్తుంది

వ్యవస్థగా రూపొందిన మతమూ, జాతీయవాదమూ మనిషిని మనిషికి విరోధిగా నిలబెడుతున్నాయి. వీటి పైన ఆశలు పెట్టుకోవడం వలన లాభం లేదు. వీటి కారణంగా మనిషి ఎంతటి దైన్యస్థితికీ, దురవస్థలకూ దిగజారాడో మాటల్లో చెప్పలేము. అజ్ఞానం ద్వారా జ్ఞానోదయాన్ని పొందలేము. అజ్ఞానం అంతరించి పోవాలి. ఆ తరువాతే జ్ఞానోదయం - అంటే కాంతిదర్శనం, జరుగుతుంది. వ్యవస్థగా మారిన నమ్మకం - అంటే మతమూ, వ్యవస్థగా రూపుదిద్దుకున్న మమైక భావన - అంటే జాతీయవాదమూ - రెండూ అంతరించిపోవాలి. అప్పుడే మనిషి తన తోటి మనిషితో శాంతియుతంగా జీవించగలుగుతాడు. నమ్మకం వల్ల కానీ, దేశాభిమానం వలన కానీ మనిషికి సంతోషం సిద్ధించదు.

సత్యాన్ని కనుగొనాలంటే చేతితోనో, మనసుతోనో చేసిన వస్తువులను దాటి మీరు ఆవలగా పోవద్దూ ? స్వీయజ్ఞానం వలన కలిగే సవ్యమైన ఆలోచన మాత్రమే మీకు సంఘర్షణ నుండీ, జీవితంలో వున్న దుఃఖాన్నుండీ విడుదల కలిగిస్తుంది.

ప్రశ్న : ఇతరులను స్వప్రయోజనానికి వుపయోగించుకోవడం దోపిడీ అనీ, దుర్మార్గం అనీ మీరు చెప్తున్నారు. మరి మీరూ ఆ పనే చేస్తున్నారు కదా ?

కృష్ణమూర్తి : స్వీయజ్ఞానం పొందాలంటే విమర్శనాత్మక శక్తి వుండాలి. అయితే అవివేకంతో కూడిన అపనమ్మిక మొండితనానికీ, అపభ్రమలకీ దారి తీస్తుంది.

దోపిడీ విధానం అంటే మీ అర్థం ఏమిటసలు ? మరొకరిని మీ ప్రయోజనం కోసం, భౌతికంగా కాని, మానసికంగా కాని వుపయోగించుకోవడం అనేగా అర్థం ? మనిషికి నిత్యావసరాలైన వాటిని గురించి తెలివి తేటలతో అర్థం చేసుకొని, వాటిని తగిన పరిమితుల్లో వుంచినప్పుడు, ఆ విషయంలో దోపిడీ చేయడం కూడా తక్కువైపోతుంది. అవసరానికి మించి వుండటం కూడా తలనొప్పి. బాగా వున్నవాళ్ళకి ఇది తెలుసు. అవసరాలని మానసికమైన సంతృప్తి సాధించడం కోసం వుపయోగించకుండా వున్నప్పుడు మాత్రమే. జీవితావసరాలను అంటే - ఆహారమూ, దుస్తులూ, గృహవసతీ అనే వాటిని మన గొప్పలకూ, ఆడంబరాలకూ సాధనాలుగా చేయకుండా వున్నప్పుడు మాత్రమే అవసరాలను వాటి పరిమితుల్లో వుంచడం జరుగుతుంది. చేతితోనో, మనసుతోనో చేసిన వస్తువులకు వాటి ఇంద్రియ విలువ కంటె ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చినప్పుడు - అప్పుడు దోపిడీ మొదలవుతుంది. మనలోని కూడబెట్టుకునే తత్వానికీ, మనలోని అత్యాశను సంతృప్తిపరచుకోవడానికీ అవసరాలను ఒక కారణంగా వాడుకుంటే అప్పుడు దోపిడీ మొదలవుతుంది. ఈ అవసరాలకు ఒక పరిమితమైన ప్రాధాన్యం మాత్రమే వున్నది - కడుపు నింపడానికీ, శరీర ఆచ్ఛాదనకీ, ఆశ్రయం ఇవ్వడానికీ ; అయితే ఈ భౌతికమైన వస్తువులు మానసికమైన అత్యవసరాలుగా మారితే అప్పుడు దోపిడీ మొదలవుతుంది. సంతోషంగా వున్న వ్యక్తి తన సంతోషం కోసం చేతితోనో, మనసుతోనో చేసిన వస్తువుల మీద ఆధారపడడు. అతని వద్ద అంతకంటె విశేషమైన గొప్ప సంపద వున్నది. ఈ సంపద తన వద్ద లేని మనిషి ఇంద్రియ సంబంధమైన విలువలకి పెద్ద పీట వేస్తాడు. ఆ విధంగా ఘర్షణకూ బాధలకూ కారణమవుతాడు.

మనోతత్వ సంబంధమైన దోపిడీ అనే సమస్య ఇంకా చాలా క్లిష్టమైనదీ, చాలా లోతైనదీ కూడా. వస్తువుల మీదా, భావాల మీద లేదా నమ్మకాల మీద మనం మానసికంగా ఆధారపడతాం. మన లోపల వున్న పేదరికాన్ని, మన లోపల వున్న

ఖాళీతనాన్ని కప్పిపుచ్చుకునే ఒక సాధనంగా వస్తువులను, పరస్పర సంబంధాలను, భావాలను వుపయోగిస్తున్నప్పుడు అవి అతిగా ప్రాముఖ్యతను సంతరించుకుంటాయి. మన లోపల పేదరికమూ లేమీ భయమూ, సందిగ్ధతా వున్నాయి కాబట్టి ఈ వస్తువుల్లో - అంటే చేతితోనో, మనసుతోనో చేసిన ఈ వస్తువుల్లో భద్రతా, నిశ్చితత్వమూ, సంపన్నతా దొరుకుతాయని వెంటాడుతాం. ఈ వెదకులాటే దోపిడీకి ఆరంభం. మానసికమైన భద్రతను వస్తువుల ద్వారా పొందాలని కోరుకోవడం వలన కలిగే ఫలితాలేమిటో మనకు తెలుసు - యుద్ధాలూ, అధఃపతనమూ, వర్గవిభజనలూ, జాతి విభజనలూ, మనిషికీ మనిషికీ మధ్య విరోధమూ, అల్లకల్లోలమూ, దైన్యమూ - ఇదీ ప్రపంచమంతటా వున్న ఆధునిక నాగరకత. అప్పుడు మీరు అంటే వస్తువులే. వస్తువులు లేకపోతే మీరు అయోమయంలో పడిపోతారు. సంబంధ బాంధవ్యాల్లో కూడా మీరు భద్రత కోసం వెతుక్కుంటుంటే ఏమవుతుంది చెప్పండి ? ఆధారపడటం లోనుంచే స్వంతం చేసుకోవడం, భయం, అసూయా, కోపమూ మొదలైనవన్నీ పుట్టుకొస్తాయి. ఆధారంగా వున్న వస్తువు అతిగా ముఖ్యమైపోతుంది. అందువల్ల పేరూ, కుటుంబమూ, హోదా ఇవన్నీ చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటాయి. దీని కారణంగా సంఘర్షణతో కూడుకున్న విభజనలూ, బాధలూ కలుగుతాయి. ఈ ఆధారపడటానికి వెనక వున్న కారణం అంతర్గతమైన ఖాళీతనం. దీనిని తృప్తి కూర్చే పరస్పర బాంధవ్యాల సహాయంతో కప్పిపుచ్చాలని మీరు ప్రయత్నిస్తుంటారు. అంతర్గతంగా మీరు పేదగా వున్నప్పుడే మనసుతో తయారు చేసిన విషయాలు - జ్ఞానమూ, భావాలూ, నమ్మకాలూ బ్రహ్మాండమైన ప్రాధాన్యాన్ని పొందుతాయి. ఇది అనుసరణకూ, ఆధిపత్యపు ఆరాధనకూ, పద్ధతులకు తల ఒంచడానికీ, ఆలోచనా రాహిత్యానికీ దారి తీస్తుంది.

ఒక మనిషి మరొక మనిషిని బాహ్యారంగంలో చేసే దోపిడీని చాలావరకు సులభంగానే గుర్తించవచ్చు, అర్థం చేసుకోవచ్చు, కొంతవరకు దానిని తగ్గించవచ్చును కూడా. అయితే మానసికరంగంలో మనిషిని మరొక మనిషి చేసే దోపిడీని మాత్రం గుర్తించడమూ కష్టమే, అధిగమించడమూ కష్టమే. దీని పద్ధతులు చాలా క్లిష్టంగానూ, నిగూఢంగానూ వుంటూ వుంటాయి. మనిషిని మనిషి చేసే బాహ్యమైన దోపిడీకంటే ఇవి ఇంకా ఎక్కువ సంఘర్షణనూ, వ్యధనూ కలిగిస్తాయి. మనిషిని భౌతికంగా చేసే దోపిడీ కంటే కూడా ఈ మానసికమైన దోపిడీయే చాలా ముఖ్యమైనదీ, నిర్మూలించవలసినదీ. అయితే భౌతికమైన దోపిడీని అంతం చేయడం కూడా అవసరమే. మనిషికి కావలసిన భౌతిక సంక్షేమాన్ని ఎంతగా క్రమబద్ధం చేసినా, ఎంత క్రమపద్ధతిలో ఏర్పాటు చేసినా మనిషి లోపల వున్న సంఘర్షణా, గందరగోళమూ బయటపడకుండా వుండవు. వస్తువుల ద్వారా, సంబంధ బాంధవ్యాల ద్వారా, జ్ఞానం ద్వారా అహాన్నీ, స్వార్థాన్నీ

పెంచుకొనే ప్రక్రియే దోపిడీతనానికి ఆరంభం. అవగాహనా, ప్రేమా మాత్రమే ఈ దోపిడీ తత్వాన్ని అంతం చేస్తాయి తప్ప శాసనాలూ, చట్టాలూ కాదు.

ప్రశ్న : బాధలు ఎదురైనప్పుడు ఇదంతా దైవసంకల్పం అని దానికి తల ఒగ్గి వుండటానికీ, మీరు చెప్తున్న 'ఉన్నది'ని అంగీకరించడానికీ మధ్య తేడా ఏం వున్నది ?

కృష్ణమూర్తి : దైవ సంకల్పానికి మీరు లోబడిపోయి వుంటున్నారా ? లేదూ మీరు దైవం అని అనుకుంటున్న దానికి లోబడిపోయి వుంటున్నారా ? తెలుసుకున్నది యదార్థం కాదు. ఒక వున్నతమైన శక్తి యొక్క సంకల్పానికి మీరు లోబడిపోతుంటే, ఆ వున్నత శక్తిని తయారుచేసి ప్రదర్శిస్తున్నది మీ ఆలోచనలే. ఈ విధంగా లోబడిపోయి అర్పణ చేసుకోవడంలో స్వీయతృప్తి, సుఖమూ వున్నాయి. అయితే సంఘర్షణా, దుఃఖమూ మాత్రం అవగాహన, ఎరుక కలగడం ద్వారానే అంతమవుతాయి. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవాలంటే ఎరుక, అనాసక్తతతో కూడిన ఒక తెలివి వుండి తీరాలి. రూపకల్పన చేసుకున్నదానికి లోబడిపోవడం కాదు, అదెంత తృప్తిని కలిగించేదైనా సరే. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడంలో ప్రయత్నం ఆటంకంగా నిలబడుతుంది. ఎందుకంటే నేను ఇంతకు మునుపు చూపినట్లుగా పరధ్యాస వున్నప్పుడే ప్రయత్నం పుట్టుకొస్తుంది. 'ఉన్నది'ని అర్థం చేసుకోవడానికి పరధ్యాస వుండకూడదు. ప్రయత్నమూ పనికిరాదు. మీరు ఇప్పుడు చెప్తున్నది నేను అవగాహన చేసుకోవాలంటే నా ధ్యాస మరో దాని మీదకు మళ్ళి వుండకూడదు. నా సంపూర్ణమైన ధ్యాసను, అంటే సావధానాన్ని దానికి ఇచ్చి తీరాలి. 'ఉన్నది'ని గురించి ఎరుకగా వుండటం చాలా కష్టసాధ్యమైన సంగతి. ఎందుకంటే, అసలు మన ఆలోచనలే పరధ్యాస. 'ఉన్నది'ని మనం ఎప్పుడూ అపోహతోనో, దానికి అనుకూలంగా వుండే పక్షపాతంతోనో, వ్యతిరేకంగా వుండే వివక్షతోనో, ఖండిస్తూనో, ఫలానా అని పేరు పెడుతూనో పరికిస్తుంటాం. 'ఉన్నది' అసలు వాస్తవం. నిజమైనది. దానిని మార్చాలని కోరుకోవడం అంటే 'ఉన్నది' నుంచి దూరంగా పారిపోవడం అన్నమాట. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడంలో మాత్రమే సమూలమైన పరివర్తన సాధ్యం అవుతుంది. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవాలంటే ద్వంద్వాల సంఘర్షణ ఆగిపోవాలి. ఎందుకంటే ద్వంద్వాలలోని వ్యతిరేకమైనది అంటే 'ఉన్నది'కి ప్రతికూలంగా వుండేదానిని కొనసాగించాలనుకోవడం. అంటే మరొకలాగా అయిపోవాలనుకోవడం. కాబట్టి అది పరస్పర వ్యతిరేకతలను తయారు చేస్తుంది. మరొకలాగా అవడం అంటే 'ఉన్నది'ని తిరస్కరించడం. పొగరుమోతుతనాన్ని, అంటే అహం భావాన్ని అర్థం చేసుకోవాలంటే దానికి వ్యతిరేకమైన దానిని గురించిన ధ్యాస ఆగిపోవాలి. అంటే మరొకలాగా అవాలనే ప్రయత్నం, అనుకూలంగానైనా సరే,

ప్రతికూలంగానైనా సరే – అదంతా ఆగిపోవాలి. 'పొగరు' అని పేరు పెట్టబడిన ఆ మనోభావానికి కనుక మనం పేరు పెట్టకపోతే, ఆ మనోభావం దానంతట అదే వడలి రాలిపోతుంది. ఒక స్పందనకి లేక సవాలుకి జవాబుగా జరిగే ప్రతిస్పందనకు, అది సుఖకరమైనదైనా, బాధాకరమైనదైనా సరే, ఆ ప్రతిస్పందనకు ఏ పేరూ పెట్టనప్పుడు అది వడలి రాలిపోతుంది. అయితే, నేను ఇంతకు ముందే సూచించినట్లుగా, ప్రేమ సంగతి పూర్తిగా భిన్నమైనది. ప్రేమ కనుక ద్వేషానికి వ్యతిరేకంగా కలిగినదయితే, అదీ వాడి రాలిపోతుంది.

'ఉన్నది'ని అంగీకరించాలి అని కోరుకోవడం కూడా సరియైన దృక్పథం కాదు. మరొకలాగా అవాలని కోరిక వున్నప్పుడే అంగీకరించడం వుంటుంది. వాస్తవం తనను అంగీకరించమని ఆజ్ఞాపించదు. 'ఉన్నది'ని దాటవేయాలనే ఒత్తిడి వున్నప్పుడే, దానిని అంగీకరించాలనే ప్రేరణ కూడా బయలుదేరుతుంది. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడానికి అనాసక్తమైన ఎరుక అవసరం. కాలం అనే వలలో చిక్కుకొనిపోయిన మనసు 'ఉన్నది'ని గతం అనీ, భవిష్యత్తు అనీ పేర్లు పెట్టి మాటల్లోకి మార్చుకుంటూ వుంటుంది. అందువల్ల 'ఉన్నది'ని అవగాహన చేసుకొనే సామర్థ్యాన్ని మనసు పోగొట్టుకుంటుంది. పలాయనాలనీ, రకరకాల వ్యాపకాలనీ అవి ఎంత గొప్పవీ, వుదాత్తమైనవీ అయినా సరే, వాటి కోసం పాకులాడుతున్న మనసు 'ఉన్నది'ని అవగాహన చేసుకోలేదు. 'ఉన్నది'ని అవగాహన చేసుకోనట్లయితే జీవితం ఒక నిరంతర సంఘర్షణా, నిరంతరమైన బాధా. 'ఉన్నది' యొక్క ప్రాధాన్యం ఏమిటో తెలుసుకోకపోతే యదార్థమైనది వుండదు. యదార్థమైనది లేకుండా ఆనందమూ లేదు. సంతోషమూ లేదు.



# 1948 లో ప్రసంగాలు
# బొంబాయి

## మార్చి 7

జీవితం అంటే పుట్టుక నుంచి చనిపోయేవరకు ఒక నిరంతరమైన ఘర్షణా, బాధా ; తనతో తనకే నిరంతరంగా పోరు. అదేవిధంగా పొరుగువారితో కూడా పోరు. ఈ సమరం తప్పనిసరా, లేక మరోవిధమైన మార్గం వున్నదా ? జీవితం, ఈ అస్తిత్వం మరొకటి అవడం కోసం, 'ఉన్నది' నుంచి మరొకటేదో అవడం కోసం నిరంతరంగా జరిగే ప్రక్రియ. మరొకటిగా అవడం అంటే అది ఘర్షణే. మరొకటిగా అవడం ఎప్పుడూ పునరుక్తి వంటిదే. మరొకటిగా అవడం అంటే జ్ఞాపకాలను పెంచిపోషించుకోవడం. ఈ జ్ఞాపకాల పోషణనే ధర్మచింతన అంటున్నారు. ధర్మచింతన లేక ధర్మనిష్ఠ అహంభావాన్ని పోషించే ప్రక్రియ. పేదరికంలో వుండి ధనవంతులవాలను కోవడంలోనూ, అల్పంగా కుంచించుకొని పోయి వుండి లోతయిన మనిషిగా అవాలనుకోవడంలోనూ వున్న సమరం సంగతి మనకు తెలుసు. మరొకటి అవడం అంటే జ్ఞాపకాలను పెంచిపోషించడం ; జ్ఞాపకాలు లేనప్పుడు మరొకటి అవడం అనేది వుండదు. ఈ పోరాటాన్నంతటినీ ధర్మబద్ధమైనది అని మనం అంటాం. కాబట్టి ధర్మచింతన ఒక రకమైన అహంభావం, తనను విడదీసుకునేదీ, తనను అంటే స్వీయాన్ని ఒంటరిగా చేసుకొనేదీ. ఈ పోరాటాన్ని చాలా విశిష్ఠమైనదిగా మనం భావిస్తుంటాం. దీనిని, ఈ బాధామయ పోరాటాన్ని చాలా విలువైనదిగా, మన జీవితంలోని ఒక మహోత్తమమైన విషయంగా ఆమోదించివేశాం.

జీవితం అంటే పోరాటమూ, దుఃఖమూ, బాధలూతో కూడుకున్న ఒక ప్రక్రియ అనే అర్ధంలో తీసుకోవలసిందేనా ? కానేకాదు. తప్పకుండా ఇంకొక రకమైన జీవిత విధానం కూడా వుండి తీరుతుంది. మరొకటి అవడంలో ఎప్పుడూ పునరుక్తి వుంటుంది. అలవాట్లను తయారు చేసుకోవడం వుంటుంది. మరొకటి అవడంలో జ్ఞాపకాలను పెంచి పోషించుకోవడం వుంటుంది. అది నాత్వానికి అంటే స్వార్ధానికి ప్రోద్బలం ఇస్తూ వుంటుంది. నా అంటేనే, దాని స్వభావంలోనే వేదన వున్నది. అందులోనే పరస్పర వైరుధ్యం వున్నది.

సద్గుణం అంటే మరొకటి అవడం కానే కాదు. సద్గుణం అంటే ఘర్షణ లేని స్థితిలో వుండటం. సద్గుణవంతులుగా మీరు అవలేరు. మీరు సత్‌గుణవంతులు లేదా మీరు సద్గుణవంతులు కాదు. సత్‌గుణాలని సమర్ధించే ధర్మచింతనులయి వుండచ్చు మీరు. అంతే తప్ప సత్‌గుణవంతులుగా అవలేరు. సత్‌గుణమే స్వేచ్ఛ

నిస్తుంది. అయితే సత్‌గుణాన్ని సమర్థిస్తూ వుండే ధర్మచింతనుడైన వ్యక్తికి స్వేచ్ఛ లేదు. సత్‌గుణవంతుడిగా అవాలని ప్రయత్నిస్తే, సద్గుణాల సమర్థకులుగా మాత్రమే అవుతారు. మరొకటి అవడం అనే ప్రక్రియను, ఘర్షణా బాధలతో కూడుకొని వున్న ఆ ప్రక్రియను అవగాహన చేసుకోవడంలో వున్న ఆ స్థితే సద్గుణం. సద్గుణం అనే స్వేచ్ఛలో సత్యం వునికిలోకి వస్తుంది. ధర్మ చింతనుడి వద్దకు సత్యం రాదు. ఎందుకంటే అతడు మరొకటి అవడం అనే దానిలో చిక్కుకొని పోయి వున్నాడు. క్షమాగుణం కలవారుగా, దయాగుణం కలవారుగా అవాలని మీరు ప్రయత్నిస్తే, అప్పుడు మరొకటి అవడం, నాత్వం – అంటే 'నేను' ముఖ్యమవుతాయి, అవే ప్రధానమవుతాయి. 'నా' ఎన్నటికీ క్షమాగుణం కలది అవలేదు. సత్‌గుణాన్ని సమర్థించే ధర్మచింతనుడు ఏనాటికీ సత్‌గుణవంతుడు అవలేడు.

సత్‌గుణం తీరు గురించి మీరు తెలుసుకొని వుంటే, ప్రతి రోధభావాన్ని పెంచుకోవడం అక్కడ వుండదని మీరే గమనిస్తారు. సత్‌గుణాన్ని అలవరచుకోవడం ద్వారా క్షమాగుణమూ, దయా, ఆత్మవిశ్వాసమూ, అసూయా రాహిత్యమూ పుట్టుకొనిరావు. సత్‌గుణాన్ని అలవరచుకుంటే అది ఒక నిరోధభావంగా తయారవుతుంది. అయితే మరొకటిగా అవడం అనే ప్రక్రియను గురించి, అంటే నాత్వపు – స్వీయం యొక్క తీరుతెన్నులను గురించి మీరు ఎరుకగా వుంటే అప్పుడు సద్గుణం వుంటుంది.

మరొకటిగా అవాలి అనే పోరులో చిక్కుకొనిపోయిన వారు అందులోనుండి బయటపడటం ఎట్లా ? ఈ మరొకలాగా అవడం అనే ప్రక్రియను గురించి అప్రమత్తంగా వుండటమూ, అనాసక్తమైన ఎరుకతో వుండటమూ మాత్రమే మనం చేయగలిగినది. మరొకటిగా అవాలనుకోవడం అంటే నిరోధభావాన్ని నిలబెట్టడం. నిరోధభావం అంటే జ్ఞాపకాలను పెంచి పోషించడం ; అంటే అదే సత్‌గుణాలను సమర్థించే ధర్మచింతన. అవును – కాదు అనడం లేకుండా, ఖండన లేకుండా ఎరుకతో వుండండి. అప్పుడు నిరోధించడం అనే గోడ కరిగిపోవడం మీరే చూస్తారు. అప్పుడే, ఆ స్వేచ్ఛలోనే సత్యం వునికిలోకి రాగలుగుతుంది. ఉన్న స్థితిలో వుండటమే సద్గుణం. ఉన్నస్థితిలో వుండటమే క్రమతనూ, స్వేచ్ఛనూ తీసుకొస్తుంది. సంకల్పం వున్న వ్యక్తి, అంటే నిరోధభావం వున్న వ్యక్తి, తన స్వార్థపూరిత క్రియల ద్వారా స్వేచ్ఛను ఏనాటికీ పొందలేడు. అందువల్ల సత్యం వునికిలోకి రాలేదు. 'ఉన్నది'ని ఇష్టాయిష్టాల ప్రసక్తి లేకుండా, ఖండన లేకుండా గుర్తించడం ద్వారా మాత్రమే – 'ఉన్నది' చలనాన్ని చురుగ్గా, సునాయాసంగా గ్రహిస్తుండటం ద్వారా మాత్రమే – 'ఉన్నది' నుండి విముక్తి కలుగుతుంది. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడంలోనే సత్యం ఆవిష్కృతమవుతుంది.

ప్రశ్న : ఈ విగ్రహాలూ, మత సంబంధమైన చిహ్నాలూ యదార్ధతత్వం గురించి మనకి తెలియ చెప్పడానికి వుద్దేశించినవి ; వాటిలో ఎంతో లోతయిన అర్థం వుంది. అవి బూటకమెట్లా అవుతాయి ? దైవం అనే ఒక సర్వసాధారణమైన శబ్దమే మనల్ని ఎంతగానో కదిలించి వేస్తుంది. ఆ మాటను ఎందుకు కాదనాలి ?

కృష్ణమూర్తి : చిహ్నాలూ, సంకేతాలూ భావప్రసారం చేయడానికి సాధనాలుగా వున్నాయనడంలో సందేహం లేదు. అయితే యదార్ధతత్వం అందుకోవడానికి చిహ్నాలు అవసరమా ? క్రాసు, చంద్రవంక, హిందువుల మత చిహ్నాలు మొదలైన భావప్రసార సాధనాలైన చిహ్నాలతో మన మనసులు క్రిక్కిరిసిపోయి వున్నప్పుడు యదార్ధతత్వం తనని మనకు ఎరిగించుకోలేదు.

ఉన్నదానిని నేరుగా, మధ్యవర్తులుగా ఏ చిహ్నాలూ లేకుండానే అనుభవంలోకి తెచ్చుకోవడం సాధ్యం కాదా ? నేరుగా ప్రత్యక్షానుభవాన్ని వెతుక్కుంటున్న వ్యక్తికి ఈ చిహ్నాలు ధ్యాసను పక్కకి మళ్ళించే అవరోధాలు కావూ ? ఈ చిహ్నాలు వుండటం వల్ల మీకు ఏం జరుగుతున్నది ? ప్రతి ఒక్క జాతి ప్రజలకీ ఒక్కొక్కరకం చిహ్నాలు ప్రత్యేకమైనవి వుంటాయి. అసలు యదార్ధతత్వాన్ని అన్వేషించడం కంటే ఈ చిహ్నాలే వారికి చాలా ముఖ్యమైపోతాయి. చిహ్నాం నిజం కాదు. మాట అసలైన వస్తువుకాదు. మాట దేవుడు కాదు కానీ మీకు మాట చాలా ముఖ్యమైపోయింది. ఎందుకు ? మనిషి తాను సృష్టించిన వాటి పరిమితులు దాటుకొని ఆ వలగా వున్నదానిని అన్వేషించడం లేదు కాబట్టి కనుకనా ? అందువల్ల చిహ్నాలే చాలా ముఖ్యమైపోయాయి. పైగా వాటికోసం మనం ఒకరినొకరం నాశనం చేసుకోవడానికి వెనకాడటం లేదు.

'దేవుడు' అనే మాట మనలో ఒక వుత్తేజాన్ని కలిగిస్తుంది. అయితే, నరాల సంబంధమైనదీ, వాచ్య సంబంధమైనదీ అయిన ఆ వుత్తేజానికీ యదార్ధానికీ ఏదో సంబంధం వున్నదని మనం అనుకుంటున్నాం. కానీ, ఇంద్రియ సంవేదనకి - అంటే అదీ ఒక ఆలోచనా ప్రక్రియే, దానికి యదార్ధతత్వంతో ఏదైనా సంబంధం వుంటుందా ? జ్ఞాపకాల ద్వారా కలిగినటువంటి, నిబద్ధీకరణకు ప్రతి స్పందన అయినటువంటి ఈ ఆలోచనకు యదార్ధతత్వంతో ఏదయినా సంబంధం వుంటుందా ? కాబట్టి, మనసు సృష్టించినటువంటి ఈ చిహ్నానికి యదార్ధతత్వంతో ఏం సంబంధం వుంటుంది ? యదార్ధతత్వాన్నుండి మనని పక్కకి మళ్ళించే మనోరంజకమైన కాలక్షేపాలు కదూ ఈ చిహ్నాలు ? యదార్ధం అస్తిత్వంలోకి రావాలంటే చిహ్నాన్ని వదిలివేయాలి. కానీ మనం ఈ చిహ్నాలతోనే మనసులని క్రిక్కిరిసిపోయేటట్లుగా నింపివేస్తాం. ఎందుకంటే ఆ మరొకటి

మనకు లేదు. కాబట్టి మీరు ప్రేమిస్తుంటే, ఇక ప్రేమ చిహ్నాన్ని మీరు కోరుకోరు. చిహ్నాన్నో, బొమ్మనో, ఆదర్శాన్నో మీరు పట్టుకొని వుంటే, అప్పుడు మీరు ప్రేమించడం లేదనే చెప్పాలి.

విషయాలని నేరుగా ఆస్వాదించడం ఎందుకు సాధ్యం కావడం లేదు ? ఒక చెట్టునో, మనిషినో మీరు ప్రేమిస్తున్నారనుకుందాం. ఆ చెట్టు కానీ, మనిషి కానీ ఫలానా దానికి ప్రతినిధులనే కారణంగానో, ఆ చెట్టు ప్రాణికోటికి లేదా యదార్ధతత్వానికి ఒక ప్రత్యక్ష స్వరూపం కాబట్టో – ఆంతరికమైన స్థితికి ఈ చెట్టు బాహ్యమైన వ్యక్తీకరణ కాబట్టో మీరు ప్రేమించడం లేదు – అవన్నీ వట్టి కబుర్లు. ఒక ప్రాణిని – అది మరి దేనికో ప్రత్యక్ష స్వరూపం అనే కారణం వల్ల కాకుండా వూరికే మీరు ప్రేమించగలిగితే – అప్పుడు ప్రాణి అంటే మీలో వున్న ప్రేమలోనే యదార్ధమైన దానిని మీరు కనిపెడతారు. ప్రాణికోటిని, మరి దేనికో ఇది ప్రత్యక్ష స్వరూపం అనే దృష్టితో మీరు చూస్తే, అప్పుడు అసలు ప్రాణికోటిని మీరు అసహ్యించుకుంటున్నారనమాట. అప్పుడు జీవితాన్నుంచి మీరు పారిపోవాలని చూస్తున్నారనమాట. లేదూ జీవితాన్ని విసుగ్గానూ, యాంత్రికంగానూ తయారు చేసుకొని, ఆ కారణంగా వాస్తవాన్నుంచి తప్పించుకొని పారిపోతూవున్నారు.

చిహ్నాలలో చిక్కుకొని పోయిన మనసు తిన్ననైన మనసు కాదు. ఏ కాలుష్యాలూ లేని అమాయకమైన మనసు, నిర్మలమైన, కల్మషరహితమైన హృదయమూ మాత్రమే యదార్ధతను కనిపెట్టగలుగుతాయి. మాటలలోను, పదప్రయోగాలలోనూ, ఆచరణ విధానాలలోనూ చిక్కుకొని పోయిన మనసుకీ, హృదయానికీ యదార్ధాన్ని అస్తిత్వం లోకి తెచ్చుకునే స్వేచ్ఛ వుండనే వుండదు. మనసు తను సంపాదించుకొని కూడబెట్టుకున్నవన్నింటినీ పూర్తిగా వదిలివేసినప్పుడే యదార్ధం అస్తిత్వంలోకి రాగలుగుతుంది.

ప్రశ్న : యుద్ధం కనుక ఆరంభం అయితే మేము ఏం చేయాలి ? మీ సలహా ఏమిటి ?

కృష్ణమూర్తి : సలహా కోసం అడగటం కంటే, ఈ సమస్యని మనం కలిసి పరీక్షిస్తే బాగుంటుందని నేను సూచించవచ్చునా ? విషమ పరిస్థితుల్లో మరొకరి సలహాలను అనుసరించడం మన వినాశనానికే దారి తీస్తుంది. అట్లా కాకుండా, యుద్ధం వలన సంభవించే సమస్త పరిణామాలను గురించీ కనుక మనం అర్ధం చేసుకుంటే, అప్పుడు ఏది సరియైన క్రియ అనుకుంటామో అది చిత్తశుద్ధితో చేస్తాం. మనల్ని ఇతరులు నిబద్ధించిన తీరులో ప్రవర్తించం. సిద్ధాంత ప్రచారం మొదలైన పద్ధతుల ద్వారా ఈ

నిబద్ధీకరణను మరింతగా మన మీద రుద్దుతూ, యుద్ధం చేయడం ఎంత అత్యావసరమో మనకి ఇతరులు గట్టిగా బోధిస్తూ వుంటారు. ప్రస్తుతం మనం ఈ దేశభక్తీ, జాతీయ వాదం అని అంటున్నదానితోనూ, ఆర్థికరంగంలో ఏర్పరచిన సరిహద్దులతోనూ, మతసిద్ధాంతాలతోనూ, రాజకీయ సిద్ధాంతాలతోనూ నిబద్ధీకరణం చెందివున్నాం. కాబట్టి ఆయుధాలు చేతపట్టి యుద్ధంలో దూకుతామనడంలో సందేహం లేదు. అటువంటి వారికి అసలు ఏ సమస్యా లేదు. వారికి తాము చేయవలసిన క్రియ నిర్ధారణగా, స్పష్టంగా కనబడుతుంటుంది. దానిని వారు కర్తవ్యం అనీ, బాధ్యత అనీ అంటారు. వారు మారణాయుధాలకు బలిపశువులూ అవుతారు.

మీకు సమస్య ఎప్పుడు ఎదురవుతుందంటే, యుద్ధానికి గల కారణాలను ప్రశ్నించడం ఆరంభించినప్పుడు. ఈ కారణాలు కొందరు చిత్రిస్తున్నట్లుగా కేవలం ఆర్థికమైనవే కాదు. అంతకంటే ముఖ్యంగా అవి మానసిక తత్వానికి సంబంధించినవి. యుద్ధం అంటే ఘోర రక్తపాతంతో, భయంకరంగా, చిత్రవిచిత్రంగా ప్రకటితమవుతున్న మీ నిత్యజీవితమే తప్ప మరొకటి కాదు. మీలో అంతర్గతంగా వున్న విద్వేషానికీ, బాధకీ ఫలితంగా కలిగే సంఘర్షణను మరొకరితో మీకు గల సంబంధ బాంధవ్యాలలో చొరబెట్టి పోషిస్తూ వుండటం వల్ల యుద్ధం అనేది వునికిలోకి వస్తున్నది. ఇదే సంఘవి ద్రోహ చర్యగా బాహ్యారూపం తాల్చి విపత్తులకూ, క్షోభలకూ కారణమవుతున్నది. అత్యాశ, కూడబెట్టుకొనే తత్వమూ, అసూయల వల్లనే వేలాది మందిని మీరు చంపుతున్నారు, నాశనం చేస్తున్నారు, వికలాంగులను చేస్తున్నారు. కాబట్టి, యుద్ధానికి గల కారణాలేమిటి అని అన్వేషించడం ఆరంభించినప్పుడు, ఇతరులతో మీ సంబంధ బాంధవ్యాలను అవగాహన చేసుకోవడం ఆరంభిస్తారు. ఈ విచారణను బట్టి, అది నిజంగా గాఢమైనదా లేదా పైపైన మాత్రమే వుండేదా అనే దానిని బట్టి యుద్ధం వచ్చినప్పుడు మీరు ప్రతి స్పందిస్తారు. అహింసాపరుడైన మనిషికి - అహింసావాదినవాలి అని ప్రయత్నిస్తున్న ఆదర్శవాదికి కాదు - యుద్ధం అంటే మహా విపత్తు, అది శాంతికారకం కాదు. కాబట్టి సహజంగానే అతడు యుద్ధంలోకి దిగడు. అతడిని బహుశ కాల్చివేయవచ్చు, జైల్లో బంధించవచ్చు. పర్యవసానం ఏదయినా దానిని అతడు లెక్కచేయడు ; అది అతడి నైజం.

నేను ఇంతకు మునుపే చెప్పినట్లుగా, హింస నుండి విముక్తి చెందడం ఆదర్శవాదికి సాధ్యం కాదు. సంఘర్షణను, హింసను ఆధారం చేసుకొని మీ జీవితం నడుస్తున్నది. ఇప్పుడే కనుక ఇటువంటి మీ ఈ జీవిత విధానాన్ని అర్థం చేసుకోకపోతే రేపు విపత్కర పరిస్థితి సంభవించినప్పుడు అవగాహనతో కూడిన చర్యను మీరు ఎట్లా తీసుకోగలుగుతారు ? స్వజాత్యభిమానం, వర్గక్షేమం, అసూయ మొదలైన వాటితో

నిబద్ధితమైపోయిన మీరు యుద్ధం సంభవించిన మరుక్షణంలో ఈ నిబద్ధత నుండి ఎట్లా తప్పించుకుంటారు ? యుద్ధం సంభవించడానికి ముందే ఈ విపత్కర స్థితికి కారణాలైన వాటినుండి మిమ్మల్ని మీరు విడిపించుకోవాలి.

యుద్ధం ఒక రకమైన బాధ్యతా రాహిత్యాన్ని సృష్టిస్తుంది. చాలా మందికి ఈ విధమైన బాధ్యతలు లేని స్వేచ్ఛ ఇష్టంగా వుంటుంది. మిమ్మల్నీ, మీ కుటుంబాన్నీ ప్రభుత్వమే ఆహారమూ వగైరాలు ఇచ్చి పోషిస్తుంది. విసుగు కలిగించే రోజువారీ జీవితాన్నుంచి పారిపోవడానికి యుద్ధం మీకు ఒక అవకాశాన్ని కలిగిస్తుంది ఈ చంపడం, చావడం చాలా అసహ్యకరమైన విషయం - అయితే అది చాలా వుద్రేక జనితంగా వుంటుంది. అంతేకాకుండా, లోపల వున్న నేర ప్రవృత్తులను బయటకు వదిలే ఒక సాధనంగా అది పనికి వస్తుంది. మన దైనిక జీవితంలో, వ్యాపార రంగంలో, మన పరస్పర బాంధవ్యాలలో మనం నేరస్థుల లాగానే ప్రవర్తిస్తుంటాం. అయితే అదంతా చాలా జాగ్రత్తగా కప్పిపెడతాం. దాని మీద ధర్మం అనే దుప్పటి కప్పి, అంతా చట్టసమ్మతంగా తయారు చేస్తాం. ఇటువంటి కృతకత్వంలో నుండి విడుదల కలిగిస్తుంది యుద్ధం. యుద్ధంలో బాహాటంగా హింసను ప్రదర్శించవచ్చు. కాబట్టి, ఆయుధాలు చేపట్టమని ఆహ్వానం అందినప్పుడు, మీరు ఏం చర్య తీసుకుంటారు అన్నది మీ నిబద్ధీకరణం మీద ఆధారపడి వుంటుంది. అయితే, మనలో నిజాయితీ వున్నవారు, మన నిత్యజీవితంలో మనం ఏ విధంగా హింసాపూరితంగా వున్నామో అర్థం చేసుకోగలిగితే, దానిని ముఖాముఖిగా ఎదుర్కొని అర్థం చేసుకుంటే, మన సంభాషణల్లో, మన ఆలోచనల్లో, మనోభావాలలో మన చర్యలలో వున్న హింసను గురించి ఎరుకగా వుండగలిగితే, యుద్ధం వచ్చినప్పుడు చిత్తశుద్ధితో ప్రవర్తించగలుగుతామని తెలుసుకుంటాం. 'ఉన్నదానిని' గురించి ఎరుకగా వుండటం వల్ల మాత్రమే - దానిని మార్చివేద్దామని ప్రయత్నించడం కాదు, మరొక దానిగా చేయాలని ప్రయత్నించడం కాదు - కేవలం ఎరుకగా వుండటం ద్వారానే అవగాహన కలుగుతుంది. ఆదర్శాలను అందుకోవాలని పాటుపడుతున్న వ్యక్తి చేసే చర్యలు బూటకంగా వుంటాయి. ఎందుకంటే అతని ప్రతిస్పందన నిరాశ, నిస్పృహల మీద ఆధారపడుతుంది కాబట్టి. మీ రోజువారీ ఆలోచనలను గురించి, చర్యలను గురించి, ఏ ఎంపికా చేయకుండా, ఏ విధమైన ఖండన గానీ, సమర్థించడం గానీ లేకుండా, ఎరుకతో వుంటే, అప్పుడు యుద్ధాన్ని తీసుకొచ్చే కారణాలను వదిలించుకొని మీరు విడుదల పొందుతారు.

ప్రశ్న : హింసను ఏవగించుకునే వ్యక్తి ఒక దేశ పరిపాలనలో పాలు పంచుకొనగలడా ?

ప్రశ్న : హింసను ఏవగించుకునే వ్యక్తి ఒక దేశ పరిపాలనలో పాలు పంచుకొనగలడా ?

కృష్ణమూర్తి పూర్తిగా నిరంకుశంగా అధికారం చలాయించే ప్రభుత్వమైతే తప్ప, సాధారణ ప్రభుత్వం మీకు ప్రాతినిధ్యం వహిస్తున్నదనే అనుకోవాలి. మీరు మీ లాంటి వారినే ఎన్నుకుంటారు. కాబట్టి ప్రజాస్వామ్యం అని మనం అంటున్న దేశంలోని ప్రభుత్వం మీవంటిదే, మీరు ఏమిటో అదీ అటువంటిదే. మీరు అసలు ఎవరు ? మీరూ అంటే హింస, అత్యాశ, కూడబెట్టుకునే తత్వం, అధికారం కోసం తపన మొదలైన నిబద్ధతతో కూడి వచ్చే ప్రతిస్పందనల మూట. కాబట్టి మీరు ఏమిటో ప్రభుత్వమూ అదే. తన అస్తిత్వంలో హింస అనేదే లేని మనిషి హింసా పూరితమైన విధానంలో ఎట్లా భాగస్థుడవుతాడు ? యదార్థతత్వాన్ని అన్వేషిస్తున్న వ్యక్తి గానీ, యదార్థతత్వాన్ని చేరుకున్న మనిషి గానీ, ఒక దేశంతో, ఒక ప్రభుత్వంతో, ఒక సిద్ధాంతవాదంతో, పార్టీ రాజకీయాలతో, అధికారయంత్రాంగంతో సంబంధం పెట్టుకోగలడా ? మరొకదానితో – ఆ మరొకటి ఒక పార్టీ అయినా సరే, సిద్ధాంతవాదం అయినా సరే, ఒక గురువు అయినా సరే – ఆ మరొకటికి తనని తాను అర్పించుకున్న వ్యక్తి యదార్థాన్ని కనిపెట్టగలడా ? కనిపెట్టలేడు.

ప్రభుత్వం గురించి మీరు ఈ ప్రశ్న ఎందుకు అడుగుతున్నారంటే – మీలో జరగవలసిన పరివర్తన కోసం బయట వున్న ఆధిపత్యం మీదా, పరిసరాల ప్రభావాలలో మార్పులు రావడం మీదా ఆధారపడటం మీకు ఇష్టం కాబట్టి. నాయకులూ, ప్రభుత్వాలూ, సిద్ధాంతవాదాలూ, ఆచరణ సూత్రాల వంటి విధానాలూ ఏదో విధంగా మిమ్మల్ని మార్చివేస్తాయనీ, మీ జీవితాల్లో క్రమతా, శాంతీ తీసుకొస్తాయనీ మీరు ఆశిస్తూవుంటారు. మీ ప్రశ్నకి వెనక వున్న వుద్దేశ్యం ఇదే అనడంలో సందేహం లేదు. మరొకరెవరో – వారు ప్రభుత్వం గానీ, గురువుగానీ, సిద్ధాంతవాదం గానీ ఎవరయినా సరే మరొకరు మీలో శాంతీ, క్రమతా తీసుకొని రాగలరా ? మరొకరు మీకు ప్రేమనూ, సంతోషాన్నీ, ఇవ్వగలరా ? ఇవ్వలేరని గట్టిగా చెప్పచ్చు. మీరే తయారు చేసుకున్న గందరగోళాన్ని మీరు పూర్తిగా అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే శాంతి వునికిలోకి వస్తుంది. అయితే, మీ క్షోభలకి అసలైన కారణాలేమిటో తెలుసుకోకుండా మీలో సంతోషాన్నీ శాంతినీ నింపుకోవాలని బయటవున్న ఏదో ఒక సాధకం వద్దకు చేరతారు. లోపల వున్నది బయటి దానిని ఆక్రమించి తాను బలంగా నిలబడుతూనే వుంటుంది. అనేక రూపాల్లో వుండే మానసికమైన సంఘర్షణ కొనసాగుతున్నంత వరకు, బయటగా వున్న విధానం ఎంత పటిష్ఠంగా నిర్మించినదయినా సరే, ఎంత క్రమ వ్యవస్థలో వున్నా సరే

కాబట్టి, మిమ్మల్ని మీరు ఏకాకిగా తయారు చేసుకోకుండా మీలో పరివర్తన ఆరంభం అవాలి. అయితే ఇది బయట వున్న దానికి వ్యతిరేకంగా మాత్రం కాదు. మీకొక్కరికే కాకుండా, బయట నిర్మించుకున్నదానికి కూడా శాంతీ, సంతోషమూ తీసుకొని రావడానికి ఇది జరగాలి.

ప్రశ్న : మనకి స్వాతంత్ర్యం వచ్చిందని మీరు అనుకుంటున్నట్లుగా లేదు. మీ దృష్టిలో నిజమైన స్వేచ్ఛ అనే ఆ స్థితి ఎటువంటిది ?

కృష్ణమూర్తి : స్వేచ్ఛ దేశానికి సంబంధించినదయినప్పుడూ, కొన్ని విషయాలకే పరిమితమైనప్పుడూ, వర్గ విభజనతో కూడుకొని వుంటేనూ అప్పుడది ఇతరుల నుండి విడదీయడం వంటిది అవుతుంది. ఇటువంటి విడదీయడం తప్పకుండా సంఘర్షణకు దారితీస్తుంది. ఎందుకంటే ఏకాంతంగా, ఇతరులతో సంబంధం లేకుండా ఏదీ జీవించలేదు. ఉనికి అంటేనే సంబంధం కలిగివుండటం. దేశపు సరిహద్దుల లోపల మిమ్మల్ని ప్రత్యేకంగా విడిగా వుంచుకోవడం వలన గందరగోళం, కరువు మొదలైన వాటిని పిలిచి కూర్చోబెట్టినట్లవుతుంది. స్వాతంత్ర్యం ఒక విడదీసే ప్రక్రియ అయినప్పుడు సంఘర్షణకీ, యుద్ధానికీ దారితీస్తుంది. మనలో చాలా మందికి స్వాతంత్ర్యం అంటే విడిగా వుండటం. ఒక జాతీయ సత్తాగా మిమ్మల్ని మీరు విడదీసుకున్నప్పుడు మీకు స్వేచ్ఛ వచ్చినట్లా ? దోపిడీ తత్వం నుండీ, వర్గసంఘర్షణ నుండీ, కరువుల నుండీ, మతాచార్యుల నుండీ, నాయకుల నుండీ మీకు స్వేచ్ఛ లభించిందా ? నిస్సందేహంగా రాలేదు. తెల్లరంగులో వుండే దోపిడీదారుల్ని వెళ్ళగొట్టారు ; ఇప్పుడు గోధుమ రంగులో వున్న వాళ్ళు ఆ స్థానం ఆక్రమించారు. ఇద్దరూ కనికరం లేని దుర్మార్గులే.

అసలు స్వేచ్ఛ కావాలని మీరు కోరుకోవడం లేదు. మాటలతో మిమ్మల్ని మీరు మభ్యపెట్టుకుంటున్నారు. స్వేచ్ఛ అంటే తెలివి - ఇతరులను స్వలాభం కోసం వుపయోగించుకునే తెలివి కాదు. దయగా వుండే తెలివి, ఔదార్యగుణంతోవుండే తెలివి, భద్రత కోసం ఆధిపత్యాన్ని నమ్ముకోనటువంటి తెలివి. స్వేచ్ఛ కావాలంటే మంచి గుణాల అవసరం వున్నది. అయితే ధర్మచింతన మాత్రం విడదీసే ప్రక్రియ. ఇతరుల నుండి విడదీయడమూ, ధర్మచింతన జంటగా పనిచేస్తుంటాయి. సద్గుణాలూ, స్వేచ్ఛా కలిసి నివసిస్తాయి.

మేమంతా ఒక జాతి, ఒక దేశం అని చెప్పుకొనే ప్రజ తమ చుట్టూరా గోడలు నిర్మించుకొని ఏకాంతవాసం చేస్తుంటారు. వారికి ఎప్పటికీ స్వేచ్ఛ లభించదు. పైగా

ఇదంతా విభేదాలకూ, అనుమానాలకూ, విద్వేషాలకూ కారణమవుతుంది. చివరకు యుద్ధానికి దారితీస్తుంది. స్వేచ్ఛ వ్యక్తితోనే ఆరంభమవాలి. అది ఒక సంపూర్ణ ప్రక్రియ. మొత్తం మనిషిలో జరిగే సంపూర్ణ ప్రక్రియ. అతడు తన చుట్టూ తాను ఆర్థిక రంగపు సరిహద్దులనో, ధర్మచింతన అనే గోడలనో కట్టుకొని, తనని తాను విడదీసుకుంటే ఘోర విపత్తులకూ, వేదనలకూ కారణమవుతాడు. అత్యాశనుండీ, హింస నుండీ విడుదల పొందితే, అప్పుడు అతని చర్యలు అతడి సంబంధ బాంధవ్యాల ప్రపంచంలో ప్రత్యక్ష సంబంధం కలిగినవిగా వుంటాయి. వ్యక్తిలో రావలసిన ఈ పునరుజ్జీవనం ఇప్పుడే జరగాలి, ఎప్పుడో భవిష్యత్తులో కాదు. అది వాయిదా వేస్తూ వుంటే గందరగోళం, అంధకారం అనే కెరటం కదిలి వచ్చి మిమ్మల్ని ముంచి వేస్తుంది. ఈ క్షణంలోనే ఆకళింపు చేసుకోవలసిన ఆవశ్యకత వున్నదాని కోసం మీ మొత్తం సావధానతనూ, మీ మనసునూ, మీ హృదయాన్నీ ఇచ్చినప్పుడే మీరు అవగాహన చేసుకోగలుగుతారు.

ప్రశ్న : నా మనసెప్పుడూ అశాంతిగా, వ్యాకులపాటుతో వుంటుంది. దానిని అణిచివేస్తూ, ఆధీనంలో వుంచుకోకపోతే ఏ పనీ చేయలేను. ఆలోచనలను నా వశంలో వుంచుకోవడం ఎట్లా ?

కృష్ణమూర్తి : మొట్టమొదట ఆలోచనలనూ, ఆలోచించే వాడినీ అర్థం చేసుకోవడం ముఖ్యం. అసలు ఆలోచనలు అంటే, ఆలోచించడం అంటే అర్థం ఏమిటి ? ఆలోచించేవాడూ, అతని ఆలోచనలూ వేరు వేరా ? ధ్యానం చేస్తున్నవాడు వేరూ, అతని ధ్యానం వేరూనా ? తన గుణాలు తన నుండి వేరుగా వుంటాయా ? ఆలోచనలను అదుపు చేసే ముందు - అంటే దాని అర్థం ఏదైనా సరే - ముందుగా ఆలోచించేవాడినీ, అతని ఆలోచనలనూ అవగాహన చేసుకోవాలి. ఆలోచించడం ఆపివేసినప్పుడు ఆలోచించేవాడు అనే ఒకరు వుంటారా ? ఆలోచనలు లేనప్పుడు ఆలోచించేవాడు వున్నాడా ? ఆలోచనలు లేనప్పుడు ఆలోచించేవాడు కూడా వుండడు. అయితే, ఆలోచించేవాడికీ, ఆలోచనలకూ మధ్యన ఈ విభజన ఎందుకున్నది ? ఈ విభజన నిజమైనదేనా లేక కాల్పనికమా ? ఈ విభజన మనసు తన భద్రత కోసం సృష్టించుకున్న కల్పన. ఆలోచించేవాడు విడిగా, ప్రత్యేకంగా వున్నాడా, ఎందుకు అతడు తనను విడదీసుకున్నాడు అనేవి మనం స్పష్టపరచుకోవాలి. మీ ఆలోచనలు మీ నుండి విడిగా వున్నాయని మీరు అనుకున్నారు కదూ ? దానిలో నుండే అదుపు చేసేవారూ, అదుపు చేయబడేదీ, పరిశీలకుడూ, పరిశీలిస్తున్న వస్తువూ వేరువేరుగా వున్నారనే ఒక భావం మీలో కలిగింది.

మీలో చాలామంది ఆలోచించేవాడు ప్రత్యేకంగా, విడిగా వున్నాడని అనుకుంటారు. ఉన్నతమైన ఒక ఆత్మ, క్రింద వున్న ఆత్మ మీద పెత్తనం చేస్తూ వుంటుందనీ, ఇంకా ఏవేవో అనుకుంటారు ఈ విభజన ఎందుకున్నది ? ఈ విభజన అంతా మనసు అనే రంగం మీదే జరుగుతున్నది కదూ ? ఆలోచించేవాడిని ఆత్మ అనీ, కాపలాదారు అనీ, ఆలోచనలు మాత్రం వేరు అనీ మీరు అంటుంటే – అదంతా కూడా ఆలోచనా ప్రక్రియలోని భాగమే అనడంలో సందేహం లేదు. ఆలోచించేవాడు ఈ విభజన ద్వారా శాశ్వతత్వం సంపాదించాలనుకోవడం వల్లనే ఈ విభజన జరుగుతోంది కదూ ? అతడు తన ఆలోచనల రూపురేఖల్లో మార్పులు చేయచ్చు, తనని ఒక కొత్త చట్రంలో అమర్చుకోవచ్చు. ఎన్ని చేసినా తనని మాత్రం విడిగా, ప్రత్యేకంగా వుంచుకుంటాడు. ఆ విధంగా తనకి తాను శాశ్వతత్వాన్ని ఆపాదించుకుంటాడు. ఆలోచన లేకుండా ఆలోచించేవాడు లేడు. అతడు తనని విడదీసుకుంటూ వుంటే వుండచ్చుగాక. ఆలోచించడం ఆపివేసినప్పుడు అతడు లేడు. ఆలోచించేవాడి నుండి ఆలోచనను విడదీసి చూడటం వల్ల అతడికి శాశ్వతత్వం లభిస్తుంది. ఆలోచించేవాడు ఆలోచనలు క్షణికమైనవి అని గ్రహిస్తాడు , అందువల్ల చాతుర్యంతో తనని తాను ఆత్మ అనీ, ఆధ్యాత్మిక సత్తా అనీ అనుకుంటూ శాశ్వతత్వాన్ని ఆపాదించుకుంటాడు. అయితే, మీరు నిశితంగా పరిశీలిస్తే, ఇతరులు – వారెంత గొప్పవారయినా సరే – వాళ్ళు చెప్పినవన్నీ, ఆ విధంగా పోగుచేసుకున్న సమాచారమంతా పక్కకి నెట్టి పరిశీలిస్తే – పరిశీలకుడే పరిశీలించబడుతున్న అంశం అనీ, వున్నది ఒక్క ఆలోచన మాత్రమే అనీ మీరే గ్రహిస్తారు. ఆలోచన కాకుండా విడిగా వేరే ఆలోచించేవాడు లేనేలేడు. అతడు ఎంత అతి తెలివిగా, అతి బలంగా, ఎన్ని రకాలుగా, తనని విడదీసుకోవాలని చూసినా, తనకీ తన ఆలోచనలకీ మధ్యన గోడ కట్టాలని చూసినా, అతడు మాత్రం ఆలోచనా ప్రపంచం అనే పరిధిలోని వాడే. కాబట్టి ఆలోచించేవాడు అంటే ఆలోచనలే

ఆలోచనలను ఎట్లా అదుపు చేయాలి అని మీరు ప్రశ్నిస్తే, ఆ ప్రశ్న సరియైనది కాదు. ఆలోచించేవాడు తన ఆలోచనలను అదుపు చేయడం మొదలుపెడితే, అది అతడు తనకి తాను శాశ్వతత్వం ఇచ్చుకోవడం కోసమే. లేదూ, తన ఆలోచనలు బాధాకరంగా వుండటం వల్ల ఆలోచనలను అదుపు చేయాలనుకోవచ్చు. ఆలోచించేవాడే ఆలోచనలు అన్న వాస్తవాన్ని మీరు పూర్తి ఎరుకతో గ్రహిస్తే, అప్పుడు మీరు ఆలోచనల మీద అజమాయిషీ చేయాలనో, వాటి రూపురేఖలు మార్చాలనో, వాటిని అదుపుచేయాలనో, ఒక వైపుగా మళ్ళించాలనో అనుకోవడం లేదనమాట. అప్పుడే ఆలోచించేవాడి కంటే ఆలోచనల ప్రాధాన్యం ఎక్కువవుతుంది. అప్పుడు ఆలోచనా ప్రక్రియను అవగాహన చేసుకోవడం ధ్యానానికి ఆరంభం అవుతుంది. అదే స్వీయ జ్ఞానం. స్వీయజ్ఞానం లేకుండా ధ్యానం వుండదు. హృదయపూర్వకమైన ధ్యానమే అవగాహన.

కాబట్టి మనం పట్టించుకోవలసినది అసలు ఆలోచనా ప్రక్రియని గురించే. ఆలోచనలను క్రమశిక్షణలో పెట్టాలి, ఆలోచనలను అదుపు చేయాలి అనే వూహలను పూర్తిగా వదిలించుకున్నాం. ఇదే ఒక గొప్ప విప్లవం. ఆలోచించేవాడు ఆలోచనలనుండి వేరుగా వున్నాడు అనే అసత్యాన్ని గ్రహించినప్పుడే స్వేచ్ఛ దొరుకుతుంది. అది బూటకం అనే సత్యాన్ని గుర్తించినప్పుడే అసత్యాన్నుంచి విముక్తి లభిస్తుంది.

ఇంద్రియ స్పందన వలన ఆలోచన కలుగుతున్నది. మనసు దానిని ముద్రించుకుంటుంది. ఈ విధంగా పోగుచేసుకోవడం జరుగుతున్నది. చేతన అనుభూతి చెందుతూవుంటుంది , పేర్లు పెడుతూవుంటుంది ; ముద్రించుకుంటూ వుంటుంది - ఇదంతా మీకు ముందే వివరించాను. ఈ ముద్రణే జ్ఞాపకాలు. సవాలు లేక సమస్య ఎప్పుడూ కొత్తగా వస్తుంటుంది. ప్రతిస్పందన మాత్రం పాతదే. అంటే గతాన్ని ముద్రించుకోగా ఏర్పడిన జ్ఞాపకం కొత్తదానిని ఎదుర్కొంటున్నది. కొత్తదానిని పాతది ఎదుర్కోవడాన్ని అనుభవం అంటున్నాము. జ్ఞాపకం స్వతహాగా సజీవమైనది కాదు. కొత్తదానిని కలుసుకోవడం వల్లనే అది ప్రాణం పోసుకుంటున్నది. కొత్తది పాతదానికి ప్రాణం ఇస్తున్నది. అంటే పాతదానికి బలం ఇచ్చి పటిష్ఠం చేస్తున్నది. కొత్తదానిని తన నిబద్ధతకు అనుగుణంగా మార్చివేసుకోవడంలోనే స్మృతులు బతుకుతున్నాయి. కొత్తదానిని ఎదురుకున్నప్పుడే స్మృతులకి ప్రాణం వస్తున్నది. ఈ పునఃప్రాణ ప్రతిష్ఠ చేయడాన్నే ఆలోచించడం అంటున్నాము. ఆలోచన ఎప్పటికీ కొత్తది అవలేదు. ఎందుకంటే ఆలోచన స్మృతులకు - జ్ఞాపకాలకు - ప్రతిస్పందనగా వస్తున్నది. స్మృతులు కొత్తదాని వల్ల శక్తివంతమవుతున్నాయి. ఆలోచన ఏనాటికీ సృజనాత్మకం కాదు. ఎందుకంటే అది ఎప్పుడూ స్మృతులకు ప్రతిస్పందనగా వస్తూవుంటుంది.

అదుపులో వుంచిన మనసు స్వేచ్ఛగల మనసు కాదు. ఆలోచనలు ఎక్కడెక్కడో షికారు చేస్తుంటాయి. అటువంటప్పుడు ఈ గందరగోళంలో క్రమతను తీసుకొని రావడం ఎట్లా సాధ్యం ? వేగంగా తిరుగుతున్న ఒక యంత్రాన్ని అర్థం చేసుకోవాలంటే దాని వేగాన్ని తగ్గించాలి. పూర్తిగా ఆపివేస్తే అది జీవరహితం అవుతుంది. చనిపోయిన దానిని అర్థం చేసుకోవడం ఎప్పటికీ సాధ్యం కాదు. కాబట్టి, రానీయకుండా ఆపివేయడం ద్వారానో, వేరుపరచడం ద్వారానో ఆలోచనలను చంపివేసే మనసు అవగాహన చేసుకోలేదు. అయితే, ఆలోచనా ప్రక్రియ వేగాన్ని తగ్గిస్తే ఆలోచనలను అర్థం చేసుకోవచ్చు. ఒక గుర్రం ఎగిరి, ఎత్తుగా వున్న కంచెను దాటుతున్నప్పుడు తీసిన చిత్రాలను మీరు స్లోమోషన్ (తక్కువ వేగంతో నడిచే సినిమా) లో చూస్తున్నప్పుడు, దాని కండరాల అద్భుతమైన కదలికలను వివరంగా చూడగలుగుతారు. అదే విధంగా మనసు

వేగాన్ని తగ్గించినప్పుడు, పైకి లేస్తున్న ప్రతి ఒక్క ఆలోచననూ అర్థం చేసుకోవచ్చును అప్పుడే ఆలోచనల నుండి విముక్తి లభిస్తుంది తప్ప, అదుపు చేయడం వలనా కాదు, క్రమశిక్షణలో పెట్టడం ద్వారానూ కాదు

కొత్తని కొత్తగానూ, నవ్యనూతనమైన దానిని నవ్య నూతనంగానూ ఎదుర్కొనడంలోనే సృజనాత్మక జీవనం వున్నది. మనసు స్మృతులను ముద్రించుకుంటూ సేకరించుకుంటూ వుండి, సవాలు ఎదురైనప్పుడు స్మృతులు ప్రాణం పోసుకుంటూ వుంటే, ఆలోచనా ప్రక్రియ కొనసాగుతునే వుంటుంది ప్రతి ఒక్క ఆలోచన గురించీ ఎరుకగా వుండటం శ్రమతో కూడినది. అయితే, ఏదో ఒక ఆలోచనను పూర్తిగ ఆలోచించి చూడాలనే ఆసక్తి మీకు వుంటే, ఆలోచనలు పైకి లేస్తున్నప్పుడు వాటిని కాగితం మీద పెట్టడం ద్వారా మీ అంతట మీరే ఒక ప్రయోగం చేసి తెలుసుకోవచ్చును రాసిన ఆలోచనలను పరిశీలిస్తే, మీ మనసు ఏ క్రమశిక్షణా, ఏ ఒత్తిడీ లేకుండానే వేగం తగ్గించిందని కనిపెడతారు. ఈ విధంగా మనసు గతాన్నుండి విముక్తి చెంది, ప్రశాంత స్థితిని అందుకుంటుంది. ఎందుకంటే అది ఇప్పుడు సమస్యలని తయారు చేస్తూ కూర్చోదు. ఇటువంటి ప్రశాంతతలో యదార్థతత్వం వునికిలోకి వస్తుంది.



# 1948 లో ప్రసంగాలు

## బెంగుళూరు

**జులై** 25

క్రిందటిసారి మనం కలుసుకున్నప్పుడు ప్రస్తావించినట్లుగా, ప్రపంచ సమస్యలు అతి బ్రహ్మాండమైనవి. చాలా సంక్లిష్టమైనవి కూడా. అందువల్ల వాటిని అవగాహన చేసుకొని. పరిష్కరించుకోవాలంటే చాలా సరళమైన, సూటియైన పద్ధతిలో వాటిని ఎదుర్కోవాలి. సరళశీలతా, సూటిదనం అనేవి బాహ్యమైన పరిస్థితుల మీద గానీ, మనకి వుండే రకరకాల అపోహల మీద గానీ, మనోస్థితి గతుల మీద గానీ ఆధారపడి వుండవు. నేను ముందే సూచించినట్లుగా. సమావేశాల ద్వారా గాని, ప్రణాళికల ద్వారాగాని, పాత నాయకుల స్థానాల్లో కొత్త నాయకుల్ని నిలబెట్టడం ద్వారా గాని పరిష్కారాలు కనిపెట్టలేము సమస్యను సృష్టించినవాడిలోనే, ఈ చీకాకులనూ, ద్వేషాన్నీ, మనిషికీ మనిషికీ మధ్య అపారమైన అపార్థాలను సృష్టించినవాడిలోనే పరిష్కారం వున్నదనే సంగతి స్పష్టంగా కనబడుతున్నది. ఈ చీకాకులను సృష్టించిన, ఈ సమస్యలన్నింటినీ సృష్టించిన వ్యక్తి ఎవరంటే మీరూ, నేనూ. అంతేకాని మనం అనుకుంటున్నట్లుగా ఈ లోకం కాదు. లోకం అంటే మరొకరితో మీ బాంధవ్యం. లోకం అంటే మీ నుంచీ, నా నుంచీ విడిగా ఎక్కడో లేదు. లోకం అంటే, సమాజం అంటే ఒకరికీ మరొకరికీ మధ్యన మనం ఏర్పరుచుకునే, లేదా ఏర్పరుచుకోవాలని మనం కోరుకుంటున్న పరస్పర సంబంధం.

కాబట్టి సమస్య అంటే మీరూ, నేనే, ప్రపంచం కాదు. ఎందుకంటే ప్రపంచం అంటే మనం తయారు చేసుకున్నదే. అందుకని ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలంటే మనల్ని మనం అర్థం చేసుకోవాలి. ప్రపంచం మననుండి విడిగా లేదు. మనమే ప్రపంచం. మన సమస్యలే లోకపు సమస్యలు. ఇది ఎన్నిసార్లు మళ్ళీ మళ్ళీ చెప్పినా ఫరవాలేదు. ఎందుకంటే మన మనస్తత్వాలు ఎంతగా మొద్దుబారి పోయాయంటే ప్రపంచ సమస్యలు మనకి అనవసరం అని అనుకుంటూ వుంటాం. ఆ పని చేయవలసినది ఏ ఐక్యరాజ్య సమితో అనుకుంటాం. పాత నాయకుల స్థానే కొత్త నాయకులను నియమించడం ద్వారా పరిష్కరించవచ్చని అనుకుంటాం. ఈ రకంగా ఆలోచించే మనస్తత్వం చాలా జడమైనది. ఎందుకంటే లోకంలో వున్న ఈ భయంకరమైన దైన్యానికీ, గందరగోళానికీ, మన మీద పడటానికి పొంచివున్న యుద్ధానికీ మనమే బాధ్యులం. ప్రపంచపు తీరు మార్చాలంటే మనతోనే ఆరంభించాలి. నేను ముందే చెప్పినట్లుగా మనతోనే ఆరంభించడానికి ముఖ్యంగా కావలసినది ఏమిటంటే – దీక్ష. మనల్ని మనం అవగాహన చేసుకోవాలనే

స్వయందీక్ష మనకి వుండాలి. అంతే తప్ప మారవలసింది ఇతరులు అనీ, వామపక్షపు లేదా మరో పక్షపు విప్లవాల ద్వారా వాళ్ళే సమాజంలో మార్పులు తీసుకొని వస్తారనీ అనుకోవడం సరికాదు. కాబట్టి ఈ బాధ్యత మనది, అంటే మీదీ, నాదీ అని అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం. ఎందుకంటే, మనం నివసించే ప్రపంచం ఎంత చిన్నదైనా సరే, మనల్ని మనం మార్చుకోగలిగితే, రోజు వారీ జీవితంలో ఒక సమూలమైన కొత్త దృక్పథాన్ని తీసుకురాగలిగితే, అప్పుడు ప్రపంచం అంతటినీ, మనం పంచుకునే పరస్పర బాంధవ్యాల్నీ సహితం మనం ప్రభావితం చేయగలుగుతాం.

కాబట్టి, మనల్ని మనం అవగాహన చేసుకునే ప్రక్రియను గురించి, దానిని కనిపెట్టడం కోసం చర్చించుకుందాం. అయితే అది మనల్ని వేరుగా విడదీసి ఒంటరిగా చేసే ప్రక్రియ కాదు. అది ప్రపంచం నుండి మనల్ని దూరం చేయడమూ కాదు. ఎందుకంటే ఎవరూకూడా ఒంటరిగా ఏకాంతంలో జీవించలేరు. ఉండటం అంటేనే సంబంధం కలిగి వుండటం. ఏకాంతవాసం చేయడం అనేది లేనేలేదు. సరియైన బాంధవ్యం లేకపోవడంవల్లనే సంఘర్షణలు, వేదనలు, కలహాలు పుట్టుకొస్తున్నాయి. మన ప్రపంచం ఎంత చిన్నదయినా సరే, ఆ ఇరుకు ప్రపంచంలోనే మన సంబంధ బాంధవ్యాలను పూర్తిగా మార్చివేసుకోగలిగితే, అది బయట ప్రపంచం అంతటిపైనా ఒక అలలాగా వ్యాపించి పోతూనే వుంటుంది. ఈ అంశం గ్రహించడం చాలా ముఖ్యమని నాకనిపిస్తున్నది - ప్రపంచం అంటే మన పరస్పర బాంధవ్యాలు, అది ఎంత ఇరుకైన ప్రపంచం అయినా సరే అక్కడ ఒక సంపూర్ణమైన మార్పును, పై పై మార్పును కాదు, సమూలమైన మార్పును తీసుకొనిరాగలిగితే, అప్పుడు ప్రపంచాన్ని పూర్తిగా మార్చివేయడం క్రియాశీలంగా ఆరంభించినట్లవుతుంది. నిజమైన విప్లవం అంటే ఏదో ఒక ప్రత్యేకమైన నమూనాను - వామపక్షపుదో, వామేతర పక్షపుదో అనుసరించి వచ్చే విప్లవం కాదు - నిజమైన విప్లవం విలువలకి సంబంధించిన విప్లవం. ఇంద్రియ స్పందనల సంబంధమైన విలువలనుండి ఇంద్రియ సంబంధితం కాని విలువలకు, పరిసరాల ప్రభావాలనులోను కాని విలువలకు మారిపోయే విప్లవం. ఇటువంటి నిజమైన విలువలను, అంటే - సమూలమైన విప్లవాన్ని, ఒక పూర్తి మార్పును లేదా పునరుజ్జీవనాన్ని తీసుకొనివచ్చే విలువలను - కనిపెట్టాలంటే తనని తాను అవగాహన చేసుకోవడం అత్యావశ్యకం. స్వీయజ్ఞానమే వివేకానికి ఆరంభం. అందువల్ల అదే పూర్తి మార్పుకు, పునరుజ్జీవనానికి ఆరంభం అవుతుంది. మనల్ని మనం అవగాహన చేసుకోవాలంటే అవగాహన చేసుకోవాలనే దీక్ష వుండాలి. అక్కడే వస్తుంది చిక్కు అంతా. ఎందుకంటే మనలో చాలా మంది చాలా అసంతృప్తితో వున్నా మనం కాంక్షించేది ఏమిటంటే హఠాత్తుగా మార్పు రావాలని. మన అసంతృప్తిని కేవలం ఒక ప్రత్యేకమైన ఫలితం రాబట్టడం వైపుగానే మళ్ళిస్తాం. అసంతృప్తులమై వుండటం వల్లనే వుద్యోగం మార్చడం

కానీ, పరిసరాలకు లొంగిపోవడం కానీ చేసివూరుకుంటాం. కాబట్టి, అసంతృప్తి మనలో ఒక జ్వాలను రగుల్కొల్పి, జీవితాన్ని ఎదిరించి ప్రశ్నించే కారకం అవడంలేదు. దానికి బదులుగా, జీవితం అనే మొత్తం ప్రక్రియ అంతటినీ ఒక దిశగా మళ్ళిస్తున్నది. ఆ విధంగా మనం సగటు మనుష్యులంగా తయారై, స్వయం శక్తినీ, అసలు జీవితానికి గల ప్రాధాన్యం ఏమిటి అనేది కనిపెట్టే నిశితత్వాన్నీ పోగొట్టుకున్నాం. అందువల్ల ఈ విషయాలన్నీ మనమే కనిపెట్టి తెలుసుకోవడం ముఖ్యం. ఎందుకంటే స్వీయజ్ఞానాన్ని మరొకరు మనకి ఇవ్వలేరు పుస్తకాల ద్వారా సంపాదించలేము మనమే కనిపెట్టాలి. కనిపెట్టాలంటే దీక్ష, అన్వేషణ, విచారణ తప్పకుండా వుండాలి అటువంటి దీక్షా, లోతైన విచారణా అసలే లేకుండా లేదా బాగా బలంగా లేకుండా, వూరికే తనని గురించి తాను తెలుసుకోవాలి అనే అంశాన్ని సమర్థించడం వల్ల కానీ, యాథాలాపంగా కోరుకోవడం వల్ల కానీ ఏ మాత్రం ప్రయోజనం వుండదు.

కాబట్టి, వ్యక్తిలో కలిగే పరివర్తన వల్లనే ప్రపంచం కూడా పూర్తిగా మారిపోతుంది వ్యక్తి అంటే మానవ అస్తిత్వం అనే మొత్తం ప్రక్రియలో నుండి తయారయినవాడే, అందులోని ఒక భాగమే, కాబట్టి, వ్యక్తిలో పూర్తి మార్పు రావాలంటే స్వీయజ్ఞానం అత్యావశ్యకం. ఎందుకంటే మీరు ఏమిటో తెలుసుకోకుండా సవ్యమైన ఆలోచనలకు పునాది వుండదు మిమ్మల్ని గురించి మీరు తెలుసుకోకుండా పూర్తి మార్పు జరగదు మీరు ఎట్లా వున్నారో అదే మీరు తెలుసుకోవాలి తప్ప, ఎట్లా వుండాలని కోరుకుంటున్నారో అది కాదు. అది కేవలం ఒక ఆదర్శం ; కాబట్టి కాల్పనికమైనదీ, అసత్యమైనదీ. 'ఉన్నది' ఏదో దానిని మార్చడం సాధ్యపడుతుంది తప్ప, మీరు అట్లా 'ఉండాలి' అని కోరుకుంటున్న దానిని కాదు. కాబట్టి, మనం ఎట్లా వున్నాము అన్నదానిని తెలుసుకోవడానికి అత్యంతమైన అప్రమత్తతగల మనసు అవసరం. ఎందుకంటే 'ఉన్నది' నిరంతరంగా మార్పు, పరివర్తనం చెందుతూ వుంటుంది. చురుకుదనంతో దాని వెంటనంటాలంటే మనసు ఏ ఒక్క ప్రత్యేకమైన పిడివాదంతో కానీ, నమ్మకంతో కానీ, ఆచరణ విధానంతో కానీ ముడివేసుకొని వుండకూడదు. దేనినైనా సరే అనుసరించడమూ, దానికి కట్టుబడి వుండటమూ సరికాదు. కాబట్టి మిమ్మల్ని మీరు తెలుసుకోవాలంటే ఎరుక వుండి తీరాలి. మనసు అప్రమత్తంగా వుండి తీరాలి. అటువంటి మనసు అన్నిరకాల నమ్మకాల నుండి, ఆదర్శీకరణాల నుండి విముక్తి చెందినదై వుంటుంది. ఎందుకంటే నమ్మకాలు, ఆదర్శాలు ఒక రంగును పులుముతాయి. సూటిగా వుండవలసిన గ్రహణ శక్తిని వక్రీకరిస్తాయి. మీరు ఏమిటో మీరే తెలుసుకోవాలనుకుంటే, మీరు కానిదిని ఏదో కల్పన చేసుకొనీ, అందులో నమ్మకం పెట్టుకొనీ లాభం లేదు. నేను అత్యాశాపరుడిని, అసూయాగ్రస్తుడిని, హింసాపరుడినీ

అయినప్పుడు, అహింసనూ, అత్యాశారాహిత్యాన్నీ వూరికే ఆదర్శాలుగా పెట్టుకోవడం వలన ఏమీ లాభం వుండదు. అయితే, మనలో అత్యాశ వున్నది, హింస వున్నది అని తెలుసుకోవడానికీ, అది తెలుసుకొని అవగాహన చేసుకోవడానికీ చాలా అసాధారణమైన పరిగ్రహణ శక్తి అవసరం ; అవసరం కాదూ ? దానికి నిజాయితీ, ఆలోచనల్లో సుస్పష్టతా కూడా తప్పక వుండి తీరాలి. అట్లాకాకుండా, 'ఉన్నది'కి దూరంగా, ఒక ఆదర్శాన్ని వెంటాడటం పలాయనం అవుతుంది. అది మీరు ఏమిటి అనే దానిని కనిపెట్టకుండా, దానిపై సూటిగా చర్య తీసుకోకుండా మిమ్మల్ని నిరోధిస్తుంది.

కాబట్టి, మీరు ఏమిటి అన్నది అవగాహన చేసుకోవడం, అది ఏదయినా సరే - అది అసహ్యంగా వుండవచ్చు, అందంగా వుండవచ్చు, దుష్టతనం కావచ్చు, కొంటెతనమూ కావచ్చు - మీరు ఏమిటో ఆ దానిని వక్రీకరించకుండా అవగాహన చేసుకోవడం సత్‌గుణాలకు ఆరంభం. సద్గుణం చాలా అవసరం. ఎందుకంటే అదే స్వేచ్ఛని ఇస్తుంది. సత్‌శీలంలోనే మీరు కొత్తవి కనిపెట్టగలరు, జీవించగలరు - సత్‌గుణాలని అలవరచుకోవడంలో కాదు. అలవరచుకోవడం వలన పరువు మర్యాదలు మాత్రం లభిస్తాయి తప్ప, అవగాహనా, స్వేచ్ఛా లభించవు. సత్‌శీలం కలిగి వుండటానికీ, సత్‌శీలురుగా అవడానికీ మధ్యన తేడా వుంది. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడం వల్ల సత్‌గుణం కలుగుతుంది. అయితే సత్‌శీలురుగా అవాలి అనుకుంటే అది వాయిదా వేయడం అనమాట. అంటే 'ఉన్నది'ని మీరు ఏం అవాలి అని కోరుకుంటున్నారో దానితో కప్పివేయడం అనమాట. కాబట్టి, సుశీలవంతులుగా అవాలనుకోవడం అంటే 'ఉన్నది' మీద సూటిగా చర్య తీసుకోవడాన్ని మీరు తలాయిస్తున్నారనమాట. ఆదర్శాలు అలవరచుకోవడం ద్వారా 'ఉన్నది'ని తప్పించుకునే ప్రక్రియను సత్‌గుణంగా మనం పరిగణిస్తుంటాం. అయితే బాగా దగ్గరనుంచి, సూటిగా పరీక్షించి మీరు చూస్తే అది సరికాదని తెలుసుకుంటారు. అది కేవలం 'ఉన్నది'ని ముఖా ముఖిగా ఎదుర్కోకుండా వాయిదా వేయడం మాత్రమే. 'ఉన్నది కాని' దానిగా అవడం సద్గుణం కాదు. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడమే సద్గుణం. కాబట్టి అదే 'ఉన్నది' నుండి విముక్తి. చాలా వేగంగా విచ్ఛిన్నమై పోతున్న ఈ సమాజంలో సద్గుణం అత్యంత అవసరం. ఒక కొత్త ప్రపంచాన్ని నిర్మించాలంటే, పాత దానినుండి వేరైన ఒక నూతన నిర్మాణాన్ని సృష్టించాలంటే, కొత్తవి కనిపెట్టడానికి స్వేచ్ఛ వుండాలి. ఎందుకంటే సత్‌గుణం లేకుండా స్వేచ్ఛ లేదు. సద్గుణవంతుడిగా అవాలని ప్రయాసపడుతున్న అవినీతిపరుడు సత్‌గుణం అంటే ఏమిటో ఎప్పటికైనా తెలుసుకోగలడా ? నీతిలేని మనిషి ఎన్నటికీ స్వేచ్ఛను పొందలేడు. కాబట్టి, అతడు ఎన్నటికీ యదార్థతత్వం ఏమిటో కనిపెట్టలేడు. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడంలోనే యదార్థతత్వాన్ని కనిపెట్టగలం. 'ఉన్నది'ని అవగాహన

చేసుకోవాలంటే స్వేచ్ఛ వుండాలి. 'ఉన్నది' అంటే వుండే భయాల నుండి విముక్తి చెందాలి.

సరే, సత్‌గుణం కాలానికి సంబంధించినది అవుతుందా ? 'ఉన్నది' యొక్క అవగాహన, అది స్వేచ్ఛనిస్తుంది కాబట్టి, తక్షణమే విడుదల చేస్తుంది కాబట్టి అదే సత్‌గుణం - అయితే అది కాలానికి సంబంధించినదా? కాలం అనే ప్రక్రియ ద్వారా మీరు దయగా, వుదారంగా, అనురాగపూరితంగా వున్నారా ? అంటే, ఎల్లుండి మీరు దయగా వుంటారా ? దయాగుణాన్ని కాలానికి సంబంధించిన మాటల్లో మీరు పెట్టగలరా ? ఏది ఏమయినా, ఆత్మీయత, క్షమాగుణం, ఔదార్యం మొదలైన గుణాలు జీవితానికి అత్యవసరమైనవి. మన సమస్యలన్నింటికీ పరిష్కారం చూపేది అవే. మంచితనం చాలా అవసరం, కానీ అది మనవద్ద లేదు. ఉన్నదా ? రాజకీయ వేత్తలవద్ద కానీ, నాయకుల వద్ద కానీ, వారి అనుయాయుల వద్ద కానీ నిజమైన మంచితనం - ఒక ఆదర్శంగా కాదు - అసలైన మంచితనం లేనేలేదు. మంచితనం లేకుండా, ఆత్మీయతను, అనురాగాన్ని ప్రసాదించే ఆ అపురూపమైన సౌమ్యతా గుణం లేకుండా, కేవలం సమావేశాలు ఏర్పాటు చేయడం ద్వారా మన సమస్యలని పరిష్కరించుకోలేము. కాబట్టి, మీరు కూడా, ప్రపంచమంతటా వున్న రాజకీయవేత్తల లాగే, లక్షలాది అత్యధికులైన ప్రజలందరిలాగే దయగలవారు కాదు. ఒకే ఒక పరిష్కారమార్గం అయిన ఆ మంచితనం మీలో లేదు. ఇప్పుడు అది మీవద్ద లేదు కాబట్టి, అది కేవలం కాలానికి సంబంధించినది మాత్రమేనా ? రేపో లేదా పది సంవత్సరాల తర్వాతో మీలో మంచితనం వస్తుందా ? ఇది కాలానికి సంబంధించినది అనుకోవడం, భవిష్యత్తులో దయగా అవుతామనుకోవడమూ కుతర్కం కాదూ ? ఇప్పుడు కనుక మీరు దయగా లేకపోతే ముందు ముందు కూడా ఎన్నటికీ దయగా వుండరు. మెల్ల మెల్లగా అభ్యాసం చేసీ, క్రమశిక్షణలో పెట్టుకొనీ, ఇంకా ఏవేవో చేస్తూ, రేపోలేదూ పది సంవత్సరాల తర్వాతో దయగా వుండబోతున్నారనీ, ఈలోగా నిర్దయగా వుండిపోవచ్చుననీ మీరు భావించవచ్చు. ప్రస్తుతం మనకు వున్న జీవిత సమస్యలకు దయాగుణం, మంచితనం, అనురాగం అనేవి మాత్రమే పరిష్కారాలు. జాతీయవాదం, కులమత విభేదం అనే విషాలను నిర్మూలించడానికి ఇవి మాత్రమే విరుగుడుగా పనిచేస్తాయి. ఇవి మాత్రమే మనందరినీ దగ్గరగా చేర్చి, కలిపి వుంచగలుగుతాయి.

సరే, దయా క్షమాగుణమూ కాలానికి సంబంధించినవి కాని పక్షంలో, అప్పుడు మీరూ నేనూ ఎందుకు తక్షణమే, వెంటనే దయగా అయిపోవడం లేదు ? ప్రస్తుతం మనం ఎందుకు దయగా లేము ? మనలో దయాగుణం ఎందుకు లేదో అన్నది కనుక

అర్థంచేసుకుంటే, అవగాహన తక్షణమే జరిగే సంగతి కాబట్టి, మనం వెంటనే దయగలవారిగా అయిపోతాం. అప్పుడు మన కులమేమిటో మనం మరచిపోతాం. కులసంబంధమైన, మత సంబంధమైన, దేశీయ, జాతీయ సంబంధమైన విభేదాలన్నీ మరచిపోతాం. తక్షణమే వుదారగుణమూ, దయాకలవారిగా అయిపోతాం. కాబట్టి, మనం ఎందుకు దయగా లేమో అది అవగాహన చేసుకొనితీరాలి. తీరిగ్గా కూర్చొని మంచితనాన్ని అభ్యాసం చేయడమూ, ఔదార్యం గురించి ధ్యానం చేయడమూ - అదంతా వట్టి మూర్ఖత్వం. అయితే నేనెందుకు దయావిహీనంగా వున్నానో తెలుసుకొని, దయగా వుండాలీ అని కోరుకుంటే అప్పుడు, దయగా వుండాలనే దీక్ష నాలో వున్నది కాబట్టి, నేను దయగా వుంటాను. కాబట్టి ఇక్కడ వుద్దేశ్యం చాలా ముఖ్యమైనది. అయితే, నా దయావిహీనతకి కారణం కనుక తెలుసుకోకపోతే ఈ వుద్దేశ్యం కూడా నిరర్థకమే. కాబట్టి, నా మొత్తం ఆలోచనా ప్రక్రియనంతటినీ నేను తెలుసుకోవాలి. జీవితం ఎడల నాకున్న వైఖరి తీరు తెన్నులను తెలుసుకోవాలి. కాబట్టి నన్ను నేను అధ్యయనం చేయడం బ్రహ్మాండమైన ప్రాముఖ్యత గలది అవుతుంది. అయితే స్వీయజ్ఞానమే తుదిగమ్యం కాదు. మనల్ని మనం ఇంకా ఇంకా ఎక్కువగా అధ్యయనం చేయాలి. అయితే, ఒక లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని కాదు. ఒక ఫలితాన్ని అందుకోవాలని కాదు. ఎందుకంటే ఒక లక్ష్యాన్ని, ఒక ఫలితాన్ని అందుకోవాలని కోరుకుంటుంటే, అదే ఆటంకమై మన విచారణా, మన ఆవిష్కరణా, మన స్వేచ్ఛ అంతరిస్తాయి. స్వీయజ్ఞానం అంటే నేను, నాత్వం అనే ప్రక్రియను, మనసు అనే ప్రక్రియను అవగాహన చేసుకోవడం. కాంక్షలూ, వాటి కోసం వెంపర్లాటా, అందులో చిక్కులు పడిపోయి వుండే సంక్లిష్టతలూ - వీటన్నింటిని గురించీ ఎరుకగా వుండటం. మనల్ని గురించి మనం ఇంకా ఎక్కువగా, లోతుగా, విస్తృతంగా, విశాలంగా, ప్రగాఢంగా తెలుసుకుంటున్నకొద్దీ మనకి స్వేచ్ఛ దొరుకుతుంది. అన్ని భయాలనుండీ, తనని తాను భయం అనే ఏకాంతవాసంలో బంధించుకుంటూ మనసు తయారు చేసుకున్న నమ్మకాలూ, మూఢ విశ్వాసాలూ, జాతీయాభిమానాలూ, కులాలూ మొదలైన ఎన్నో అసహ్యాకరమైన వాటినుండీ విడుదల లభిస్తుంది. స్వేచ్ఛ పొందినప్పుడు నిరంతరంగా నిలిచిపోయేది ఆవిష్కృతం అవుతుంది. ఆ స్వేచ్ఛ లేకుండా నిరంతరమైనది ఏది అని వూరికే అడగడమూ, నిరంతరమైన దానిని గురించి పుస్తకాల్లో చదవడమూ వల్ల లాభం లేదు. అదంతా చిన్నపిల్లలు బొమ్మలతో ఆడుకోవడం వంటిది. నిత్యమైనది, యదార్థతత్వం, దైవం - లేదూ మీరు ఏమని పిలిచినా సరే, దానిని మీరు మాత్రమే ఆవిష్కరించుకోగలుగుతారు. మనసు స్వేచ్ఛగా వున్నప్పుడే, నమ్మకాల జంఝాటాలలో చిక్కుకోకుండా, కాంక్షలు, దుష్టచింతన, అతితెలివి అనే జాలంలో తగులుకొని లేకుండా వున్నప్పుడే అది అస్తిత్వంలోకి వస్తుంది. అయితే జాతీయాభిమానాల్లో, దేశభక్తిలో, నమ్మకాల్లో, కర్మకాండల్లో చిక్కుపడిపోయిన

మనసు తన కోరికల్లోనే, తన ఆకాంక్షల్లోనే, తన ఆరాటాల్లోనే మునిగిపోయి వుంటుంది. కాబట్టి అటువంటి మనసుకు అవగాహన సాధ్యపడదు అన్నది స్పష్టం. అటువంటి మనసు అందుకోవడానికి సిద్ధంగా లేదు.

సత్యాన్ని ఆవిష్కృతం చేసుకోవడం ద్వారా మాత్రమే సంతోషం కలుగుతుంది ఆవిష్కృతం చేసుకోవాలంటే తనని తాను అవగాహన చేసుకోవడం తప్పనిసరి. తనని తాను అవగాహన చేసుకోవడానికి అవగాహన చేసుకోవాలనే దీక్ష వుండాలి. ఆ దీక్ష వలన విచారణ చేసే మనసు కలుగుతుంది. అప్రమత్తతతో ఎరుకగా వున్న మనసు - అంటే ఖండించడం గానీ, ఇది ఫలానా అని పేరు పెట్టడం గానీ, సమర్థించడంగానీ చేయని మనసు తయారవుతుంది. అటువంటి ఎరుకవల్ల సమస్య నుండి తక్షణమే విడుదల కలుగుతుంది. కాబట్టి మన అన్వేషణ సమస్యకి సమాధానం వెదకడం కోసం కాదు. అసలు సమస్యనే అవగాహన చేసుకోవడం కోసం. ఇక ఆ సమస్య బయట ఎక్కడో లేదు - అది మీరే, సమస్యే మీరు. సమస్యని అర్థం చేసుకోవాలంటే సమస్యని సృష్టించిన వాడిని - అంటే మీరే - అతనిని అవగాహన చేసుకోవాలంటే మీరు ఏమిటో, ఆ మిమ్మల్ని, ప్రతిరోజూ అప్పటికప్పుడే, ప్రయత్న రహితంగా కనిపెడుతూ వుండాలి. ఎందుకంటే, మీ ప్రతిస్పందనలు ఏ క్షణంలో పైకి లేస్తాయో ఆ క్షణంలో మాత్రమే వాటిని మీరు అవగాహన చేసుకోగులుగుతారు. అయితే, మీ ప్రతిస్పందనలను వామపక్షం వైపు గానో, మరో పక్కగానో, ఏదో ఒక ప్రత్యేక నమూనాలోకి కనుక శిక్షణ నిచ్చి తిప్పి వుంటే, ఒక ప్రత్యేకమైన ప్రవర్తనా నియమావళిని అనుసరిస్తూ వుంటే, అప్పుడు మీ ప్రతిస్పందనలను మీరు కూడా కనిపెట్టలేరు. ప్రయోగం చేసి చూడండి. ప్రతి ఒక్క ప్రతిస్పందనా పైకి లేస్తున్నప్పుడు దాని ఎడల ఎరుకగా వుండటం ద్వారా, ఖండించడం గానీ, సమర్థించడం గానీ లేకుండా చూడటం ద్వారా, ఆ ప్రతిస్పందనలో వున్న మొత్తం అంతరార్థాన్ని చివరంటా చూడటం ద్వారా, మీ ప్రతిస్పందనలను మీరు పూర్తిగా కనిపెట్టగలుగుతారు. ప్రతిస్పందన నుండి విడుదల పొందడంలోనే స్వేచ్ఛ వున్నది. ఆ ప్రతిస్పందనను క్రమశిక్షణలో పెట్టడంలో లేదు.

కాబట్టి, మనసుని, అంటే మిమ్మల్ని - మీరు అవగాహన చేసుకోనంతవరకు మానవ అస్తిత్వం వెనకవున్న ముఖ్యోద్దేశ్యం ఏమిటి అనే ఈ విచారణకూ, ఒక యదార్థతత్వం వున్నదా లేదా అన్న మన ప్రశ్నకూ ఏమాత్రం అర్థం వుండదు. ఈ సమస్య చాలా పెద్దది, చాలా సంక్లిష్టమైనది, ఎంతో అత్యవసరమైన ప్రాధాన్యం గలదీ అయిన ఈ సమస్య మీలోనే వున్నది. మీరు తప్ప మరెవ్వరూ దానిని పరిష్కరించలేరు. ఏ గురువూ పరిష్కరించలేడు. ఏ బోధకుడూ, ఏ రక్షకుడూ, వ్యవస్థగా మారిన ఏ నిబంధనలూ

పరిష్కరించలేవు. బయటగా వున్న వ్యవస్థను ఇట్టే తోసిపారేసేయవచ్చు. ఎందుకంటే మనిషి అస్తిత్వంలో బాహ్యంగా వున్న విషయం కంటె అంతర్గతమైనది ఎక్కువ బలంగా వుంటుంది. అంతర్గతంగా వున్న దానిని అవగాహన చేసుకోకుండా, బయట వున్న దాని పద్ధతిని మార్చడం వల్ల ఏమీ లాభం లేదు. బయటగా వున్న విషయాలలో ఒక స్థిరమైన పునర్ వ్యవస్థీకరణ తీసుకొని రావాలంటే మనలో ప్రతి ఒక్కరం ముందు మనతోనే ఆరంభించాలి. అంతర్గతమైన పరివర్తన వచ్చినప్పుడు, బాహ్యంగా వున్న దానిని కూడా తెలివితోనూ, కరుణతోనూ, శ్రద్ధతోనూ మార్చివేయవచ్చును.

ప్రశ్నలు చాలా వచ్చాయి. సాధ్యమైనంతవరకు చాలావాటికి ఈ మధ్యాహ్నమే సమాధానం ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

ప్రశ్న : యువకులకు ప్రత్యేకంగా ఏదయినా సందేశం ఇస్తారా మీరు ?

కృష్ణమూర్తి : సర్, యువకులకూ, పెద్దవారికీ మధ్య అంత పెద్ద వ్యత్యాసం ఏమున్నది ? యువత – అంటే చిన్నవయసులో వున్న యువతీ యువకులు – వారిలో కనుక సజీవత్వం వుంటే – పూర్తిగా విప్లవాత్మకమైన భావాలతోనూ, అసంతృప్తితోనూ నిండిపోయి వుంటారు. ఉండరూ ? తప్పకుండా అట్లాగే వుండి వుంటారు. లేకపోతే వాళ్ళు వృద్ధుల కిందే లెక్క. దయచేసి దీనిని తేలిగ్గా తీసుకోకండి, కాబట్టే అంగీకరించనూ వద్దు, నిరాకరించనూ వద్దు. మనం జీవితం గురించి చర్చించుకుంటున్నాం – నేను వేదిక మీదకు ఎక్కి మిమ్మల్ని సంతోష పెట్టడానికి గానీ, నన్ను నేను సంతోష పెట్టుకోవడానికి గానీ వుపన్యాసం ఇవ్వడం లేదు.

నేను చెప్పినట్లుగా, యువకుల్లో కనుక విప్లవాత్మకమైన అసంతృప్తి లేకపోతే, వారికి వయసుకు ముందే వృద్ధాప్యం వచ్చిందనమాట. వృద్ధులు ఎవరూ అంటే ఒకప్పుడు అసంతృప్తితో వుండి, ఇప్పుడు సర్దుకుపోయి స్థిమితపడినవారు. వారికి భద్రత కావాలి. సుస్థిరత్వం కావాలి, వారి వుద్యోగాలకీ, వారి ఆత్మలకీ కూడా. ఆలోచనల్లోనూ, పరస్పర సంబంధాల్లోనూ, ఆస్తిపాస్తుల్లోనూ స్థిరత్వం, ఒక నిశ్చిత స్థితి కావాలి. మీలో కనుక, యువకులైన మీలో కనుక శోధించాలనే వుత్సాహం వుంటే విషయాల్లోని అసలైన సత్యాన్ని తెలుసుకోవాలనుకుంటారు. వామపక్షపు రాజకీయ చర్యల్లో గాని, మరో పక్షపు రాజకీయ చర్యల్లో గాని వున్న నిజానిజాల్ని తెలుసుకోవాలనుకుంటారు. సంప్రదాయం కనుక మిమ్మల్ని బంధించి వుంచకపోతే, అప్పుడు మీరు ప్రపంచాన్ని పునరుజ్జీవింప చేస్తారు. ఒక కొత్త నాగరకతకు, ఒక కొత్త సంస్కృతికి సృష్టికర్తలవుతారు. అయితే, తక్కిన మనందరిలాగే, పాతతరం వారిలాగే యువకులు కూడా భద్రతా, నిశ్చితత్వం

కావాలనుకుంటారు. వారికీ వుద్యోగాలు కావాలి. తినడానికి ఆహారం కావాలి, దుస్తులూ, వుండటానికి ఇళ్ళూ కావాలి. తమ తల్లిదండ్రుల మాటతో విభేదించడం వారికి ఇష్టం వుండదు. ఎందుకంటే అది సమాజాన్ని ధిక్కరించినట్లవుతుంది. కాబట్టి వాళ్ళు గాడిలో పడిపోతారు. పెద్దవారి ఆధిపత్యానికి తల ఒంచుతారు. అప్పుడు ఇక ఏమవుతుంది ? విచారణ, అన్వేషణ, అవగాహన అనే ఆ అగ్నిజ్వాల, ఆ అసంతృప్తి సన్నగిల్లి చప్పబడుతుంది. ఇప్పుడది కేవలం ఒక పెద్ద వుద్యోగం కోసమో, లాభసాటి అయిన పెళ్ళి సంబంధం కోసమో, డిగ్రీ చదువుల కోసమో కాంక్షగా మారుతుంది. ఈవిధంగా యువకుల్లోని అసంతృప్తి నీరుగారి పోతుంది. మరింత ఎక్కువ భద్రత కోసం కోరికగా మారిపోతుంది. అసలు పెద్దవారికి కానీ, యువకులకు కానీ అవసరమైనది ఏమిటంటే పూర్తిగా, సంపూర్ణంగా జీవించడం. అయితే, చాలా కొద్దిమంది మాత్రమే ఈవిధంగా సంపూర్ణంగా జీవించాలనుకుంటారు. పూర్తిగానూ, సంపూర్ణంగానూ జీవించాలంటే స్వేచ్ఛ వుండి తీరాలి తప్ప ఆధిపత్యానికి లొంగిపోవడం వుండకూడదు. అంతే కాకుండా, సత్‌గుణం వున్నప్పుడే స్వేచ్ఛ వుంటుంది. సత్‌గుణశీలం అంటే మరొకరిని అనుకరించడం కాదు. సత్‌గుణం అంటే సృజనాత్మకంగా జీవించడం. అంటే, సద్గుణాల వలన కలిగిన స్వేచ్ఛలో సృజనాత్మకత వుద్భవిస్తుంది. అయితే, సద్గుణాలని అలవరచుకోలేము. రోజూ అభ్యాసం చేయడం వల్లా రావు. జీవితపు చరమదశలోనూ రావు. ఇప్పుడు మీలో సద్గుణాలు వుండి, స్వేచ్ఛగా వున్నారు లేదా మీరు అట్లా లేరు. మీకు స్వేచ్ఛ ఎందుకు లేదో తెలుసుకోవాలంటే మీలో అసంతృప్తి వుండాలి. మీలో దీక్ష వుండి తీరాలి. మీ లోపల మిమ్మల్ని నడిపించే స్వీయబలం వుండాలి. విచారణ చేసే శక్తి వుండాలి. అయితే మీ శక్తినంతా లైంగిక వ్యవహారాల్లో కానీ, గొంతుచించుకొని రాజకీయ నినాదాలు వల్లించడంలో కానీ, జెండాలు వూపడంలో కానీ, కేవలం వారినీ వీరినీ అనుకరించడంలో కానీ, మంచి వుద్యోగాలు సంపాదించడం కోసం పరీక్షల్లో వుత్తీర్ణత సాధించడంలో కానీ వృథా చేసేస్తుంటారు.

అందుకని ప్రపంచం విపరీతమైన క్షోభలో మునిగివున్నది. ఎందుకంటే ఆ సృజనాత్మకత లోపించడం వల్ల. సృజనాత్మకతతో జీవించాలంటే వట్టి అనుకరణలు అంటే మార్క్సునో, బైబిలునో, భగవద్గీతనో అనుసరించడం వుండకూడదు. స్వేచ్ఛ వలన సృజనాత్మకత కలుగుతుంది. సత్‌గుణశీలత్వం వున్నప్పుడే స్వేచ్ఛ వుంటుంది. సద్గుణం కాలం అనే ప్రక్రియ వలన వచ్చే ఫలితం కాదు. మీ రోజువారీ జీవితంలో 'ఉన్నది'ని అవగాహన చేసుకుంటున్నప్పుడు సద్గుణశీలత్వం కలుగుతుంది. అందువల్ల పెద్దవారికీ, యువకులకీ మధ్యన ఈ విభజన నాకు అర్థం లేనిదిగా కనబడుతుంది. సర్ ! పరిపక్వత వయసుకి సంబంధించిన విషయం కాదు. మనం చాలామందిమి వయసులో

పెద్దవారమైనా, మనలో కుర్రతనం పోలేదు. సమాజం ఏమనుకుంటుందో అని భయం, గతాన్ని గురించి భయం. వయసులో పెద్దవారయిన వారు శాశ్వతత్వాన్నీ, ధైర్యాన్ని అనునయవాక్యాల్నీ కోరుకుంటారు. యువకులకి కూడా భద్రత కావాలి. కాబట్టి పెద్దవారికీ, యువకులకీ మధ్య అంతగా వ్యత్యాసమేమీ లేదు. నేను ముందు చెప్పినట్లుగా పరిపక్వత వయసుతో రాదు. పరిపక్వత అవగాహన వల్ల కలుగుతుంది. సంఘర్షణ నుంచీ, బాధలనుంచీ మనం తప్పించుకొని పారిపోతున్నంతవరకూ అవగాహన వుండదు. సుఖాన్ని కోరుకుంటుంటే, ఆదర్శాన్ని కోరుకుంటుంటే బాధల నుండి పారిపోతున్నట్లే. అయితే, యువ వయసులో వున్నప్పుడే మనం నిజంగా, హృదయ పూర్వకంగా, వుద్దేశ్యపూర్వకంగా విచారణ చేయకలుగుతాం. వయసు పైబడుతున్నకొద్దీ జీవితం మనల్ని విసిగించేస్తుంది. మనం మరీ మరీ జడంగా తయారవుతూ వుంటాం. అనవసరంగా మన శక్తినంతా వృధా చేసుకుంటూ వుంటాం. ఈ శక్తిని విచారణ చేయడం కోసమూ, యదార్థతత్వాన్ని కనిపెట్టడం కోసమూ సేకరించి వుంచాలంటే చాలా ఎక్కువగా అధ్యయనం చేయవలసి వుంటుంది. ఒక ప్రణాళికకు లోబడి నేర్చుకోవడం, నేర్చుకోవడం అవదు – అది అసలు అధ్యయనమే కాదు. కేవలం పరీక్షల్లో వుత్తీర్ణత సాధించడం విద్యాధ్యయనం కాదు. ఎంతటి బుద్ధిహీనుడైనా పరీక్షలు రాసి పాసవచ్చు. దానికి కావలసింది ఒక రకమైన బుర్ర. అయితే, గాఢంగా విచారణ చేసి, జీవితం అంటే ఏమిటి, ఈ అస్తిత్వానికి ఆధారం ఏమిటి అనేవి తెలుసుకోవడానికి చాలా అప్రమత్తమైన, సునిశితమైన మనసు కావాలి. అయితే మనసును లొంగిపోయి వుండమని ఒత్తిడి చేసినప్పుడు, దాని మృదుత్వం కోల్పోతుంది. కానీ, మన సమాజ నిర్మాణం మొత్తం నిర్బంధాల మీదే ఆధారపడి వున్నది. నిర్బంధాలు ఎంత సూక్ష్మరూపంలో నర్మగర్భంగా వున్నప్పటికీ, అటువంటి నిర్బంధాల ద్వారా మాత్రం అవగాహన జరగదు.

ప్రశ్న : మీలో వున్న ఈ ఆత్మవిశ్వాసం భయం నుండి మీరు పూర్తిగా విముక్తి పొందడం వలన వచ్చిందా, లేక మీకు వెనక బుద్ధుడు, ఏసుక్రీస్తువంటి గొప్ప మహాత్ముల బలం వున్నదనే గాఢనమ్మకం వల్ల కలిగిందా ?

కృష్ణమూర్తి : సర్ ! ముందుగా ఇది చెప్పండి, అసలు ఆత్మవిశ్వాసం అనేది ఎట్లా కలుగుతుంది ? స్వీయనమ్మిక అనేది రెండు రకాలుగా వుంటుంది. సాంకేతిక పరిజ్ఞానం సంపాదించడం వలన ఒక స్వీయ నమ్మకం వస్తుంది. ఒక మెకానిక్కు, ఇంజనీరు, భౌతికశాస్త్రవేత్త, ఫిడేలు వాయించడంలో ప్రావీణ్యం సంపాదించిన వ్యక్తి – వీళ్ళంతా అనేక సంవత్సరాలు అధ్యయనం చేసి, అభ్యాసం చేసి, ఒక ప్రత్యేకమైన కౌశల్యాన్ని సాధించారు. కాబట్టి వారిలో ఒక స్వీయ విశ్వాసం వుంటుంది. ఇదంతా ఒక

రకమైన స్థయిర్యం - ఈ నమ్మకం కేవలం పైపైన వుండేదీ, సాంకేతికమైనదీ. అయితే మరో రకమైన స్థయిర్యం వుంది. అది స్వీయజ్ఞానం వలన, తనని తాను సమస్తంగా - అంటే, వ్యక్తచేతననూ, అవ్యక్త చేతననూ, అజ్ఞాత మానసాన్నీ, కనబడుతున్నదానినీ కూడా తెలుసుకోవడం వలన కలిగేది. మిమ్మల్ని మీరు సంపూర్ణంగా తెలుసుకోవడం సాధ్యమేనని నేను అంటున్నాను. అప్పుడు ఒక ఆత్మవిశ్వాసం - దౌర్జన్య పూరితమైనది కానిదీ, తన వ్యక్తిత్వ ప్రాబల్యాన్ని ప్రదర్శించేది కానిదీ, గడుసుదనం కానిదీ అయిన మరొక రకం విశ్వాసం మీలో కలుగుతుంది. ఈ నమ్మకం ఏదైనా సాధించడం వలన కలిగేటటువంటి నమ్మకం కాదు. ప్రతి క్షణమూ విషయాలను వున్నవి వున్నట్లుగా, వికృతీకరించకుండా చూడటం అనే ఆత్మవిశ్వాసం ఇది. తన ఆలోచనలు వ్యక్తిగతమైన కార్యసాధన మీదా, తన స్వీయఘనత మీదా, తన స్వంత విమోచనం మీదా ఆధారపడనప్పుడు, ప్రతి విషయమూ, తన అసలైన అర్థాన్ని తెరచి చూపినప్పుడు అటువంటి స్థైర్యం కలుగుతుంది. అప్పుడు వివేకం - అది బుద్ధుడిది కానివ్వండి, ఏసుక్రీస్తుది కానివ్వండి - ఆ వివేకం మిమ్మల్ని నిలబెడుతుంది. అటువంటి వివేకమూ, స్వీయనమ్మికా, ఎంతో చురుకైన మెత్తదనం గల మనసూ ప్రత్యేకమైన ఏ కొందరి సొత్తూకాదు. అవగాహన చేసుకోవడంలో అధికారశ్రేణులు లేవు. సంబంధ బాంధవ్యాలలో వున్న సమస్యను - భౌతికమైన వస్తువుల సమస్య కావచ్చు, భావాలది అవచ్చు, లేదా మీ ఇరుగు పొరుగుతో అవచ్చు - ఆ సమస్యను అర్థం చేసుకున్నప్పుడు - ఆ అవగాహన వలన కాలం, అంతస్థులూ, అధికారాలూ అనే వాటినుండి మీకు స్వేచ్ఛ లభిస్తుంది కాబట్టి అప్పుడు గురువూ, శిష్యుడూ వుండరు ; గురువుగారు వేదిక మీదా మీరు కిందా కూర్చోవడం వుండదు. సర్, అటువంటి ఆత్మవిశ్వాసమే ప్రేమ, ఆప్యాయత ; మీరు ఒకరిని ప్రేమిస్తున్నప్పుడు వ్యత్యాసాలు వుండవు. ఒకరు గొప్ప కాదు ఒకరు చిన్న కాదు. ప్రేమ వున్నప్పుడు, ఈ అద్భుతమైన జ్వాల వెలుగుతున్నప్పుడు, అదే దాని శాశ్వతత్వం.

ప్రశ్న : యదార్థాన్ని సౌందర్యం ద్వారా చేరగలమా ? లేక సత్యం విషయంలో సౌందర్యం నిస్సారమైనది కాబట్టి దానివలన లాభం లేదంటారా ?

కృష్ణమూర్తి : సరే, అసలు సౌందర్యం అంటే ఏమిటి మీ అర్థంలో ? సత్యం అంటే ఒక అలంకారం కాదు, అందులో సందేహం లేదు, కదా ; కేవలం శరీరాన్ని అలంకరించుకోవడం సౌందర్యం కాదు. మనందరికీ అందంగా వుండాలనే వుంటుంది. ఇతరుల దృష్టికి చక్కగా కనబడాలనే వుంటుంది. అయితే సౌందర్యం అంటే అర్థం అది కాదు. పొందికగా, శుచిగా, శుభ్రంగా, మర్యాదా మన్ననా చూపుతూ వుండటం

మొదలైనవి సౌందర్యంలో ఒక భాగం, అంతే కదూ ? అయితే ఇవి అంతర్గతంలో వికృతత్వాన్ని వదుల్చుకుంటున్నప్పుడు బయటకు వ్యక్తమవుతున్న విషయాలు మాత్రమే. సరే, ప్రపంచంలో ఏం జరుగుతున్నది ? బాహ్యమైనదానిని అలంకరించడం రోజు రోజుకీ ఎక్కువైపోతున్నది. సినిమాతారలూ, వారిని అనుకరిస్తున్న మీరూ బాహ్యాలంకరణ చేసుకొని అందంగా కనబడతారు. అయితే లోపల కనుక ఏమీ లేకపోతే, బాహ్యాలంకరణాలూ, ఇంకా రకరకాలైన ఆభరణాలూ సౌందర్యం కాదు. సర్, ఆ ఆంతరికమైన స్థితి – ప్రేమనూ, దయాగుణాన్నీ, ఔదార్యాన్నీ, క్షమాగుణాన్నీ పొదుగుకొని వున్న ఆ ఆంతరిక ప్రశాంతత మీకు తెలియదూ ? అటువంటి స్థితిలో వుండటమే సౌందర్యంలోని అసలు సారాంశం అని స్పష్టంగా తెలుస్తున్నది. అది లేకుండా కేవలం పైపైన అలంకరించుకోడం అంటే ఇంద్రియ సంబంధమైన విలువలకు, ఇంద్రియ స్పందనలకు సంబంధించిన విలువలకు ప్రాధాన్యం ఇవ్వడం. ఈ ఇంద్రియ సంబంధమైన విలువలను పెంచిపోషించుకోవడం వల్ల – మనం ఇప్పుడు చేస్తున్నది అదే – సంఘర్షణలూ, యుద్ధాలూ, సర్వనాశనమూ తప్పవు.

మన ప్రస్తుత నాగరికత లక్షణమే బాహ్యమైన దానిని అలంకరించడం. ఈ నాగరికత పారిశ్రామీకరణ మీద ఆధారపడి వున్నది. నేను పారిశ్రామీకరణకి వ్యతిరేకినని అనుకోకండి – ఈ పరిశ్రమలను లేకుండా చేయాలనుకోవడం బుద్ధిహీనత. అయితే, ఆంతరికమైన దానిని అవగాహన చేసుకోకుండా కేవలం బాహ్యమైన దానిని పెంచుకోవడం వల్ల మనుష్యులు తమ పరస్పర వినాశనానికి పూనుకొనేరకం విలువలను సృష్టించుకోవడం తప్పకుండా జరుగుతుంది. ప్రపంచంలో ప్రస్తుతం సరిగ్గా అదే జరుగుతున్నది. కొనడానికీ, అమ్మడానికీ, రంగులు పులమడానికీ దొరికే అలంకరణ వస్తువుగా సౌందర్యాన్ని పరిగణిస్తున్నారు. ఇది సౌందర్యం కాదని నిస్సందేహంగా చెప్పొచ్చు. సౌందర్యం ఒక అస్తిత్వ స్థితి. ఆంతరికమైన సుసంపన్నత వున్నప్పుడే ఆస్థితి కలుగుతుంది – అంటే సద్గుణాలను, సదాశయాలను పోగుచేసుకొని అదే సంపద అని అనుకోవడం కాదు. అది కాదు సౌందర్యం అంటే. ఎన్నటికీ చెడిపోని, అక్షయ సంపదలు గలిగిన సుసంపన్నతా, ఆంతరిక సౌందర్యమూ మనసు స్వేచ్ఛగా వున్నప్పుడే సిద్ధిస్తాయి. భయం లేనప్పుడే మనసు స్వేచ్ఛగా వుండగలుగుతుంది. స్వీయజ్ఞానం ద్వారా భయాన్ని అవగాహన చేసుకోగలుగుతాం తప్ప భయాన్ని నిరోధించడం ద్వారా అవగాహన రాదు. భయాన్ని, అంటే ఏ రూపంలో వున్న వికృతత్వాన్ని అయినా సరే, ప్రతిరోధించినప్పుడు, అడ్డంగా ఒక గోడను కట్టుకున్నట్లు మాత్రమే అవుతుంది. ఆ గోడ వెనకాల మీకు స్వేచ్ఛ వుండదు. మీరు ఏకాకిగా వుండిపోతారు. ఇట్లా విడిగా ఏకాంతవాసం చేయడంలో సంపన్నతకి ఆస్కారం లేదు, సంపూర్ణతకి ఆస్కారం వుండదు. కాబట్టి, అత్యంత

ప్రధానమైన సత్‌గుణాల రూపంలో యదార్థతత్వం తనని సాకారపరచుకున్నప్పుడు మాత్రమే సౌందర్యానికి యదార్థతత్వంతో పరస్పర సంబంధం వుంటుంది.

సరే, సత్యం అనీ దైవం అనీ మీరు అంటున్నదానికి అర్థం ఏమిటి ? ఒక సూత్రరూపంలో దానిని చెప్పలేమని స్పష్టంగా తెలుస్తున్నది. ఎందుకంటే, సూత్రాలలో ఇమిడేది యదార్థమైనది కాదు , అది మనసు సృష్టించినదీ, ఆలోచనా ప్రక్రియకు ఫలితంగా వచ్చినదీ అవుతుంది. ఆలోచన స్మృతికి ప్రతిస్పందన. పరిపూర్ణం అవని అనుభవాల అవశేషమే స్మృతి. కాబట్టి సత్యం అనీ, దైవం అనీ, లేదూ ఏ పేరుతో పిలుస్తున్నా సరే, అది అజ్ఞేయం, తెలియనిది, దానిని సూత్రీకరించలేము. అజ్ఞేయమైనది వుండాలంటే, మనసే తనకు తెలిసినదానితో వున్న బంధాన్ని తొలగించుకోవాలి. అప్పుడు సౌందర్యానికీ, యదార్థతత్వానికీ మధ్య పరస్పర బాంధవ్యం వుంటుంది. అప్పుడు యదార్థతత్వమూ, సౌందర్యమూ వేరువేరుగా వుండవు. అప్పుడు సత్యమే సౌందర్యం. అది ఒక చిరునవ్వులో వుండచ్చు, పక్షి చేసే ఆకాశయానంలో వుండచ్చు, పాప ఏడుపులో, లేదూ మీ భార్య లేక భర్తల కోపంలో వుండచ్చు. 'ఉన్నది' లోని సత్యాన్ని తెలుసుకోవడం మంచిదే. అయితే ఆ సత్యంలో సౌందర్యాన్ని తెలుసుకోవడానికి, మనసు అవగాహన చేసుకోగలిగినదై వుండాలి. అయితే కట్టుబాట్లకు కట్టివేసుకొని వున్న మనసు, భయపడుతున్న మనసు దేనినయినా తప్పించుకొని తిరుగుతున్న మనసు అవగాహన చేసుకోలేదు. ఈ తప్పించుకోవడమే బాహ్యామైన అలంకరణగా, ఆభరణాలు అలంకరించుకోవడంగా రూపుతాలుస్తుంది. అంతర్గతంలో సమృద్ధంగా లేకపోవడం వలన, లోపల లేమి వుండటం వలన, బాహ్యంలో అందంగా తయారవాలని ప్రయత్నిస్తాం. చక్కటి ఇళ్ళు కట్టుకుంటాం. రకరకాల నగలు కొనుక్కుంటాం. స్వంతానికి ఎన్నో పోగుచేసుకుంటాం. ఇవన్నీ కూడా ఆంతరికమైన లేమికి సంకేతాలు. అట్లాగని మంచి చీరలు, చక్కటి ఇళ్ళూ మనకి వుండకూడదని కాదు. ఆంతరికమైన సంపన్నత లేకుండా వాటికి అర్థం లేదు. ఆంతరికమైన సంపన్నత లేదు కాబట్టి బాహ్యామైన వాటిని పెంచిపోషిస్తాం. అందుకని బాహ్యామైన వాటిని అలవరచుకోవడం విధ్వంసానికి దారి తీస్తున్నది. అంటే, ఇంద్రియ సంబంధిత విలువలను పోషిస్తే వాణిజ్యం అవసరం అవుతుంది. దాని విస్తీర్ణం పెంచడం అవసరం అవుతుంది. పరిశ్రమలను పెంపుజేయడం అవసరం అవుతుంది. పోటీలు పడి పరిశ్రమలను పెంపుచేయడం అంటే మళ్ళీ వాటిమీద నిర్బంధాలు కూడా ఎక్కువ చేయాలి. ఈ నిర్బంధాలు వామపక్షపువో మరో పక్షం నిర్ణయించేవో అయివుంటాయి. ఇవన్నీ తప్పకుండా యుద్ధాలకు దారితీస్తాయి. మనం మళ్ళీ ఈ యుద్ధ సమస్యలను ఇంద్రియ సంబంధిత విలువలు ఆధారంగా పరిష్కరించాలని ప్రయత్నిస్తాం.

సత్యాన్ని అన్వేషించేవాడే సౌందర్యాన్వేషకుడు కూడా - వాళ్ళిద్దరూ విభిన్నులు కారు. సౌందర్యం అంటే వట్టి బాహ్యాలంకరణ, వేషభూషణాలూ కాదు. అది అంతరికమైన అవగాహన ఇచ్చే స్వేచ్ఛ ద్వారా, 'ఉన్నది'ని గ్రహించడం ద్వారా కలిగే ఆ సుసంపన్నత.

ప్రశ్న : మతాన్నెందుకు మీరు నిరసిస్తున్నారు ? మతంలో ఎంతో కొంత సత్యం వున్నదని స్పష్టంగా తెలుస్తున్నది కదా ? చుట్టూ బురద వున్నదని తామరపూవునే వద్దనుకుంటామా ? సత్యం ఎక్కడ వున్నా మనం గుర్తించి తీరాలి కదూ ?

కృష్ణమూర్తి : సర్ ! మతం అంటే మీ అర్థం ఏమిటసలు ? ఆచారాలుగా మారిన మూఢవిశ్వాసం, నమ్మకాలూ, పూజాపునస్కారాలూ, ప్రతి గొప్పవాడినీ ఆరాధించడం, ప్రార్థనలు జరపడం, శాస్త్రాలు వల్లించడం, బైబిల్లో నుంచి వుల్లేఖించడం - ఇదేనా మతం అంటే. సత్యం కోసమో, దైవం కోసమో అన్వేషించడమా ? వ్యవస్థగా ఏర్పడిన విశ్వాసాలతో దైవాన్ని కనిపెట్టగలమా ? హిందువులం అని ఒక పేరు పెట్టుకొని, హిందూమతంలో వుండే లేదా మరో సిద్ధాంతంలో వుండే పూజలూ, తంతులూ అన్నీ ఆచరించడం వల్ల దైవాన్ని కానీ, సత్యాన్నీ కానీ మీరు కనుక్కోగలుగుతారా ? నేను నిరసిస్తున్నది మతాన్ని కానే కాదు. యదార్థతత్వ అన్వేషణనీ కాదు. నేను నిరసిస్తున్నది మూఢవిశ్వాసాలతో, విచ్ఛిన్నకర శక్తులతో, ప్రభావాలతో కూడుకొని వ్యవస్థగా అంటే ఆచారాలుగా ఏర్పడిన నమ్మకాలను. మనం యదార్థతత్వాన్ని అన్వేషించకుండా, వ్యవస్థగా ఏర్పడిన నమ్మకాల వలలో, పూజానుష్ఠానాల, మంత్రజపాల వలలో చిక్కుకొనిపోయి వున్నాం, ఆ వ్యవహారమంతా మీకు బాగానే తెలుసు - అదంతా వట్టి చెత్త అని నేనంటాను. ఎందుకంటే, అన్వేషణ చేయకుండా మనసుని దారి మళ్ళించే మత్తుమందులు అవన్నీ. పారిపోయే మార్గాల్ని మీ చేతికందిస్తాయి. ఆవిధంగా మనసుని జడంగా, ఎందుకూ పనికి రాకుండా చేసేస్తాయి.

కాబట్టి, ఆధిపత్యాలు, మతాచార్యులు, గురువులు మొదలైన పద్ధతులతో నిండిపోయి వున్న ఈ నమ్మకాల వ్యవస్థలో మన మనసులు చిక్కుకొనిపోయి వున్నాయి. కాబట్టి - అసలు భయంవల్లా, నిశ్చితత్వం కోసం ఆరాటపడటం వల్లా ఇవన్నీ పుట్టుకొచ్చాయి - అటువంటి వలలో చిక్కుకునిపోయి వున్నాం కాబట్టి ప్రతిదానినీ ఆమోదించడానికి వీల్లేదు. ప్రశ్నిస్తూ, విచారణ చేస్తూ వుండాలి. నేరుగా చూసి, ప్రత్యక్షంగా అనుభవంలోకి తెచ్చుకొని చూసి, అసలు మనం చిక్కుకొనిపోయినది ఎందులో అన్నదానిని, ఎందుకు చిక్కుకొనిపోయాం అన్నదానిని పరికించాలి.

మునుపెప్పుడో మా ముత్తాతగారు ఈ పూజాకర్మకాండలన్నీ చేశారు కాబట్టీ, నేను చేయకపోతే మా అమ్మ ఏడుస్తుంది కాబట్టీ నేనూ, అవన్నీ చేసి తీరాలి. ఇటువంటి వ్యక్తికి, మానసికంగా ఇతరుల మీద ఆధారపడిన వాడికి, ఆ కారణంగా భయస్థుడుగా మారిన వాడికి నిస్సందేహంగా సత్యాన్ని కనిపెట్టగలిగిన సమర్థత వుండదు. దానిని గురించి అతను మాట్లాడవచ్చుగాక, దేవుడి పేరు లక్షలసార్లు వల్లె వేయచ్చుగాక, అయినా సరే అతడు ఎక్కడో వుంటాడు, యదార్ధతత్వాన్ని అతడు సమీపించలేడు. తన అపోహలు, తన భయాలు అనే కవచంతో తనని తాను గట్టిగా మూసివేసుకున్నాడు కాబట్టి అతనిని యదార్ధతత్వం దూరంగా వుంచుతుంది. మతం ఇటువంటి ఈ సంప్రదాయంగా, వ్యవస్థగా మారడానికి బాధ్యత మీదే. - మీరు తూర్పుదేశాల వారవచ్చు, పాశ్చాత్యులవచ్చు, వామపక్షం వారవచ్చు, మరో పక్షపు వారవచ్చు. ఇదంతా అధిపత్యం చేసే పెత్తనం మీద ఆధారపడినది కాబట్టి మనిషిని మనిషి నుండి విడదీసింది. అధిపత్యం మీద. అది గతం లోనిది కానీ, వర్తమానంలోనిది కానీ కానివ్వండి - దానిమీద మీరు ఎందుకు ఆధారపడతారు ? మీలో గందరగోళం, అయోమయం వుంది కాబట్టి, మీలో బాధా, ఆందోళనా, మీలో ఒంటరితనమూ దుఃఖమూ వున్నాయి కాబట్టి మీరు మరొకరి అధిపత్యాన్ని కోరుతున్నారు. అందుకని బయటనుండి సహాయం రావాలని మీరు కోరుకుంటారు. అందుకే మీరు ఆధిపత్యాన్ని - అది రాజకీయాల్లో అవచ్చు, ఆధ్యాత్మిక రంగంలో కావచ్చు - తయారు చేస్తున్నారు. ఆధిపత్యాన్ని తయారు చేశాక, ఇక దాని ఆదేశాలను అనుసరిస్తుంటారు. ఆవిధంగా మీలో వున్న అయోమయమూ, ఆందోళనా, మీ హృదయంలో వున్న బాధా తొలగిపోతాయని ఆశిస్తారు . మీ బాధలనీ, మీ దుఃఖాన్నీ మరొకరు తీసివేయగలరా ? దుఃఖాన్నుంచి దూరంగా పారిపోవడానికి ఇతరులు మీకు సహాయం చేయచ్చు. కానీ దుఃఖం మాత్రం ఎప్పటికీ అట్లాగే వుండిపోతుంది.

కాబట్టి, అధిపత్యాన్ని సృష్టిస్తున్నది మీరే. ఆధిపత్యాన్ని తయారు చేశాక, ఇక దానికి మీరు దాస్యం చేస్తారు. ఆధిపత్యానికి పుట్టిన ఫలితమే విశ్వాసం. గందరగోళం నుంచి తప్పించుకొని పారిపోవాలని మీరు చూస్తారు కాబట్టి, విశ్వాసంలో చిక్కుకొనిపోతారు. ఆవిధంగా ఇంకా గందరగోళంలోనే కొనసాగుతూ వుంటారు. ఈ మీ గందరగోళంలో నుంచి పుట్టిన వారే మీ నాయకులు. కాబట్టి అసలు వాళ్ళు కూడా గందరగోళంలోనే మునిగివుంటారు. మీలో స్పష్టత కనుక వుంటే, మీలో అయోమయం లేకపోతే, మీరే ప్రత్యక్షంగా అనుభూతి చెందుతూవుంటే మరొకరిని మీరు అనుసరించరు. మీరు గందరగోళంలో పడివున్నారు కాబట్టే నేరుగా అనుభవాన్ని పొందలేక పోతున్నారు. మీ గందరగోళంలో నుండే నాయకుడినీ, మతవ్యవస్థనూ, విభజనకు కారణమైన పూజా

విధానాలని తయారు చేస్తున్నారు. దాని వల్లనే ప్రస్తుతకాలంలో ప్రపంచమంతటా విస్తరించివున్న ఈ కక్షలూ, కలహాలూ పుట్టుకొస్తూ వున్నాయి. భారతదేశంలో ఇది హిందువులకూ, ముస్లిములకూ మధ్య మతకలహాల రూపం తాల్చింది. యూరపులో అది కమ్యూనిస్టులను మితవాదులకు (రైటిస్టులకు) విరుద్ధంగా నిలబెట్టింది. ఇంకా ఇటువంటివే ఎన్నో. మీరు ఇదంతా జాగ్రత్తగా పరికించి చూస్తే, విశ్లేషించితే, ఇదంతా ఆధిపత్యం మీద ఆధారపడి తయారయిందని గ్రహిస్తారు. ఒక వ్యక్తి ఏదో అంటాడు. ఇంకో వ్యక్తి మరొకటి అంటాడు. మనకి అంతా అయోమయంగా వుంటుంది అందుకని ఆధిపత్యస్థానంలో నిలబెట్టడానికి ఒకరిని మనం తయారు చేస్తాం. మాటల్లో చెప్పినప్పుడు చాలా సులువుగా, ఇంతేనా అనిపిస్తుంది. కానీ, లోతుగా చూస్తే అది అంత సామాన్యమైనది కాదు ; విపరీతమైన సంక్లిష్టతతో కూడుకున్నది. మీరు గందరగోళ స్థితిలో వున్నారు కాబట్టి, అందులో నుండి ఎవరయినా మిమ్మల్ని బయటకు లాగాలని ఆశిస్తారు. అంటే అర్థం ఈ గందరగోళం అనే సమస్యను మీరు అవగాహన చేసుకోలేదనీ, కేవలం పలాయనాన్నే మీరు అభిలషిస్తున్నారనీ. గందరగోళాన్ని అవగాహన చేసుకోవాలంటే, ఈ గందరగోళాన్ని తయారు చేస్తున్న వ్యక్తిని అర్థం చేసుకోవాలి. అది ఎవరో కాదు. మీరే. మిమ్మల్ని మీరు అర్థం చేసుకోకుండా, మరొకరిని అనుసరించడం వలన జరిగే మంచి ఏమిటి ? గందరగోళంలో పడివుండి, ఏదో ఒకదానిని అభ్యాసం చేసో, వ్యవస్థగా మారిన మతం ద్వారానో సత్యాన్ని కనిపెట్టగలమనుకుంటున్నారా ? ఉపనిషత్తులు, గీత, బైబిలూ ఇంకా ఎన్నో పుస్తకాలు మీరు అధ్యయనం చేసి వుండచ్చు. కానీ అందులో వుండే సత్యాన్ని మీ ఈ గందరగోళ స్థితిలో కనిపెట్టడం మీ చేతనవుతుందా ? మీ గందరగోళాన్ని బట్టీ, మీ ఇష్టాయిష్టాలని బట్టీ, మీ మీ అపోహలను బట్టీ, మీ నిబద్ధతను అనుసరించీ మీరు చదివిన దానికి అర్థం చెప్పుకుంటారు, అంతే. మీ ఈ వైఖరి యదార్థతత్వం వైపు లేదనడంలో సందేహం లేదు. సత్యాన్ని కనిపెట్టడమంటే సర్ ! మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం. అప్పుడు సత్యం మీ వద్దకు వస్తుంది, మీరు సత్యం వద్దకు వెళ్ళనవసరం లేదు. అదీ అందులో వున్న సౌందర్యం. మీరే సత్యం వద్దకు వెళ్తే, మీ లోపల మీరు చిత్రించుకున్న దానినే మీరు చేరుకుంటారు. కాబట్టి అది సత్యం కాదు. అప్పుడది కేవలం మిమ్మల్ని మీరు సమ్మోహంలో పడవేసుకునే ఆత్మభ్రమ అవుతుంది. అదే మతం అనే వ్యవస్థ. సత్యాన్ని కనిపెట్టాలంటే, సత్యం మీ వద్దకు రావాలంటే, మీలో వున్న మీ అపోహలనూ, అభిప్రాయాలనూ, ఊహలనూ, చేసుకున్న నిర్ణయాలనూ మీరు చాలా స్పష్టంగా చూసి తీరాలి. అటువంటి స్పష్టత స్వేచ్ఛ ద్వారా అంటే సద్గుణశీలత ద్వారా కలుగుతుంది. సుగుణశీలత్వం కల మనసుకి అంతటా సత్యం కనబడుతుంది. అప్పుడు మీరు ఏదో ఒక మత సంప్రదాయానికి చెందివుండరు. అప్పుడు మీరు స్వేచ్ఛగా వుంటారు.

కాబట్టి, మనసుకి స్వీకరించడం చేతనయినప్పుడే, హృదయంలో మనసుకి సంబంధించిన విషయాలన్నీ తీసివేసి ఖాళీ ఏర్పడినప్పుడు మాత్రమే సత్యం కనబడుతుంది. ప్రస్తుతం మన హృదయాలు మనసుకి సంబంధించిన విషయాలతో నిండిపోయి వున్నాయి. మనసును తనలో నుండి తొలగించుకొని విముక్తి చెందినప్పుడు హృదయం స్వీకరించడానికి సిద్దంగానూ, యదార్ధతత్వం ఎడల స్పందన శీలత్వంతోనూ వుంటుంది.

ప్రశ్న : మీ ప్రసంగాలను చాలా సంవత్సరాలుగా వింటున్న మాలో కొంతమంది మీరు చెప్పేదానితో పూర్తిగా - కనీసం మాటల్లో - అంగీకరిస్తున్నాం. అయితే, వాస్తవంలో, మాదైనిక జీవితంలో మందకొడిగా వుండిపోయాం. మీరు చెప్పే ఆ ప్రతి క్షణమూ జీవించడం జరగడం లేదు. ఆలోచనలకీ - లేదా మాటలకీ, క్రియకీ మధ్యన దాటశక్యం కాని ఇంత ఎడం ఎందుకున్నదంటారు ?

కృష్ణమూర్తి : మాటలను యోగ్యత గలవి అని మెచ్చుకోవడమే నిజమైన అవగాహన అని మనం పొరబడుతున్నామేమో అని నాకనిపిస్తుంది. మాటల్లో మనం ఒకరినొకరం అర్దంచేసుకుంటాం. పదాలను అర్ధం చేసుకుంటాం. నాలో వున్న కొన్ని ఆలోచనలను వాచ్యరూపంలో మీకు అందిస్తాను. మీరు వాచ్యస్థాయిలో వుండి అందుకుంటారు. ఆ మాటల స్థాయినుండి క్రియ జరుగుతుందని మీరు ఆశిస్తారు. కాబట్టి, మాటలని మెచ్చుకోవడం అవగాహననూ, క్రియనూ తీసుకొస్తుందా అనేది మీరే కనిపెట్టాలి. ఉదాహరణకి, మంచితనమూ, ఆప్యాయతా, ప్రేమా మాత్రమే పరిష్కారం అనీ, ఈ చీకాకులనుండి విడిపించే ఏకైక మార్గమనీ నేను అన్నప్పుడు, వాచ్యరూపంలో మీరు అర్దం చేసుకుంటారు. మీకు ఏమాత్రం ఆలోచనా శక్తి వున్నా అదంతా ఆమోదిస్తారు. సరే, అప్పుడు చర్య ఎందుకు తీసుకోరు ? దానికి చాలా స్పష్టంగా కనబడే కారణం ఏమిటంటే మాటల ప్రతిస్పందనా మేధ ద్వారా కలిగిన ప్రతిస్పందనా ఒకటే అనుకోవడం. అంటే, మేధతో ఈ భావాన్ని గ్రహించామని మీరనుకుంటారు. కాబట్టి, భావానికీ, క్రియకీ మధ్యన విభజన ఏర్పడింది. అందువల్లనే భావాలను అలవరచుకోవడం ద్వారా జరిగేది అవగాహన కాదు. దానివల్ల వ్యతిరేకతా, ప్రతికూల భావాలూ మాత్రమే తయారవుతాయి. ఇటువంటి వ్యతిరేకత వలన విప్లవాలు వస్తే రావచ్చు గాక, కానీ అది వ్యక్తిలో కానీ, తద్వారా సమాజంలో కానీ నిజమైన పరివర్తనను తీసుకొనిరాదు.

ఈ విషయాన్ని మీకు బాగా స్పష్టంగా విశదపరుస్తున్నానో లేదో నాకు తెలియదు. మనం మాటల స్దాయిలో వుండిపోయినప్పుడు, కేవలం భావాలను,

వ్యూహాలను మాత్రమే సృష్టిస్తాం. ఎందుకంటే మాటలు మనసుకి సంబంధించినవి. మాటలు గ్రహణేంద్రియాలకు సంబంధించినవి. మాటల స్థాయిలోనే కనుక మనం వుండిపోతే మాటలు కేవలం ఇంద్రియ సంబంధితమైన భావాలనీ, విలువలనీ మాత్రమే సృష్టిస్తాయి. అంటే కొన్ని భావాల సముదాయం వాటికి ప్రతికూల భావాలని సృష్టిస్తుంది. ఆ ప్రతికూల భావాలు క్రియను సృష్టిస్తాయి. అయితే ఈ క్రియ కేవలం ఒక ప్రతిచర్య మాత్రమే. అది ఒక భావానికి ప్రతిస్పందన. మనలో చాలామంది మాటల స్థాయిలోనే జీవిస్తుంటారు. మాటలే మనకి ఆహారం. భగవద్గీత ఇట్లా అంటుంది ; పురాణాల్లో అట్లా చెప్పారు ; మార్క్స్ చెప్పినది ఇదీ ; ఐన్‌స్టీన్ చెప్పింది అదీ. మాటలు భావాలని మాత్రమే వుత్పత్తి చేయగలవు తప్ప, క్రియను మాత్రం ఏనాటికీ సృష్టించలేవు. భావాలు ఒక ప్రతిచర్యను కలగచేస్తాయి తప్ప క్రియను కాదు – ఆ కారణంగానే మాటల అవగాహనకీ క్రియకీ మధ్యన ఈ ఎడం వుండిపోతున్నది.

సరే, మాటలకీ క్రియకీ మధ్యన వంతెన ఎట్లా నిర్మించాలో తెలుసుకోగోరుతున్నారు ఈ ప్రశ్న వేసినవారు. నిర్మించలేరు అని నేనంటున్నాను. మాటనీ క్రియనీ వంతెన వేసి కలపడం సాధ్యం కాదని అంటున్నాను. దయచేసి ఇందులోని ప్రాధాన్యాన్ని గమనించండి.మాటలు ఎప్పటికీ చర్యను తీసుకొనిరాలేవు. మాటల వల్ల ఒక ప్రతిస్పందన వస్తుంది. అది ఒక ప్రతికూలమైన చర్య అవచ్చు, ఒక ప్రతిచర్య అవచ్చు. ఈ విధంగా మళ్ళీ మళ్ళీ ప్రతిచర్య ఒక అలలాగా లేస్తూవుంటుంది. మీరు ఆ అలలో చిక్కుకొనిపోతారు. అయితే క్రియ దీనికంటె చాలా భిన్నమైనది. అది ప్రతిచర్య కానే కాదు. కాబట్టి మాటలనీ, క్రియనీ వంతెనతో కలపలేరు. మాటని వదిలివేయాలి – అప్పుడు మీరు క్రియని చేస్తారు. ఇప్పుడు మన ఇబ్బంది ఏమిటంటే మాటలని వదిలివేయడం ఎట్లా. అంటే అర్థం – ప్రతిచర్య లేని క్రియను చేయడం ఎట్లా. అర్థమవుతున్నదా ? మాటల మీదే బ్రతుకుతున్నంతవరకు మీరు ప్రతిచర్య చూపక మానరు. కాబట్టి మాటలన్నీ వదులుకొని ఖాళీ అవాలి. అంటే అనుకరణని పూర్తిగా, ఏమీ మిగలకుండా వదిలేయాలి. అనుకరణ అంటే మాటలే. మాటల స్థాయిలో జీవించడం అంటే అనుకరణలో జీవించడం అనమాట. మన జీవితం సమస్తమూ అనుకరణ మీదా, నకలుగా తయారవడం మీదా ఆధారపడి వున్నది. కాబట్టే, క్రియ చేయలేని అసమర్థులంగా మనల్ని తయారు చేసుకున్నాం. అందువల్ల మిమ్మల్ని నకళ్ళుగా తయారుచేసే, అనుకరణ చేయించే, మాటల స్థాయిలో జీవింపజేసే రకరకాల పద్ధతులు ఏవేవి వున్నాయో అవన్నీ పరిశోధించి తెలుసుకోవాలి. మిమ్మల్ని ఇట్లా అనుకరణ చేసే జీవిగా తయారుచేసిన ఆ పద్ధతులన్నింటినీ విప్పి చూడటం ఆరంభించినప్పుడు, ప్రతిచర్య లేకుండా క్రియ చేస్తున్నారని మీరు కనిపెడతారు.

సర్! ప్రేమ ఒక మాట కాదు. మాట అసలు విషయం కాదు. అవునా ? 'దేవుడు' అన్న ఆ మాట దేవుడు కాదు. 'ప్రేమ' అన్న ఆ మాట ప్రేమ కాదు. కానీ మీరు మాటతోనే తృప్తిపడిపోతారు ఎందుకంటే మాట ఒక వుద్రేకాన్ని కలిగిస్తుంది. 'దైవం' అనే మాటని ఎవరయినా వుచ్చరించగానే, మీలో మానసికమైన, నరాల సంబంధమైన ఒక ప్రభావం కలుగుతుంది. దైవాన్ని అవగాహన చేసుకోవడం అంటే ఈ ప్రతిస్పందనే అని మీరు అనుకుంటారు. కాబట్టి ఒక మాట మీ నరాలనీ, ఇంద్రియాలనీ ప్రభావితం చేస్తుంది. అది మీలో ఒక విధమైన చర్యను పుట్టిస్తుంది. అయితే మాట అసలు విషయం కాదు. 'దైవం' అనే మాట దైవం కాదు. మిమ్మల్ని కేవలం మాటలతోనే పెంచారు ; నరాల సంబంధమైన, ఇంద్రియ సంబంధమైన ప్రతిస్పందనలతోనే పెంచారు. ఇందులోని సారాంశాన్ని గమనించండి. వట్టి బోలు మాటల్నే ఆహారంగా పెట్టి మిమ్మల్ని పెంచినప్పుడు, క్రియ ఎట్లా చేయగలుగుతారు మీరు ? వట్టి మాటలకి ఏమీ విలువలేదు. అవునా కాదా ? వాటివలం నరాల సంబంధమైన ప్రతిస్పందన కలుగుతుంది. అది క్రియ కాదు. అనుకరించడం అనే ప్రతిస్పందన లేనప్పుడు మాత్రమే క్రియ జరుగుతుంది. అంటే అర్ధం - ఈ మాటలతో కూడుకున్న మొత్తం ప్రక్రియను మనసు తరచి విచారణ చేయాలీ అని. ఉదాహరణకి ఒక రాజకీయనాయకుడో, మతాచార్యుడో ఒక ప్రకటన చేస్తాడు. ఏమీ ఆలోచించకుండా దానికి మీ అంగీకారం చూపుతారు. ఆపైన ఒక జండా పట్టుకొని వూపుతారు. ఇండియా కోసమో, జర్మనీ కోసమో యుద్ధం చేస్తారు. కానీ, చెప్పిన దానిని పరీక్షించి చూడరు. కాబట్టి, అట్లా మీరు పరీక్షించి చూడలేదు కాబట్టి, మీరు చేసేదంతా కేవలం ప్రతిచర్య. ప్రతిచర్యకీ క్రియకీ ఏమీ సంబంధం వుండదు. ఇది వేరు, అది వేరు. మనలో చాలామంది ప్రతిచర్య చేయడానికే నిబద్ధితమైపోయి వున్నాం. కాబట్టి ఈ నిబద్ధతకి గల కారణాలేమిటి అని మీరు కనిపెట్టాలి మనసు ఈ నిబద్ధీకరణం నుండి విడుదల పొందడం ఆరంభ మవుతుండగానే, క్రియ జరుగుతున్నదని మీరు కనిపెడతారు. అటువంటి క్రియ ప్రతిచర్య కాదు. ఆ క్రియే దానిలో వున్న ప్రాణశక్తీ, దానిలోని నిరంతరత్వమూ కూడా.

ఇక, మనలో చాలామందిలో వున్న బాధ ఏమిటంటే కలపశక్యంగాని రెండింటిని కలిపే వంతెన వేయాలనుకోవడం. దేవుడినీ, ధన పిశాచాన్నీ రెండింటినీ పూజించాలనుకుంటాం, మాటల స్థాయిలో నివసించాలనుకుంటాం, మళ్ళీ క్రియ కూడా చేయాలనుకుంటాం. ఈ రెండింటికీ పొసగదు. ప్రతిచర్య అంటే ఏమిటో మనకందరికీ తెలుసు. అయితే మనలో చాలా కొద్దిమందికి మాత్రమే క్రియ తెలుసు. ఎందుకంటే, మాట అసలు విషయం కాదు అన్నది అవగాహన చేసుకున్నప్పుడే క్రియ జరుగుతుంది. అది అవగాహన చేసుకున్నాక, ఆపైన మనం ఇంకా లోతుగా పోవచ్చు. మన లోపల వున్న

భయాలనూ, అనుకరణలనూ, పలాయనాలనూ, ఆధిపత్యాలనూ విప్పి, తెరచి చూసుకోవడం ఆరంభించవచ్చును. అయితే దీని అర్ధం ఏమిటంటే మన జీవితం అప్పుడు చాలా సాహసభరితంగా వుంటుంది. అయితే, నిరంతరమైన విప్లవస్థితిలో జీవించడం మనలో చాలా మందికి ఇష్టం వుండదు. మనకి కావలసినది ఏమిటంటే ఏ ఆటుపోటులూ లేని ఒక ఆశ్రయం ; అక్కడ స్థావరం ఏర్పరచుకొని శారీరకమైన, మానసికమైన సౌఖ్యాన్నీ మన మనోద్రేకాలకు వుపశమనాన్నీ పొందాలని కోరుకుంటాం. ఒక సోమరిపోతయిన వ్యక్తికీ, చాలా చురుకైన వ్యక్తికీ మధ్యన ఏవిధంగా సంబంధం వుండదో, అదే విధంగా మాటకీ క్రియకీ మధ్యన కూడా ఏ బాంధవ్యమూ వుండదు. అయితే ఒకసారి ఇది అవగాహన చేసుకొని, అందులోని సారాంశాన్నంతా అర్ధం చేసుకున్నాక, అప్పుడు క్రియ జరుగుతుంది. అటువంటి క్రియ నిస్సందేహంగా యదార్ధతత్వానికి దారి తీస్తుంది. యదార్ధతత్వం పని చేసే రంగం అదే. అప్పుడు మనం యదార్ధతత్వం కోసం ఎక్కడో వెతకనక్కరలేదు. అది నేరుగా వచ్చేస్తుంది. యదార్ధతత్వాన్ని స్వీకరించడం చేతనయిన మనసు ధన్యమవుతుంది.



# 1948 లో ప్రసంగాలు

## పూనా

### సెప్టెంబరు 5

మానవ సంబంధాల్లో వుండే సంక్లిష్టతలనూ, అతి సూక్ష్మరూపాల్లో అల్లుకొని పోయిన చిక్కు ముడులనూ అర్థం చేసుకోవడం మహా దుస్సాధ్యమనిపిస్తుంది, అనిపిస్తుంది కదూ ? ఒక వ్యక్తితో మనకు ఎంతో దగ్గిర పరిచయం వున్నా, అతని మనోభావాలు, అతని ఆలోచనలు ఏమిటి అనేది కనిపెట్టడానికి చాలా ప్రయాస పడవలసి వస్తూ వుంటుంది. అసలు అది చాలావరకు అసాధ్యం కూడా. ఇద్దరు వ్యక్తుల మధ్య ఆత్మీయత, ప్రేమ వున్నప్పుడు అంతకంటె కొంత సులువుగా వుంటుంది. ఎందుకంటే అప్పుడు ఒకే సమయంలో, ఒకే స్థాయిలో ఇద్దరి మధ్యా అన్యోన్యమైన భావప్రసారం అప్పటికప్పుడే జరుగుతూ వుంటుంది కాబట్టి. అయితే, మన చర్చలూ, వినడమూ మాటల స్థాయిలో మాత్రమే సాగుతున్నంత కాలం ఆ విధమైన అన్యోన్యత వుండదు. మీకూ నాకూ మధ్య అటువంటి అన్యోన్యతను స్థాపించుకోవడం మహా కష్టం. ఎందుకంటే మన మధ్య ఆ భావప్రసారం లేదు, నిజమైన అవగాహన లేదు. భయం కానీ, ఆపోహకానీ వుంటే అన్యోన్యత అంతరించిపోతుంది. ఎందుకంటే అప్పుడు మనల్ని రక్షించుకోవాలి అనే సాధనమే పని చేస్తూంటుంది. బహుశ మీకు అలవాటయిన తీరులో కాక విభిన్నమైన తీరులో నేను విషయాలను చూస్తున్నానేమో. మీతో నేను అన్యోన్యతను పంచుకోవాలనుకుంటున్నాను. నేను చూసిన దానిని మీకు అందించాలనుకుంటున్నాను. నేను చూస్తున్నది నిజమైనదీ, సంపూర్ణమైనదీ కాకపోవచ్చు. కానీ, నేను అందిస్తున్న దానిని మీరు పరీక్షించాలనుకుంటే, మీ తరఫున నుంచి మీరు తలుపులు తెరచిపెట్టి, స్వీకరించే గుణంతో వుండాలి.

నేను కేవలం వూహలతో వ్యవహరించడం లేదు. నా దృష్టిలో భావాలకీ, వూహలకీ ఏ విలువా లేదు. భావాలు విప్లవాలను పుట్టించలేవు. భావాలు పునరుజ్జీవనాన్ని తేలేవు. అయితే మనకిప్పుడు అత్యవసరంగా కావలసినది పునరుజ్జీవనం. భావాలను ఒకరికొకరు అందజేసుకోవడం కొంతవరకు సులువే. కానీ మాటల స్థాయిని దాటిపోయి పరస్పరం అన్యోన్యతను పంచుకోవడం మహా కష్టసాధ్యం. మన మధ్య స్థాపించు కోవలసినది ఏదో కాల్పనికమైన, రహస్య పూరితమైన అన్యోన్యత కాదు. మన సమస్యలను పరిష్కరించే సత్యాన్ని ఆవిష్కృతం చేసుకోవాలని మన ఇద్దరిలోనూ తీవ్రంగా వున్నప్పుడు మాత్రమే సాధ్యం అయే ఆ అన్యోన్యత మనకు కావాలి. నా వరకు నాకు అనిపిస్తున్నది

ఏమిటంటే ప్రతి క్షణంలోనూ ఒక యదార్థతత్వం వున్నదనీ, అది కాలం అనే పరిధికి చెందినది మాత్రం కాదనీ. మన జీవితాల్లో వుండే అసంఖ్యాకమైన సమస్యలకి ఆ యదార్థతత్వమే ఏకైక పరిష్కారం. ఆ యదార్థతత్వాన్ని మనం గ్రహించినప్పుడు, లేదూ ఆ యదార్థతత్వం అరుదెంచినప్పుడు, అదే విమోచన సాధనం అవుతుంది. అయితే, ఆర్థికమైనవి కానీ, సామాజికమైనవి కానీ, మతపరమైనవి కానీ, మేధతో కూడినవి కానీ అయిన వాదోపవాదాలూ, తర్కవితర్కాలూ, ఘర్షణలూ మాత్రం - అవి ఎంతగా కొనసాగించినప్పటికీ - అవి మాత్రం మనసే సృష్టించిన ఈ సమస్యలకు పరిష్కారాన్ని సాధించలేవు.

మనం ఒకరితో ఒకరం అన్యోన్యమైన భావప్రసారం చేసుకోవడానికి ఇక్కడ సమావేశమైనాం. అది జరగాలంటే మనం తలుపులు మూసుకొని కూర్చోకూడదు, స్వీకరించే గుణంతో వుండాలి. అంగీకరించనూ వద్దు, నిరాకరించనూ వద్దు. తరచి శోధిస్తూ వుండాలి. మీకూ నాకూ మధ్యన పరస్పర సంబంధం వున్నది. మనం ఏకాకులుగా జీవించడం లేదు. సత్యం సంబంధ బాంధవ్యాలకి దూరంగా ఎక్కడో లేదు. సమాజం అంటేనే పరస్పర సంబంధాలు. మీకూ మీ భార్యకీ మధ్య, మీకూ సమాజానికీ మధ్య వున్న పరస్పర బాంధవ్యాన్ని అవగాహన చేసుకోవడంలోనే సత్యాన్ని కనిపెట్టగలుగుతారు. అంతకన్న, సత్యమే మీ వద్దకు వస్తుంది. ఆ సత్యం మీ సమస్యలన్నింటి నుండి విడుదల కలిగిస్తుంది. సత్యాన్ని మీరు వెళ్ళి వెతకలేరు. దానిని మీ వద్దకు మీరే రానివ్వాలి. అట్లా రావాలంటే మనసు అజ్ఞానంలో మునిగివుండకూడదు. అజ్ఞానం అంటే సాంకేతిక విజ్ఞానం లేకపోవడం కాదు. బోలెడు తాత్విక గ్రంధాలను చదవకపోవడం కాదు. అజ్ఞానం అంటే స్వీయజ్ఞానం లేకపోవడం. ఒకరు ఎన్నో తాత్విక గ్రంధాలనూ, పవిత్ర గ్రంధాలనూ చదివి వుండవచ్చు. వాటిలో నుంచి వాక్యాలూ, శ్లోకాలూ అనర్గళంగా వుదహరించ గలిగివుండచ్చు. అయితే కేవలం పదాల కూర్పులూ, ఇతరుల అనుభవాలూ అయిన ఈ వుదాహరణ వాక్యాలు మనసును అజ్ఞానం నుండి విడిపించలేవు. తన లోపల ఏయే ఆలోచనలూ, మనోభావాలూ వున్నాయో, తను చేస్తున్న క్రియలు ఏమిటో వాటిని అన్వేషించడమూ, వాటి తీరుతెన్నులను అనుభూతి చెందడమూ చేసినప్పుడు మాత్రమే - అంటే అర్థం - పరస్పర బాంధవ్యాలలో తాను అనే మొత్తం ప్రక్రియను గురించి ప్రతి క్షణమూ ఎరుకతో వున్నప్పుడు మాత్రమే స్వీయజ్ఞానం కలుగుతుంది. స్వీయజ్ఞానం - దీనిని గురించి మనం ఇంకా వివరంగా చర్చించబోతున్నాం - మనకున్న ఏ సమస్యలనైనా సరే ఎదుర్కొనడానికి తగిన సవ్యమైన దృక్పథాన్ని కలిగిస్తుంది. సవ్యమైన దృక్పథం అంటే సమస్యలోని సత్యాన్ని అవగాహన చేసుకోవడం. ఆ అవగాహనే సంబంధ బాంధవ్యాల్లో క్రియ జరిపిస్తుంది. కాబట్టి

స్వీయజ్ఞానం క్రియకు వ్యతిరేకి కాదు, క్రియను నిరాకరించడమూ చేయదు. సమస్యను గురించి ఒక సవ్యమైన దృక్పథాన్ని, అంటే సమస్యలోని అసలు నిజాన్ని స్వీయజ్ఞానం తెరచి చూపుతుంది. అందులో నుండి క్రియ వస్తుంది. ఈ మూడూ ఎప్పుడూ పరస్పర సంబంధం కలిగి వుంటాయి, విడివిడిగా వుండవు. స్వీయజ్ఞానం లేకుండా నిజమైన క్రియ వుండదు. నన్ను నేను తెలుసుకోనప్పుడు క్రియకి ఆస్కారం లేదనడంలో ఏమాత్రం సందేహం లేదు. అప్పుడు చేసేది కేవలం కార్యకలాపాల సందడి. అది నిబద్ధీకరణం చెందిన మనసు ప్రతిస్పందించడం మాత్రమే. కాబట్టి దానిలో అర్ధం లేదు. నిబద్ధతలోనుండి వచ్చిన ప్రతిస్పందన వల్ల విడుదల పొందడం సాధ్యం కానే కాదు. అస్తవ్యవస్తతలో నుండి క్రమతనూ అది తీసుకొనిరాలేదు.

సరే, ప్రపంచమూ వ్యక్తీ అంతా ఒకటే ప్రక్రియ, రెండూ పరస్పరం వ్యతిరేకించుకునేవి కావు. తన సమస్యలను పరిష్కరించుకోవాలని ప్రయత్నిస్తున్న మనిషికి ఆ సమస్యలన్నీ ప్రపంచ సమస్యలు కూడా – అతడు ఆలోచించడానికి ఒక ఆధారం అవసరం కదా. ఇంతవరకూ బాగా స్పష్టంగా వుందనుకుంటాను. నేను ఎవరో నాకే తెలియకపోతే నా ఆలోచనలకు ఏ ఆధారమూ వుండదు. నా గురించి నాకే తెలియక, వూరికే క్రియ చేస్తూవుంటే, అటువంటి క్రియవలన దుర్భరమైన వ్యథలూ, గందరగోళమూ పుట్టుకొస్తాయనడానికి సందేహం అక్కర్లేదు – ప్రస్తుతం వర్తమానకాలంలో ప్రపంచంలో జరుగుతున్నది అదే. కాబట్టి స్వీయజ్ఞానం గురించి విచారణ మనల్ని ఏకాకులుగా చేసే ప్రక్రియ కాదు. అది ఏదో తపస్సు చేసుకునే వారికి వుండవలసిన సరదానో, సౌఖ్యవంతమైన అభిలాషో కాదు. అట్లా కాకపోగా, లౌకిక ప్రపంచంలోని వ్యక్తికే అది చాలా అత్యవసరమైన విషయం. పేదవారికీ ధనవంతులకీ కూడా. లోకంలోని సమస్యలను పరిష్కరించాలని కోరే వ్యక్తికి కూడా. ఎందుకంటే, వ్యక్తి అంటే లోకం కూడా కాబట్టి. ఈ లోకం మన రోజువారీ జీవితం తయారుచేసినదేననీ, మనమే సృష్టించిన ఈ పరిసరాలూ, మనమూ అంతా ఒకటే తప్ప విడివిడిగా లేమనీ గ్రహించడం చాలా ముఖ్యమనీ నాకనిపిస్తున్నది. పరిసరాలూ, వాతావరణమూ ఇట్లా వున్నాయి, పాటిని మార్చలేము, మిమ్మల్ని మార్చుకుంటే తప్ప అవి మారవు. మిమ్మల్ని మార్చుకోవాలంటే, మీలో వున్న ఆలోచనలను, మనోభావాలను, సంబంధ బాంధవ్యాల్లో తీసుకునే చర్యలను మీరు అవగాహన చేసుకొని తీరాలి. ఆర్థిక నిపుణులూ, విప్లవకారులూ వ్యక్తిని మార్చకుండా పరిసరాలను మార్చాలని చూస్తుంటారు. అయితే వ్యక్తి తనను తాను అవగాహన చేసుకోకుండా పరిసరాలను మాత్రమే మార్చాలనుకోవడంలో అర్థం లేదు. వ్యక్తి ప్రయత్నాల ఫలితంగా జనించినదే పరిసరవాతావరణం. ఆ రెండూ పరస్పర సంబంధం కలవి. ఒక దానిని మార్చకుండా

రెండో దానిని మార్చలేరు. మీరూ నేనూ విడివిడిగా, ఒంటరిగా లేము. మనమూ మొత్తం ప్రక్రియకు ఫలితంగా జనించినవాళ్ళమే. మొత్తం మానవ ప్రయత్నానికి పర్యవసానంగా జనించిన వాళ్ళమే. మనం ఇండియాలో నివసిస్తున్నా, జపానులోనో, అమెరికాలోనో నివసిస్తున్నా అంతే. మానవాళి మొత్తాన్ని కలుపుతే మీరూ, నేనూ ఆ సంగతి మనకు తెలిసి వుండచ్చు, లేదూ మనకా స్పృహ లేకనూ పోవచ్చు. సమాజ నిర్మాణంలోనే ఒక విప్లవాత్మకమైన మార్పు తీసుకొని రావాలంటే, ప్రతివారూ తమని ఒక మొత్తం ప్రక్రియగా అర్థం చేసుకోవాలి తప్ప, విడివిడిగా వున్న ఒంటరి సత్వాలగా కాదు. ఇది కనుక మీకు బాగా స్పష్టంగా వుంటే, మనిషి మనసు యొక్క స్వభావం ఏమిటి, అతను అంటే ఏమిటి అనే పరిశోధనను మనం కొనసాగించవచ్చు. అయితే, చిత్తశుద్ధి వున్న ఎవరయినా స్పష్టంగా తెలుసుకోవలసినది ఏమిటంటే, ఏదో ఒక స్థాయిలో, ఆర్థిక స్థాయిలోనో, ఆధ్యాత్మిక స్థాయిలోనో సంపూర్ణమైన ప్రపంచ విప్లవం జరగడం సాధ్యం కాదని. మీరూ, నేనూ మనల్ని ఒక మొత్తం ప్రక్రియగా అవగాహన చేసుకుంటే తప్ప, ఒక సంపూర్ణమైన సకల సమృద్ధవంతమైన విప్లవం జరగదు. మీరూ నేనూ విడివిడిగా ఒంటరిగా వున్న వ్యక్తులం కాదు. భ్రాంతులతోను, ఇష్టాయిష్టాలతోను, వ్యాపకాలతోను, అజ్ఞానం, ద్వేషం, సంఘర్షణ, వ్యథలతోను కూడుకొని వున్న మొత్తం మానవాళి పడిన ప్రయాసకు ఫలితంగా జనించిన వారం మనం. మొదట తనను తాను అవగాహన చేసుకోకుండా ప్రపంచ స్థితిగతులని మార్చడం సాధ్యం కాదు. అది కనుక మీకు అర్థం అయిందంటే, తక్షణమే మీ లోపల ఒక సంపూర్ణమైన విప్లవం జరుగుతుంది. జరుగుతుంది కదూ ? అప్పుడు ఏ గురువు అవసరమూ వుండదు. ఎందుకంటే తనని గురించి తెలుసుకోవడం ప్రతిక్షణమూ జరుగుతూ వుంటుంది. అది ఎవరో చెప్పినది పోగుచేసుకోవడం కాదు. మతాచార్యులు ప్రవచించే నియమ సూత్రాలలోనూ దాగి వుండదు. మరొకరితో వుండే బాంధవ్యంలో ప్రతి క్షణమూ మిమ్మల్ని మీరు ఆవిష్కృతం చేసుకుంటూ వుంటారు. కాబట్టి, సంబంధ బాంధవ్యం పూర్తిగా ఒక కొత్త అర్థాన్ని సంతరించుకుంటుంది. అప్పుడు బాంధవ్యం అంటే ఒక నవ్యదర్శనంగా ప్రత్యక్షమవుతుంది, తనని తాను ఆవిష్కరించుకుంటూ వుండే ఒక నిరంతర ప్రక్రియ అది. ఇటువంటి ఆత్మావిష్కారం నుండి, ఈ విధంగా తనని తాను కనుగొనడంలో నుండి క్రియ జరుగుతుంది.

కాబట్టి స్వీయజ్ఞానం పరస్పర సంబంధం ద్వారా మాత్రమే కలుగుతుంది. ఒంటరిగా వుండి సాధించేది కాదు. బాంధవ్యం అంటే క్రియ. క్రియను గురించిన ఎరుక వలన స్వీయజ్ఞానం కలుగుతుంది. అది ఇట్లా జరుగుతుంది : మీరు ఏ పుస్తకాలూ చదవలేదని అనుకుందాం. జీవితానికి అర్థం వెతుకుతున్న మొట్టమొదటి వ్యక్తి మీరే అనుకుందాం. అది ఎట్లా ఆరంభించాలో మీకు చెప్పడానికి ఎవ్వరూ లేరు. గురువు లేడు,

గ్రంధం లేదు. ఆచార్యులు లేరు. మొత్తం ప్రక్రియనంతా మీ అంతట మీరే కనిపెట్టాలి. అప్పుడు మీరు ఏం చేస్తారు ? మొట్టమొదట మీతోనే ఆరంభిస్తారు. ఆరంభించరూ ? అదే మన సమస్య. ఎవరో అధికారయుతంగా చెప్పినది మళ్ళీ వుదహరించడం స్వీయజ్ఞానం కాదు. అది తనను గురించిన ప్రకియను ఆవిష్కారం చేసుకోవడం అవదు. కాబట్టి దానికి విలువలేదు మీకు ఏమీ తెలియదు అనుకొని మీరు ఆరంభించాలి. అప్పుడే సృజనాత్మకమైనదీ, విడుదల చేయించేదీ అయిన దానిని కనిపెడతారు. అప్పుడే ఆ ఆవిష్కారం మీకు సంతోషాన్నీ, ఆనందాన్నీ కలుగజేస్తుంది. అయితే, మనలో చాలా మందిమి మాటలమీదే జీవిస్తున్నాం. మాటలు కూడా జ్ఞాపకాలలాగే గతంలో నుండి వచ్చినవి. గతంలో జీవిస్తున్న మనిషి వర్తమానాన్ని అవగాహన చేసుకోలేడు. కాబట్టి మీరు అనే ప్రక్రియను ప్రతిక్షణమూ కనుగొంటూ వుండవలసిందే. అంటే అర్థం మీరు ఎరుకతో వుండాలి. మీ ఆలోచనల ఎడల, మనోభావాల ఎడల, క్రియల ఎడల స్పృహతో వుండాలి ఎరుకతో వుండండి, అప్పుడు మీ ఆలోచనలు, మీ మనోభావాలు, మీ చర్యలు సమాజమో, మతాచార్యులో తయారుచేసిన నమూనాల మీద ఆధారపడి వుండటమే కాకుండా. మీ అభిరుచులలో మీ అభిప్రాయాలలో నుంచి కూడా రూపుదిద్దు కుంటున్నాయని గ్రహిస్తారు. మీ ఆలోచనలను గురించి, మనోభావాలను గురించి, చర్యలను గురించి ఎరుకగా వుండటమే స్వీయజ్ఞానం అనే ప్రక్రియ. మనందరం ఎరుకగానే వుంటాం, అంటే మనం ఫలానాది చేస్తున్నాం, ఆలోచిస్తున్నాం అనే స్పృహ మనకు వుంటుంది అయితే మన ఆలోచనలకీ, మన పనులకీ వెనకాల వున్న వుద్దేశ్యం లేదా కాంక్షను గురించి మనకి తెలియదు. ఆ స్పృహ మనకి వుండదు. ఆలోచన యొక్క చట్రపు ఆకారాన్ని మార్చాలని ప్రయత్నిస్తామే తప్ప, అసలు ఆ చట్ర నిర్మాణాన్ని తయారు చేసిన కర్త ఎవరు అనేది మనం ఎప్పుడూ అర్థం చేసుకోము.

కాబట్టి, మనల్ని మనం అవగాహన చేసుకోవడం అత్యవసరం. ఎందుకంటే మనల్ని అర్థం చేసుకోకుండా, స్వీయ ఆవిష్కారం అనే ప్రక్రియ లేకుండా సృజనాత్మకమైన విప్లవం జరగదు. తనని తాను అవగాహన చేసుకోవడం అంటే ప్రతి ఒక్క ఆలోచన ఎడలా, ప్రతి ఒక్క మనోభావం ఎడలా నిరసన లేదా ఖండింపు లేకుండా ఎరుకతో వుండటం. ఖండించినప్పుడు ఆ మనోభావాలు, ఆ ఆలోచనలు ఆగిపోతాయి. ఖండించకపోతే కనుక, సమర్థనా నిరోధించడమూ కూడా లేకపోతే కనుక, అప్పుడు మీ ఆలోచనలు తమలోని విషయాన్ని తామే విప్పి చూపించుకుంటాయి. ప్రయోగం చేసి మీరే చూసుకోండి. ఇది చాలా ముఖ్యం. ఎందుకంటే ఒక సృజనాత్మకమైన విప్లవం లేదా పునరుజ్జీవనం జరగాలంటే ప్రాథమిక అవసరం తనను తాను అవగాహన చేసుకోవడమే. తనని తాను అర్థం చేసుకోకుండా ఆర్థికరంగంలో మాత్రమే మార్పును

తీసుకొనిరావడం, లేదా కొత్త కొత్త ఆచరణ విధానాలను చొరబెట్టడమూ వల్ల ఏమీ ప్రయోజనం వుండదు. మనల్ని మనం అవగాహన చేసుకోకపోతే ఒక సంఘర్షణ నుండి మరో సంఘర్షణలోకి పోతూ వుంటాం. సంఘర్షణ ద్వారా కొత్తది ఏదీ తయారు చేయలేము. సంఘర్షణ సమాప్తమైనప్పుడు మాత్రమే కొత్త సృష్టి జరుగుతుంది. తనతోనూ, తన ఇరుగుపొరుగుతోనూ నిరంతరం ఘర్షణలో మునిగి తేలేవాడికి పునరుజ్జీవనం అనేది వుండదు – ఒక ప్రతిచర్య తర్వాత మరో ప్రతిచర్య చేస్తూ పోతూ వుంటాడు. మొత్తం ప్రతిచర్యలనుండే విముక్తి పొందినప్పుడు పునరుజ్జీవనం జరుగుతుంది. అటువంటి విముక్తి స్వీయజ్ఞానం కలిగినప్పుడే జరుగుతుంది. వ్యక్తి అంటే ఒంటరిగా, విడిగా వుండే ప్రక్రియ కాదు. సమస్తమైన మొత్తం నుండి అతడు విడిగా వుండడు. అతడు అంటే మానవాళి అనే మొత్తం ప్రక్రియ. కాబట్టి చిత్తశుద్ధి గలవారు, విలువలలో సమూలమైన, ఆ మూలాగ్రమైన విప్లవాన్ని తీసుకొనిరావాలని కోరుకుంటున్నవారు తమతోనే ఆరంభించాలి.

ప్రశ్నలు చాలానే వచ్చాయి. వాటిలో సాధ్యమైనన్ని ఎక్కువ ప్రశ్నలకు సమాధానం ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

ప్రశ్న : విగ్రహారాధన, పూజ, ధ్యానం – ఇవన్నీ చేయడం మనిషిలోని సహజ లక్షణాలు. ఇవి అతనికి వుపయోగపడతాయనడంలో సందేహం లేదు. మీరెందుకని వాటిని నిరసిస్తున్నారు ? బాధపడుతున్నవారికి అవి అందించే ఓదార్పును మీరెందుకు త్రోసి పారేస్తున్నారు ?

కృష్ణమూర్తి : ధ్యానం అంటే ఏమిటో ముందుగా మనం అవగాహన చేసుకుందాం. ఇది చాలా జటిలమైన విషయం ; కాబట్టి మీరు కొంతసేపు సావధానతతో వింటూ వుండాలి. లేకపోతే అసలు సంగతిని మీరు అందుకోలేకపోవచ్చు. ముందుగా ముఖ్యమైనవాటిని స్పష్టపరచుకుందాం. అన్నింటికంటె ముందుగా ఒక సంగతి – ధ్యానం అవసరం కాదని నేను అనడం లేదు. అయితే అది అవసరమా కాదా అని తేల్చి చెప్పడాని కంటే ముందు అసలు దాని అర్థమేమిటో మనం అవగాహన చేసుకోవాలి. మా గురువుగారు, నా సంప్రదాయం 'ధ్యానం చేయి' అని అంటున్నారు. అందుకని నేను ఒక గదిలో కూర్చుని ధ్యానం చేస్తాను. అందులో బొత్తిగా అర్థం లేదు. ధ్యానం అంటే ఏమిటి అన్నది మొదట నేను అవగాహన చేసుకోవాలి.

ధ్యానం అంటే అసలు మనం అనుకునేదేమిటి ? ధ్యానంలో అనేక విషయాలున్నాయి : ప్రార్థన, ఏకాగ్రత, సత్యాన్వేషణ లేదా మనం అవగాహన అని

అంటున్నది, ఊరట కోసం ఆశించడం మొదలైనవి. ప్రార్థనని తీసుకుందాం. ప్రార్థన అంటే ఏమిటి ? ప్రార్దన అంటే ఒక విధమైన అర్థింపు. ఒకరు కష్టంలో వున్నారు, అందులో నుంచి బయటపడటానికి మరొకరి సహాయం కావాలి. మీరూ నేనూ ప్రార్థించకపోవచ్చు. కానీ లక్షలాది మంది చేస్తుంటారు. వాళ్ళు ప్రార్థించినప్పుడు, ఏదో సమాధానం కూడా దొరుకుతూ వుంటుంది. లేకపోతే వాళ్ళు ప్రార్థించరు. వాళ్ళకు కొంత ఓదార్పు దొరుకుతున్నది. ఈ ప్రార్థనల్లో, సమాధానాన్ని ఇస్తున్నది దైవమా, వున్నతమైన ఒక సత్వమా లేదూ ఈ సమాధానం మరెక్కడనుంచో వస్తున్నదా ? అసలు ప్రార్దనలో వున్నది ఏమిటి ? మొదట కొన్ని పదాలను జపం చేస్తూ వుంటారు. మీరు హిందువులు, ఆ మంత్రాలను, ఆ పదాలను జపిస్తూ వుంటారు. మళ్ళీ మళ్ళీ అవే పదాలను వుచ్ఛరిస్తూ వుండటం ద్వారా మనసు నెమ్మదించేటట్లుగా చేసుకుంటారు. ఏదయినా ఒకదానిని ఆపకుండా మళ్ళీ మళ్ళీ అంటూ వుంటే మనసు సహజంగానే నెమ్మదిగా, జడంగా అయిపోతుంది. ఈవిధంగా చేతన మానసం మౌనం వహించగానే ఏదో సమాధానం వినబడుతుంది. ఈ సమాధానం ఎక్కడనుండి వస్తున్నది ? దైవం అని మీరు అనుకుంటున్న వారి వద్ద నుంచా లేదూ మరెక్కడినుంచోనా ? అసలు మీరు ఎందుకు ప్రార్దిస్తారు ? ఏదో ఒక రకమైన దురవస్థలో వున్నారు కాబట్టి ప్రార్ధన చేస్తారు అనేది స్పష్టం. బాధతోనూ. దుఃఖంతోనూ కూడిన ఒక స్దితిలో వున్నారు, అందుకని దానికి ఒక పరిష్కారం కావాలి మీకు. అంటే, మీరు ఒక సమస్యను సృష్టించుకున్నారు ; ప్రార్దన ద్వారా, అంటే కొన్ని మాటలను జపం చేయడం ద్వారా మనసుని నెమ్మది పరుస్తున్నారు, ఆపైన మనసు ఆ సమస్యకు ఒక సమాధానాన్ని అందుకుంటుంది. ఈవిధంగా మీరు చేస్తున్నప్పుడు, వాస్తవంగా జరుగుతున్నదేమిటి ? ఉపరితలంలో వున్న మనసు నెమ్మది పొంది, చలనం లేకుండా వున్న స్థితిలో వుంటుంది. అప్పుడు అచేతన మానసం తనని పైకి ప్రదర్శించుకుంటుంది. మీకు ఒక సమాధానం దొరుకుతుంది. ఇంకోరకంగా చెప్పాలంటే, మీకు ఒక సమస్య వున్నది ; దానిని గురించి చాలా కాలంగా మీరు చింతిస్తూ, తర్జన భర్జన పడుతూ వున్నారు. కానీ పరిష్కారం దొరకలేదు. అప్పుడు 'ఈ రాత్రికి మెదలకుండా వూరుకుందాం' అనుకుంటారు. మరునాడు వుదయం నిద్ర లేవగానే ఒక పరిష్కారం మీకు తడుతుంది. ఇది ఎట్లా జరుగుతున్నది ? చేతన మానసం కొంతకాలం ఆ సమస్య గురించి చింతించాక, ఆ సమస్యని పక్కకి త్రోసి, ''దానిపాటికి అట్లా వదిలేసి వుంచుదాం'' అనుకుంటుంది. ఈ సమస్య విషయంలో చేతన మానసం నెమ్మదించగానే అచేతన మానసం తనను చైతన్య పరచుకొని ప్రకటించుకుంటుంది. సమాధానం అక్కడ హాజరవుతుంది. దానికి మీరు ఏ పేరు పెట్టినా పెట్టవచ్చు – అంతర్వాణి లేదా దైవవాణి అని – ఏ పేరయితేనేం. సందేశాన్ని అందిచ్చినది లోపలి

అంతశ్చేతన, సమాధానం ఇచ్చినది ఆ అచేతన మానసమే. చేతన మానసాన్ని నెమ్మదింపజేసి, సమాధానం అందుకోవడానికి సిద్ధపరచే ఒక యుక్తీ, ఒక వుపాయమూ మాత్రమే ఈ ప్రార్థన అన్నది స్పష్టమైంది. అయితే చేతన మానసం అందుకునే సమాధానం చేతనలో వున్న కోరిక ఏమిటో దాని ప్రకారంగానే వుంటుంది. మనసు నిబద్ధితమై వున్నంతవరకూ సమాధానం కూడా నిబద్ధతకు లోనయి వుండటమే జరుగుతుంది. అంటే, నాలో దేశభక్తి వుండి, ప్రార్థన ద్వారా నా మనసుని ఏదో విధంగా నిలకడగా నిలబడేటట్లు చేసివేస్తే, నాకు అందే సమాధానం కూడా నా దేశభక్తి భావాలకు నిబద్ధితమై, దానికి అనుగుణంగానే వుంటుంది. అందువల్ల హిట్లర్‌లాంటి వ్యక్తి కూడా 'నేను దైవవాణిని విన్నాను' అని అనవచ్చు. ఇదీ ధ్యానం అనే ప్రశ్నలోని మొదటి భాగం.

ఇప్పుడు, ఏకాగ్రత అనే ఇంకొక ప్రశ్న వున్నది. ఇది మరికొంచెం కష్టమైనది. దీని మీద మీ ఆలోచననీ, మీ ధ్యాసనీ మరి కొంచెం ఎక్కువగా పెట్టడం అవసరం ఏకాగ్రత అంటే మీ అర్థం ఏమిటి ? ఏకాగ్రత అంటే బహిష్కరించడం. అంటే బయటకు నెట్టివేయడం. ఒక వస్తువు మీదనో, ఒక భావం మీదనో, ఒక విగ్రహం మీదనో ఏకాగ్రత నిలపడం అంటే మీ మనసు మీదకి వచ్చి ఆక్రమించుకుంటున్న ఇతర ఆలోచనలన్నింటినీ నిరోధించి, బహిష్కరించడం. తక్కిన భావాలను ప్రవహించనీయకుండా ఆపడమూ, మీ మనసును ఒక భావం మీదే నిలపమని ఒత్తిడి తేవడానికి ప్రయత్నించడమూ అంటే అది ఒక నిరంతర సమరం. అవును కదూ ? ఒక భావాన్ని ఎన్నుకొని, ఆ భావం మీదే మీ మనసును కేంద్రీకరించే ప్రయత్నం చేస్తారు. ఇతర ఆలోచనలన్నింటినీ నిరోధిస్తారు. తక్కిన వాటినన్నింటినీ బహిష్కరించి, ఆ ఒక్క భావం మీదే కేంద్రీకరించడం సాధించగలిగినప్పుడు, సంపూర్ణమైన ఏకాగ్రతను నేర్చేసుకున్నామని మీరు అనుకుంటారు. ఇట్లా మీరు చేసినప్పుడు వాస్తవంగా ఏం జరుగుతున్నది ? నిరోధించడం అనే ఒక నిరంతరమైన పోరాటంగా ఏకాగ్రత తయారవుతుంది. ఒక్క ఆలోచననే ఎన్నుకొని, తక్కిన ఆలోచనలన్నింటినీ ఎందుకు నిరాకరిస్తున్నారు ? ఆ ఒక్క ఆలోచనా అన్నింటిలోకీ చాలా ముఖ్యమైనది ; తక్కినవన్నీ అంత ముఖ్యం కాదు. అవి అల్పమైనవని మీరు పరిగణిస్తారు కాబట్టి. అందుకని, అల్పమైన ఆలోచనలకీ, చాలా ముఖ్యమైన ఆలోచనకీ మధ్యన ఒక సంఘర్షణ, ఒక నిరంతర సమరం జరుగుతూ వుంటుంది. మీరు కనుక, ప్రతి ఆలోచననూ, అది మనసులో ఆరంభమవుతున్నప్పుడే, ఆ ఆలోచన ముఖ్యమైనది అయినా సరే, కాకపోయినా సరే – అన్ని ఆలోచనలూ ముఖ్యమైనవే – ప్రతి ఆలోచననూ అనుసరించి పోయి అవగాహన చేసుకుంటే – అప్పుడు మీ ఆలోచనను ఒకే ఒక్క భావం మీద కేంద్రీకరించవలసిన అవసరం వుండదు. అప్పుడు ఆ ఏకాగ్రత సంకుచిత పరచేది అవదు. ఇంకా బలంగానూ, సృజనాత్మకం

గానూ అవుతుంది. చిన్నపిల్లలని గమనించండి. ఒక పిల్లవాడికి ఒక బొమ్మో, ఆట వస్తువో, అతనిలో ఆసక్తిని కలిగించేది ఏదో ఒకటి ఇవ్వండి. పిల్లవాడు అందులో పూర్తిగా లీనమైపోతాడు. దానిమీద ఏకాగ్రత నిలపమని మీరతనికి చెప్పనక్కరలేదు. పెద్దవారిలో మాత్రమే ఇటువంటి ఆసక్తి వుండదు ; అందుకని వాళ్ళు ఏకాగ్రత నిలపడం కోసం తమ మీద తమే ఒత్తిడి చేసుకుంటారు. ఏకాగ్రత కోసం ప్రయత్నం చేస్తున్న మనిషికి తను చేస్తున్న దానిలో ఆసక్తి లేదన్నమాట. అతనిలో ఆసక్తి కనుక వుంటే ఏకాగ్రత కోసం ప్రయత్నం చేయనక్కరలేదు. మీలో చాలామంది ధ్యానంలో వుండిపోవాలని ఎందుకు కోరుకుంటారంటే, ప్రతిరోజూ మీరు చేస్తున్న పనులలో మీకు ఆసక్తి లేదు కాబట్టి. అందువల్ల, ధ్యానం మిమ్మల్ని జీవితాన్నుంచి దూరంగా తీసుకొనిపోతుంది. అది మీ నిత్యజీవితంలోని భాగం అవదు. అందువల్ల, ఏకాగ్రత – దానినే మీరు ధ్యానం అంటున్నారు – అది జీవితాన్నుంచి పలాయనం మాత్రమే. మీరు కనుక జీవితాన్నుంచి పూర్తిగా తప్పించుకోగలిగితే ఏదో గొప్పగా సాధించేశామని అనుకుంటారు. అయితే, మీరు కనుక మీ ప్రతి ఆలోచననూ, ప్రతి మనోభావాన్నీ ఖండించడం గానీ, సమర్థించడం గానీ, నిరోధించడం గానీ చేయకుండా, అది ఆరంభమవుతుండగానే పరీక్షించి చూస్తుంటే, అప్పుడు ఆ నిరంతర అవగాహనలో, ఆ నిరంతరమైన పునరావిష్కరణలో మనసు చాలా నెమ్మదిగా, నిశ్చలంగా, స్వేచ్ఛగా వుంటుంది. కాబట్టి, ధ్యానం అంటే ఏకాగ్రత కాదు, ధ్యానం అంటే ప్రార్థన కాదు.

ఇక, కర్మకాండల కార్యక్రమం ఒకటి వున్నది. ఈ పూజా తతంగాలు మీరు ఎందుకు చేస్తుంటారు ? దాని వెనక వున్న అసలు సత్యం ఏమిటి ? మా అమ్మ చనిపోయింది ; ఇవన్నీ నేను చేస్తాను ; అంతకంటే బలమైన కారణమేమీ వుండదు. సర్ ! ఇక్కడ మానసిక ఆరోగ్యం అనే విషయంలోకి ప్రవేశిస్తున్నాం. ఏదయినా ఒక పనిని ఆలోచనా రహితంగా చేయడం అంటే అది మనోరుగ్మత. సందర్భం లేకుండా, అర్థం సంగతి పట్టించుకోకుండా మాటలు వుపయోగించడం అంటే మానసిక స్థిరత్వం లేకపోవడం చనిపోయినవారి కోసం మీరు ఎందుకు ఈ కర్మకాండలు చేస్తుంటారు ? అవి మీకు వుపశమనాన్ని ఇస్తుండటం వల్ల. అప్పుడు మీరు వుపశమనాన్ని కోరుకుంటున్నారు తప్ప అవగాహనని కాదు. అది తెలుసుకున్నాక కూడా ఇంకా అవన్నీ ఎందుకు చేస్తున్నారు ? కర్మకాండల కార్యక్రమం చేయడం వెనక వున్న విశేషార్థమూ, అందులోని సమస్తమైన బాగోగులూ ఏమిటో మీకు తెలుసా ? తెలియకపోతే కనుక, అప్పుడు మీరు అవేవీ చేయకూడదనమాట. సర్ ! అసలు అవన్నీ మీరు ఎందుకు చేస్తారు ? చేయడానికి మరేమీ లేదు కాబట్టి కొంతమంది వీటికి పూనుకుంటారు. ముఖ్యంగా స్త్రీలు. మనం ఎటువంటి మతిస్థిరం లేని స్థితిలో జీవిస్తున్నామో ఇది సూచిస్తుంది. జీవితంలో

వున్న పాశవికత, భర్తల నిర్దాక్షిణ్యము, అదే పనిగా పిల్లల్ని కనడమూ నుండి దూరంగా పారిపోవడానికి భలే చక్కని మార్గం. పైగా ఇవన్నీ చేయనివారిని మీరు విమర్శిస్తారు. కొంతమందికి ఇవి – ఈ కర్మకాండలు ఒక పలాయనం. మరికొందరికి అవి సంప్రదాయానికీ, ఆధిపత్యానికీ చెందిన విషయం. తల్లికానీ, తండ్రికానీ చనిపోయినప్పుడు అది సాంప్రదాయం కాబట్టి కర్మకాండలు చేయడం అనేది నిస్సందేహంగా మతిస్థిరత్వం లేనివారు చేసే పని. దాని అర్థం ఏమిటో మీకు తెలియదు. కానీ మీ అమ్మనో, నాన్ననో, మీ ఇరుగుపొరుగునో అది సంతోషపెడుతుంది – కాబట్టి చేస్తారు. తనకు అర్థం కాని దానిని చేసే వ్యక్తి తప్పకుండా మతిస్థిరత్వం లేని మనిషే.. ఆధిపత్యాన్ని ప్రమాణంగా తీసుకోవడమూ, అవగాహన కాకపోయినా మీకు వుపశమనం ఇస్తుంది కాబట్టి ఒక పని చేయడమూ నిస్సందేహంగా మతిస్థిరత్వం వున్న వ్యక్తి చేసే పనులు కావు.

ఇక చివరగా, విగ్రహాన్ని పూజించడం అనేది వున్నది. ఒక చిత్రపటం ముందు కూర్చొని మిమ్మల్ని మీరు మరిచిపోవడం. చనిపోయిన వారిని ఎందుకు పూజిస్తారు మీరు ? పోనీ మీ భార్యనీ, పిల్లలనీ, మీ ఇరుగుపొరుగునీ పూజించకూడదూ ? చనిపోయిన వాటిని పూజించడం ఎందుకంటే అవి ప్రతిస్పందన చూపలేవు. కాబట్టి, మీకు కావలసిన విషయాలని వాటికి ఆపాదించవచ్చు. ఇది చాలా అద్భుతమైన పలాయనం. బతికివున్న వాటిని మీరు పూజించరు. ఎందుకంటే అవి ప్రతిస్పందన చూపుతాయి, మీరు ఎంత వెర్రివారో చెప్పేస్తాయి.

సరే, ధ్యానం అంటే ప్రార్థన కాదు, ఏకాగ్రత కాదు, కర్మకాండా పూజలూ కాదు, మాటలు జపం చేయడమూ కాదు, విగ్రహాలను పూజించడమూ కాదు. అప్పుడు, అసలు ధ్యానం అంటే ఏమిటి ? ఏదయినా అవగాహన చేసుకోవాలంటే మనసు నెమ్మదిగా వుండటం చాలా అవసరం. అందులో సందేహం లేదు. ధ్యానం అంటే మనకు అర్థమైనదేమిటి ? ధ్యానం అంటే కేవలం కొన్ని శబ్దాలను మళ్ళీ మళ్ళీ వుచ్చరించడం కాదు. ఒక బొమ్మని ఎదురుగా పెట్టుకొని, దాని వైపే చూస్తూ కూర్చొని, మనల్ని సమ్మోహపరచుకోవడం కాదు – అని కనుక మీరు గ్రహిస్తే, అందులోని సత్యాన్ని కనుక మీరు చూస్తే, అప్పుడు మీ మనసు ఏమవుతుంది ? ప్రార్థనలోని నిజాన్నీ, విగ్రహారాధనలోని నిజాన్నీ, కర్మకాండలోనూ, ఆ మాయామంత్రాల్లోనూ వున్న సత్యాసత్యాలను మీరు గ్రహించినప్పుడు, అప్పుడు మీ మనోస్థితి ఎట్లా వుంటుంది ? ఈ విషయాలన్నింటిలోనూ వున్న సత్యాన్ని కనుక మీరు గ్రహిస్తే, నిస్సందేహంగా మీరు వాటినన్నింటినీ వదిలించుకొని స్వేచ్ఛను పొందుతారు. పొందరూ ? అవన్నీ పోయి

స్వేచ్ఛగా వున్నప్పుడు మీ మనసు మరింత సుస్పష్టంగా, మరింత ప్రశాంతంగా, చాలా నెమ్మదిగా అవుతుంది. ఆ ప్రశాంతతలో యదార్థతత్వం వునికిలోకి వస్తుంది. కాబట్టి ధ్యానం అంటే ఒక ప్రత్యేకమైన నమోనాకు అనుగుణంగా మనసునీ, హృదయాన్నీ క్రమశిక్షణలో పెట్టడం కాదు. ధ్యానం అంటే ఆగకుండా ప్రతిక్షణమూ కొనసాగే అవగాహనా ప్రక్రియ. సత్యాన్ని చూసి గ్రహించినప్పుడే అవగాహన కలుగుతుంది. సత్యం అంటే ఏదో నైరూప్య సత్యం కాదు. వాస్తవంగా వున్నది ఏమిటి అన్న సత్యం. తాడుని చూసి పాము అని పొరబడితే, అది ఒక అసత్యమైన స్థితి. అయితే తాడుని తాడుగానే నేను చూసినప్పుడు, అక్కడ సత్యం వుంటుంది. వస్తువులని సవ్యమైన దృష్టితో నేను చూసినప్పుడు మాత్రమే సత్యం వుంటుంది. విషయాలని స్పష్టంగా, వక్రీకరించకుండా, వున్నవాటిని వున్నట్లుగా చూసే మొత్తం ప్రక్రియే ధ్యానం. అయితే 'ఉన్నది'ని చూడటం, తాడుని చూసి పాము అని పొరబడకుండా వుండటం విపరీతమైన కష్టంతో కూడుకొని వుంటుంది. ఎందుకంటే మనలో చాలామందికి వక్రీకరించకుండా చూసి గ్రహించడం చేతకాదు. అందువల్ల ధ్యానం అంటే మనసుని అని బద్ధంగా చేసే ఒక ప్రక్రియ అనమాట. అంటే – ఒక్కొక్కరి విచిత్ర, వింత స్వభావాలకూ, సహజవైఖరులకూ అనుగుణంగా వారిలో పుట్టుకొని వచ్చే ప్రతి ఆలోచన ఎడలా ప్రతి మనోభావం ఎడలా, ప్రతి సరదా ఎడలా, ఖండనగానీ, సమర్ధనగానీ, నిరోధంగానీ లేకుండా ఎరుకతో వుండటం. కాబట్టి, ధ్యానం అంటే గతం నుండి విముక్తి పొందడం. మీ ప్రతిస్పందనలను నిబద్ధం చేస్తున్నది గతంలోని జ్ఞాపకాలే. ఈ గతాన్నుంచి మనసును విముక్తం చేసే ప్రక్రియే ధ్యానం.

ఇక్కడ ఒక ఇబ్బంది ఎదురవుతుంది. 'ఉన్నది'ని వక్రీకరించకుండా చూడాలంటే, విషయాలని సుస్పష్టంగా, వున్నవాటిని వున్నట్లుగా చూడాలంటే మనసు తనను తాను గతాన్నుంచి విడిపించుకొని స్వేచ్ఛగా వుండటం అవసరం. అయితే గతం కారణంగా ఏర్పడినటువంటి మనసు, తనని తాను గతం నుంచి ఎట్లా విడిపించుకుంటుంది ? అయితే, ప్రతి ఆలోచనా గతం తయారుచేసిన వుత్పాదన అని మీరు గుర్తించినప్పుడు, ఆలోచన ఏ సమస్యనూ పరిష్కరించలేదని పూర్తిగా తెలుసుకున్నప్పుడు, అప్పుడు మాత్రమే మనసు గతం నుంచి తనను విడిపించుకొనగలుగుతుంది. సమస్య అంటే ఒక సవాలు. సవాలు ఎప్పుడూ కొత్తదే. పాతకు సంబంధించిన వాటికి అనుగుణంగా కొత్తదానికి అర్థం చెప్పుకుంటే, కొత్త దానిని తిరస్కరించినట్లే. వక్రీకరణ చేసే కేంద్రం తానే అని మనసు గ్రహించి స్వేచ్ఛనూ, స్పష్టతనూ పొంది, గతపు సంకెళ్ళను విడిపించుకున్నప్పుడు, మనసు 'నీవు' 'నేను' అంటూ విడివిడిగా విభజించుకోవడం మానివేసినప్పుడు – అప్పుడు మనసు నిశ్చలంగా

వుంటుంది ఆ నిశ్చలత్వంలోనే అవగాహన వుంటుంది. గ్రహింపు వుంటుంది. యదార్థతత్వం వుంటుంది. ఇది ప్రతివారూ తామే అనుభూతి చెందవలసిన అనుభవం. దానిని మళ్ళీ మళ్ళీ పునరావృతం చేసుకోకూడదు. అట్లా పునరావృతం చేసుకుంటే అది పాతదే అవుతుంది. మానవ సమస్యలను పరిష్కరించాలనే ఆసక్తి కనుక మీకు వుంటే, అప్పుడు ఈ రకమైన ధ్యానం వుండితీరాలి. గాలి వీచడం ఆగిపోయినప్పుడు కొలను నిశ్చలనంగా అయినట్లు మనసు సహజమైన నెమ్మదిని పొందినప్పుడు యదార్థతత్వం వునికిలోకి వస్తుంది.

ప్రశ్న : పుట్టుకతోనే మనుష్యుల్లో అసమానతలు వున్నాయి. తెలివి తేటలను గురించి చేసే పరీక్షలు దీనిని నిరూపిస్తున్నాయి. మన శాస్త్రాలు కూడా ఈ వాస్తవాన్ని గుర్తించాయి. సాత్వికులు, రాజసులు, తామసులు అని మూడు రకాలుగా మనుష్యుల్ని విభజించాయి. అటువంటప్పుడు మీరు మీ సందేశం అందరి కోసమూ అనీ, వారి మనస్తత్వాల్లోనూ, తెలివితేటల్లోనూ వున్న వ్యత్యాసాలతో దీనికి సంబంధం లేదనీ ఎందుకంటున్నారు ? అందరూ సమానమేనని మీరు ఒక నిర్ధారణకు రావడం మీ బాధ్యత నుంచి తప్పించుకోవడం కాదా ? ఇదీ ఒక రకమైన వితండవాదన కాదా ?

కృష్ణమూర్తి : సర్ ! అందరమూ సమానంగా లేము అనే సంగతి స్పష్టంగా కనబడుతున్న వాస్తవం. పురుషుడికీ పురుషుడికీ మధ్య, స్త్రీకీ స్త్రీకీ మధ్య బ్రహ్మాండమైన వ్యత్యాసం వున్నది. అయితే ఒకరిని మీరు ప్రేమిస్తున్నప్పుడు ఆ వ్యత్యాసం వుంటుందా ? అప్పుడు అసమానతలు కనిపిస్తాయా ? అప్పుడు జాతీయ భేదాలు వుంటాయా ? హృదయం ఖాళీగా వున్నప్పుడే విభిన్నతలూ రకాలూ చాలా ముఖ్యమవుతాయి. అప్పుడు మానవులందర్నీ తరగతుల వారీగా, రంగుల వారీగా, జాతుల వారీగా విభజిస్తాం. అయితే, మీరు కనుక ప్రేమిస్తే, అప్పుడు వ్యత్యాసాలు వుంటాయా ? మీ హృదయంలో కనుక ఔదార్యం వుంటే మీరు విచక్షణ చూపిస్తారా ? మిమ్మల్నే సమర్పించుకుంటారు. ఈ ఔదార్యగుణం లేని మనిషి, బ్యాంకులో తన డబ్బు ఎప్పుడూ లెక్కపెట్టుకునే మనిషి ఈ విభిన్నతలూ, ఈ విభజనలూ అట్లాగే కొనసాగాలనుకుంటాడు. సత్యాన్వేషణ చేస్తున్న మనిషికి విభజనలు వుండవు. సత్యం అన్వేషించడం అంటే చురుగ్గా వుండటం, వివేకంతో వుండటం, ప్రేమ అంటే తెలిసివుండటం. ఒక ప్రత్యేకమైన మార్గాన్ని పట్టుకొని పోతున్న వారికి సత్యం ఏనాటికీ తెలియదు. ఎందుకంటే ఆ మార్గం తక్కినవాటిని దూరంగా నెడుతుంది, నేను చెప్తున్నది అందరికీ వర్తిస్తుంది అని నేనంటున్నప్పుడు అది ప్రజాస్వామ్యాన్ని ప్రశంసించడం కాదు. అసలు ప్రజాస్వామ్యం ప్రపంచంలో లేనే లేదు. సగటు మనిషిని మెప్పించడం చాలా నీచమైన వంచన. అది రాజకీయవేత్తలు చేసే పని.

నేను చెప్తున్నది ప్రతివారికీ, అంటే వారు ఏ అంతస్తులో వున్నా, భాగ్యవంతులయినా, పేదవారయినా, వారి మనస్తత్వం ఎటువంటిదయినా సరే - అందరికీ వర్తిస్తుంది. బాధలు మనందరికీ వున్నాయి. సమస్యలు అందరికీ వున్నాయి. ఎన్నో విచారాల భారాన్ని మనం మోస్తున్నాం. అంతులేని సంఘర్షణల్లో మునిగివున్నాం. మరణం, దుఃఖం, బాధ మనందరికీ సదా వెంటవుండే సహచరులు. అధిష్ఠానశ్రేణి అనే సూత్రం ఆధ్యాత్మిక చింతనకు హానికరం అనేది స్పష్టంగా తెలుస్తున్నది. మనుష్యుల్ని వున్నతులూ, అల్పులూ అని విభజించడం అజ్ఞాన లక్షణం. మనందరమూ కూడా చేతనావర్తంలోని వివిధ స్థాయిల్లో బాధలు పడుతున్నాం కాబట్టి, నేను చెప్తున్నది అందరికీ వర్తిస్తుంది. మనందరమూ బాధలనుంచి విముక్తి చెందాలని కోరుకుంటున్నాం. భాగ్యవంతులూ, పేదవారూ, మధ్యతరగతి వారూ - అందరూ. బాధలు మనందరి వంతుకీ సమానంగా వచ్చిన కష్టం: మనందరమూ కూడా ఈ బాధల్లో నుండి బయటపడే మార్గాన్ని అన్వేషిస్తున్నాం. కాబట్టి, నేను చెప్తున్నది అందరికీ వర్తిస్తుంది.

సరే, మనకి బాధలు వున్నాయి. అయితే వాటినుండి దూరంగా పారిపోవడం వల్ల లాభం లేదు. పారిపోవడం ద్వారా బాధలని అవగాహన చేసుకోలేము. వాటిని ప్రేమించి. అర్థం చేసుకోవడం ద్వారా అది సాధ్యం. మీరు దేనినయినా ప్రేమిస్తున్నప్పుడు దానిని అర్థం చేసుకోగలుగుతారు. మీ భార్యని ప్రేమిస్తున్నట్లవుతే ఆమెని అవగాహన చేసుకోగలుగుతారు. మీ పొరుగు మనిషి మీద ప్రేమ వుంటే అర్థం చేసుకోగలుగుతారు - అయితే ప్రేమ అంటే 'ప్రేమ' అనే ఆ మాటలో పడి కొట్టుకొనిపోవడం కాదు. మనలో చాలామంది బాధలనుంచి పారిపోతూ వుంటాం. దీనికి మనసు తన చాతుర్యం వుపయోగించి చేసే అసంఖ్యాకమైన గారడీలు సహాయపడుతుంటాయి. బాధలని ముఖాముఖిగా ఎదుర్కొన్నప్పుడే అవి అర్థం అవుతాయి. వాటిని తప్పించుకోవాలని అవిరామంగా ప్రయత్నించడం వల్ల కాదు. బాధలని తప్పించుకోవాలనే ఈ కోరిక వల్లనే మన ధ్యాసను మళ్ళించే కాలక్షేపాల సంస్కృతిని ఒకదానిని మనం తయారు చేసుకున్నాం. అదే మత వ్యవస్థ - దానితో పాటుగా వుండే వుత్సవాలూ, పూజలూ. ఇక ధనం పోగుచేసుకోవడానికి ఇతరులను దోపిడీ చేయడం. ఇవన్నీ కూడా బాధలనుంచి తప్పించుకునే లక్షణాలు. మీరూ, నేనూ, వీధిలో నడుస్తున్న ఆ సామాన్యుడూ - ఎవ్వరయినా బాధని అవగాహన చేసుకోగలం. సందేహం లేదు. అయితే, మన పూర్తి సావధానాన్ని దానికి ఇచ్చితీరాలి. కానీ, దౌర్భాగ్యం ఏమిటంటే ఆధునిక నాగరికత తన వినోదాల ద్వారా, కాలక్షేపాల ద్వారా, మాయగొల్పే ఇంద్రజాలాల ద్వారా, కొన్ని మాటల్ని వల్లె వేయడం మొదలైన వాటి ద్వారా బాధలనుంచి దూరంగా పారిపోవడానికి మాత్రమే సహాయపడుతున్నది. కాబట్టి, ఈ అసంఖ్యాకమైన పలాయనాలను గురించి మనం

తెలుసుకొని వుండాలి. పలాయనాల నుంచి విముక్తి పొందినప్పుడే మనిషి బాధకు గల మూల కారణాన్ని సమాప్తం చేయగలుగుతాడు. సంతోషంగా వున్న మానవుడికి, ప్రేమించే మనిషికి విభజనలు వుండవు. అతడు బ్రాహ్మణుడూ కాదు, ఆంగ్లేయుడూ కాదు. అటు జర్మనీవాడూ కాదు, ఇటు హిందువూ కాదు. అటువంటి మనిషికి వున్నతుడూ, అల్పుడూ అనే విభజన లేదు. మనం ప్రేమించడం లేదు కాబట్టి ఈ విద్వేషపూరితమైన విభజనలని చేస్తుంటాం. మీరు ప్రేమిస్తున్నప్పుడు సమృద్ధంగా వుండే ఒక నిండుతనం, ఆ జీవన సౌరభం వెల్లివిరుస్తుంది. అప్పుడు మీ హృదయాన్ని మరొకరితో పంచుకోవడానికి సిద్ధపడతారు. హృదయం నిండుగా వున్నప్పుడు మనసుకు సంబంధించిన విషయాలు రాలి పడిపోతాయి.

ప్రశ్న : మహారాష్ట్రం ఎందరో మహాత్ములకు పుట్టినిల్లు. మహారాష్ట్రకు చెందిన ధ్యానేశ్వర్, తుకారాం మొదలైన మహానుభావులు తమ జీవితాలను ధారపోసి, భక్తి మార్గం ద్వారా సత్యాన్ని తెలుసుకున్నారు. ఆ విధంగా లక్షలాది సామాన్య ప్రజానీకానికి, స్త్రీలకూ, పురుషులకూ చేయూతనిచ్చి తోడ్పడ్డారు. ఇప్పటికీ వారంతా భక్తి విశ్వాసాలతో పండరిపురంలోని ఆలయాన్ని ప్రతి యేటా దర్శిస్తుంటారు. ఈ మహాత్ములు కొన్ని మంత్రాలను వుపదేశించారు. మీరు కూడా మీ సందేశాన్ని సరళంగా తయారుచేసి, సామాన్య మానవుడి స్థాయికి తీసుకొని రాకూడదూ ?

కృష్ణమూర్తి : మనలో చాలామందికి భక్తి వుంటుంది. దేనికో ఒకదానికి పూజలు చేయాలనుకుంటారు. మంత్రాలు జీవితాన్ని ఒక సులభ మార్గంలో పెట్టాయి. కాబట్టి, లక్షలాది మందికి సహాయం చేశాయి. కాబట్టి, నేను కూడా ఎందుకు నా బోధనలను సరళంగా చేయకూడదూ ? అదీ ప్రశ్నలోని సారాంశం. సర్ ! కొన్ని మాటల్ని మళ్ళీ మళ్ళీ అనడం వల్ల, ఒక పేరుని మళ్ళీ మళ్ళీ జపించడం వల్ల ఆత్మకి పుష్టి చేకూర్చవచ్చని అనుకుంటున్నారా ? లేదూ మనసుని వట్టి జడంగా తయారు చేస్తున్నారా ? దేన్నయినా సరే, పదే పదే జపం చేయడం వల్ల మనసు మొద్దుబారిపోతుంది. కొన్ని పదాలను వదలకుండా జపం చేయడం అనేది మనసుని జడంగా తయారుచేసి, ఇక విప్లవం కానీ, అన్వేషణ కానీ, సున్నితమైన స్పందనలు కానీ లేకుండా పరిహరించి వేసెయ్యడానికి పన్నిన కపటోపాయమా ? ప్రభుత్వాలు కూడా 'మనం చేస్తున్నదే సరియైనది, తక్కిన పార్టీలు చేసేవన్నీ తప్పులు' అని మళ్ళీ మళ్ళీ అదే పనిగా ప్రకటిస్తూ, మనిషి మనసుని స్పందన లేకుండా జడంగా తయారుచేయడం తమ విధుల్లో ఒకటిగా పెట్టుకున్నారు. ఒక పేరుని పట్టుకొని, అదే మళ్ళీ మళ్ళీ జపం చేస్తూవుంటే, ఒక పూజా కార్యక్రమాన్ని అదే పనిగా పదే పదే నిర్వహిస్తూ వుంటే, సున్నితంగానూ మృదువుగానూ వుండవలసిన

మనసు తప్పకుండా మొద్దుబారిపోతుంది. మనలో చాలామందికి ఏదో ఒక రకమైన భక్తి పూరితమైన జీవితం గడపాలనే వుంటుంది. అయితే, దౌర్భాగ్యం ఏమిటంటే మళ్ళీ మళ్ళీ వల్లెవేయడం అనే ఈ కసరత్తులు దానిని హతమార్చి వేస్తాయి. భక్తి మార్గమూ వివేక మార్గమూ వేరు వేరు కావు అని అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం. ఏ ఒక్క మార్గం ద్వారానూ సంబంధబాంధవ్యాలను - అంటే స్వస్వరూప దర్శనం అనే ప్రక్రియను అవగాహన చేసుకోలేము. నేను జీవితాన్ని అవగాహన చేసుకోవాలి అని అనుకుంటే జీవితాన్ని జీవించాలి. చురుగ్గా వుండాలి, జీవితాన్ని గురించిన వివేకాన్ని నాలో నింపుకోవాలి. ఒక మార్గాన్ని పూర్తిగా కాదనడం, ఇంకో మార్గాన్ని ఎంచుకోవడం వక్రభాష్యమే అవుతుంది. అది తన లోపల పరస్పర వైరుధ్యాలున్న స్థితి అవుతుంది.

ఈ ప్రశ్న అడిగినవారు సామాన్య మానవుడికి కూడా అందేటట్లుగా నా బోధనలను సులభంగా ఎందుకు తయారుచేయడం లేదని ప్రశ్నిస్తున్నారు. ఇది చాలా విపరీతంగా తోస్తున్నది. సామాన్య మానవుడిని గురించి మీరెందుకు ఇంతగా విచారిస్తున్నారు ? మీకు నిజంగానే సామాన్య మానవుడిని గురించిన అక్కర వున్నదా ? నాకు సందేహమే. సామాన్యుడిని గురించి కనుక మీకు చింత వుంటే, ఏదో ఒక విధానాన్ని మీరు ఆరాధించరు. ఏ రాజకీయ పక్షాలూ వుండవు. వామపక్షం గానీ మరో పక్షంగానీ వుండవు. సామాన్య మానవుడి మీద మీకు ప్రేమ లేనప్పుడే, ఫలానా విధానాన్ని మాత్రమే ప్రేమిస్తున్నప్పుడే ఆ ఫలానా విధానమే మీకు ముఖ్యమైనది అవుతుంది. ఆ విధానం, అంటే ఆ సిద్ధాంతవాదం కోసం సామాన్య మానవుడిని చంపడానికీ, నాశనం చేయడానికీ మీరు వెనకాడరు. నిజంగా చూస్తే, సామాన్య మానవుడు అంటే మీరూ, నేనే. నేను చెప్తున్నది అర్థం చేసుకోవడంలో వున్న ఇబ్బంది ఏమిటి ? మొట్టమొదటి ఇబ్బంది ఏమిటంటే మీకు అర్థం చేసుకోవాలని లేదు. అర్థం చేసుకుంటే విప్లవం వచ్చి పడుతుంది, అది మీలో అలజడి రేపుతుంది. మీ నాన్నగారినీ, మీ అమ్మనూ, మీ భార్యనీ అందర్నీ చీకాకుల్లో పడేస్తుంది. అందుకని 'మీ బోధనలు చాల క్లిష్టంగా వున్నాయి' అని మీరు అంటుంటారు. మరో మాటల్లో చెప్పాలంటే, సర్ ! ఒక విషయాన్ని మీరు అవగాహన చేసుకోదలుచుకోకపోతే దానిని క్లిష్టంగా చేసుకుంటారు. ఒక విషయాన్ని అవగాహన చేసుకోదలుచుకుంటే, దానిమీద ప్రేమ కలుగుతుంది. ప్రేమిస్తున్నప్పుడు, జీవితం సరళంగా, సుగమంగా వుంటుంది. మీలో అసలు ప్రేమే లేదు కాబట్టి - మీ భార్య అంటే ప్రేమ లేదు, అసలు దేనిమీదా ప్రేమ లేదు - కాబట్టి ఇదంతా చాలా క్లిష్టమైన తత్వం అవుతున్నది మీ దృష్టిలో. అందుకని అర్థం చేసుకోవడం కష్టం అవుతున్నది. ఒక్కరిని మీరు ప్రేమిస్తుంటే తక్కిన అందరినీ కూడా ప్రేమిస్తారు. అందరి ఎడలా హృదయం ఆత్మీయంగా అవుతుంది. అప్పుడు ఒక సున్నితమైన, మృదువైన స్థితిలో మీరు వుంటారు.

మనలో అటువంటి మృదుశీలమైన, ఆత్మీయమైన ఆప్యాయత లేదు గాబట్టి, మాటల మీదే బతుకుతూ వుంటాం. మాటలే మనకి ప్రాణాదారం. ఏదో ఒక విధానాన్ని పట్టుకొని ఆరాధిస్తూ వుంటాం ; అందులో సహించశక్యంగాని వర్గ, జాతి విభజనలు వున్నా సరే ; ఆర్థిక రంగపు హద్దులు వున్నా సరే. ఎందుకంటే హృదయాల్లో ఏమీ లేక, వట్టిపోయి వున్నాయి గాబట్టి. అవగాహన చేసుకోవాలంటే మీ హృదయాల్లో ప్రేమ వుండాలి. ప్రేమ ప్రయత్నించి అలవరచుకునే విషయం కాదు. మనసుకు సంబంధించిన విషయాలు ఆటంకపరచనప్పుడు ప్రేమ అతివేగంగా, వెంటనే, సూటిగా వునికిలోకి వస్తుంది. మన హృదయాలు ఖాళీగా వుండటం వల్ల, మీకూ నాకూ మధ్య అన్యోన్యమైన భావప్రసారం జరగడం లేదు. వింటూనే వుంటాం, ఎన్నో మాటలు వుంటాయి, వాదోపవాదాలు జరుగుతాయి. కానీ మన మధ్య అన్యోన్యమైన భావప్రసారం జరగదు. ఎందుకంటే మన మధ్య ప్రేమ లేదు. ప్రేమ వున్నప్పుడు – ఆ ఆత్మీయతా, ఆ ఔదార్యమూ, ఆ దయార్ద్రతా, ఆ క్షమాగుణమూ వున్నప్పుడు – ఏ తత్వచింతనా అక్కర్లేదు, బోధకులూ అవసరం లేదు ఎందుకంటే ప్రేమ దానికదే అసలైన సత్యం.



# 1948 లో ప్రసంగాలు

## పూనా

**అక్టోబరు 10**

స్వీయజ్ఞానం పొందకుండా మానవ సమస్యల్ని వేటినీ శాశ్వతంగా పరిష్కరించలేమని మేము చెప్తూ వచ్చాం. ఒక సమస్యను పూర్తిగా పరికించి చూసి, మన ఆలోచనల, మన మనోభావాల, మన చర్యల కదలికలను ఒక సమగ్రమైన, సమైక్యమైన మొత్తంగా పరిశీలించడానికి మనలో చాలామంది సిద్ధంగా లేరు. మనము అనే సంపూర్ణ ప్రక్రియను అవగాహన చేసుకోకుండానే, తక్షణమే ఒక పరిష్కారం దొరకాలని మనలో చాలామంది ఆశిస్తుంటారు. ఈ విషయాన్ని విచారించడం కోసం పురోగమనం, ప్రత్యేక నైపుణ్య సాధన అనే విషయాలను మనం పరిశీలించాలి. పురోగమనం వున్నది, పరిణామక్రమం వున్నది. పెరుగుదల వున్నది అనే ఒక భావన మనలో చాలా జాగ్రత్తగా పోషించబడింది, ఆ చట్రంలో మనం బిగించబడ్డాం. ఇప్పుడు ఆ విషయాన్ని పరీక్షిద్దాం. సాంకేతికమైన పురోగమనం వున్నది – ఎడ్లబండి నుండి జెట్ విమానానికి. అందులో సందేహం లేదు. పెరుగుదల కూడా వున్నది – గింజలో నుండి మహావృక్షం ఎదుగుతుంది. ఇక అదేవిధంగా, మనం కూడా ఎదిగి ఏదో అవుతాం అని మనం అనుకుంటాం – ఏదో ఫలితాన్ని, ఒక గమ్యాన్ని సాధిస్తాం – అని అనుకుంటాం. కాబట్టి ఈ మూడు విషయాలనూ – సాంకేతిక పురోగమనం, ఎదుగుదల, మరొకలాగా అవడం – వీటన్నింటినీ కూడా పరిణామం అనే అంశం కింద పరిగణిస్తాం. సాంకేతికమైన అభివృద్ధికి చెందిన పురోగమనాన్ని లేదు పొమ్మనడం అసంమజసంగా వుంటుంది. చాలా ప్రాథమికమైన స్థాయిలో వుండే చోదక యంత్రాలనుండి టర్బోజెట్ అనే ఇంజన్ల తయారీని మనం చూశాం. అద్భుతమైన వేగంతో, గంటకి 1,500 మైళ్ళ వేగంతో నడిచే విమానాల తయారీ ఇప్పుడు సాధ్యమైంది. విత్తులో నుండి మొక్క ఎదగడం, ఆపైన పూవు పూయడం, అది కాయగా, పండుగా ఎదగడం అనే పెరుగుదలని కూడా మనం కాదనడం అసంమజసం. అయితే అదే విధమైన దృక్పథంతో మానవ చేతనని కూడా మనం పరిగణిస్తున్నాం. పురోగమనం వున్నదీ, పరిణామం వున్నదీ, కాలక్రమంలో ఒక ఫలితాన్ని మనం అందుకోగలం అని మనం అనుకుంటాం. అసలు మానవుడి విషయంలో పురోగమనం వున్నదా, పరిణామశీలమైన ఎదుగుదల వున్నదా, కాలక్రమంలో మీరూ నేనూ ఒక ఫలితాన్ని, అంటే యదార్ధతత్వాన్ని అందుకోవడం అనే ఫలితాన్ని సాధించడం సాధ్యమా అన్న విషయాన్ని పరిశీలించాలని నేను కోరుకుంటున్నాను. మానవుడు

పరిణామక్రమంలో అభివృద్ధి చెందుతున్నాడు అనీ, చివరకు ఏదో అవుతాడు, సాధిస్తాడు అనీ మనం మాట్లాడుకుంటూ వుంటాం. పోనీ ఈ జన్మలో కాకపోతే మరో ముందు జన్మలో, అంటే, కాలక్రమేణా మీరు ఇంతకంటె గొప్పగా, అందంగా, ఇంతకంటె ఎక్కువ అర్హత గలవారిగా పరిణామం చెందుతారు అని అంటూవుంటాం.

సరే, మీరు ఇంతకంటె వివేకవంతులు అవడమూ, ఇంతకంటే అందంగా అవడమూ, ఇంతకంటే గుణవంతులు అవడమూ, కాలప్రక్రియ ద్వారా యదార్థతత్వానికి దగ్గరగా చేరడమూ అనేవి అసలు వున్నాయా ? పరిణామక్రమం గురించి మనం మాట్లాడుతుంటే దాని అర్థం అదే. భౌతికమైన పరిణామక్రమమూ, పెరుగుదలా నిస్సందేహంగా వున్నాయి. అయితే, మానసికమైన పెరుగుదల, పరిణామం వున్నదా ? లేదూ, ఇది మనసు తన రూపం మార్చుకోవాలనే కోరికతో అల్లుకున్న ఒక కాల్పనిక చిత్రమా ? మరొకలాగా అవాలనే మిధ్యాలోచనలో అందువల్లనే పడుతున్నదా ? మరొకలాగా అవాలంటే ఒక దానిలో ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించాలి, సాధించవద్దూ ? అట్లా ప్రత్యేకత సాధించేది ఏదయినా కొంత కాలానికి చనిపోతుంది, క్షీణించిపోతుంది. ఎందుకంటే ప్రత్యేక నైపుణ్యం గణించడంలో ఇమిడిపోవడం అనే లక్షణం లోపిస్తుంది. ఇమిడిపోగలగడం, విరగకుండా మెత్తగా వంగగలగడమూ వున్నప్పుడే జీవి కొనసాగగలుగుతుంది. కాబట్టి, మరొకలాగా అవాలని అనుకుంటున్నంత వరకు ప్రత్యేక నైపుణ్యం సాధించడం వుంటుంది. ప్రత్యేకత అంటేనే సంకుచితపరచే ఒక ప్రక్రియ అనడంలో సందేహం లేదు. అందులో మెత్తగా సాగిపోయే మృదుత్వానికి ఏ ఆస్కారమూ వుండదు. కాబట్టి మరణమూ, క్షీణించడమూ, నశించడమూ తప్పవు. ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించిన జంతుజాతి క్షీణించి క్షయమై పోవడం మనం చూస్తున్న సంగతే. అది జీవశాస్త్రానికి సంబంధించిన వాస్తవం. సరే, మానవులు ఒక ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించితీరాలని వున్నదా ? ఒక వృత్తి విద్యను గణించాలంటే – డాక్టరవాలన్నా, న్యాయవాది అవాలన్నా, సైన్యంలో సేనాధిపతి వంటి అధికారి అవాలన్నా, తుఫాను సమయంలో సముద్రంలో పడవ నడపాలన్నా – ప్రత్యేకతను సాధించాలి. అయితే, మానసికమైన ఒక ప్రత్యేక నిపుణతను సాధించడం అవసరమా ? వివరంగా చెప్పాలంటే – స్వీయజ్ఞానం అంటే ప్రత్యేకతను సాధించే ప్రక్రియా ? అదే గనుక అయితే, అటువంటి ప్రత్యేకతను సాధించే ప్రక్రియ మనిషిని సర్వనాశనం చేస్తుంది. ఇప్పుడు ప్రపంచంలో జరుగుతున్నది అదే. ప్రత్యేక నైపుణ్యాన్ని గడించడం ద్వారా సాంకేతికమైన పురోభివృద్ధి చాలా త్వరితగతిని జరుగుతున్నది. అయితే మనస్తత్వ విషయకంగా చూసినప్పుడు మనిషి అంత శీఘ్రగతిని ఇమిడిపోలేడు. ఎందుకంటే, జీవితాన్ని కూడా మనం ప్రత్యేక నైపుణ్యం సాధించాలనే మనోవైఖరితోనే సమీపిస్తాం. మరో మాటల్లో చెప్పాలంటే, సాంకేతిక

రంగంలో ప్రత్యేకత సాధించడం లాగే స్వీయజ్ఞానం అనే ప్రత్యేకతను సాధించాలనే అపోహ మనలో అది కలిగించింది. ఇందులో నిపుణులం అవాలనీ, మనల్ని మనం అవగాహన చేసుకోవడంలో ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించాలనీ అనుకుంటాం. కాబట్టి, ఈ సమస్య ఎడల మన మనోవైఖరి, మన దృక్పథం ఏమిటంటే ప్రత్యేక నైపుణ్యం సాధించి తీరాలి. అంటే అర్థం ఏమిటంటే మరొకలాగా అవాలీ అని. ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించాలంటే మిమ్మల్ని మీరు క్రమశిక్షణలో పెట్టుకోవాలి, అణచివుంచుకోవాలి, మీ శక్తి సామర్థ్యాలను ఒకదారిలో పెట్టుకోవాలి, మీ ధ్యాసను ఒక ప్రత్యేక విషయంపై కేంద్రీకరించాలి - ఇంకా అటువంటివి. ప్రత్యేక నైపుణ్యం అంటే అందులో ఇవన్నీ అంతర్గర్భితంగా వుంటాయి.

సరే. నిస్సందేహంగా మనిషి చాలా జటిలమైన జీవి. తనని గురించి తాను అవగాహన చేసుకోవడంలో ఒక ప్రత్యేక నైపుణ్యాన్ని గడించలేడు. మీలో సంక్లిష్టతా, సూక్ష్మశీలత్వమూ వున్నాయి ; రకరకాల సత్వాలను కలిపి మీరు చేయబడ్డారు. కాబట్టి అంతటినీ ఒక సంపూర్ణత్వంగా అవగాహన చేసుకోవాలి తప్ప ఏదో ఒక కోణంలో నుండి చూసి ప్రత్యేకతను గడించడం కాదు. కాబట్టి, నేను, నాత్వం అనే ప్రక్రియను అవగాహన చేసుకోవడానికి - అంటే స్వీయజ్ఞానం పొందడానికి, ప్రత్యేక నైపుణ్యం నిరోధకారకం అవుతుంది. త్వరగా ఇమిడిపోవడానికి ఈ ప్రత్యేక నైపుణ్యం ఆటంకంగా వుంటుంది. ప్రత్యేక నైపుణ్యాన్ని గడించేదేదైనా త్వరలోనే క్షీణించి, వాడి వడలిపోతుంది. అందువల్ల, మనల్ని మనం అవగాహన చేసుకోవాలంటే అసాధారణమైన మెత్తదనం వుండాలి. భక్తిలోనో, క్రియాచరణలోనో, జ్ఞానంలోనో ప్రత్యేకత్వాన్ని గడించినప్పుడు మనలో ఈ మృదుత్వం లేకుండా పోతుంది. భక్తిమార్గం అనీ, కర్మమార్గం అనీ, జ్ఞానమార్గం అనీ రకరకాల మార్గాలు లేవు. వీటిలో ఏదో ఒక మార్గాన్ని పట్టుకొని, అందులో మాత్రమే ప్రత్యేకతను గడించేవారు తప్పకుండా తమ నాశనాన్ని తామే కొని తెచ్చుకుంటారు. అంటే ఒక మార్గానికి గాని, ఒక దృక్పథానికి గానీ కట్టుబడివున్న వ్యక్తిలో మెత్తగా వుండే గుణం పోతుంది. అటువంటి మృదుత్వం లేనప్పుడు విరిగిపోవడం తప్పదు. తుఫాను గాలికి వంగలేని చెట్టు విరిగి కూలిపోయినట్లుగా, ప్రత్యేక నైపుణ్యాన్ని గడించిన మనిషి విషమ పరిస్థితి ఎదురైనప్పుడు కూలిపోతాడు. తనని తాను అవగాహన చేసుకోవడం చాలా తప్పనిసరి. ఎందుకంటే, మనల్ని ఎదుర్కొని నిలవేసే ఈ అసంఖ్యాకమైన సమస్యలను పరిష్కరించగలిగినది ఒక స్వీయజ్ఞానం మాత్రమే. స్వీయజ్ఞానాన్ని ఏ ఒక్కమార్గం ద్వారానో చేరలేము. మార్గము అనగానే ప్రత్యేక నైపుణ్యం గడించడం - ఒక నిపుణునిగా తయారవడం అని అర్థం - ఆ ప్రక్రియలో మీరు ధ్వంసమైపోతారు. నిపుణుడైన వ్యక్తి సమగ్రమైన సమన్వయత్వం చెందినవాడు కాదని మీరు గమనించలేదూ ? ఏదో ఒక దిశలో అతడు ప్రత్యేకతను సాధించాడు. జీవితం అనే ఈ ప్రక్రియను అర్థం

చేసుకోవాలంటే సమన్వయపూరితమైన క్రియ కావాలి ; సమన్వయ పూరితమైన అవగాహన ఎప్పుడూ వుంటూవుండాలి. అంతే తప్ప ప్రత్యేకించి ఒక దానిమీద వుండే సావధానత్వం కాదు. పరిణామక్రమం అనే పద్ధతిలో ఆలోచించడం - కొంత కాలానికి నేను ఏదో అవుతాను అనుకోవడం - అంటే అర్థం ప్రత్యేక నైపుణ్యాన్ని పొందడం అనమాట. ఎందుకంటే, మరొకలాగా అవడం అంటే ఒక ఫలితాన్ని సాధించడం అన్నమాట. ఒక ఫలితాన్ని సాధించాలంటే అదుపు ఆజ్ఞల్లో పెట్టుకోవాలి, క్రమశిక్షణలో వుండాలి. క్రమశిక్షణ అంటేనే సంకుచితపరచే ప్రక్రియ అనడంలో సందేహం లేదు. మీరొకవేళ ఫలితాన్ని సాధించవచ్చు. అయితే ఫలితాన్ని సాధించడంలో మీరు మాత్రం విరిగి ముక్కలైపోతారు. ఇప్పుడు మనందరికీ జరుగుతున్నది అదే. నిరంతరమూ మారిపోతున్న పరిసరాలలో మనం త్వరత్వరగా ఇమిడిపోలేక పోతున్నాం. ఆ సామర్థ్యం మనలో లోపించింది. ఒక సవాలు ఎదురైనప్పుడు మన ప్రతిస్పందన ఎప్పుడూ నిబద్ధతతో కూడుకొని వస్తూ వుంటుంది. అందువల్ల మనం ఆ సవాలును అవగాహన చేసుకోలేక పోతున్నాం.

కాబట్టి, పరిణామక్రమం అనే దృక్పథంతో, మానసికంగా మరొకటి అవాలి అనే దృక్పథంతో ఆలోచిస్తున్నప్పుడు, ఆ అవడం అంటే ఒక ఫలితాన్ని సాధించడం అనే అర్థం అందులో వుంటుంది. ఒక ఫలితాన్ని సాధించాలి అంటే మిమ్మల్ని మీరు క్రమశిక్షణలో పెట్టుకోవాలి. క్రమశిక్షణకి ఒక ప్రత్యేక నైపుణ్యం అవసరం - అది మళ్ళీ మీ ఆలోచనలను ఒక ఇరుకైన దారిలో బిగించి వేస్తుంది. అందువల్ల మృదుత్వం లేనివారుగా, త్వరగా ఇమిడిపోవడం చేతగానివారుగా తయారవుతారు. ఇమిడిపోలేనిది ఎప్పుడూ విరిగి ముక్కలవుతుంది స్వీయజ్ఞానం వున్న మనిషి మరొకలాగా అవడం అన్న భావనను పక్కకు నెట్టివేయాలి. ప్రతి క్షణం తనను తాను అవగాహన చేసుకుంటూ, ఆ క్షణపు అవశేష ఫలితాన్ని మిగుల్చుకోకుండా చూసుకోవాలి. పరిశీలిస్తూ వుంటే, స్మృతులను కూడబెట్టుకోవడంలో కాకుండా, స్మృతులు పనిచేయకుండా వున్నప్పుడే అవగాహన కలుగుతుందని మీ అంతట మీరే పరిశీలనలో కనిపెడతారు. ఒక వ్యక్తిని, ఆ వ్యక్తి యొక్క పూర్వ చరిత్ర లేకుండా చూసినప్పుడే, అవగాహన చేసుకోగలుగుతారు. పూర్వ చరిత్రని మీవద్ద పెట్టుకుంటే, ఆ వ్యక్తి యొక్క గత చర్యలనూ, అతని అభిప్రాయాలనూ మాత్రమే మీరు గుర్తు చేసుకుంటుంటారు తప్ప, అతనిని అవగాహన చేసుకోవడం జరగదు. అవగాహన చేసుకోవాలంటే మరొకలాగా అవడం అనే భావాలన్నీ అంతమవాలి. అంటే అర్థం - ప్రతి అనుభవమూ తక్షణమే సూటిగా అర్థం చేసుకోవాలి. ఆ అనుభవాన్ని లేదా ఆ సమస్యని అర్థం చేసుకోవడం కోసం పాత నిబద్ధతనూ, పాత నేపథ్యాన్నీ తీసుకొనిరాకుండా వున్నప్పుడే అనుభవాన్ని వెంటనే అవగాహన చేసుకోగలుగుతాం.

తనని తాను అవగాహన చేసుకోవడం అత్యంత ప్రధానం. ఎందుకంటే, ఎంచి చూసే అసలు పరికరాన్ని, గ్రహించి చూసే పరికరాన్ని, పరీక్షించి చూసే పరికరాన్ని అర్థం చేసుకోకుండా మానవ సమస్యలను వేటినీ అవగాహన చేసుకోవడం సాధ్యం కాదు. నా గురించి నాకే తెలియకపోతే నా ఆలోచనలకి పునాది లేనట్లే. అయితే, నన్ను నేను తెలుసుకోవడం ప్రత్యేకమైన నైపుణ్యాన్ని సంపాదించడం ద్వారాగానీ, నన్ను తెలుసుకోవడంలో నిష్ణాతుడిని అవడం ద్వారా గానీ జరిగే పని కాదు. నన్ను నేను తెలుసుకోవడానికి అది ఆటంకంగా తయారవుతుంది. ఎందుకంటే నేను, నాత్వం అంటే కోరిక . అది సజీవమైనది, ఎప్పుడూ చలిస్తూ వుంటుంది, ఎక్కడా విశ్రాంతిగా కూర్చోలేదు, అది ఎప్పుడూ మారిపోతూ వుంటుంది. ఇక ఈ కోరికను అవగాహన చేసుకోవడానికి ఫలానా పద్ధతిలో చర్య తీసుకోవాలి అని చెప్పలేము. ఆరంభమవుతున్నప్పుడే, ఆ ఆ క్షణాల్లోనే కోర్కెను అవగాహన చేసుకోవాలి. మన మనసులకి, చూడగానే పట్టుకొనే సామర్థ్యం గానీ, తక్షణమే ఇమిడిపోయే సామర్ధ్యం గానీ, కోరికను చూసి తక్షణమే గ్రహించే సమర్ధత గానీ లేకపోవడం వల్ల ఆ కోరికను మనకు బాగా అలవాటయిన పద్ధతిలోకి తర్జుమా చేసుకుంటాము. అప్పుడు ఆ పద్ధతే సవాలుకు నిబద్ధతతో కూడి కలిగే ప్రతిస్పందన అవుతుంది. అంటే మనం కోరికను ఎప్పుడూ మన స్మృతులతో చేర్చి ఆ రకంగా అనువదించుకుంటాం కాబట్టి కోరికను ఎప్పటికీ సరిగ్గా అవగాహన చేసుకోనేలేము. కోరికను అవగాహన చేసుకోవడం కోసంగాను ఆ కోరికను మార్చాలనుకోవడమో, ఒక ఫలితాన్ని సాధించాలనుకోవడమో చేయకూడదు. ప్రతి కోరికనూ అది ఆరంభమవుతున్నప్పుడే పరికించండి. దాని అర్థాన్ని అనువదించుకోకండి. ఆ కోరికలో వున్న విషయాన్నే దాని లోపలి అంతరార్థాన్ని మీకు అందజేయనీయండి. మరో మాటల్లో చెప్పాలంటే, నిన్న నేను వివరించినట్లుగా, ఒక పాటను వింటున్నట్లు, చెట్లకొమ్మల్లో వీస్తున్న గాలిని వింటున్నట్లుగా కోరికను ఆలకించండి. కోరిక అనే మొత్తం ప్రక్రియను, దానిని మార్చాలని గానీ, అదుపు చేయాలని గానీ, రూపురేఖలు మార్చాలని గానీ ప్రయత్నించకుండా, ఆ కోరికను ఆలకించండి అప్పుడు కోరిక తన సంపూర్ణమైన అర్థాన్ని విప్పి చెప్పుతుంది. కోరిక లోపల వున్న విషయాన్ని అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే మీకు స్వేచ్ఛ లభిస్తుంది.

క్లుప్తంగా చెప్పాలంటే, మనోతత్వాన్ని గురించిన ఒక ప్రత్యేక నైపుణ్యాం సాధించడం అంటే మరణం . మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడానికి, ఎవరో ఒక నిపుణుని వద్దకు వెళ్ళడం వల్ల గానీ, పుస్తకాల వల్లగానీ ఏమీ లాభం లేదు. మీరే మీకు ఆచార్యులు, శిష్యులూ కూడా. మరొకరి వద్దకు వెళితే, ప్రత్యేక నైపుణ్యాం సాధించడంలో అతను మీకు సహాయం చేస్తాడు. అయితే, మిమ్మల్ని మీరు

అవగాహన చేసుకోవాలని మీకు గాఢంగా వుంటే, నిన్నలను కూడబెట్టి వుంచడం గానీ, గడచిన క్షణాలను కూడబెట్టి వుంచడం గానీ లేనప్పుడు మాత్రమే ప్రతి క్షణమూ అవగాహన జరుగుతూ వుంటుంది. మనసు తననూ, తన కార్యకలాపాలనూ పూర్తిగా, సంపూర్ణంగా అవగాహన చేసుకున్నప్పుడు, అప్పుడు మాత్రమే యదార్ధతత్వం వుంటుంది.

ప్రశ్న : సంపూర్ణమైన సావధానత ఇవ్వడం అంటే అర్ధం ఏమిటో దయచేసి వివరంగా చెప్తారా ?

కృష్ణమూర్తి : సంపూర్ణమైన సావధానతలోని ప్రాధాన్యత ఏమిటో అర్ధం చేసుకోవాలంటే ముందుగా పరధ్యాస అంటే ఏమిటో అర్ధం చేసుకోవాలి. ఎందుకంటే, ఒక వ్యక్తిలో పరధ్యాస లేనప్పుడు పూర్తి సావధానత వుంటుంది. సంపూర్ణ సావధానత అంటే ఏమిటి అని వూరికే ప్రశ్నించడమూ, జవాబు రాబట్టడమూ వల్ల – సకారాత్మకమైనదీ, ఒక దిశగా మళ్ళించినదీ అయిన సావధానత అని మీరు అంటుంటారే – ఆ సంపూర్ణ సావధానత అంటే ఏమిటో కనిపెట్టగల మీ స్వంత సామర్ధ్యం నశించిపోతుంది. ఇది స్పష్టంగా వున్నది కదూ? ఉన్నదా లేదా? సంపూర్ణ సావధానత అంటే ఏమిటో నేను మీకు చెప్తే సరిగ్గా దాన్నే, ఆ మాటలనే మీరు మళ్ళీ మననం చేస్తూ వుంటారు. చేస్తారు కదూ ? అప్పుడది సంపూర్ణ సావధానత్వం అవదు. ఒక ప్రత్యేకమైన పద్ధతిలో ఆలోచించడం గానీ, ధ్యానం చేయడం గానీ, మనసుని ఒక ప్రత్యేకమైన భావం మీద కేంద్రీకరింపజేయడం గానీ సంపూర్ణ సావధానత కాదు. అయితే, మీరూ, నేనూ పరధ్యాస అంటే ఏమిటి అని ప్రశ్నించుకొని, విచారణ చేసి, అవగాహన చేసుకుంటే, అప్పుడు, ఆ ప్రశ్నను నకారాత్మక కోణం నుంచి – అంటే ఏది సావధానత్వం కాదో దానిని తీసివేస్తూ సమీపించినప్పుడు సంపూర్ణ సావధానత్వం వున్నట్లు మీరు కనిపెడతారు. నేను చెప్తున్నది స్పష్టంగా వున్నదనే ఆశిస్తాను. ఎందుకంటే ఇది చాలా ముఖ్యమైన విషయం. ఒక సమస్యను అనుకూల కోణం నుంచి లేక సకారాత్మక కోణం నుంచి చూడటం సమస్యను అవగాహన చేసుకోవడానికి ఆటంకంగా నిలబడుతుంది. అయితే సమస్యను ప్రతికూల కోణం నుంచి, నకారాత్మక కోణం నుంచి చూసినప్పుడు – అసలు ప్రతికూలంగా ఆలోచించడమే – అంటే కానిది ఏది అనే కోణంలో చూడటమే అత్యున్నతమైన విచారణ – అప్పుడు సంపూర్ణ సావధానత అంటే ఏమిటి అన్నదానికి పూర్తి సమాధానం మనకు దొరుకుతుంది.

సరే, పరధ్యాస అంటే అర్ధం ఏమిటి ? అనేక వూహలలో నుండి ఒక వూహను మీరు ఎన్నుకొని, అనేక ఆసక్తికర విషయాలలో నుండి ఒక ఆసక్తికరమైన దానిని మీరు

ఎన్నుకుని, ఆ ప్రత్యేకమైన విషయం మీద మీ మనసుని నిలపాలని ప్రయత్నం చేస్తారు. ఇతర విషయాలేవైనా మీ మనసును అప్పుడు ఆక్రమిస్తే, వాటిని పరధ్యాసలని అంటారు. అంతే కదూ, అదేకదూ మీ అర్థం ? అంటే, నాకు అనేక విషయాల్లో ఆసక్తి వున్నది, ఆ విషయాల్లో నుంచి ఒకదానిని ఎన్నుకొని, నా ధ్యాసను దానిమీద కేంద్రీకరించడానికి ప్రయత్నిస్తుంటాను. అయితే, ఆ ఇతర ఆసక్తులు కూడా మధ్యలో ప్రవేశించి నా సావధానతకు అడ్డం తగులుతాయి. దీనినే పరధ్యాస అని అంటాను. కాబట్టి, ఈ పరధ్యాసను అవగాహన చేసుకోగలిగితే, దానిని సమాప్తం చేయగలిగితే, అప్పుడు అప్రయత్నంగానే, దానంతటదే హఠాత్తుగా సంపూర్ణ సావధానత కలుగుతుంది. మన సమస్య ఏమిటంటే ఎన్నిక చేసుకోవడం లేకుండా, ప్రతి ఆసక్తినీ అర్థం చేసుకోవడం ; ఒక్క ఆసక్తిని మాత్రమే ఎన్నుకొని, తక్కినవాటిని పరధ్యాసలని అంటూ వాటిని తిరస్కరించాలని ప్రయత్నించడం కాదు. ఒక్కొక్క ఆసక్తీ కలుగుతూ వున్నప్పుడే, మనసు దానిని అర్థం చేసుకుంటూ, ఆ విధంగా ఒక్కొక్క ఆసక్తి నుంచీ విముక్తి చెందుతూ వుంటే - ఆ స్వేచ్ఛలోనే మీకు సంపూర్ణ సావధానత కలుగుతుంది. సర్ ! మనలో చాలామందికి రకరకాలైన ముసుగులూ, రకరకాలైన భిన్న సత్వాలూ వున్నాయి. అవి అన్నీ కలిపి మనల్ని తయారు చేసుకున్నాం. వాటిల్లో ఏదో ఒక సత్వాన్ని ఎన్నుకొని, 'దీనిమీద ఏకాగ్రతను సాధించబోతున్నాను' అంటే లాభం లేదు. ఎందుకంటే, అప్పుడు మీరు ఇతర సత్వాలతో సంఘర్షణను ఆరంభించినట్లవుతుంది. మీరు ఎన్నుకున్న సత్వంతో పోరాడుతున్న ఇతర సత్వాలు కూడా మీరే. కాబట్టి, అట్లా చేయకుండా, అన్ని సత్వాలనూ పరికించి చూసి, వాటి విలువలను మళ్ళీ పట్టి చూసి, వాటి అసలైన ప్రాధాన్యత ఏమిటి అని చూసుకోవాలి. అట్లా చూడాలంటే వాటిని ఖండించడం గానీ, సమర్థించడం గానీ, పోల్చిచూడడం గానీ వుండకూడదు. అప్పుడు మీ తెలివిలో తీవ్రమైన చురుకుదనం కలుగుతుంది. పరీక్షించి చూస్తున్నప్పుడు మాత్రమే,ఒక్కొక్క సత్వాన్నీ, విలువనూ పట్టిచూస్తున్నప్పుడు మాత్రమే సావధానత వుంటుంది. అదే అత్యున్నతమైన తెలివి. బుద్ధిహీనుడు ఒక భావాన్ని పట్టుకొని, దానిమీద కేంద్రీకరించాలని ప్రయత్నిస్తుంటే బుద్ధిహీనుడు గానే మిగిలిపోతాడు. అయితే, ఆ బుద్ధిహీనుడే తన ఆసక్తులన్నింటినీ వాటిలోని ప్రాధాన్యతను కనిపెట్టడం కోసం పరికించి చూసినప్పుడు - ఆ విచారణే అసలైన తెలివితేటలకు ఆరంభమవుతుంది.

కాబట్టి, ఈ సమస్యను ప్రతికూలమైన కోణం నుంచి చూడటం ద్వారా ఎంతో కనిపెట్టగలుగుతారు. సున్నితంగా అవుతారు ; మీ చుట్టూ వున్న అసంఖ్యాకమైన సమస్యల్లోని ముఖ్యా ముఖ్య విషయాల ఎడల అప్రమత్తంగా వుంటారు. అప్పుడు వాటిని మీరు నిరోధించరు, పక్కకి నెట్టేయరు. అవి ఆరంభమవుతున్నప్పుడే వాటిని అవగాహన

చేసుకుంటారు. అంటే అర్థం – మీలో కొత్తవాటిని ఆవిష్కరించుకునే ఆ సామర్ధ్యం, ఆ చురుకుదనం, ఆ సజీవశక్తి వున్నాయనమాట. అవి ఆవిష్కరించుకున్నాక సంపూర్ణమైన సావధానతను మీరు చూపెడతారు. సంపూర్ణ సావధానత వుండాలంటే, మీ మనసు పరధ్యాసల పైకి మళ్ళకూడదు. మనసు పరధ్యాసల పైకి మళ్ళినట్లవుతే, ఆ రకరకాల పరధ్యాసలనే పట్టుకొని చూసి తెలుసుకోకూడదూ ? అది చేసినట్లవుతే, అప్పుడు ఎంత అద్భుతంగా, ఎంత త్వరితంగా మనసు సూక్ష్మగ్రాహ్యతనూ, స్ఫుటత్వాన్నీ, సుస్పష్టతనూ సంతరించుకొని, జీవశక్తితో తొణికిసలాడుతుందో చూస్తారు. మనసు అప్రమత్తంగా వున్నప్పుడే ఆ సంపూర్ణమైన సావధానతను ఇవ్వగలుగుతారు. అందులోనే సమగ్రమైన అవగాహన వున్నది.

ప్రశ్న: ఒక ఆలోచన రాగానే దానిని క్షుణ్ణంగా చూడటం గురించీ, దానిని వదిలించుకోవడం గురించీ మీరు మాట్లాడారు. దయచేసి దీనిని పూర్తిగా వివరించి, స్పష్టంగా విప్పిచెప్పగలరా ?

కృష్ణమూర్తి : ఒక ఆలోచనను క్షుణ్ణంగా విచారించడం అనేది చాలా కష్టసాధ్యమైన పని. చాలా తక్కువమంది ఈ పనికి పూనుకోడానికి సిద్ధపడతారు. ఒక ఆలోచనను, దాని రూపం మార్చివేసి, ఇంకొక భిన్నమైన చట్రంలోనో, మూసలోనో బిగించాలని ప్రయత్నిస్తాం తప్ప, ఆ ఆలోచనని మొదలంటా, లోపలా బయటా మొత్తంగా విచారించాలంటే ఇష్టపడం. ఆలోచనలో పరివర్తన తేవాలనే కోరిక వుండకూడదు. ఆలోచనను వదిలించుకోవాలనే కోరిక కానీ, ఇంకోరకమైన చట్రంలో పెట్టాలనే కోరిక కానీ వుండకూడదు. ఇప్పుడు నేను ఒక ఆలోచనను తీసుకొని, దానిని పూర్తిగా పరీక్షించబోతున్నాను. మనందరం కలిసి ఈ పరిశీలన సాగిద్దాం.

మనం చాలా తెలివి గలవారమనీ, మనలో గొప్ప ప్రజ్ఞ దాగివుందనీ మనలో చాలామంది అనుకుంటూ వుంటారు. సరే, మనలో నిజంగా తెలివి వున్నదా ? లేకపోగా, చాలా మందబుద్ధులం. అయితే మనం మందబుద్ధులమనీ, మనలో సున్నితత్వం లేదనీ ఎన్నటికీ ఒప్పుకోము. దీన్నంతా కనుక పూర్తిగా విశ్లేషించి చూసినప్పుడు ఆ పరమ మూర్ఖత్వం కొంతన్నా తగ్గుతుంది. మనలో తెలివిలేదు. అప్పుడప్పుడు మెరిసే బుద్ధి నైశిత్యమూ లేదు. కానీ, మనం అనుకునేది ఏమిటంటే, మనలో కొంత చురుకుదనమూ వుంది, కొంత మందకొడితనమూ వుంది అని. ఈ ఆలోచనను నేను క్షుణ్ణంగా విచారించబోతున్నాను. దయచేసి మీరు కూడా నాతోపాటుగా రండి. 'నాలో కొంత చురుకుదనమూ, కొంత మందకొడితనమూ వున్నాయి' అని మీరు అన్నప్పుడు, 'నేను

చురుగ్గా వుంటాను' అని అంటున్న భాగం ఏది, 'నేను మందకొడిగా వుంటాను' అని అంటున్న భాగం ఏది? చురుగ్గావుండే భాగం కనుక, తక్కిన భాగాన్ని మందకొడిగా వున్నది అని అంటుంటే, అప్పుడు చురుకైన భాగానికి తను చురుకైనది అని తెలుసుననమాట. అంటే 'నేను చురుగ్గా వుంటాను' అని మీరు అన్నప్పుడు మీరు చాలా తెలివిగలవారనే ఒక స్పృహ మీలో వున్నది. తెలివికి తను అనే స్పృహ వుంటుందా? 'నేను తెలివిగలవాడిని' అని అన్నానంటే, వెంటనే నేను మందబుద్ధినని స్పష్టమవుతుంది. (నవ్వులు) అది అంత తెలివైన ప్రతిస్పందన కాదు - మీరే గమనించండి. ఒక మనిషి తను చాలా తెలివిగలవాడిని అని అంటే అతడు చాలా మూర్ఖుడని నిస్సందేహంగా చెప్పచ్చు. కాబట్టి, మనసులో ఒక భాగం తను చాలా చురుకు అని తనే తలుస్తూ వుంటే అది నిజంగా చాలా మందకొడిగా వున్నదనమాట. మందకొడిగా వున్న మనసు తనలో ఒక భాగం మాత్రం చాలా చురుగ్గా వుంటుంది అని అనుకుంటుంటే ఆ మనసు ఇంకా ఎక్కువ మందకొడిగా వున్నట్లే. ఇదంతా అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం. ఎందుకంటే, మన లోపల ఎక్కడో ఒక చురుకైన అంశం వున్నదని మనలో చాలామంది అనుకుంటూ వుంటారు. మందకొడిగా వుండే మనసు తన లోపల ఎక్కడో ఒక చురుకైన అంశం వున్నదని తలుస్తూ వుంటే, ఆ ఆలోచన కూడా బుద్ధిహీనమైన ఆలోచన అనడంలో సందేహం లేదు. అవునా కాదా? సర్! మనం ఒక ఆలోచనను మొదలంటా తరచి చూస్తున్నాం. మందకొడిగా వున్న మనసు తన లోపల ఒక చురుకైన అంశం వున్నదని తలుస్తుంటే, ఆ పని కేవలం మందకొడిగా వుండే మనసు చేసే పనే. మందకొడిగా వుండే వ్యక్తి పూజలు చేస్తుంటే అతని ఆ పని కూడా బుద్ధి తక్కువ పనే. మందకొడిగా వుండే ఒక మనసు తన లోపల ఒక భాగం చాలా చురుగ్గా, శాశ్వతంగా వుంటుందీ అని అనుకుంటుంటే, ఆ భాగం కూడా అంత మందకొడితనం కలదే..

అయితే, మనం చాలా మందబుద్ధులం అనే సంగతి మనలో చాలామంది అంగీకరించరు. ఏదోవిధంగా, ఎక్కడో ఒకచోట, మన లోపల ఒక చురుకైన అంశం వున్నదని అనుకోవడం మనకి ఇష్టం - దాన్ని దేవుడనో, యదార్థతత్వం అనో, ఆత్మ అనో, పరమాత్మ అనో - ఇంకా రకరకాలుగా అంటూ వుంటాం. అయితే, మందకొడిగా వుండే మనిషి ఆత్మని గురించి ఆలోచిస్తుంటే, ఆ ఆత్మ కూడా మందకొడిగానే వుంటుంది. నిస్తేజంగా వుండే మనిషి నిజంగా తెలివైనదానిని గురించి ఎట్లా ఆలోచించ గలుగుతాడు? తెలివైన దానికి తను అనే స్పృహ వుండదు. 'నేను తెలివైన వాడిని' అని నాలో నేను అనుకున్న క్షణంలోనే నన్ను మూర్ఖత్వపు స్థాయిలోకి దించుకుంటాను. అదే మీలో చాలామంది చేస్తున్న పని. కాబట్టి, మీ సమస్తమూ మందకొడిగా వున్నదనే సంగతి మీరెన్నటికీ ఒప్పుకోరు. మీరు బాగా పరికించి చూసినట్లవుతే అదే నిజం. మంచి చురుకైన

విషయాలతో ఆటలాడటం మీకు ఇష్టం. ఆవిధంగా మిమ్మల్ని తెలివైన వారిగా పరిగణించుకుంటూ వుంటారు. నిజానికి జరిగేదేమిటంటే, నిస్తేజంగా వుండే మనిషి తేజోవంతమైన విషయాలతో ఆడుకుంటుంటే, ఆ చురుకైన విషయాలను కూడా తన స్థాయికి దించేస్తాడు. ఒక మనసు తను చాలా చురుకైనది అని అనుకుంటూవున్నా, తాను అనే స్పృహతో అట్లా అనుకుంటూవున్నా మందకొడిగా వున్నట్లే. లేదూ మందకొడిగా వున్న మనసు తను చాలా చురుగ్గా వున్నానని అనుకుంటూవున్నా అప్పుడు అదీ మందకొడిగా వున్నట్లే. అయితే, మనసు కనుక తను మందకొడిగా వున్నానని గుర్తించితే, ఆ తరువాత వచ్చే ప్రతిస్పందన ఏమిటి? అసలు ఒకరు మందకొడిగా వున్నామని ఒప్పుకోవడమే చాలా అసాధారణమైన వాస్తవం. నేను అబద్ధాలకోరుని అని చెప్పినప్పుడు, అప్పుడే అక్కడే నిజం పలకడం అనేది ఆరంభమవుతున్నది. కాబట్టి, చురుకుదనమూ, మందకొడితనమూ అనే ఆలోచనలను విచారిస్తున్నప్పుడు, మనలో దాదాపు అందరూ కూడా అసాంతం మందకొడిగా వున్నామని చూడగలుగుతాం. అయితే, ఆ సంగతి ఒప్పుకోవడానికి భయపడతాం. మీరెంత మందకొడిగా వుంటారో మీకు తెలియదూ? మనం మందకొడిగా వుంటాం కాబట్టి, మన సమస్యలను పాక్షికంగానూ, ముక్కలు ముక్కలుగానూ పరిష్కరించుకోవాలని ప్రయత్నిస్తుంటాం. ఆ కారణంగా మనం ఇంకా మందకొడిగానే మిగిలిపోతాం. అయితే మనం ఆ సంగతిని ఒప్పుకున్నప్పుడు, – అంటే మానసికంగానో, వాచ్యంగానో కాకుండా, వాస్తవంగానే మన మందకొడితనాన్ని చూస్తే – అప్పుడు ఏమవుతుంది? మందకొడిగా వున్న మనసు తన మందకొడితనాన్ని గుర్తించినప్పుడు, మనసు ఆ సంగతిని ఎట్టెదురుగా చూసినప్పుడు, ఇక అప్పుడు పారిపోవడం వుండదు. ఒక ఆలోచనను మనం క్షుణ్ణంగా విచారించి చూస్తూ వున్నాం – మీరు మందకొడిగా వున్నారు అనే యదార్థాన్ని ఒప్పుకొని, దానిని ముఖాముఖిగా ఎదుర్కున్నప్పుడు ఏం జరుగుతుందో చూస్తూ వుండండి. మీరు పూర్తిగా మందకొడిగా వున్నారు అనే వాస్తవాన్ని ఒప్పుకున్న మరుక్షణమే ఏం జరుగుతున్నది? దేవుడిని గురించి ఆలోచిస్తున్న నిస్తేజమైన మనసు నిస్తేజంగానే వుండిపోతుంది. దేవుడు అనే భావన చాలా తేజోవంతమైనదవచ్చు గాక, అయితే నిస్తేజమైన మనసు ఆ భావాన్ని తన స్థాయికే దిగజార్చుతుంది. మీరు మందకొడిగా వున్నారు అనే వాస్తవాన్ని ఎదుర్కొన కలిగితే, అప్పుడు అందులోనే స్పష్టత ఆరంభమవుతూ వుంటుంది. తెలివిగా మారాలని ప్రయత్నించే మూర్ఖత్వం ఏనాటికీ తెలివిగా అవలేదు. అది ఎప్పటికీ తను ఏమిటో అదేగా వుండిపోతుంది. తెలివిగా అవాలని ప్రయత్నిస్తున్న మందకొడి మనసు ఎప్పటికీ మందకొడిగానే వుండిపోతుంది. అది ఏం చేసినా సరే. అయితే, మీరు మందకొడిగా వున్నారు అనే వాస్తవాన్ని ఒప్పుకున్న మరుక్షణమే, తక్షణమే పరివర్తన జరిగితీరుతుంది.

ప్రతి ఆలోచనా ఈ విధంగానే వుంటుంది. కోపాన్ని తీసుకోండి. శరీర సంబంధమైన ప్రతిస్పందన కారణంగానో, నరాల సంబంధమైన ప్రతిస్పందన కారణంగానో కోపం పుట్టుకొని రావచ్చు. లేదా పైకి కనపడకుండా దేనినో లోపల దాచాలని మీరు అనుకోవడం వల్ల కూడా కోపం రావచ్చు. విచారించి చూడండి. కోపానికి ఇదీ కారణం అంటూ ఏదో ఒక సాకును చూపడానికి ప్రయత్నించకుండా, దానిని నేరుగా ఎదుర్కొనండి. అదే పరివర్తనకు ఆరంభం అవుతుంది. ఒక వాస్తవాన్ని మీ ఇష్టం వచ్చినట్లు తర్జుమా చేసెయ్యలేరు. అట్లా తప్పులుగా తర్జుమా చేస్తే చేసుకోవచ్చు. అంతే తప్ప, వాస్తవం మాత్రం ఎప్పటికీ వాస్తవంగానే వుండిపోతుంది. కాబట్టి, ఒక ఆలోచనను క్షుణ్ణంగా విచారించడం అంటే 'ఉన్నది'ని ఏ వక్రీకరణలూ లేకుండా చూడటం. వాస్తవాన్ని నేను సూటిగా గ్రహించినప్పుడు మాత్రమే అది పరివర్తన చెందుతుంది. 'ఉన్నది' నుంచి నేను తప్పించుకోవాలని చూస్తున్నంతవరకూ, 'ఉన్నది'ని మరొకటిగా మార్చాలని ప్రయత్నం చేస్తున్నంతవరకూ పరివర్తనను తీసుకొనిరావడం సాధ్యం కాదు. ఎందుకంటే అటువంటప్పుడు, సూటియైన చర్య తీసుకోవడం నాకు చేతకాదు కాబట్టి.

సర్ ! ఇప్పుడు హింసని తీసుకుందాం. మళ్ళీ ఒకసారి ఆలోచనను క్షుణ్ణంగా విచారిద్దాం. అసలు నాలో హింస వున్నదీ అనే సంగతి ఒప్పుకోవడం నాకు ఇష్టం వుండదు. ఎందుకంటే, సామాజిక పరంగా చూసినా, నీతిపరంగా చూసినా హింస చాలా చెడ్డది అని నాకు నూరిపోశారు. అయితే వాస్తవం ఏమిటంటే నాలో హింస వున్నది. అందుకని నేను ధ్యానం చేస్తాను, నన్ను అణచుకుంటాను, మరొకలాగా అవాలని ప్రయత్నిస్తాను. కానీ అసలు వాస్తవంలో నేను ఏమిటి అనే దానిని – అంటే నాలో హింస వున్నది అనే దానిని ముఖాముఖిగా చూడను. 'ఉన్నది'ని మరొకటిగా పరివర్తన చెందించాలని నా సమయమంతటినీ వెచ్చిస్తుంటాను. పరివర్తన తేవాలంటే 'ఉన్నది' చూసి తీరాలి. అయితే నాలో ఒక ఆదర్శం వున్నంతవరకూ నేను 'ఉన్నది' వైపు చూడటం లేదనమాట. అది కనుక గ్రహించానంటే, అప్పుడు ఆదర్శాన్ని, అంటే అహింసను పక్కకు పెట్టి, హింస వైపు పరికించి చూస్తాను. అప్పుడు నాలో హింస వున్నది అనే విషయం నాకు పూర్తిగా తెలుస్తుంది. నాలో ఆ సూటియైన స్పృహ వుండటమే, ఆ వాస్తవమే పరివర్తనను తీసుకొని వస్తుంది. మీరే ప్రయోగం చేసి చూసుకోండి. మీకే తెలుస్తుంది. 'ఉన్నది'ని చూడకుండా నిరాకరించడం – అదే మనందరికీ వున్న సమస్య. 'ఉన్నది'ని చూడటం నాకు ఇష్టం లేదు. నేను వికారంగా వున్నాననే విషయాన్ని నేను ఏనాటికీ ఒప్పుకోను. నా వికృతత్వానికి ఎన్నో కారణాలు వెతికి చూపుతాను. అయితే, నా వికృతత్వాన్ని వున్నది వున్నట్లుగా, ఏ వివరణలూ, ఏ సాకులూ ఇవ్వకుండా నేను పరికించి చూస్తే, అప్పుడు పరివర్తన జరగడానికి అవకాశం వున్నది.

కాబట్టి, ఒక ఆలోచనను క్షుణ్ణంగా విచారించడం అంటే, ఆలోచన తనని తాను ఎట్లా వంచన చేసుకుంటున్నదో, ఎట్లా 'ఉన్నది' నుంచి పారిపోతున్నదో చూడటం అనమాట. అన్ని రకాలైన పలాయన మార్గాలను మూసివేసి, ఆలోచన వైపు పరికించి చూసినప్పుడు మాత్రమే ఆ ఆలోచనను మీరు పూర్తిగా, సమగ్రంగా, క్షుణ్ణంగా విచారించగలుగుతారు. దీనికి అపరిమితమైన నిజాయితీ కావాలి. అయితే మనలో చాలామంది ఆలోచనలలో ఈ నిజాయితీ లోపిస్తుంది. అసలు మనకి ఏ ఆలోచనను కూడా క్షుణ్ణంగా విచారించడం ఇష్టంలేదు. ఆలోచన తనని తాను ఎట్లా వంచన చేసుకుంటున్నదో కనిపెట్టడం చాలా ప్రధానమైన విషయం. ఆ వంచన తత్వాన్ని మీరు కనిపెట్టినప్పుడు, అప్పుడు 'ఉన్నది'ని మీరు ముఖాముఖిగా చూడగలుగుతారు. అప్పుడే 'ఉన్నది' తన లోపలి అర్థాన్నీ, తన పూర్తి ప్రాధాన్యతనూ విప్పి చూపుతుంది.

ప్రశ్న : దేశదేశాలు తిరుగుతూ, విభిన్న రకాలకు చెందిన అనేక మంది ప్రజలని వుద్దేశించి ప్రసంగాలు చేస్తూ, మీ ప్రజ్ఞా ప్రదీప్తితో, మీ సూక్ష్మబుద్ధితో అందరినీ విస్మయపరుస్తూ, విభ్రాంతిలో ముంచుతూ వున్నారు. బాగానే వుంది. కానీ, అంతకంటే, మీ ఆలోచనా దృక్పథాన్ని ప్రతిబింబించే ఒక సమాజాన్ని, లేదా అటువంటి వ్యక్తులతో ఒక జనావాసాన్ని కనుక మీరు నిర్మిస్తే, అది ఒక వుదాహరణగా నిలుస్తుంది కదా ? అటువంటిది సాధ్యం కాదేమోనని భయపడుతున్నారా ?

కృష్ణమూర్తి : సర్ ! తీక్షణమైన కాంతినీ, నిశితమైన సూక్ష్మబుద్ధినీ ఎప్పుడూ మూసి వుంచాలి. ఎందుకంటే తీక్షణ కాంతి వల్ల అంధత్వం కలుగుతుంది. కంటి చూపుని పోగొట్టడం, అతితెలివిని ప్రదర్శించడమూ కాదు నా లక్ష్యం. అది వట్టి మూర్ఖత్వం. అయితే విషయాలను సుస్పష్టంగా చూసినవారు ఇతరులకు అవి స్పష్టమయ్యే తీరులో చెప్పకుండా వుండలేరు. ఇది మీకు ప్రజ్ఞా తీక్షణతగా, సూక్ష్మబుద్ధి కౌశలంగా అనిపించవచ్చు. నాకు మాత్రం నేను చెప్తున్నది తీక్షణ ప్రజ్ఞగా అనిపించడం లేదు. నా కళ్ళకెదురుగా కనబడుతున్నది చెప్తున్నాను. ఇది ఒక వాస్తవం. ఇక రెండోది – ఒక ఆశ్రమాన్నో, ఒక సమాజాన్నో స్థాపించమని నన్ను మీరు కోరుతున్నారు. సరే, ఎందుకోసం ? ఒక ప్రత్యేకమైన సమాజాన్ని ఒకచోట నివసింపజేయమని మీరెందుకు కోరుతున్నారు ? అది ఒక వుదాహరణగా పని కొస్తుందని మీరంటున్నారు. అంటే, దానిని ఒక విజయవంతమైన ప్రయోగంగా చూపవచ్చని. ఉదాహరణ అంటే అర్థం అదే – అంతే కదూ ? ఈ విషయాలన్నీ ఆచరణలో పెడుతున్న వ్యక్తులతో కూడిన ఒక ప్రత్యేక జనసముదాయం. మీకు కావలసినది అదీ. ఒక ఆశ్రమాన్ని కానీ, సమాజాన్ని కానీ, స్థాపించాలని నేను కోరుకోవడం లేదు. కానీ, మీరు కోరుతున్నారు. సరే, అటువంటి

సమాజం వుండాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారు ? ఎందుకో నేను చెప్తాను. ఇది చాలా ఆసక్తికరమైన విషయం. అవునా ? అసలు అటువంటిది కావాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారు. అంటే, మీరు ఇతరులతో కలిసిపోయి నివసించడానికి అటువంటి సమాజం ఒకటి మీకు కావాలి. అయితే, మీతోనే ఆ సమాజం ఆరంభం అవడం మీకు ఇష్టం వుండదు. మరొకరెవరో అది చేపట్టాలని మీకు వుంటుంది. అది జరిగినప్పుడు మీరు అందులో చేరతారు. ఇంకోరకంగా చెప్పాలంటే, సర్! మీ అంతట మీరే అటువంటిది ఆరంభించాలంటే మీకు భయం. అందువల్ల ఒక వుదాహరణ మీకు కావాలి. అంటే, ఒక రకమైన ఆధిపత్యాన్ని మీరు కోరుకుంటున్నారు ; దాని ప్రకారంగా మీరు నడుచుకోవచ్చునని. మరొకలాగా చెప్పాలంటే, మీ అంతట మీకుగా అంత ధైర్యం లేదు. అందుకని, ''ఒక ఆశ్రమవాసాన్ని స్థాపించండి, నేను అందులో చేరతాను'' అని మీరంటున్నారు సర్! మీరు వున్న చోటే మీరొక ప్రత్యేక సమాజాన్ని స్థాపించవచ్చు. అయితే మీకు ఆ ధైర్యం వుంటేనే, అటువంటి సమాజాన్ని స్థాపించగలుగుతారు. ఇబ్బంది ఏమిటంటే, అటువంటి ధైర్యం మీలో లేదు. ఎందుకు మీలో ఆ ధైర్యం లేదు ? ఈ ధైర్యం అంటే అర్థం ఏమిటి ? ఒక ఫలితాన్ని సాధించాలని కోరుకునే మనిషిలో, తను అనుకున్నది సాధించిన వాడిలో ఆత్మవిశ్వాసం నిండుగా వుంటుంది వ్యాపారస్తుడు, న్యాయవాది, పోలీసు కర్మచారి, సైనికాధికారి – వీరందరిలో ఆత్మధైర్యం నిండివుంటుంది. ఇక్కడ చూస్తే మీలో ఆ ధైర్యం లేదు. ఎందువల్ల ? కారణం చాలా సామాన్యమైనది. మీరసలు ప్రయోగమే చేసి చూడలేదు. ఈ విషయంలో ప్రయోగం చేసిన మరుక్షణమే మీలో ధైర్యం పుట్టుకొస్తుంది. ఇతరులు ఎవరూ మీకా ధైర్యాన్ని ఇవ్వలేరు. గ్రంధాలు కానీ, గురువులు కానీ ఈ ధైర్యాన్ని మీలో కలిగించలేరు. ప్రోత్సహించడం వల్ల ధైర్యం రాదు. ప్రోత్సాహం కేవలం పైపైన వుంటుంది, అది చిన్నపిల్లల వ్యవహారం, పరిణతి లేకపోవడం. ప్రయోగం చేస్తున్నప్పుడు మీలో ధైర్యం కలుగుతుంది. దేశభక్తి గురించీ, ఇంకా చాలా చిన్న చిన్న విషయాల గురించీ కూడా ప్రయోగాలు చేసి చూస్తుంటే మీలో ధైర్యం పుట్టుకొస్తుంది, ఎందుకంటే మీ మనసు అప్పుడు చురుగ్గా, మృదువుగా తయారవుతుంది. అప్పుడు మీరు ఎక్కడ వుంటే అక్కడే ఆశ్రమం వెలుస్తుంది. మీ అంతట మీరే ఒక కొత్త సమాజాన్ని స్థాపిస్తారు. ఇది స్పష్టమయింది కదా, అయిందా ? సమాజాలన్నింటి కంటే కూడా మీరే చాలా ముఖ్యం. మీరు వెళ్ళి ఒక సమాజంలో చేరుతే, మీరు ఎట్లా వున్నారో అట్లాగే వుండిపోతారు. మీ మీద అధికారం చలాయించేవారు ఒకరు వుంటారు అక్కడ. మీ పైన చట్టాలూ, నిబంధనలూ, క్రమశిక్షణా విధించబడతాయి. ఆ పాశవిక సమాజంలో మీరు మరొక సుబ్బారావో, అప్పారావో అవుతారు. మీకు మరొకరు మార్గనిర్దేశం చేయాలనీ, మీరు ఏం చేయవలసినదీ చెప్పాలనీ కోరుకుంటున్నప్పుడే, ఒక ప్రత్యేక సమాజం కావాలని కోరుకుంటారు. ఇతరులు తనకు మార్గం చూపాలి అని కోరుకునేవారికి తమలో తమకు

ఆత్మవిశ్వాసం లేదని తెలుసు. మీరే మీ అంతట మీకుగా ఆ నమ్మిక కలుగజేసుకోవచ్చు. అయితే, ఆత్మవిశ్వాసం గురించి మాట్లాడటం వల్ల అది జరగదు. ప్రయోగం చేసి చూడటం వల్ల, ప్రయత్నించడం వల్ల జరుగుతుంది. సర్ ! అసలు వుదాహరణ మీరే. మీరు ఎక్కడ వుంటే అక్కడే, ఏ ఆలోచనా స్థాయిలోనైనా సరే, అక్కడే ప్రయోగం చేసి చూడండి. ఉదాహరణగా తీసుకోవలసింది మీ ఒక్కరినే, సమాజాన్ని కాదు. సమాజమే కనుక వుదాహరణ అవుతే అప్పుడు మీరు అందులో దిక్కుతోచకుండా వుండిపోతారు. అనేకమంది కలిసి ఈ విషయంలో ప్రయోగాలు చేస్తారని నేను ఆశిస్తున్నాను. తమలో తమకు పూర్తి నమ్మిక వుండటం వల్ల అందరూ కలిసి పని చేయగలుగుతారు. అందువల్ల మీరు బయటనే కూర్చొని, 'మీరు ఒక సమాజాన్ని ఎందుకు ఆరంభించరు ? నేనూ అందులో చేరతాను'' అని అడగడం నిస్సందేహంగా పిచ్చి ప్రశ్న. ఒక ఆశ్రమం ఆరంభించాలని నేను కోరుకోవడం లేదు. ఎందుకంటే నాకు ఆశ్రమం కన్నా మీరే చాలా ముఖ్యం కాబట్టి. నేను నిజంగానే అట్లా భావిస్తున్నాను. ఆశ్రమం ఒక పీడకలలాగా తయారవుతుంది. సర్ ! ఆశ్రమాల్లో ఏం జరుగుతూవుంటుంది ? అక్కడ గురువు చాలా ప్రాధాన్యం వహిస్తాడు. అన్వేషకుడు కాకుండా గురువే ముఖ్యం అవుతాడు. గురువుకే సర్వాధిపత్యం వుంటుంది. మీరూ ఆ గురువుకే అన్ని అధికారాలూ అప్పచెబుతారు. ఎందుకంటే, ఒకరిని గురువుగా ఆమోదించగానే అతడు సర్వాధికారి అయిపోతాడు. కాబట్టి, ఈ ఆశ్రమాల్లో చేరారంటే మిమ్మల్ని మీరే సర్వనాశనం చేసుకున్నట్లు (నవ్వులు). దయచేసి నవ్వేసి విషయాన్ని తోసిపారేయకండి. ఆశ్రమాల్లో నుంచి వచ్చేసిన మనుష్యుల్ని చూడండి. వాళ్ళెంత నిస్తేజంగా, అలసిపోయివున్నారో చూడండి. వాళ్ళ రక్తం పీల్చేసి, రక్తమాంసాలు లేని నీడల్లాగా తయారుచేసి బయటకు పంపుతున్నారు. ఒక భావన కోసం ప్రాణత్యాగం చేయడం సత్యాన్వేషణ కానే కాదు. అది కూడా మరొక రకమైన తృప్తి, కోరికలను నెరవేర్చుకోవడమూ. తృప్తి చెందడం కోసం అన్వేషిస్తుంటే, యదార్థతత్త్వం కోసం అన్వేషణ వుండదు. కాబట్టి అసలు వుదాహరణగా మీరే వుండాలి. మరొకరెవరో కాదు. ఆశ్రమమూ కాదు, ఒక ప్రత్యేక సమాజమూ వుదాహరణ కాదు. ప్రయోగం చేయడానికి ఒక సమాజాన్ని తయారు చేయాలని మీరు కోరుకుంటుంటే, అప్పుడు దానిని ఒక వుదాహరణగా మీరు తీసుకోకూడదు. ఎందుకంటే, దానిని ఒక వుదాహరణగా, ఒక ఆధిపత్యంగా చేసిన మరుక్షణమే మీ సత్యాన్వేషణ ఆగిపోతుంది – మరొకరు చేసిన కృషికి మీరు భుజాలు ఎగరవేయడంలా వుంటుంది. మీకు కావలసినది అదే. మీకందరికి కావలసినది మరొకరి గొప్పతనం నీడలో సుఖంగా కూర్చోవడం. అందుకనే మీరు ఆశ్రమాల్లో చేరుతారు, గురువుల వెంటబడతారు, ప్రత్యేక సమాజాలని ఏర్పాటు చేసుకుంటారు. అవన్నీ అర్థహీనంగా తయారవడం తథ్యం. ఎందుకంటే, అక్కడ గురువు చాలా ప్రధానం అవుతాడు తప్ప, మీరు కాదు. మీరు కనుక సత్యం కోసం అన్వేషిస్తుంటే ఏ

ఆశ్రమంలోనూ చేరరు. ఏదో ఒక వుదాహరణ కావాలని ఎన్నటికీ కోరుకోరు. మిమ్మల్ని మీరే ఒక వుదాహరణగా తయారు చేసుకుంటారు. అయితే, మీరు ఎంతో నిజాయితీతో వుంటే తప్ప ఒక వుదాహరణగా అవలేరు. మీ అంతట మీరే ప్రయోగం చేస్తున్నప్పుడే మీలో నిజాయితీ కలుగుతుంది. అయితే, ఫలితం కోసం కాంక్షిస్తూ ప్రయోగం చేయడం నిజమైన ప్రయోగం కాదనేది స్పష్టం. ప్రయోగం చేస్తున్న మనిషికి, అందులోనుండి ఏం రాబోతున్నదో తెలియదు. అదీ ప్రయోగం చేయడంలో వున్న సౌందర్యం. అందులోనుండి ఏం రాబోతున్నదో కనుక మీకు తెలుస్తే, మీరు ప్రయోగం చేస్తున్నట్లు కానేకాదు. కాబట్టి, ఒక గురువు కానీ, ఒక ప్రత్యేక సమాజం కానీ, ఒక ఆశ్రమం కానీ వుండటంలో గల ఇబ్బంది ఇదీ : దానిని మీరు ఒక ఆదర్శమైన వుదాహరణగా చేసుకుంటారు, మీకు రక్షణ నిచ్చే ఆశ్రయంగా చేసుకుంటారు. ఇందులో గురువు తప్పు అంతగా లేదు. అనుచరుడిదే లోపం. గురువుని ఒక ఆదర్శంగా చేసుకొని, మీ జీవితాన్ని అతని చేతిలో పెడతారు. మీరు ఏం చేయాలో ఆదేశించమని అతన్ని అడుగుతారు. మీరు ఏం చేయాలో ఏ మనిషీ చెప్పలేడు. మీరు ఏం చేయాలో అతడు చెప్తే కనుక అతనికి ఏమీ తెలియదనమాట. నాకు తెలుసును అన్న మనిషికి ఏమీ తెలియదు. ఉదాహరణల కోసం చూడకండి. ఆశ్రయం కోసం వెతుక్కోకండి. స్వయంగా ప్రయోగం చేసి చూసుకోండి. ధైర్యమూ, నమ్మికా తెచ్చుకోండి. అప్పుడే మీకు మీరే ఒక వుదాహరణ అవుతారు. అదే సత్యం. అప్పుడు మీరే ఆ ప్రత్యేక సమాజం అనీ, మీరే మీ స్వంత ఆశ్రమం అనీ తెలుసుకుంటారు. మీరు ఎక్కడ వున్నారు అన్నది చాలా ప్రధానం. ఎందుకంటే, మీరు కనుక పరికించి చూస్తే, సత్యం మీకు చాలా దగ్గిరలో వుంటుంది.

ప్రశ్న : సాంకేతిక విజ్ఞానంలో పురోభివృద్ధీ, దానిని చక్కగా వినియోగించుకోవడం – ఈ రంగంలో ఆధునిక మానవుడు అత్యద్భుతమైన విజయం సాధించాడు. అయితే, సామరస్యంతో కూడిన సంబంధ బాంధవ్యాలను నిర్మించుకోవడంలో మాత్రం ఘోరంగా విఫలమయ్యాడు. ఇంతటి విషాదకరమైన ఈ వైరుధ్యాన్ని ఏ విధంగా మనం పరిష్కరించుకోగలం ? ప్రపంచంలో వున్న ప్రతి ఒక్కరి మీదా ఆ కరుణాకటాక్షం ఎన్నో రెట్లు ఎక్కువగా ప్రసాదించబడటానికి మనం ఏదయినా యోచించలేమా ?

కృష్ణమూర్తి : ఈ ప్రశ్నలోకి బాగా తరచిచూసి, అందులోని అసలు అర్థం ఏమిటో చూద్దాం. మన జీవితాల్లో వైరుధ్యం వున్నదని ఈ ప్రశ్న వేసినవారు అంటున్నారు – సాంకేతిక విజ్ఞానంలో మనం చాలా పురోగమించాం. మనోతత్వాన్ని తీసుకుంటే ఈ జీవులు చాలా వెనకబడేవున్నాయి. ఆధ్యాత్మికంగా వెనకబడి వున్న మనమూ, మనలో ప్రతి ఒక్కరూ సాంకేతిక అభివృద్ధితో సమానస్థాయిని అందుకునేందుకు వీలుగా 'నన్ను' తక్షణమే

మార్చివేయగల మహత్యం జరగడానికి ఏదయినా అవకాశం వున్నదా ? ఈ ప్రశ్నలో వున్న తాత్పర్యం అదే అనుకుంటాను. కరుణాకటాక్షాన్ని ఎక్కువ చేసుకోవడం ద్వారా ప్రతి ఒక్కరిలోనూ అతి త్వరితంగా పరివర్తన తేలేమా ? ఆ విధంగా వారిలో వైరుధ్యాలు లేకుండా పోతాయి గదా ? అంటే ఏమిటంటే – ప్రశ్నని నేను సరిగ్గా అర్థం చేసుకున్నాననే అనుకుంటున్నాను – సూటిగా, సరళంగా చెప్పాలంటే, ఒక మహత్యం సహాయంతో మీలో పరివర్తన తీసుకొని రాలేమా ? పుష్కలమైన ఆ దైవకటాక్షపు అద్భుత చర్య అతి శీఘ్రంగా జరిగి, ఈ విభజనలూ, ఈ వైరుధ్యాలూ లేకుండా పోకూడదా ? ఎందుకంటే, సాంకేతికాభివృద్ధి అతి వేగంతో ముందుకు పయనిస్తున్నది. మనమేమో మనోతత్వ రంగంలో మెల్లగా నడుస్తూ, వెనకబడిపోతున్నాం. అందుకోవాలంటే ఒక అద్భుతమైన మహత్యం జరిగితీరాలి. లేదా అంటే మనమంతా సర్వనాశనమై పోతాం. ఇదంతా మీకు అర్థమవుతున్నదా ? మరోవిధంగా చెప్పాలంటే, టర్బో–జెట్ విమానం గంటకి 1500 మైళ్ళ వేగంతో ఎగురుతూ వుంటుందని అంటారు. అణు బాంబులూ వున్నాయి. అంటే అర్థం ఏమిటో మీకందరికీ తెలుసు. ఇటువంటి శక్తివంతమైన ఆయుధాలు సర్వసేనాధిపతి అని పిలవబడే ఒక మూర్ఖుడి చేతిలో, ఒక జాతీయ నాయకుడి చేతిలో లేదా మరొకడి చేతిలో వున్నప్పుడు, మానసికంగా వెర్రికుంకనైన నేను అంతంత దూరాల్ని అందుకొని, అవన్నీ మార్చగలనా ? ఈ ప్రశ్నని మరొక విధంగా చెప్పాలంటే, నాలో పరివర్తనను ఇప్పుడే, ఈ క్షణమే తీసుకొనిరాగలనా ? దయచేసి జాగ్రత్తగా వినండి. తక్షణమే నాలో మార్పు తీసుకొని వచ్చే మహత్యం ఒకటి జరగగలదా ? జరుగుతుంది అంటాను నేను. (నవ్వులు). నవ్వులతో కొట్టిపారేయకండి. నేను చెప్తున్నది చాలా గంభీరమైన విషయం. ఒక అద్భుతమైన మహత్యం ఇప్పుడే జరగవచ్చును అని నేనంటున్నాను. అయితే, ఆ మహత్యం జరగడానికి మీరూ, నేనూ కూడా స్వీకరించగల స్థితిలో వుండాలి. మీరు కూడా ఆ మహత్యంలో ఒక భాగంగా వుండి తీరాలి. అంధత్వంతో బాధపడుతున్న ఒక గుడ్డివాడికి తనకు నయమవాలనీ, తనకి కంటి చూపు రావాలనీ కోరిక వుంటుంది. ఆ స్థితిలో కనుక మీరు వుంటే మీకూ ఒక మహత్యం జరుగుతుంది. పరివర్తన అనేది కాలానికి సంబంధించినది కాదు, ఇప్పుడే జరిగేది అని నేనంటున్నాను. పునరుజ్జీవనం తక్షణమే జరుగుతుంది. రేపూ కాదు, ఎప్పుడో సుదూర భవిష్యత్తులోనూ కాదు. సమస్యని ఎట్లా పరికించి చూడాలో మీకు తెలుస్తే కనుక మహత్యం జరుగుతుంది. గత నాలుగైదు వారాలుగా నేను చూపించాలని ప్రయత్నిస్తున్నది ఆ విషయమే. విషయాలని సూటిగా చూసినప్పుడు మహత్యమూ, అద్భుతమూ జరుగుతుంది. సర్ ! తాడుని పాము అనుకొని, పరికించి చూడటానికి మీరు భయపడుతుంటే మహత్యం జరిగే అవకాశం లేదు. ఉన్నదా ? అంటే, మీరు ఎప్పటికీ భయపడుతూనే వుంటారూ అని. పరికించి చూసినప్పుడు మాత్రమే అద్భుతమైన

మహత్యం జరుగుతుంది. అట్లా చూడాలంటే మీలో ఆ కోరిక వుండాలి, మీలో బాధ వుండాలి, అది నయం కావాలనీ వుండాలి. అంటే అర్థం, ఈ సమస్య పరిష్కారం అవాలంటే మీలో నిజాయితీ వుండాలి. అయితే మీలో నిజాయితీ లేదు. మీలో ఆ తొందర లేదు. ఏదయినా ఒకటి జరిగి మార్పు రావాలి అని మీరు కోరుకుంటున్నారు. అంతే తప్ప సమస్య వైపు మాత్రం మీరు పరికించి చూడరు. దానిని అన్వేషించి చూడరు. అందులోకి తరచి విచారించరు. దాని లోపలగా చూడరు. అందువల్ల, మీరు జడంగా, నిస్తేజంగా వుండిపోతారు. సాంకేతిక పురోభివృద్ధి ఇంకా వేగంగా సాగిపోతూ వుంటుంది. దాని గమనంతో పాటు పోలేక మీరు వెనకబడిపోతారు.

కాబట్టి, మహత్యం జరగాలంటే, మహత్యాన్ని స్వీకరించడానికి మీరు సిద్ధంగా వుండాలి. స్వీకరించడానికి మీరు సుముఖంగా వున్నప్పుడు, విషయాలను, అవి నిజంగా ఎట్లా వున్నాయో అట్లా చూడటానికి సుముఖంగా మీరు వున్నప్పుడు మహత్యాలు జరుగుతాయని నేను గట్టిగా చెప్పగలను. మిమ్మల్ని మీరే సమర్ధించుకుంటూ, కారణాలు వివరించి చెప్పుకొని మిమ్మల్ని మీరే వంచన చేసుకుంటున్నారు. అట్లా కాకుండా మీరు ఎట్లా వున్నారో అది చూసుకోండి – అప్పుడు ఎంత అపూర్వమైనది జరుగుతుందో మీరే కనిపెట్టండి. మీలో పరివర్తన జరగడానికి కాలం మీద ఆధారపడకుండా వున్నప్పుడు మాత్రమే పునరుజ్జీవనం జరుగుతుందని నేను నొక్కి చెప్తున్నాను. అప్పుడు మాత్రమే పరివర్తన జరుగుతుంది, అప్పుడు మహత్యం కూడా సమీపంలోకి వస్తుంది. అయితే, మీ బాధల్లో కూడా మీరు ఎంత సోమరితనంతో, ఎంత విముఖత్వంతో, ఎంత ఖాళీ చేతులతో వుంటారో ! సర్ ! వర్షం కురిసి నేలకూ, చెట్లకూ, పువ్వులకూ ఆహారాన్ని ఇచ్చి పోషిస్తున్నది. అయితే, ఆ వర్షం రాళ్ళ మీద పడితే దానివల్ల లాభం వుంటుందా ? మీరు ఆ రాళ్ళ వంటివారు. మీ మనసులూ, హృదయాలూ జడంగా వున్నాయి. మీరు ఖాళీగా, కఠోరంగా వుంటారు. ఎంత వర్షం పడినప్పటికీ దాన్నంతటినీ కడిగివేయలేదు. కఠినమైన మీ హృదయాలను మార్చడం సాధ్యం అయేది ఎప్పుడంటే, మీరు విషయాలను వున్నవి వున్నట్లుగా చూసినప్పుడే. వాటిని నిందించకండి, వాటికి కారణాలూ, సాకులూ చూపకండి, వాటిని గుర్తించండి, వాటిని పరికించి చూడండి – అప్పుడు మహత్యాన్ని చూస్తారు. మీ హృదయం కఠినంగా వున్నదని చూసి, ఒప్పుకున్నప్పుడు, మీ మనసును చిన్న పిల్లల ఆట వస్తువులతో నింపుకున్నామని చూసినప్పుడు, అది గుర్తించినప్పుడు – పరివర్తన జరగడం మీరే చూస్తారు. అయితే, పరికించడానికీ, చూడటానికీ, పరిశీలించడానికీ మీలో ఆ తీవ్రమైన దీక్ష వుండాలి. సర్ ! మీ వైపు చూసుకోండి. కొందరు ఆవలిస్తున్నారు, కొందరు చేతివేళ్ళు విరుచుకుంటున్నారు, కొందరు కంటి అద్దాలు తుడుచుకుంటున్నారు. ఇక అద్భుతం జరుగుతుందని ఎట్లా అనుకుంటారు ? మీరు

భద్రతతోనూ, బాగా డబ్బు దాచుకుని వున్నప్పుడు అద్భుతం జరుగుతుందని భావిస్తున్నారా ? మీ చేతుల నిండా డబ్బు వున్నప్పుడు అది జరగదు. అంతా వదిలేయాలి, అన్నీ వదిలేయడానికి సిద్ధంగా వుండాలి. అప్పుడు మహత్యం జరుగుతుంది. మీరు ఎట్లా వున్నారో ఆ మీ గురించి ఎరుక కలిగి వుండాలి – చాలా సాధారణంగా, నిరంతరంగా, సూటిగా. మీలో వున్న వికారం అంతటినీ, మీ వుల్లాసపు వైఖరినీ, మీలో వున్న పాశవికత్వం, సంతోషాలూ, బాధలూ – మీలో వున్న వీటన్నింటి ఎడలా ఎరుకగా వుండాలి. ఆ ఎరుక మీలో కలుగుతున్నప్పుడే, మీరు ఎన్నడూ వూహించను కూడా వూహించలేని అద్భుతం జరగడం చూస్తారు. పరివర్తనను కలిగించే, విమోచనను ఇచ్చే ఆ మహత్యం అనే సత్యాన్ని చూస్తారు.

ప్రశ్న : ఏకాగ్రతా, వుద్దేశ్య పూర్వకంగా మన ధ్యాసను ఒకదాని మీద కేంద్రీకరించడమూ సంకుచిత పరుస్తాయనీ, అందువల్ల అవి మనల్ని జడంగా తయారు చేసే ప్రక్రియలనీ మీరు అంటున్నట్లుగా తోస్తున్నది. దయచేసి, ధ్యానం అంటే ఏమిటి, మనసును నిశ్చలంగా ఎట్లా చేయగలం, మనసును వదిలించుకోవడం ఎట్లా అనే విషయాలను మీరు విపులీకరించగలరా ?

కృష్ణమూర్తి : 'వదిలించుకోవడం' అంటే అర్థం ఏమిటో నాకు బోధపడటం లేదు. సరే, ఫరవాలేదు. ఏకాగ్రతతో వుండటం ధ్యానం కాదని నేను చాలా జాగ్రత్తగా వివరించాను. ఏకాగ్రతతో వుండటం అంటే ప్రత్యేకించి ఒకదానిని ఎన్నుకోవడం. ఆ విధంగా మనసు కుంచితమైపోవడం జరుగుతుంది. సంకుచితంగా తయారైన మనసు పరిమితులు లేని, కొలతలకు అందని, అనంతమైన దానిని ఏనాటికీ అవగాహన చేసుకోలేదు. అదంతా వివరించాను. పుస్తకాలలో ప్రచురించి వున్న ఈ విషయాలను మీరు చదువుకోవచ్చు. అంతేకాకుండా, ధ్యానం అంటే ప్రార్థించడం కాదని కూడా నేను చెప్పాను. మనసు తనను తాను నెమ్మది పరచుకోడానికి పన్నుతూ వుండే వుపాయాల్లో ఈ ప్రార్థన ఒకటి. కొన్ని మాటలనో, వాక్యాలనో మళ్ళీ మళ్ళీ అంటూ జపం చేయడం ద్వారా మనసుని నిశ్చలనంగా తయారు చేయవచ్చు. ఆ నెమ్మది స్థితిలో ఏదయినా స్పందన కూడా కలగవచ్చు. అయితే ఆ స్పందన యదార్థతత్వం కలిగించే స్పందన కాదు. ఎందుకంటే ఈ విధమైన ప్రార్థన కేవలం ఒక పునశ్చరణా, ఒక అర్థింపూ, ఒక అభ్యర్థనా మాత్రమే. ప్రార్థనలో ద్వైదీభావం వున్నది – అర్థించే వారూ, ప్రసాదించే మరొకరూ. ధ్యానం అంటే ఏకాగ్రత కాదనీ, ధ్యానం అంటే ప్రార్థన కాదనీ నేను చెప్పాను. ప్రతిరోజూ ఒక అభ్యాసంగా ధ్యానం చేస్తున్న మీలో చాలామంది ఈ రెండింటిలో ఏదో ఒక తరగతికి చెందినవారే అయివుంటారు. అంటే, ఏదో ఒక ఫలితాన్ని సాధించడానికి ఏకాగ్రతను

మీరు వుపయోగిస్తున్నారు. లేదూ మీకు కావలసినది ఏదో పొందడానికి ప్రార్థన చేస్తున్నారు. అది రిఫ్రిజిరేటరూ కావచ్చు, సద్గుణాలూ కావచ్చు. ఏమీ కోరుకోకుండా వున్నప్పుడే, ధ్యానం అంటే ఏమిటో మీరు శోధించగలుగుతారు. పైన చెప్పిన రెండు కోణాల్లో దేనిని మీరు అనుసరిస్తున్నా, ధ్యానంలో వున్న అంతరార్థాన్ని తెలుసుకోలేరు. అదంతా మీకు బాగా వివరించి చెప్పాను. ఇప్పుడు మళ్ళీ అందులోకి పోను.

ధ్యానం అంటే అసలు అర్థం ఏమిటి ? నిస్సందేహంగా ఇదీ - ఏమిటంటే - త్వరితగతిని మృదువుగా ఇమిడిపోగల మనసు ; అవునా ? - ఆ విధంగా దానికి విశాలమైన, విస్తృతమైన ఎరుక కలుగుతుంది. అందువల్ల ఏ సమస్యనైనా, ఆ సమస్య ఆరంభం కాగానే, తక్షణమే ఆ సమస్యను కరిగించివేయగల శక్తి కలిగి వుంటుంది. ప్రతి సవాలునూ అవగాహన చేసుకుంటుంది. నిన్నటి స్పందనలు మిగిలి వుండవు. సర్ ! ధ్యానిస్తున్న మనసు అంటే తనను తాను తెలుసుకున్న మనసు, అంటే అర్థం, ధ్యానం స్వీయజ్ఞానానికి ఆరంభమూ అని. మీరు ఏమిటో తెలుసుకోకుండా మీరు ధ్యానించలేరు. మిమ్మల్ని మీరు తెలుసుకోకపోతే ధ్యానం వృధా. దానికి అర్థం లేదు. సవ్యంగా ధ్యానం చేయాలంటే ముందుగా మిమ్మల్ని మీరు తెలుసుకోవాలి. కాబట్టి, ధ్యానం అంటే స్వీయజ్ఞానం. మిమ్మల్ని మీరు తెలుసుకోవడం అంటే మనసులో వున్న సమస్త విషయాలనూ చూడటం ; చేతనలోని కార్యకలాపాలనూ, అంతఃచేతనలోని కార్యకలాపాలనూ, మేలుకొని వున్నప్పటివీ, నిద్ర అనబడే స్థితిలో వున్నప్పటివీ కూడా - అన్నింటినీ చూడటం. అది అంత కష్టం కాదు. ఎట్లా చేయాలో నేను చూపిస్తాను. రండి. అయితే, ఇప్పుడే ఈ ప్రయోగం చేసి చూడాలి. ఇంటికి వెళ్ళాక చేద్దాం అని మీరు వాయిదా వేయకూడదు. ప్రయోగం చేస్తున్నప్పుడు ఏం ఫలితాలు కనిపెట్టబోతున్నారో మీకే తెలియదు. ఏ సమస్యనైనా సమీపించిన ప్రతిసారీ కొత్తది ఏదో కనబడుతుంది. యదార్థతత్వంలో వున్న సౌందర్యం అది. ఎప్పుడూ సృజనాత్మకంగా, ఎప్పుడూ కొత్తగా వుంటుంది. ఈ కొత్తదనం జ్ఞాపకాల ద్వారా రాలేదు. కాబట్టి ధ్యానం అంటే స్వీయజ్ఞానానికి ఆరంభం. అంటే చేతనలో జరిగే కార్యకలాపాలూ, మనసులోని అజ్ఞాతపు పొరలలో దాగివున్న సమస్త విషయాలూ కూడా తెలుసుకోవడం. దయచేసి శ్రద్ధగా వినండి. ఒక్కొక్క అడుగే నాతోపాటుగా వేస్తూ ధ్యానం ఆరంభించండి. నేను మిమ్మల్ని సమ్మోహపరచడం లేదు. మీ నాడీమండలాన్ని ప్రభావితం చేయడం కోసంగాను ఈ మాటలు వుపయోగించడం లేదు. ధ్యానించడం అంటే, ధ్యానం ద్వారా యదార్థతత్వాన్ని ఆవిష్కరించడం అంటే ఏమిటి అనేది కనిపెట్టబోతున్నాను. మనం ప్రయోగం చేసి కనిపెట్టబోతున్నాం. రేపు ఎప్పుడో కాదు. ఇప్పుడే. సందేహాలు వుంటే రేపు నన్ను అడుగుదురు గాని. దయచేసి ఇప్పుడు జాగ్రత్తగా వినండి. సర్ ! మొదట,

నన్ను నేనుతెలుసుకోకుండా ధ్యానం చేయలేననే వాస్తవాన్ని నేను గ్రహిస్తాను. స్వీయజ్ఞానంలో లేనప్పుడు ధ్యానానికి అర్థం లేదు. స్వీయజ్ఞానంలో ఎక్కువలూ, తక్కువలూ వుండవు - అది ఆలోచన అనే మొత్తం ప్రక్రియ ; మీకు బాగా పరిచయం వున్న బహిరంగమైన ఆలోచనలూ, అంతఃచేతనలో మూసిపెట్టబడి వున్న రహస్య ఆలోచనలూ. ఇప్పుడు నేను ధ్యానం చేస్తూ ఆ ప్రక్రియను మొత్తం తెరచి చూడబోతున్నాను - అది ఇప్పుడే ఈ క్షణంలోనే చేయవచ్చు. సత్యాన్ని నేరుగా గ్రహించవచ్చు.

సరే, నేను - నాత్వం - అంటే ఏమిటి ? అది స్మృతి అనడంలో సందేహం లేదు. అది ఏ స్థాయిలో వున్నా సరే, వున్నతమైనా, సామాన్యమైనా సరే - అది జ్ఞాపకాలే. అంటే అర్థం ఆలోచనలూ అని. స్వీయాన్ని, నాత్వాన్ని మీరు 'ఆత్మ' అని పిలవచ్చు గాక, లేదూ పరిసర వాతావరణానికి ప్రతిస్పందన అనీ అనవచ్చు. 'ఆత్మ' అని పిలిచినప్పుడు దానిని ఒక వున్నత పీఠం మీద కూర్చోపెడుతున్నారు. అప్పుడు కూడా అది ఆలోచనల్లో భాగమే, అంటే స్మృతులు. కాబట్టి, స్వీయం - నాత్వం అనే ఈ మొత్తం ప్రక్రియను అవగాహన చేసుకోవడం అంటే స్మృతులను అవగాహన చేసుకోవడమే - స్మృతులు అంటే గతించిన క్రిందటి నిముషంలో ఆర్జించిన జ్ఞాపకమే కాదు, శతాబ్దాలనాటి స్మృతులు కూడా. జాతి పొందిన అనుభవాల సంచయ ఫలితంగా ఏర్పడినవీ, పుట్టి పెరిగిన దేశపు, భౌగోళిక, శీతోష్ణస్థితుల, ప్రభావాల ఫలితంగా ఏర్పడినవీ అయిన స్మృతులు. ఇదంతా స్మృతే. ఉపరితలంలో వుండేదీ, చాలా నిగూఢమైన లోతుల్లో వున్నదీ కూడా. ఈ సమస్త స్మృతులనూ, పూర్తిగా, సవివరంగా తెలుసుకొన్న ఆ ఎరుకను అందుకోబోతున్నాం మనం. నాత్వం అంటే స్మృతులు అని అన్నప్పుడు, అది ఏదో ఒకటి, రెండు జ్ఞాపకాలు కావు - అన్ని సత్వాల సమస్తమైన స్మృతుల మొత్తం. ఇది మనలో చాలామందికి అర్థం అయే వుంటుంది. అప్పుడు, రకరకాల ఆ పొరలనన్నింటినీ తెరచి చూడటానికి సమయం అవసరం కదా అని మనం అనుకోవచ్చు. చేతనలోని, అంతఃచేతనలోని జ్ఞాపకాలనన్నింటినీ శోధించాలంటే మనకి సమయం కావాలి. అయితే, సత్యాన్ని, యదార్థతత్వాన్ని ఆవిష్కరించుకోవడానికి కాలాన్ని వుపయోగించడం అంటే సత్యాన్ని కాదన్నట్లే. ఇది మీకు అర్థమవుతున్నదని ఆశిస్తున్నాను. కాబట్టి, సవ్యమైన ఫలితం కావాలంటే సవ్యమైన మార్గాన్నే నేను వుపయోగించి తీరాలి. అంటే, సర్ ! చేతనలోనివీ, అచేతనలోనివీ పొరలన్నీ చూసి విశ్లేషించడానికి సమయాన్ని వెచ్చిస్తే, కాలరహితమైన దానిని సాధించడానికి నేను కాలాన్ని ఒక సాధనంగా వుపయోగిస్తున్నట్లు అనమాట. కాబట్టి సత్ఫలితాన్ని చేరడానికి నేను అపసవ్యమైన మార్గాన్ని వుపయోగిస్తున్నాను. సత్ఫలితం చేరడానికి సత్‌మార్గాన్నే నేను అవలంబించాలి. అంటే,

కాలాన్ని నేను వుపయోగించకూడదు. అయితే, కాలరహితమైన దానిని చేరుకోవడానికి సాధనంగా కాలాన్ని వుపయోగించడం నాకు అలవాటైపోయింది. క్రమశిక్షణా, ధ్యానమూ, నిగ్రహమూ, అణచుకోవడమూ అన్నీ కాలంతో కూడుకున్నవి. పైగా స్మృతి అంటే కాలం. కాబట్టి నాకు ఇప్పుడు ఇది అర్ధమైంది - ఏమిటంటే సత్ఫలితానికి సత్ మార్గమే సాధనంగా వుపయోగించాలీ అని. కాబట్టి, నాకు ఇప్పుడు వున్న సమస్యను కాలంతో సంబంధం లేకుండా పరిష్కరించుకోవాలి. స్మృతుల పొరలన్నింటినీ విశ్లేషించి, వాటి విలువను గణించి చూడటం అంటే కాలంతో కూడుకున్న పని. కాలాన్ని కనుక వుపయోగిస్తే, సవ్యమైన గమ్యం చేరడానికి నేను అపసవ్యమైన సాధనాన్ని చేపడుతున్నట్లే. ఎందుకంటే, కాలరహితమైన దానిని కనిపెట్టడానికి నేను కాలాన్ని వుపయోగిస్తున్నాను. సవ్యమైన సాధనాన్ని వుపయోగిస్తేనే నేను కాలరహితమైన దానిని కనుక్కోగలుగుతాను. కాబట్టి, నా సమస్య ఏమిటంటే, ఆలోచనను, స్మృతికి పర్యవసానంగా కలిగిన ఆలోచనను - అంటే స్మృతిని - ఏవిధంగా తక్షణమే కరిగించి వేయగలనూ అని. ఇక మరే దృక్పథమైనా సరే, అవన్నీ కాలంతో కూడుకున్నవే. గమనించండి, సర్ ! దయచేసి జాగ్రత్తగా వినండి, మీ ముందు ఒక సమస్య వున్నది. అది ఏమిటంటే ; నాత్వం, 'మీరు' అంటే అది స్మృతి, జ్ఞాపకాల మూట ; దానిని కరిగించి తీరాలి. ఎందుకంటే స్మృతి కొనసాగడం అంటే కాలం. అయితే కాలం ద్వారా అనంతమైన దానిని, కొలతలు లేని దానిని, స్థలరహితమైన దానిని, కాలానికి అతీతమైన దానిని మీరు ఎన్నటికీ కనిపెట్టలేరు. అప్పుడు మరి దానిని ఎట్లా కనిపెట్టాలి ? స్మృతి పూర్తిగా ఆగిపోయినప్పుడే దానిని కనిపెట్టగలం. సరే, స్మృతి ఎట్లా ఆగిపోతుంది ? దయచేసి జాగ్రత్తగా వినండి. స్మృతులు పనిచేస్తున్నంత వరకు యదార్థతత్వం వుండదు - అని నేను గ్రహించాను. అది వాస్తవం. అవునా కాదా ? అదంతా నేను పూర్తిగా వివరించాను. అంటే, సర్ ! మనసు అంటే తయారు చేయబడిన ఒక వుత్పత్తి అనీ, స్మృతుల ఫలితం అనీ నేను చూశాను. అటువంటి మనసు స్వేచ్ఛను పొందడం ఎట్లా అని ఆలోచిస్తున్నప్పుడు, స్మృతులు ఇంకా పని చేస్తూనే వున్నాయి. ''స్మృతుల నుండి నేను విముక్తి పొందడం ఎట్లా'' అని మనసు అడిగినప్పుడు, అసలు ఆ ప్రశ్నలోనే స్మృతులలో నుంచే సమాధానం రాబోతున్నదనే అర్ధం దాగివున్నది. బహుశ, దీనిని నేను మరీ సంక్షిప్తంగా చెప్తున్నానేమో.

మనసు, చేతన మానసమూ, అంతఃచేతనా కూడా కేవలం ఒక జ్ఞాపకాల మూట. 'యదార్థతత్వాన్ని అవగాహన చేసుకొనడానికి గాను స్మృతుల నుండి విముక్తి పొందాలి' అని మనసు తనకు తానే చెప్పుకున్నప్పుడు, స్వేచ్ఛ పొందాలనే ఆ ఇచ్ఛ కూడా స్మృతులలో భాగమే. ఇది ఒక వాస్తవం. కాబట్టి, ఏదీ అవాలనే ఇచ్ఛ మనసులో ఇకమీదట లేకుండా - తనే స్మృతులు అనే వాస్తవంతో మాత్రమే మనసు

ముఖాముఖిగా వుంటుంది. తనలో పరివర్తన జరగాలనీ కోరుకోదు, మరొకటి ఏదో అవాలనీ కోరుకోదు. మనసు తను తలపెట్టిన ప్రతి చర్యా కూడా స్మృతులు పని చేయడంలో నుంచే పుడుతున్నదనీ, కాబట్టి సత్యాన్ని కనిపెట్టడం తనవల్ల కాదనీ గ్రహించినప్పుడు, అప్పుడు మనసు యొక్క స్థితి ఏమిటి ? అప్పుడది కదలిక లేకుండా నిలిచిపోతుంది. మనసు తను చేసే ఏ కార్యకలాపాల వల్ల కూడా ఏమీ ప్రయోజనం లేదనీ, అదంతా కూడా స్మృతులలో భాగమేననీ - కాబట్టి కాలంలో భాగమేననీ గ్రహించినప్పుడు, ఆ వాస్తవాన్ని చూసినప్పుడు, అప్పుడు అది ఆగిపోతుంది ; ఆగిపోతుందా లేదా ? నేను చెప్తున్న దానిలోని యదార్థాన్ని - అంటే, మనసు ఏం చేసినా సరే అదంతా స్మృతులలోని భాగమే అనీ, కాబట్టి స్మృతుల నుండి విముక్తమవడానికి చర్య తీసుకోలేదనీ మనసు చూస్తే, అప్పుడది ఏ పనీ చేయకుండా వుంటుంది. ఆవిధంగా ముందుకు పోలేనని మనసు చూసినప్పుడు, అది ఆగిపోతుంది. అందువల్ల మనసు, మనసులోని మొత్తం విషయ సామగ్రి అంతా, చేతనమైనది, అంతఃచేతనా కూడా నిశ్చలనంగా వుండిపోతాయి. ఇప్పుడు మనసు పనిచేయడం లేదు. తను ఏం చేసినా అదంతా సమతలమైన ఒకే దిశలో పోతోందనీ, అదే స్మృతి అనీ మనసు చూసింది. అందువల్ల, ఇందులో వున్న భ్రమను చూశాక మనసు మౌనంగా వుండిపోతుంది. ఇప్పుడు దాని దృష్టిలో ఏ వుద్దేశ్యమూ లేదు, ఫలితం సాధించాలనే కోరికా లేదు. అది ఏ మాత్రం చలనం లేకుండా ప్రశాంతంగా వున్నది. ఏ దిశలో కూడా కదలిక జరగడం లేదు. కాబట్టి ఏం జరిగింది ? మనసు ప్రశాంతిని పొందింది. అయితే, ప్రశాంతంగా చేయబడలేదు. నిద్ర పుచ్చబడిన మనసుకీ, నిశ్చలనంగా వున్న మనసుకీ మధ్యగల తేడాను చూడండి. ఈ స్థితిలో ఒక బ్రహ్మాండమైన కదలికా, అపరిమితమైన సజీవశక్తీ, ఒక కొత్తదనమూ, శాంతీ, అప్రమత్తతా మీరు కనిపెడతారు. క్రియ అని అనబడేది మొత్తం ఆగిపోతుంది. ఇప్పుడు మనసు అత్యున్నతమైన తెలివితేటలున్న స్థితిలో వుంటుంది. ఎందుకంటే స్మృతుల సమస్యను మనసు నకారాత్మకమైన ఆలోచనా తీరుతో సమీపించింది. ఈ నకారాత్మకమైన ఆలోచనా తీరే అత్యున్నతమైన ఆలోచన. ఇప్పుడు మనసు శాంతంగా వున్నది, దానిలో చురుకుదనం వున్నది, అయితే నిశ్చలనంగా వుండిపోయింది. అది దేనినీ బయటకు నెట్టడం లేదు, దేనిమీదా ఏకాగ్రత చూపడం లేదు, కేంద్రీకరించీ లేదు. అయితే, విస్తృతమైన ఎరుకతో వున్నది. ఇప్పుడు ఏం జరుగుతుంది ? ఈ ఎరుకలో ఎన్నుకోవడం అనేది లేదు. కేవలం వున్న విషయాలను వున్నవిగా - ఎరుపును ఎరుపుగా, నీలాన్ని నీలంగా ఏ వక్రీకరణలూ లేకుండా చూడటం వున్నది. ప్రశాంతంగా వుండే ఆ స్థితిలో ఎన్నిక చేయడం అనేది లేని ఆ ఎరుకలో, ఆ అప్రమత్తతలో, మాటలలో వ్యక్తీకరించడమూ సమస్తమైన మానసిక ప్రక్రియలూ, మేధాక్రియా అన్నీ పూర్తిగా ఆగిపోతాయి. నిశ్చలనత్వం వుంటుంది ; అయితే అది

తెచ్చిపెట్టుకున్న నెమ్మది తనం కాదు. ఆ నిశ్చలత్వంలో మనసు ఆలోచనను వుపయోగించుకొని తనను తాను పునర్జీవింప చేసుకోవడం వుండదు. కాబట్టి ఆలోచించేవాడూ వుండడు, ఆలోచనా వుండదు. అనుభవిస్తున్నవాడూ వుండడు, అనుభవం అయినదీ వుండదు. ఎందుకంటే అనుభవించేవాడూ, జరిగిన అనుభవమూ రెండూ ఆలోచనా ప్రక్రియ ద్వారా వుద్భవించినవే. అయితే, ఇప్పుడు ఆలోచనా ప్రక్రియ పూర్తిగా ఆగిపోయింది. ఇప్పుడు వున్నది కేవలం అనుభూతి చెందుతూవున్న స్థితి. అనుభూతి చెందుతూ వున్న ఆ స్థితిలో కాలం వుండదు. నిన్నా, ఇవాళా. రేపూ అనే కాలం సమస్తమూ పూర్తిగా ఆగిపోతుంది. ఇందులోకి కనుక మీరు ఇంకా ముందుకు వెళ్ళగలిగితే కాలం చేసిన వుత్పత్తి అయిన ఈ మనసు, తనను తాను సంపూర్ణంగా పరివర్తన చెందించుకున్నట్లుగా, ఇప్పుడు మనసు నిరంతరంగా కాలరహితంగా వున్నట్లుగా మీరే చూస్తారు. కాలరహితంగా వుండేది కొలతలకు అతీతంగా వుంటుంది ; దానికి ఆరంభమూ లేదు, అంతమూ లేదు ; దానికి వెనక కారణమూ వుండదు ; కాబట్టి దాని వలన కలిగే ప్రభావమూ వుండదు. ఏ కారణమూ లేకుండా వుండేదే యదార్థమైనది. దానిని మీరు ఇప్పుడే అనుభవంలోకి తెచ్చుకోవచ్చును. శతాబ్దాల తరబడి అభ్యాసం చేయడం ద్వారా కానీ, క్రమశిక్షణ ద్వారా కానీ, నిగ్రహం ద్వారా కానీ అది జరగదు. అది ఇప్పుడే జరిగి తీరాలి ; లేదా మరెన్నడూ జరగదు.

కాబట్టి, ధ్యానాన్ని అవగాహన చేసుకోవాలని కోరే మనసు తనని తాను అవగాహన చేసుకోవడం ఆరంభించాలి – తన సంబంధ బాంధవ్యాల్లో తనని అవగాహన చేసుకోవాలి, ఒంటరితనంలో కాదు. కాలం తయారుచేసిన ఈ మనసు కాలం నుండి విముక్తి పొందగలదు ; ఎప్పుడో కాలక్రమేణా కాదు, ఈ క్షణంలోనే. అయితే సవ్యమైన దృక్పథంతో వున్నప్పుడే ఆ స్వేచ్ఛ కలుగుతుంది – ధ్యానమే ఆ సవ్యమైన దృక్పథం – మానవ సమస్యలన్నింటికీ. సకారాత్మక దృక్పథం ఒక ప్రత్యేకమైన పద్ధతిలో వుండే చర్యలతో నిబద్ధితమై వుంటుంది. ధ్యానం నకారాత్మక దృక్పథం, అందువల్ల అది అత్యున్నతమైన ఆలోచనా తీరు – అయితే అది ఆలోచన కాదు. ఆలోచనలన్నీ కాలంతో సంబంధితమై వుంటాయి. ఒక మానవ సమస్యను మీరు అవగాహన చేసుకోవాలంటే, ఆలోచనా ప్రక్రియ జరగకూడదు. ఆలోచనా ప్రక్రియ నుండి మనసును విముక్తం చేయడం అంటే ధ్యానించడం. స్వీయజ్ఞానం లేకుండా ధ్యానించడం చేయలేరు. స్వీయజ్ఞానం వున్నప్పుడు మాత్రమే – దానికి ధ్యానమే ఆరంభం – అప్పుడు మాత్రమే యదార్దతత్వం వునికిలోకి వస్తుంది. యదార్థతత్వమే విడుదల చేస్తుంది.

# 1948 లో ప్రసంగాలు

## న్యూఢిల్లీ

**నవంబరు 14**

క్రియే బాంధవ్యం. క్రియ చేయకుండా మనం బ్రతకలేము. మన అస్తిత్వం లేదు. క్రియ వల్లనే నిరంతరమైన ఘర్షణా, నిరంతరంగా అపార్థాలూ, ఆందోళనలూ కలుగుతున్నట్లుగా అనిపిస్తున్నది. దురదృష్టవశాత్తూ, వ్యవస్థా రూపం తాల్చిన క్రియల కారణంగానే విపత్తులపైన విపత్తులు ఈ ప్రపంచంలో వచ్చిపడుతున్నాయని మనం చూస్తూనే వున్నాం. మన చుట్టూ వున్న ప్రపంచంలో గందరగోళమూ, దారుణమైన వేదనలూ, పరస్పరం ఘర్షించుకుంటున్న కోరికలూ వున్నాయని మనకి తెలుసు. ప్రపంచంలో వున్న ఈ అస్తవ్యస్తాన్ని గ్రహించాక, గాఢమైన ఆలోచనా శక్తీ, నిజాయితీ వున్న చాలామంది - అవి వున్నట్లుగా నటించేవారు కాదు, నిజంగా ప్రపంచం గురించి అక్కర వుండి చింతిస్తున్నవారు - ఈ క్రియ అనే సమస్యను గురించి ఆలోచించడం ఎంత ముఖ్యమో తప్పకుండా గ్రహిస్తారు. సామూహిక క్రియ వున్నది, వ్యక్తిగతమైన క్రియా వున్నది. సామూహిక క్రియ ఒక వూహగా మిగిలిపోయి, వ్యక్తి తప్పించుకోవడానికి ఒక సులువైన వుపాయంగా తయారైంది. సామూహిక చర్య ద్వారా నిరంతరంగా పుట్టుకొస్తున్న ఈ అవకతవకలనూ, ఈ దుర్భర స్థితిగతులనూ, ఈ విపత్తులనూ ఏదోవిధంగా పూర్తిగా మార్చి వేయవచ్చుననీ, లేదా ఒక క్రమతను నెలకొల్పవచ్చునీ అనుకోవడం వల్లనే వ్యక్తిలో బాధ్యతా రాహిత్యం పెరుగుతున్నది. ప్రజాసమూహం అనేది, సముదాయం అనేది కాల్పనికమైన సత్వం. అందులో సందేహం లేదు. సమూహం అంటే మీరూ, నేనే. నిజమైన క్రియ అనే బాంధవ్యాన్ని మీరూ, నేనూ అర్థం చేసుకోనప్పుడే, సమూహం అనే ఒక ఊహాకల్పన మీద మనం ఆధారపడతాం. ఆ విధంగా మన చర్యల్లో బాధ్యత లేకుండా పోతున్నది. క్రియల్లో సంస్కరణను తీసుకొని రావడానికి ఒక నాయకుడిని పట్టుకొస్తాం, లేదా అందరం కలసి ఒక వ్యవస్థగా ఏర్పడి తద్వారా సాముదాయకమైన చర్యను చేపడతాం. అయితే అదీ సామూహిక క్రియే అవుతుంది. క్రియ చేయడానికి ఒక మార్గాన్ని నిర్దేశించే నాయకుడిని తెచ్చుకున్నప్పుడు, ఆ నాయకుడు మన సమస్యలనూ, మన బాధలనూ అధిగమించి ముందుకు నడిపించే వాడయి వుంటాడని ఆశిస్తూ అతన్ని ఎన్నుకుంటాం. అయితే, మనం గందరగోళంలో వుండి నాయకుడిని ఎన్నుకుంటాం గాబట్టి, ఆ నాయకుడు కూడా గందరగోళ స్థితిలోనే వుంటాడు. మనవంటివాడు కాని నాయకుడిని మనం ఎన్నుకోము. మనం అది చేయలేము. మనలాగే గందరగోళంలో పడిపోయివున్న నాయకుడినే మనం ఎన్నుకుంటాం. కాబట్టి, అటువంటి

నాయకులూ, అటువంటి మార్గనిర్దేశకు లూ, ఆధ్యాత్మిక గురువులు అనే పేరున్నవారూ తప్పకుండా మనల్ని మరింత గందరగోళంలో పడవేస్తారు, మరిన్ని వేదనల్లో ముంచుతారు. మనం ఎన్నుకునేది మనలో వున్న గందరగోళపు స్థితిలోనుంచే కాబట్టి, ఆ నాయకుడిని మనం అనుసరిస్తున్నప్పుడు జరుగుతున్నది ఏమిటంటే, మన లోపలి గందరగోళపు బాహిర చిత్రాన్నే మనం అనుసరిస్తున్నామన్న మాట. కాబట్టి అటువంటి క్రియ, తాత్కాలికంగా కొంత ఫలితాన్ని ఇచ్చినా, ముందు ముందు మరింత విపత్తుకు తప్పకుండా దారితీస్తుంది.

కాబట్టి, సామూహిక క్రియ కొన్ని సందర్భాల్లో వుపయోగపడినప్పటికీ, ఎప్పటికైనా విపత్తులకూ, అల్లకల్లోలానికీ దారితీస్తుందనీ, వ్యక్తిలో బాధ్యతారాహిత్యాన్ని పెంచుతుందనీ మనం చూడవచ్చు. నాయకుడిని అనుసరించడం వల్ల గందరగోళం ఎక్కువవుతుందని కూడా మనం చూశాం. అయితే మనం బ్రతకక తప్పదు. బ్రతకడం అంటే క్రియ చేయడం. ఉండటం అంటేనే బాంధవ్యం కలిగివుండటం. పరస్పర సంబంధం లేకుండా క్రియ వుండదు. మనం ఒంటరిగా, ఏకాకులుగా జీవించలేము. అసలు ఏకాకి జీవితం అనేది లేనే లేదు. జీవితం అంటే క్రియ చేయడం, పరస్పర బాంధవ్యం కలిగివుండటం. కాబట్టి, మరింత దుర్భరస్థితినీ, ఇంకా కొంత గందరగోళాన్నీ సృష్టించని క్రియ ఏమిటో అవగాహన చేసుకోవాలంటే మనల్ని మనం అవగాహన చేసుకోవాలి. మనలో వున్న పరస్పర వైరుధ్యాలతో పాటుగా, మనలో వున్న పరస్పర ప్రతికూలతత్వాలతో పాటుగా, నిరంతరం ఒకదానితో మరొకటి యుద్ధం చేస్తున్న మనలోని బహురూపాలతో పాటుగా మనల్ని మనం అవగాహన చేసుకోవాలి. మనల్ని మనం అర్ధం చేసుకోనంతవరకూ, మన చర్యలు తప్పకుండా మరింత సంఘర్షణకూ, మరింత దారుణస్థితికీ దారి తీస్తూనే వుంటాయి.

కాబట్టి, మన సమస్య ఏమిటంటే అవగాహనతో క్రియ చేయడం. ఆ అవగాహన స్వీయజ్ఞానం ద్వారా మాత్రమే వస్తుంది. నిజానికి, ఈ ప్రపంచం అంటే నేను స్వయంగా చిత్రించుకున్నదే. నేను ఏమిటో అదే ఈ ప్రపంచం. ప్రపంచం నా నుండి విడిగా లేదు. ఈ ప్రపంచం నాకు వ్యతిరేకమైనది కాదు. నేనూ, ఈ ప్రపంచమూ రెండు విడివిడిగా వున్న సత్వాలు కావు. సమాజం అంటే నేనే. అవి రెండూ భిన్నభిన్న ప్రక్రియలు కావు. నన్ను విస్తరించుకోగా అది ప్రపంచం అవుతుంది. ఈ ప్రపంచాన్ని అవగాహన చేసుకోవాలంటే నన్ను నేను అవగాహన చేసుకోవాలి. వ్యక్తి ఈ సమూహానికి గానీ, ఈ సమాజానికి గానీ వ్యతిరేకంగా లేడు. ఎందుకంటే ఈ సమాజమే వ్యక్తి. సమాజం అంటే మీకూ, నాకూ, మరొకరికీ మధ్య వుండే పరస్పర బాంధవ్యం. వ్యక్తి బాధ్యతారాహితుడు

అయినప్పుడే వ్యక్తికీ, సమాజానికీ మధ్య వ్యతిరేకత ఏర్పడుతుంది. కాబట్టి, ఇప్పుడు మన సమస్య పెద్దదయింది. ప్రతి దేశాన్నీ, ప్రతి మనిషినీ, ప్రతి సమాజాన్నీ నిలవేస్తున్న భయంకరమైన విషమస్థితి మన ఎదురుగా వున్నది. మనకు అంటే మీకూ, నాకూ ఈ విషమస్థితితో వున్న సంబంధం ఏమిటి ? మనం ఏవిధంగా చర్య తీసుకోవాలి ? పరివర్తనను తీసుకొని రావాలంటే మనం ఎక్కడ ఆరంభించాలి ? నేను ముందే చెప్పినట్లుగా, సమూహాన్ని దృష్టిలో పెట్టుకుంటే – ఆ విధంగా పరిష్కారం జరగదు. ఎందుకంటే సమూహం అనగానే ఒక నాయకుడు కూడా అక్కడ వుంటాడు. సమూహాన్ని ఎప్పుడూ రాజకీయ వేత్తో, మతాచార్యుడో, ప్రత్యేక నిపుణుడో స్వప్రయోజనం కోసం దోపిడీ చేస్తూనే వుంటారు. అసలు సమూహంలో వుండేది మీరూ, నేనే కాబట్టి, మనం చేసే క్రియలకు మనమే బాధ్యత వహించాలి. అంటే మన స్వభావాన్ని మనమే అవగాహన చేసుకోవాలి. మనల్ని మనం అవగాహన చేసుకోవడం అంటే ప్రపంచాన్ని వదిలి, లోపలకు ముడుచుకొని పోవడం కాదు. ఎందుకంటే ముడుచుకొని పోవడం అంటే ఏకాకులుగా తయారవడం. ఏకాకులుగా ఎవరూ జీవించలేరు. కాబట్టి పరస్పర సంబంధాలలో క్రియని మనం అవగాహన చేసుకోవాలి. ఆ అవగాహన మనలో వున్న సంఘర్షణాపూరితమైన, పరస్పర వైరుధ్యంతో వున్న మన స్వభావాన్ని గ్రహించి తెలుసుకోవడం మీద ఆధారపడి వుంటుంది. శాంతితో కూడిన ఒక స్థితిని గురించి ఊహా కల్పన చేసుకొని, అది గమ్యం అనుకోవడం వట్టి మూర్ఖత్వం అని నేననుకుంటున్నాను. మన స్వభావాన్ని మనం అవగాహన చేసుకున్నప్పుడే, మనకు తెలియని ఏదో ఒక స్థితిని ముందే వూహించుకోకుండా వున్నప్పుడే శాంతి, ప్రశాంతత నెలకొంటాయి. శాంతితో కూడిన ఒక స్థితి వున్నదేమో. అయితే దానిని గురించి వూహాపోహాలు చేయడం నిరర్థకం.

కాబట్టి, సరియైన క్రియ చేయడం కోసంగాను, సవ్యంగా ఆలోచించాలి. సవ్యంగా ఆలోచించాలంటే స్వీయజ్ఞానం వుండితీరాలి. అయితే స్వీయజ్ఞానం పరస్పర సంబంధాల ద్వారానే కలుగుతుంది, దూరంగా వెళ్ళిపోయి ఏకాకులుగా వుండటం ద్వారా కాదు. మనల్ని మనం అవగాహన చేసుకోవడంలోనే సవ్యంగా ఆలోచించడం కలుగుతుంది. అందులో నుండే సరియైన క్రియ వుద్భవిస్తుంది. కాబట్టి, సరియైన క్రియ అంటే మనల్ని మనం అవగాహన చేసుకోవడంలో నుండి వచ్చేది. అంటే, మనలో ఏదో ఒక్క భాగాన్ని కాదు, మన లోపల వున్న విషయ సామగ్రినంతా, పరస్పర వైరుధ్యాలతో కూడిన మన స్వభావాలనూ, మనం ఏమిటో అదంతటినీ అవగాహన చేసుకోవాలి. మనల్ని మనం అవగాహన చేసుకుంటుంటేనే సరియైన క్రియ జరుగుతూ వుంటుంది. ఆ క్రియలో నుండే సంతోషం కలుగుతుంది. నిజంగా చూస్తే, మనకి కావలసినది ఈ సంతోషమే కదా. మనలో చాలామంది వెతుకుతున్నది రకరకాల రూపాల్లో, రకరకాల

పలాయనాల ద్వారా ఈ సంతోషాన్నే కదా ! – సామాజిక కార్యకలాపాల ద్వారా, వుద్యోగాల రంగం ద్వారా, వినోదకార్యక్రమాల ద్వారా, పూజా పునస్కారాల ద్వారా, కొన్ని కొన్ని మాటలను జపంచేయడం ద్వారా, శారీరకమైన సుఖసంతృప్తుల ద్వారా – ఇంకా ఎన్నో ఇటువంటి మార్గాల ద్వారా వెతుకుతున్నది సంతోషాన్నే కదా! అయితే, ఈ పలాయన మార్గాలు దీర్ఘకాలం కొనసాగే సంతోషాన్ని ఇవ్వలేవనీ, కేవలం తాత్కాలికమైన వుపశాంతిని మాత్రమే ఇస్తాయనీ మనం గ్రహించాం. అసలు ముఖ్యమైన సంగతి ఏమిటంటే వాటిలో సత్యం లేదు. చిరకాలం కొనసాగే ఆనందం లేదు. అటువంటి ఆనందాన్ని, అటువంటి తన్మయత్వాన్ని, అటువంటి సృజనాత్మకమైన, సజీవమైన, నిజమైన వుల్లాసాన్ని మనల్ని మనం అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే కనిపెట్టగలమని నేను అనుకుంటున్నాను. ఈ మనల్ని మనం అవగాహన చేసుకోవడమనేది అంత సులువైనది కాదు. దానికి ఒకవిధమైన అప్రమత్తత అవసరం, ఒక ఎరుక అవసరం. ఆ అప్రమత్తత, ఆ ఎరుక మనం ఖండించడం గానీ, సమర్ధించడం గానీ చేయకుండా వున్నప్పుడే కలుగుతాయి. ఎందుకంటే ఖండనగానీ, సమర్ధనగానీ చేసిన మరుక్షణమే అవగాహన అనే ప్రక్రియ ఆగిపోతుంది. ఎవరినైనా మనం ఖండిస్తుంటే ఆ మనిషిని అర్థం చేసుకోవడం జరగదు. ఎవరితోనైనా మనల్ని మమైక్యం చేసుకుంటే – మనవాళ్ళు అని అనుకుంటే, అప్పుడు కూడా వాళ్ళని అర్థం చేసుకోవడం జరగదు. మనల్ని మనం అర్థం చేసుకోవడం విషయంలో కూడా ఇంతే. మీరు ఏమిటో దానిని పరిశీలించడం, అనాసక్తమైన ఎరుకతో వుండటం చాలా కష్టం. అయితే అటువంటి అనాసక్తమైన ఎరుక ద్వారానే అవగాహన కలుగుతుంది. 'ఉన్నది' పరివర్తన చెందుతుంది. ఈ పరివర్తన మాత్రమే తలుపులు తెరిచి యదార్ధతత్వాన్ని చూపుతుంది.

ఇప్పుడు మన సమస్య ఏమిటంటే – క్రియా, అవగాహనా, సంతోషమూ. మనల్ని మనం తెలుసుకుంటే తప్ప నిజమైన ఆలోచనకు పునాది వుండదు. నన్ను నేను తెలుసుకోకుండా నావద్ద ఆలోచనకు పునాది వుండదు. పరస్పర వైరుధ్యాలతో నిండిన స్థితిలోనే నేను జీవిస్తూ వుంటాను. మనలో చాలామంది ఇట్లాగే వుంటారు. ప్రపంచంలో – అంటే నా సంబంధ బాంధవ్యాల ప్రపంచంలో పరివర్తన తీసుకొని రావాలంటే నాతోనే నేను ఆరంభించాలి. 'ఆ విధంగా ప్రపంచంలో పరివర్తనను తీసుకొని రావాలంటే అంతూపొంతూ లేనంత సమయం పడుతుంది,' అని మీరనవచ్చు. తక్షణమే ఫలితాలు కావాలని మనం కోరుకుంటున్నప్పుడు సహజంగానే చాలా సమయం పడుతున్నదని మనం అనుకుంటాం. తక్షణమే ఫలితాలు లభిస్తాయని రాజకీయ వేత్తలు వాగ్దానాలు చేస్తుంటారు. అయితే సత్యాన్ని అన్వేషిస్తున్న మనిషికి తక్షణమే ఫలితాలు లభించవు. పరివర్తనను కలిగించేది సత్యం. అంతే తప్ప తక్షణమే జరిగే క్రియవల్ల రాదు. ప్రతి

ఒక్కరూ సత్యాన్ని కనుగొనడం వల్ల మాత్రమే ప్రపంచంలో సంతోషమూ, శాంతీ నెలకొంటాయి. ప్రపంచంలో నివసిస్తూనే, ప్రపంచానికి చెంది వుండకూడదు అనేదే మన సమస్య – అంటే ఈ శోధన చిత్తశుద్ధితో చేయడం పెద్ద సమస్యే. ఎందుకంటే, మనం దూరంగా ఏకాంతంలోకి పారిపోవడానికీ లేదు, సన్యసించడానికీ లేదు ; అయితే మనల్ని మనం మాత్రం అర్థం చేసుకొని తీరాలి. తనని తాను అవగాహన చేసుకోవడం వివేకానికి నాంది. తనని తాను అవగాహన చేసుకోవడం అంటే తనకి విషయాలతో, మనుష్యులతో, రకరకాల భావాలతో వున్న సంబంధ బాంధవ్యాలను అర్థం చేసుకోవడం. విషయాలతో, మనుష్యులతో, భావాలతో వున్న మన సంబంధాలలోని పూర్తి ప్రాధాన్యాన్ని మనం అవగాహన చేసుకోనంతవరకూ క్రియలు – అంటే అవే పరస్పర సంబంధాలు – ఆ క్రియలు తప్పకుండా సంఘర్షణలనూ, కలహాలనూ తీసుకొస్తూనే వుంటాయి. కాబట్టి, చిత్తశుద్ధితో వున్న మనిషి తనతోనే ఆరంభించాలి. అతడు తన ఆలోచనలన్నింటి ఎడలా, మనోభావాలన్నింటి ఎడలా క్రియలన్నింటి ఎడలా అనాసక్తమైన ఎరుక కలిగివుండాలి. మళ్ళీ చెప్తున్నాను, ఇది సమయానికి సంబంధించినది కాదు. స్వీయజ్ఞానానికి ఒక ముగింపు అంటూ లేదు. స్వీయజ్ఞానం అంటే ఆయా క్షణాలలో వుండేది. అందువల్ల క్షణక్షణమూ సృజనాత్మకమైన సంతోషం వుంటూ వుంటుంది.

అందుకని, మనందరికీ కావలసినది శాంతీ, సంతోషాలతో పాటుగా సరియైన క్రియ – సంక్లిష్టమైన మన స్వభావాలను మనం అవగాహన చేసుకోవడం ద్వారా మాత్రమే అవి కలుగుతాయి. ఆ అవగాహన మరీ అంత కష్టసాధ్యమైనదేమీ కాదు ; అయితే దానికి కొంత చిత్తశుద్ధీ, మృదువుగా మలచుకొనిపోయే మనసూ అవసరం అవుతాయి. మనం మాట్లాడే మాటలను గురించీ, మన ఆలోచనలను గురించీ, మనోభావాలను గురించీ ఖండించడం గానీ, సమర్థించడం గానీ లేకుండా నిరంతరమైన, అనాసక్తమైన ఎరుక కనుక వుంటే అప్పుడు ఆ ఎరుక ద్వారానే సవ్యమైన క్రియా, తద్వారా పరివర్తనా కలుగుతాయి – ఇది మనల్ని మనం పరివర్తన చేసుకోవాలి అనే ప్రయత్నాల ఫలితంగా వచ్చేది కాదు. అయితే ఆ సత్యం వునికిలోకి రావాలంటే, స్వీకరించే స్థితి వుండితీరాలి ; ఆ స్థితిలో ఒకటి కావాలి అనే ఒత్తిడి కానీ, భయం కానీ, కోరికలు కానీ వుండవు. అటువంటి స్థితి అనాసక్తమైన ఎరుక వున్నప్పుడే వునికిలోకి రావడం జరుగుతుంది.

రాబోయే కొద్ది వారాల్లో ఇవన్నీ మనం చర్చించుకుందాం. ఇప్పుడు కొన్ని ప్రశ్నలకు మాత్రం సమాధానాలు ఇస్తాను. సవ్యమైన సమాధానం రావాలంటే సవ్యమైన ప్రశ్న వుండితీరాలి. ప్రశ్న ఎవరయినా అడగచ్చు. అయితే ప్రశ్నకు సమాధానాన్ని కనిపెట్టాలంటే మనం ఆ సమస్యనే బాగా అధ్యయనం చేయాలి తప్ప సమాధానాన్ని

కాదు. ఎందుకంటే అసలు సమాధానం ఆ ప్రశ్నలోనే ఇమిడి వున్నది. ఒక సమస్యలోకి పరికించి చూడటమూ, అవగాహన చేసుకోవడమూ ఒక లలితకళ వంటిది. అందుకని మీ ప్రశ్నలను నేను పరిశీలించి, వివరిస్తూ వున్నప్పుడు, దయచేసి సమాధానం కోసం వేచి చూడకండి. ఎందుకంటే మీరూ, నేనూ కలసి ఈ సమస్యను గురించి యోచించాలి, ఆ సమస్యలో నుండే సమాధానాన్ని రాబట్టాలి. మీరు కేవలం సమాధానం కోసం మాత్రమే వేచివుంటే, బహుశ మీకు నిరాశే మిగులుతుంది. జీవితంలో 'అవును' అనీ 'కాదు' అనీ ఇతమిత్థమైన జవాబులు వుండవు. అయితే మనం అటువంటి జవాబులు లభించాలని ఆశిస్తాం. జీవితం అంతకంటే సంక్లిష్టంగా వుంటుంది, అంతకంటే సూక్ష్మాంశాలతో నిండివుంటుంది. కాబట్టి, సమాధానం కనిపెట్టాలంటే సమస్యనే అధ్యయనం చేయవలసి వుంటుంది. అంటే అర్థం - మనలో సమస్యను పరికించి చూసే ఓర్పూ, తెలివీ వుండి తీరాలి.

ప్రశ్న : ఆధునిక సమాజంలో మత వ్యవస్థకున్న స్థానం ఏమిటి ?

కృష్ణమూర్తి : మతం అంటే మన అర్థం ఏమిటి, ఆధునిక సమాజం అంటే అర్థం ఏమిటి అనేవి ముందుగా తెలుసుకుందాం. మతం అంటే ఏమిటి ? మీ దృష్టిలో మతం ఏమిటి ? అంటే - కొన్ని నమ్మకాలూ, కర్మకాండలూ, కొన్ని అంధవిశ్వాసాలూ, రకరకాల మూఢాచారాలూ, పూజలూ, కొన్ని మాటలని జపం చేయడమూ, అస్పష్టమైనవీ, నిష్ఫలమైపోయినవీ, నిరాశలుగా మిగిలిపోయినవీ - ఇట్లా అనేకమైన ఆశలూ, కొన్ని గ్రంథాలను ప్రత్యేకంగా చదవడమూ, గురువుల వెంటబడటమూ, అప్పుడప్పుడు దేవాలయాలకి వెళ్ళడమూ మొదలైనవి - అవునా కాదా ? మనలో చాలామందికి మతమంటే నిస్సందేహంగా ఇదే. అయితే అదేనా మతమంటే ? మతమంటే ఒక ఆచారమా ? ఒక అలవాటా ? ఒక సంప్రదాయమా ? మతమంటే వీటన్నింటినీ మించి ఆవలగా వుంటుందని గట్టిగా చెప్పచ్చు. అవునా కాదా ? మతం అంటే యదార్థతత్వం కోసం అన్వేషణ అనే అంతర్లీనమైన అర్థం వున్నది. దానికీ నమ్మకం అనే వ్యవస్థకీ, దేవాలయాలకీ, మూఢ విశ్వాసాలకీ, కర్మకాండలకీ ఎటువంటి సంబంధమూ లేదు. అయినా కూడా మన ఆలోచనా ధోరణిలోనే, మన బ్రతుకు అనే వస్త్రపునేతలోనే నమ్మకాలూ, అంధాచారాలూ మొదలైనవి గజిబిజిగా అల్లుకొనిపోయి వున్నాయి. కాబట్టి, ఆధునిక మానవుడు ధార్మిక జీవితం గడపడం లేదని స్పష్టంగా కనబడుతూ వున్నది. అందువల్ల అతని సమాజం ఆరోగ్యంగా, మతిస్థిరత్వంతో, సమతుల్యంతో వున్న సమాజం కాదు. కొన్ని కొన్ని ధర్మశాస్త్రాలని మనం అనుసరిస్తుండవచ్చుగాక, కొన్ని బొమ్మల్ని పూజిస్తుండవచ్చుగాక, ప్రభుత్వమే ఒక కొత్త మతాన్ని నెలకొల్ప వచ్చుగాక. అయితే

ఇవన్నీ మతం కాదు అనేది స్పష్టం. మతం అంటే యదార్ధతత్వం కోసం అన్వేషణ అని నేనన్నాను. అయితే ఈ యదార్ధతత్వం అజ్ఞేయమైనది, మనకి తెలియనిది. అది పుస్తకాలలో వుండే యదార్ధతత్వం కాదు. అది ఇతరుల అనుభవం కాదు. ఆ యదార్ధతత్వాన్ని కనిపెట్టాలంటే, దానిని తెరచి చూడాలంటే, ఆహ్వానించాలంటే తెలిసినది ముగిసిపోవాలి. ఆచార సంప్రదాయాలలో, నమ్మకాలలో వున్న ప్రాధాన్యతలను, అప్రాధాన్యతలను అన్నీ క్షుణ్ణంగా పరిశీలించాలి, అవగాహన చేసుకోవాలి, వదిలివేయాలి. దీని కోసం కర్మకాండలూ, పూజా పునస్కారాలూ మళ్ళీ మళ్ళీ చేయడంవల్ల లాభం లేదు. కాబట్టి ధార్మికుడైన మనిషి ఏ మతానికీ చెందివుండడు, ఏ వ్యవస్థలోనూ చేరడు – అని స్పష్టమవుతున్నది. అతను హిందువూ కాదు, ముస్లిమూ కాదు. ఏ వర్గానికీ చెందడు.

సరే, ఆధునిక ప్రపంచం అంటే ఏమిటి ? బహుళ సంఖ్యల్లో వుద్యోగులని నియమించి, ఆ సంస్థలని సాంకేతిక నైపుణ్యంతోనూ, కార్యకుశలత్వంతోనూ నడిపించేదే ఆధునిక ప్రపంచం. సాంకేతిక విజ్ఞానంలో అపూర్వమైన అభ్యున్నతిని సాధించాం. ప్రజల నిత్యావసరాలకు తగినట్లుగా పంపిణీ జరగడంలేదు. ఈ పంపిణీ, వుత్పత్తి సాధనాలూ అన్నీ కొద్దిమంది చేతుల్లోనే వుండిపోయాయి. జాతుల మధ్య వైరాలూ, సంఘర్షణలూ వున్నాయి. సర్వస్వతంత్ర ప్రభుత్వాల కారణంగా నిరంతరమూ రగులుకుంటున్న యుద్ధాలు వున్నాయి. ఇంకా ఎన్నో ఇటువంటివి. అదీ ఆధునిక ప్రపంచం అంటే. అవును కదూ ? సాంకేతిక రంగంలో అభివృద్ధి జరిగింది. కానీ దానితోపాటుగా అంతే సమాన ప్రాధాన్యం గల మనోతత్వంలో పురోగతి లేదు. అందువల్ల ఇది సమతుల్యంలో వున్న స్థితి కాదు. మహా అద్భుతమైన శాస్త్రపరిశోధనలు జరిగి గొప్ప ఫలితాలు సాధించారు. అదే సమయంలో మానవుల్లో దుర్భర దైన్యం, ఖాళీ హృదయాలు, ఖాళీ మనసులూ పెచ్చు పెరిగాయి. మనం కనిపెట్టిన సాంకేతిక నైపుణ్యం అంతా విమానాలు నిర్మించడంలో, ఒకరి నొకరం చంపుకోవడంలో – ఇంకా అటువంటి వాటిలోనే. కాబట్టి అదీ ఆధునిక ప్రపంచం. అంటే అది మీరే. ప్రపంచం అంటే మీరే తప్ప మీనుండి వేరుగాలేదు. మీ ప్రపంచం అంటే మీరే. మేధాశక్తిని పెంచిపోషించే, శూన్య హృదయాలను తయారుచేసే ప్రపంచం. మీ లోపలకు మీరు పరికించి చూసుకుంటే, ఆధునిక నాగరికత పండించిన ఫలం మీరు, అని మీరే తెలుసుకుంటారు. మీకు కొన్ని యుక్తులు తెలుసు – సాంకేతికమైనవీ, చేతితో సాధించేవీ అయిన వుపాయాలు. అయితే మీరు సృజనాత్మకత కల మనుష్యులు కారు. మీరు పిల్లల్ని కంటారు. కానీ, అది సృజనాత్మకత కాదు. సృజన చేయాలంటే మనిషిలో అసాధారణమైన అంతరికమైన సంపద వుండాలి.

సత్యాన్ని మనం అవగాహన చేసుకున్నప్పుడే, సత్యాన్ని స్వీకరించగలిగి వున్నప్పుడు మాత్రమే ఆ సంపద ఒనగూడుతుంది.

కాబట్టి, మత వ్యవస్థలూ, ఆధునిక ప్రపంచమూ రెండూ కలిసికట్టుగా వుంటాయి. అవి రెండూ శూన్య హృదయాల్ని తయారుచేస్తాయి. మన జీవన అస్తిత్వంలో వున్న దౌర్భాగ్యం అదీ. మనం పైపైన బతుకుతూ వుంటాం. మేధాసంబంధమైన విషయాల్లో చురుకుగా వుంటాం ; గొప్ప గొప్ప నూతన పరిశోధనలు కనిపెట్టగలం. ఒకరి నొకరు హతమార్చుకునే గొప్ప మారణసాధనాలు తయారుచేయగలం. మన మధ్య రకరకాలైన కొత్త విభజనలు సృష్టించుకుంటూ వుంటాం. అయితే, మనకి ప్రేమించడం అంటే ఏమిటో తెలియదు. మన హృదయాలు ఆలపించే రాగాలు ఏవీ వుండవు. మనం గ్రామఫోన్ల చేత పాడిస్తాం. రేడియోలు వింటాం కానీ, మనం పాటలు పాడం. ఎందుకంటే మన హృదయాలు ఖాళీ, వట్టిపోయివున్నాయి. పూర్తిగా గందరగోళమై పోయిన, దుర్భరస్థితిలో వున్న ప్రపంచాన్ని మనమే తయారు చేసుకున్నాం. మన సంబంధాలు అన్నీ తేలిగ్గా ముక్కలై పోతాయి ; లోతులేని పైపై పూతలవంటివి. అవును, మత వ్యవస్థలూ, ఆధునిక ప్రపంచమూ కలిసి పని చేస్తాయి. ఎందుకంటే రెండూ గందరగోళానికే దారితీస్తాయి. మత వ్యవస్థా, ఆధునిక ప్రపంచమూ సృష్టిస్తున్న ఈ గందరగోళానికి కారణం మనమే. మనం స్వయంగా తయారుచేసుకున్న వాటి వ్యక్తరూపాలే ఇవి. కాబట్టి, మనలో ప్రతి ఒక్కరిలోనూ, మన లోపల లోతుల్లో పరివర్తన జరగనంతవరకూ బయట ప్రపంచంలో పరివర్తన జరగదు. అటువంటి ఆ పరివర్తనను తీసుకొనిరావడం ఎవరో ప్రత్యేక నిపుణులూ, నాయకులూ, మతాచార్యులూ పూనుకొని చేయవలసిన సమస్య కాదు. ఈ సమస్య మనలో ప్రతి ఒక్కరిదీ. అది ఇతరులకు మనం వదిలేశామంటే, మన బాధ్యతను మనం వదిలివేసినట్లవుతుంది. అప్పుడు మన హృదయాలు శూన్యమైపోతాయి. శూన్య హృదయంతో, సాంకేతిక విజ్ఞానం నిండిన మనసుతో వున్న మనిషి సృజనాత్మకత గల మనిషి అవడు. అటువంటి సృజనాత్మకత గల స్థితిని మనం పోగొట్టుకున్నాం ; కాబట్టే, మహాదారుణమైన బాధలతో నిండిన, గందరగోళంలో పడిపోయివున్న, యుద్ధాలతో ముక్కలైపోయిన, వర్గ జాతి విభేదాలతో చెదరిపోయి వున్న ఇటువంటి ప్రపంచాన్ని మనం తయారుచేశాం. కాబట్టి, మన లోపల ఒక సమూలమైన పరివర్తనను తీసుకొని రావలసిన బాధ్యత మనదే.

ప్రశ్న : నాలో ఘర్షణ వున్నది, బాధపడుతున్నాను. ఈ బాధలని కలిగిస్తున్న కారణాలు ఏమిటో వేల సంవత్సరాలుగా మనకి చెప్తూనే వున్నారు. బాధను పరిహరించే మార్గాలనూ బోధించారు. అయినా ఎక్కడున్నవాళ్ళం అక్కడే వుండిపోయాం. ఈ బాధలను అంతం చేయడం సాధ్యమేనంటారా ?

కృష్ణమూర్తి : మనం బాధపడుతున్నామనే స్పృహ ఎంతమందికి వున్నదా అని నాకనిపిస్తున్నది. మీకు వున్నదా ? మీలో సంఘర్షణ వున్నదనే విషయం మీకు తెలుసా ? ఒక సిద్ధాంతంగా, వాదంగా కాదు, ఒక అసలైన వాస్తవంగా మీకు తెలుసా ? అట్లా కనుక తెలుస్తే ఏం చేస్తారు ? దానినుండి పారిపోవాలని ప్రయత్నిస్తారు, అంతేకదూ ? ఈ సంఘర్షణ గురించీ, బాధ గురించీ తెలుసుకున్న మరుక్షణమే, మేధాసంబంధమైన వ్యాపకాలలోనో, కార్యభారంలోనో, వినోదాల అనుభవాలలోనో, సుఖాన్వేషణలోనో పడి ఆ సంగతి మరిచిపోవాలని ప్రయత్నిస్తారు. బాధలనుండి పారిపోవడానికి మార్గాలు వెతుక్కుంటారు. అయితే ఈ పలాయనాలన్నీ ఒక్కటే. అవునా కాదా ? అవి నాగరీకమైనవైనా సరే, మోటురకమైనా సరే. అసలు సంఘర్షణ అంటే మీ అర్థం ఏమిటి ? మీలో సంఘర్షణ వున్నట్లు మీకు ఎప్పుడు తెలుస్తుంది ? 'నా'కు హఠాత్తుగా తన గురించి స్పృహ కలిగినప్పుడు మాత్రమే సంఘర్షణను గురించి మనకు తెలుస్తుంది. అది లేనప్పుడు మీరు మామూలుగానే, ఒకే రకమైన దినసరి జీవితాన్ని లోతుకు పోకుండా పైపైన మాత్రం వ్యవహరిస్తూ వుండే, మందకొడిగా వుండే, దినసరి జీవితాన్నే గడిపేస్తూ వుంటారు. అవునా ? సంఘర్షణ వున్నప్పుడే మీ గురించిన ఒక స్పృహ మీకు కలుగుతుంది. ఏ వైరుధ్యాలూ లేకుండా, ఏ ఆశాభంగాలూ లేకుండా, అంతా తిన్నగా సాగిపోతున్నంత వరకు క్రియాచరణలో 'మీరు' అనే స్పృహ వుండదు. నన్ను ఎవరూ అటూ ఇటూ త్రోసి, నెట్టిపారేయనంత వరకు, నాకు కావలసినది నాకు లభ్యమవుతున్నంత వరకు నాలో ఏ సంఘర్షణా వుండదు. అయితే నాకు ఆటంకం తగిలిన మరుక్షణమే నా గురించి నాకు స్పృహ కలిగి, నేను అమితబాధకు లోనవుతాను. ఇంకో మాటల్లో చెప్పాలంటే, పని చేస్తున్నప్పుడు 'నాత్వం' అంటే నేనుకు, నాకు ఆశాభంగం అవుతున్నది అనే భావం కలగగానే సంఘర్షణ ఆరంభమవుతుంది. కాబట్టి, మనకి కావలసినది ఏమిటి ? మన క్రియలకు ఏ భంగపాటూ ఎదురుకాకుండా ఎల్లప్పుడూ అవి సఫలీకృతమవుతూ వుండటమే మనకు కావలసినది. అంటే, మనకి ఏ అడ్డంకులూ రాకుండా మన జీవితాలు సాగిపోతుండాలి. మరో మాటల్లో చెప్పాలంటే, మన కోరికలు ఎప్పుడూ నెరవేరుతూ వుండాలి. ఆ కోరికలు కనుక నెరవేరకపోతే అప్పుడు సంఘర్షణ పుడుతుంది, వైరుధ్యాలు బయలుదేరుతాయి. కాబట్టి, అసలు మన సమస్య ఏమిటంటే, ఏవిధంగా సఫలత చెందాలీ, భంగపాట్లు లేకుండా ఏవిధంగా స్వీయసాఫల్యాన్ని సాధించాలీ అని. నా స్వంతానికి ఫలానాది కావాలి – ఆస్తి, ఒక వ్యక్తి, ఒక బిరుదు లేదా మరొకటి – అది నాకు లభ్యమవుతే, నాకు కావలసినది నాకు దక్కుతూ వుంటే, అప్పుడు నేను సంతోషంగా వుంటాను. అప్పుడు ఏ వైరుధ్యమూ నాలో వుండదు. కాబట్టి, మనం కోరుకుంటున్నది స్వీయం తృప్తి చెందడం ; ఆ సాఫల్యమూ, ఆ సంతృప్తీ సాధిస్తున్నంత వరకు మనలో ఏ ఘర్షణా వుండదు.

ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే – అసలు స్వీయ సాఫల్యం అనేది ఒకటి వున్నదా ? అంటే ఫలానాది నేను సాధించగలనా, ఫలానాగా అవగలనా, ఫలానాది గ్రహించి అందుకోగలనా ? ఇటువంటి కోరికలో నిరంతరమైన పోరాటం లేదూ ? అంటే, ఫలానాగా అవాలనీ, ఫలానాది సాధించాలనీ, 'నా'కు సఫలత కలగాలనీ నేను ఆరాటపడుతున్నంతవరకూ భంగపాట్లు వుండి తీరుతాయి, భయం వుండితీరుతుంది, సంఘర్షణ వుండి తీరుతుంది. కాబట్టి, స్వీయసాఫల్యం అనేది ఒకటి అసలు వున్నదా ? స్వీయ సాఫల్యం అంటే అర్థం ఏమిటి ? స్వీయ సాఫల్యం అంటే స్వీయాన్ని, అంటే నన్ను విస్తృత పరచుకోవడం, 'నా' మరింత పెరిగిపోయి, మరింత గొప్పగా, మరింత ప్రముఖంగా అవడం. 'నా' ఒక గవర్నరు అవడమో, గొప్ప వుద్యోగి అవడమో, బ్యాంక్ మేనేజరు అవడమో, ఇంకా అటువంటివి. సరే, దీని లోపలకు కనుక ఇంకా లోతుగా మీరు వెళ్ళి పరికిస్తే, 'నేను' చేత క్రియ జరుగుతున్నంతవరకు, అంటే క్రియలో నేను అనే స్పృహ వున్నంతవరకు భంగపాట్లు తప్పవు. అందువల్ల బాధలు కూడా వుండి తీరుతాయి. కాబట్టి, మన సమస్య ఏమిటంటే, బాధల్ని ఎట్లా అధిగమించాలి అని కాదు, సంఘర్షణలని ఎట్లా తోసేసుకోవాలి అని కాదు, నాత్వాన్ని, ఈ 'నా' స్వభావాన్ని అవగాహన చేసుకోవాలి అనేది. ఇదంతా మరీ క్లిష్టంగా తయారుచేయడం లేదనే ఆశిస్తున్నాను. మనం కేవలం సంఘర్షణని మాత్రం అధిగమించాలని ప్రయత్నిస్తే, దుఃఖాన్ని పక్కకి నెట్టేయాలని చూస్తే ఈ దుఃఖాన్ని తయారు చేస్తున్న కర్త స్వభావాన్ని మనం అవగాహన చేసుకోలేము.

ఆలోచన తనని తాను బాగుపరచుకోవడం కోసం, తనలో పరివర్తన రావడం కోసం, తన అభివృద్ధి కోసం ఆరాటపడుతున్నంతవరకు సంఘర్షణా, వైరుధ్యమూ వుండి తీరుతాయి. కాబట్టి, మళ్ళీ మనం స్పష్టంగా కనిపించే ఈ వాస్తవానికే – నన్ను నేను అవగాహన చేసుకోనంతవరకు సంఘర్షణా, బాధలూ వుంటూనే వుంటాయనే వాస్తవానికే – తిరిగి వస్తున్నాం. అందువల్ల, దుఃఖాన్నీ సంఘర్షణనీ ఎట్లా అధిగమించాలో తెలుసుకోవడం కంటే కూడా తనని తాను అవగాహన చేసుకోవడమే ముఖ్యం. ఇదంతా ముందు ముందు ఇంకా విశదంగా తెలుసుకుందాం. అయితే, పూజలూ, ఆచారవిధులూ మొదలైనవాటి ద్వారా, వినోద కాలక్షేపాల ద్వారా, నమ్మకాల ద్వారా, ఇంకా ఇతరమైన వ్యాపకాల ద్వారా దుఃఖాన్నుంచి పారిపోవడం అంటే, అసలు ప్రధాన విషయాన్నుంచి ఆలోచనను మరింత దూరదూరంగా తీసుకొని పోవడమే. ఆ ప్రధాన విషయం ఏమిటంటే – మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం. బాధని అవగాహన చేసుకోవాలంటే పలాయనాలన్నీ ఆగిపోవాలి. అప్పుడు మాత్రమే క్రియ చేస్తున్నప్పటి మిమ్మల్ని మీరు ముఖాముఖిగా ఎదుర్కొన గలుగుతారు. క్రియ చేస్తున్నప్పటి మీరు అంటే

– అదే పరస్పర బాంధవ్యం – ఆ మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడంలోనే ఆలోచనను అన్ని సంఘర్షణల నుండి పూర్తిగా విడిపించి, ఆనందమూ, యదార్థ తత్వమూ అనే ఒక స్థితిలో జీవించే ఒక మార్గాన్ని మీరు కనిపెడతారు

ప్రశ్న : ఎందుకు జీవిస్తున్నామో తెలియకుండానే మేము బతుకుతూ వుంటాం. జీవితానికి అసలు అర్థమే లేదని మాలో చాలామంది అనుకుంటూ వుంటారు. మా ఈ జీవితాలకి ప్రయోజనమేమిటి, అర్థం ఏమిటి – అది మీరు చెప్పగలరా ?

కృష్ణమూర్తి : సరే, అసలు ఈ ప్రశ్న మీరు ఎందుకు అడుగుతున్నారు ? జీవితానికి అర్థమూ, జీవన ప్రయోజనమూ ఏమిటో చెప్పమని నన్ను మీరు ఎందుకు అడుగుతున్నారు ? అసలు జీవితం అంటే మనం అనుకునేది ఏమిటి ? జీవితానికి ఒక అర్థమూ, ఒక ప్రయోజనమూ వుంటాయా ? జీవితాన్ని జీవించడమే దాని అర్థమూ, దాని ప్రయోజనమూ కాదా ? అంతకంటే ఎక్కువగా ఏదో కావాలని ఎందుకు కోరుకుంటాము ? ఎందుకంటే మన జీవితాలతో మనం అసంతృప్తి చెంది వున్నాం కాబట్టి. జీవితం ఎంతో శూన్యంగా ఎంతో చౌకబారుగా, ఎంతో విసుగ్గానూ వుండి, చేసిందే మళ్ళీ మళ్ళీ చేస్తూ పోతూ వుంటాం కాబట్టి. ఇంతకంటే ఇంకా ఏదో మనకి కావాలి. మన రోజువారీ జీవితం ఎంతో విసుగ్గా, భరించరాని మూర్ఖత్వంతో నిండివున్నది కాబట్టి జీవితానికి ఇంతకంటె అర్థం ఏదో వుండాలని అంటాం. అందుకనే మీరు ఈ ప్రశ్న అడుగుతున్నారు. సర్ ! బాగా సమృద్ధవంతమైన జీవితం గడుపుతున్న మనిషిలో, విషయాలని వున్నవి వున్నట్లుగా చూస్తున్న మనిషిలో, తనకి వున్నదానితో సంతుష్టి చెందివున్న మనిషిలో ఏ గందరగోళమూ వుండదు, అందులో సందేహం లేదు. అతనిలో స్పష్టత వుంటుంది. అందుకని జీవితం యొక్క ప్రయోజనం ఏమిటి అని అతను ప్రశ్నించడు. అతనికి అసలు జీవించడమే ఆరంభమూ, అదే గమ్యమూ కూడా. కాబట్టి మనకి వచ్చిన ఇబ్బంది ఏమిటంటే, మన జీవితం శూన్యంగా వున్నది కాబట్టి, జీవితానికొక ప్రయోజనాన్ని కనిపెట్టి, దానిని సాధించడం కోసం ప్రయత్నించాలనుకుంటాం. అటువంటి జీవిత ప్రయోజనం కేవలం మేధ నుపయోగించి చేసుకున్న ఒక భావన మాత్రమే. అందులో యదార్థం వుండదు. మూర్ఖంగా, జడంగా వుండే మనసూ, శూన్య హృదయమూ అటువంటి జీవన ప్రయోజనాన్ని సాధించడానికి పూనుకున్నప్పుడు – ఆ ప్రయోజనం కూడా శూన్యమైనదిగానే తయారవుతుంది. అందువల్ల మన సమస్య ఏమిటంటే, మన జీవితాన్ని సుసంపన్నంగా, సమృద్ధవంతంగా ఎట్లా చేసుకోవాలి అని. డబ్బుతోనూ, తదితరమైన వాటితోనూ కాదు, ఆంతరికమైన సంపన్నత పొందాలి. అయితే అది ఏదో రహస్యమైనదీ, మార్మికమైనదీ కాదు. జీవన ప్రయోజనం సంతోషంగా వుండటం అని కానీ, దేవుడిని

కనుగొనడమే జీవితోద్దేశ్యం అని కానీ మీరు అంటే, దేవుడిని అన్వేషించడం అనే కోరిక కూడా జీవితం నుంచి పారిపోవడం కోసమే అవుతుంది. మీరు చెప్తున్న దేవుడు మీకు ఇప్పటికే తెలిసిపోయిన ఒక విషయం. మీకు తెలిసిన ఒక వస్తువు వైపుగా మాత్రమే మీరు ఒక మార్గాన్ని వేసుకోగలుగుతారు. దేవుడు అని మీరు అంటున్న ఒక విషయం వైపుగా మేడమెట్లను గనుక మీరు నిర్మిస్తే, అది దేవుడు కాదని నిస్సందేహంగా చెప్పచ్చు. పలాయనంలో కాకుండా, జీవించడంలోనే యదార్థతత్వాన్ని అవగాహన చేసుకోగలుగుతాం. జీవితానికి ప్రయోజనం ఏమిటని మీరు వెతుకుతుంటే మీరు జీవితాన్నుంచి పారిపోతున్నారు, జీవితం అంటే ఏమిటో అవగాహన చేసుకోవడం లేదు. జీవితం అంటే పరస్పర బాంధవ్యం ; జీవితం అంటే సంబంధ బాంధవ్యాల్లో మన క్రియాచరణ. బాంధవ్యాలను నేను అవగాహన చేసుకోనప్పుడు, సంబంధ బాంధవ్యాల్లో అస్తవ్యస్తత వున్నప్పుడు – అప్పుడు నేను ఇంతకంటె నిండైన అర్థం కోసం వెతుకుతాను. మన జీవితాలు ఎందుకింత ఖాళీగా వున్నాయి ? ఎందుకు మనం ఇంత ఒంటరిగా, ఇంత నిస్పృహగా వున్నాం ? ఎందుకంటే, మన లోపలకు మనం ఎన్నడూ పరికించి చూసుకోలేదు. మనకు తెలిసినదంతా ఈ జీవితమే అనీ, కాబట్టి దానిని పూర్తిగానూ, ఆసాంతంగానూ అవగాహన చేసుకోవాలనీ మనం ఒప్పుకోము. అంతకంటే మననుంచి మనం పారిపోవడమే నయం అనుకుంటాం. అందువల్లనే బాంధవ్యాల నుండి దూరంగా ఎక్కడో జీవిత ప్రయోజనం వున్నదేమోనని వెతుకుతూ వుంటాం. అయితే, క్రియ – అంటే అది మనుష్యులతోనూ, ఆస్తిపాస్తులతోనూ, విశ్వాసాలతో, భావాలతో మన సంబంధ బాంధవ్యం – ఆ క్రియ గురించి అవగాహన చేసుకోవడం మొదలుపెడితే, అప్పుడు ఆ బాంధవ్యమే తనతో పాటుగా ప్రతిఫలాల కానుకలు తెచ్చి ఇస్తుందని కనిపెట్టగలుగుతాం. వాటికోసం మనం వెతకనక్కర్లేదు. ఇదికూడా ప్రేమ కోసం వెతకడం వంటిదే. ప్రేమ కోసం వెదికితే అది దొరుకుతుందా ? ప్రేమని అలవరచుకోనూ లేరు. ప్రేమను కేవలం బాంధవ్యాలలోనే పొందగలుగుతారు. బాంధవ్యాలనుంచి దూరంగా కాదు. అయితే, మనలో ప్రేమ లేదు కాబట్టే జీవితానికొక ప్రయోజనమంటూ వుండాలని మనం కోరుకుంటాం. ప్రేమ వున్నప్పుడు, అదే దాని నిత్యత్వం ; అప్పుడు దేవుడికోసం అన్వేషించడం వుండదు. ఎందుకంటే ప్రేమే దైవం.

మన మనసులు పద్ధతులతో కూడుకున్న ఆచారాలతో, మూఢ విశ్వాసాల సణుగుళ్ళతో పూర్తిగా నిండిపోయి వున్నాయి. కాబట్టే మన జీవితాలు ఇంత ఖాళీగా వున్నాయి. ఆ కారణం వల్లనే మనల్ని మించి వుండే ప్రయోజనం కోసం వెతుకుతూ వుంటాం. జీవితపు వుద్దేశ్యాన్ని కనిపెట్టాలంటే మనం అనే ఈ తలుపులో నుండే మనం వెళ్ళి చూడాలి. అయితే మనకి తెలిసో, లేదూ ఆ స్పృహ లేకుండానేనో, విషయాలను

నేరుగా, వున్నవాటిని వున్నట్లుగా ఎదుర్కొనకుండా తప్పించుకుంటూ వుంటాం. అందుకని దేవుడే ఒక తలుపు తెరిచి, ఆవలగా వున్నదానిని మనకి చూపాలని కోరుకుంటాం. జీవిత ప్రయోజనం గురించి ఈ ప్రశ్నను ప్రేమించని మనిషి మాత్రమే అడుగుతాడు. ప్రేమను క్రియలో, అంటే పరస్పర సంబంధాలలో మాత్రమే కనిపెట్టగలుగుతాం.

ప్రశ్న : మంచి పనులు చేయాలనే కోరిక ఒక్కటి మాత్రమే మా జీవితాన్ని వుత్సాహంతో, వుత్తేజంతో నింపుతూ వుంటుంది. మీరేమో ఇది తప్పటడుగు అంటున్నారు. కృషి జరపడానికి వెనకవుండే ఈ ప్రోత్సాహాన్ని తీసివేస్తే ఇక ఏం మిగులుతుంది ?

కృష్ణమూర్తి : సర్ ! పని చేయడానికి ప్రోత్సాహం కావాలని ఎందుకు కోరుకుంటాం ? అసలు ఏది చేయాలన్నా ప్రోత్సాహం ఎందుకు కావాలి ? 'ప్రోత్సాహం' అంటే మీ అర్థం ఏమిటి ? మన పనులకి తగిన ప్రతిఫలం పొందాలని కోరుకుంటాం, అవునా ? డబ్బు కోరకపోవచ్చు, వస్తురూపంలో ప్రతిఫలమూ కోరుకోకపోవచ్చు. కానీ మానసికమైన పారితోషికం ఏదో కావాలనుకుంటాం. మనం చేసినవాటికి మానసికంగా ప్రోత్సాహం కావాలనుకుంటాం. అందుకోసమే ఒక గురువు వద్దకు చేరతాం. ప్రోత్సాహమే మనచేత క్రియ చేయిస్తుంది. అదే లేకపోతే మానసికంగా మనం జీవించలేము. అంటే, మానసికంగా, అంతర్గతంగా మనకి పారితోషికాలు కావాలి - మన అన్వేషణకి ప్రతిఫలం, మన ఆలోచనలకీ, మన మనోభావాలకీ తగిన ప్రతిఫలం మనకి కావాలి. అదీ వాస్తవం, అవునా కాదా ? ఇంతకూ మనకు కావలసిన ప్రతిఫలం ఏమిటి ? తనివితీరా తృప్తి పొందాలి, అదీ కావలసినది. అందులో సందేహం లేదు. ఇటువంటి మానసికమైన తృప్తి లభిస్తున్నంతవరకు ఏదో ఒకటి చేస్తూ వుంటాం. కాబట్టి, మనం కోరుకుంటున్నది నిరంతరంగా తృప్తి చెందుతూ వుండటం ; ఎడతెగకుండా మనకి సంతృప్తి లభిస్తూ వుండాలి. అది మనకు దొరక్కపోతే నిరాశా నిస్పృహల్లో మునిగిపోతాం.

సరే, తృప్తి తీరడం అనేది వున్నదా ? చిరకాలం వుండిపోయే సంతుష్టి వున్నదా ? లేదూ తనతో పాటుగా సంఘర్షణనూ, బాధనూ తప్పనిసరిగా వెంటబెట్టుకొని వచ్చే తాత్కాలికమైన సంతుష్టి మాత్రమే వున్నదా ? కాబట్టి, శాశ్వతమైన సంతుష్టి వున్నదా అనేది మనంతట మనమే కనిపెట్టాలి. స్పష్టంగా తాత్కాలికమైన సంతుష్టులు అని కనిపిస్తున్న వాటిని పక్కకి తోసిపారవేయచ్చు మీరు. ఎందుకంటే అవి అనుకోని కష్టాలని, భంగపాట్లను, ఆందోళనలనూ, భయాన్నీ, ఇంకా ఎన్నో అటువంటి వాటిని తమ వెంట తీసుకొస్తాయని గ్రహించాం కాబట్టి. అయితే, చిరకాలం నిలిచిపోయే, నిరంతరంగా

వుండిపోయే సంతుష్టిని ఇచ్చేదానిని కనిపెట్టగలం అని మనం అనుకుంటూ వుంటాం - దానికే సత్యం అనీ, దైవం అనీ పేర్లు పెట్టాం. దానికోసంగాను పని చేయాలనుకుంటాం. అయితే, శాశ్వతంగా సంతుష్టి నిచ్చేదంటూ ఒకటి వున్నదా ? అంటే, శాశ్వతమైన మానసిక భద్రత వున్నదా ? శాశ్వతంగా వుండిపోయే మానసిక భద్రతనే దైవం అనీ, చనిపోయాక కూడా జీవించడమనీ, ఏవేవో అంటూ మీరే కల్పించి తయారు చేసుకున్నారు. అయితే, అటువంటి సంపూర్ణమైన సంతుష్టీ, భద్రతా వున్నాయా ? లేక మనసే, భవిష్యత్తులో ఏమున్నదో తెలియకపోవడం వలన, అనిశ్చితంగా వుండటం వలన - తను తయారుచేసుకున్న దానినే ఇది ఒక శాశ్వతమైనది అని ప్రదర్శిస్తూ వున్నదా ? అంటే, మనసు తనకు తెలిసినదాని నుంచి తెలిసిన దానివైపుకే కదిలిపోతూ వుంటుంది. తెలియనిదాని వైపుకి అది కదిలిపోలేదు. అందువల్ల, తరువాత వచ్చేది ఏమిటో రూఢిగా తెలియాలనుకుంటుంది. ఆ తరువాత వచ్చే దానిని గురించి సందేహాలు వెలిబుచ్చినప్పుడు, మనలో ఆందోళన మొదలవుతుంది.

అందుకని, భౌతికమైన భద్రత అవసరమే అయినప్పటికీ, శాశ్వతంగా వుండే మానసికమైన భద్రత అనేది లేనేలేదు. అటువంటి భద్రత, అది కేవలం స్వీయకల్పన మాత్రమే. అది కలిగిన మరుక్షణం మీరు సోమరితనంలో, సుఖంలో మునిగిపోయి, కదలిక లేకుండా ఆగిపోతారు. భద్రత లేనప్పుడే, ప్రతిక్షణమూ సజీవంగా జీవించే మనసు అవసరం అవుతుంది. కాబట్టి జీవితం అంటే అనిశ్చితత్వం - సందిగ్ధత. మనసు అనిశ్చితత్వంతో, సందిగ్ధంగా వున్నప్పుడు, మనసుకు ఏమీ తెలియనప్పుడు, సంతుష్టి కోసం కోరుకోకుండా వున్నప్పుడు, మనసు సృజనాత్మకమవుతుంది. మనసు సమస్తం పూర్తిగా నిశ్శబ్దంగా, మౌనంగా వున్నప్పుడు మాత్రమే, ఏదీ కోరుకోకుండా వున్నప్పుడే, ప్రతిఫలం కోసం ఎదురుచూడకుండా వున్నప్పుడు మాత్రమే అటువంటి సృజనాత్మకమైన అస్తిత్వస్థితి కలుగుతుంది. అప్పుడు స్థిరంగా వుండిపోయే శాంతి నెలకొంటుంది. అటువంటి స్థితిలోకి ఎట్లా చేరుకోవాలో మనకి తెలియదు కాబట్టి, సంతుష్టి కావాలని మనం కోరుకుంటాం, దానిని గట్టిగా పట్టుకుంటాం. ఆ సంతుష్టే మన క్రియకి కావలసిన ప్రోత్సాహంగా తీసుకుంటాం. అయితే ఈ సంతుష్టి, దానిని ఎంత సంస్కరించి, మెరుగులు దిద్దినా, దానితోపాటు అంతులేని భయాన్నీ, ఆందోళననీ, సందేహాలనీ, హింసనీ, ఇంకా ఇతరమైన వాటినీ వెంట తీసుకొనిరావడం ఖాయం. అయితే మనసు తనని తాను అవగాహన చేసుకుంటే, ఆవిధంగా సంపూర్ణమైన ప్రశాంత స్థితిని చేరుకుంటే, అప్పుడు సృజనాత్మకత కలుగుతుంది. అదే, ఆ సృజనాత్మకతే అస్తిత్వానికి సంపూర్ణ ప్రయోజనం.

# 1949 లో ప్రసంగాలు
# వారణాసి

**ఫిబ్రవరి 20**

ఇది చివరి ప్రసంగం అవడం వల్ల, మీరు అనుమతిస్తే, గత అయిదు వారాలుగా మనం చర్చిస్తూ వచ్చినవాటిని క్లుప్తంగా ఒకసారి సమీక్షిస్తాను. అవగాహనా శక్తి లోపం వల్లనే సమస్యలు వుత్పన్న మవుతున్నాయి. సమస్యని అవగాహన చేసుకోలేని అశక్తతత వలన సంఘర్షణ కలుగుతున్నది. సమస్యని అర్థం చేసుకొనే శక్తి సామర్థ్యాలు గనుక వుంటే. అప్పుడసలు సమస్యే అంతమైపోతుంది. సవాలును అవగాహన చేసుకోలేని అశక్తతే సమస్యలను తెచ్చిపెడుతున్నది.

జీవితం అంటేనే సమస్యలూ, ప్రతిస్పందనల పరంపర ; అట్లా వున్నది మరి. మనం ఎదుర్కొనే సమస్యలు మన ఇష్టాయిష్టాలని అనుసరించి వుండవు. మనకుండే కోర్కెలకు అనుగుణంగానూ వుండవు. అవి ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క రూపంలో ఎదురొస్తుంటాయి. ఆ సవాళ్ళని వాటికి తగినట్లుగా, సంపూర్ణంగానూ, సూటిగానూ ఎదుర్కొనగలిగిన శక్తిసామర్థ్యాలు మనకి కనుక వుంటే, అప్పుడిక సమస్యే వుండదు. అయితే సవాలును మనం సంపూర్ణంగానూ, దానికి తగినంత సముచిత రీతిలోనూ ఎదుర్కోము కాబట్టే అది ఒక సమస్యగా తయారవుతుంది. అటువంటి శక్తి సామర్థ్యాలు పొందడం ఏవిధంగా సాధ్యపడుతుంది ? జీవితంలో ఎదురయే సవాళ్ళు ఏదో ఒక అస్తిత్వపు స్థాయికి మాత్రమే పరిమితమై వుండవు. అసలు జీవితం ఏ ఒక్క స్థాయిలో మాత్రమే వుండదు. అది ఆర్థిక స్థాయిలోనూ వుండదు. ఆధ్యాత్మిక స్థాయిలోనూ వుండదు. మనం ఇంతకుముందు మాట్లాడుకున్నట్లుగా జీవితం అంటే వివిధ స్థాయిలలో వుండే పరస్పర బాంధవ్యం. అది ఎప్పుడూ కదులుతూ, ప్రవహిస్తూ వుంటుంది. ప్రతిక్షణమూ రకరకాలుగ తనని తాను వ్యక్తీకరించుకుంటూ వుంటుంది. జీవితాన్ని అన్ని స్థాయిలలోనూ, ఎల్లప్పుడూ, పూర్తిగా, సంపూర్ణంగా ఎదుర్కొన గలిగిన మనిషి నిజంగా ఆనందజీవి.

కాబట్టి, జీవితం అంటే కేవలం పరిసరాలచేత, అవి ఆర్థికమైనవి గానీ, మేధకి సంబంధించినవి గానీ – వాటి చేత మాత్రమే నిబద్ధతకు లోనయి వుండేదిగా పరిగణిస్తూ. జీవితాన్ని ఆ దృక్పథంతో మాత్రమే ఎదుర్కొంటున్న మనిషి – తనలో సంపూర్ణ సమైక్యత పొందిన వ్యక్తి అవడు. దాంట్లో సందేహం లేదు. అతనిలో వుండే

సంఘర్షణలు అసంఖ్యాకం ఎందుకంటే, జీవితం ఏదో ఒక్క స్థాయిలో మాత్రమే వుండేది కాదు. జీవితం అంటే విషయాలతో, మనుష్యులతో, భావాలతో వుండే పరస్పర సంబంధం. మనం కనుక ఈ సంబంధాలతో సవ్యంగా, సంపూర్ణంగా మసలుకోకపోతే, అప్పుడు సవాలు వదిలిన తీవ్ర ప్రభావం సంఘర్షణను పుట్టిస్తుంది.

కాబట్టి, మన సమస్య ఇదీ - అవునా, కాదా ? ఏమిటంటే - ఈ సవాలును ప్రతిసారీ ఎదుర్కొన గలిగే శక్తి సామర్థ్యాలను కలిగించుకోవడం ఎట్లా - ప్రయత్న పూర్వకంగా పెంపొందించుకోవడం ఎట్లా - అసలు ప్రయత్న పూర్వకంగా వాటిని పెంచుకోవడం సాధ్యమవుతే కనుక. ఎందుకంటే సవాలు లేకుండా వున్న క్షణం అంటూ వుండదు దానికి తగిన ప్రతిస్పందన జరగకపోతే మిగిలేది మరణమే, నశింపే. సవాలును ప్రతిక్షణమూ, నిరంతరంగా స్వేచ్ఛతో, సంపూర్ణంగా ఎదుర్కోగలగడం తెలిసినప్పుడే సజీవత్వం వుంటుంది. అప్పుడే ప్రగాఢత్వమూ వుంటుంది. ఆలోచనల్లో, మనోభావాల్లో ఔన్నత్యమూ వుంటుంది.

సరే, ఈ శక్తి సామర్థ్యాలు రావాలంటే ఎట్లా, ఏవిధంగా ఇవి కలుగుతాయి ? సమాచారం సేకరించడం వల్ల రావు అని గట్టిగా చెప్పచ్చు. జీవితాన్ని ఎట్లా ఎదుర్కోవాలో తెలిపే పుస్తకాలన్నీ సేకరించి మీరు చదవచ్చుగాక, అయితే మీరు గ్రహించిన ఆ సమాచారమే ఒక ఆటంకంగా నిలబడుతుంది. ఎందుకంటే, చేతిలో సమాచారం వుండటం వలన, ఆ సమాచార చట్రంలోనుంచే సమస్యలను ఎదుర్కోవాలని మీరు ప్రయత్నిస్తారు కాబట్టి, సమాచారం ఆ శక్తిసామర్థ్యాలను కలిగించలేదు, తయారుచేయనూ లేదు అని స్పష్టంగా తెలుస్తున్నది. జీవితాన్ని సంపూర్ణంగా ఎదుర్కొనే ఆ శక్తిసామర్థ్యాలు లేకపోతే జీవితం నిరంతరం విడవక బాధించే ఒక పుండులా తయారవుతుంది. కాబట్టి సమాచారమూ పనికిరాదు, సేకరించిన జ్ఞానమూ లాభం లేదు - మీరు భగవద్గీత చదివి వుండవచ్చు, అనేక పవిత్ర గ్రంధాలు చదివి వుండవచ్చు. ఎందరో మహాత్ముల ప్రసంగాలు విని వుండవచ్చు, ఎన్నో రకాలైన నియమాలను పాటిస్తూ వుండవచ్చు - జీవితాన్ని ఎదుర్కొనే శక్తిసామర్థ్యాలను పొందడానికి అవి ఏవీ తోడ్పడలేవు.

సరే, సమాచారం పనికిరాదు, జ్ఞానసేకరణా లాభం లేదు. అప్పుడు అసలు అవసరమైనది ఏమిటి ? అది ఏమిటో కనిపెట్టేముందు, జీవితం అంటే ఏమిటి, జీవించడం అంటే ఏమిటి అనేవి కనిపెట్టాలి. అవునా కాదా ? అది అర్థం చేసుకుంటే అప్పుడు బహుశ సవాలును - అంటే అది జీవితమే - దానిని ఎదుర్కొనే శక్తిసామర్థ్యాలను పొందవచ్చు. జీవితం అంటే సవాలూ, ప్రతిస్పందనా రెండూనూ,

అవునా కాదా ? జీవితం **అంటే** కేవలం సవాలూ కాదు. కేవలం ప్రతిస్పందనా కాదు. జీవితం అంటే అనుభవం, బాంధవ్యాలలో అనుభవం. ఎవ్వరూ కూడా ఏకాకులుగా జీవించలేరు, కాబట్టి జీవితం అంటే పరస్పర సంబంధ బాంధవ్యాలు. బాంధవ్యం అంటే క్రియ. బాంధవ్యాన్ని, అంటే జీవితాన్ని అవగాహన చేసుకునే శక్తిసామర్థ్యాలను పొందడం ఎట్లా ? సంబంధాలు అంటే మనుష్యులతో అన్యోన్యత కాకుండా, విషయాలతోనూ, భావాలతోనూ వుండే సాన్నిహిత్యం కూడా, కాదూ ? జీవితం అంటే బాంధవ్యం ; అది విషయాలతోనూ, మనుష్యులతోనూ, భావాలతోనూ మనకి ఏర్పడే సంస్పర్శ ద్వారా వ్యక్తమవుతూ వుంటుంది. బాంధవ్యాలని అవగాహన చేసుకోవడంలోనే జీవితాన్ని సంపూర్ణంగా, తగినంతరీతిగా ఎదుర్కొనే శక్తి సామర్థ్యం మనకి వస్తుంది. కాబట్టి, మన అసలు సమస్య శక్తిసామర్థ్యాలు కాదు – ఎందుకంటే శక్తిసామర్థ్యాలు బాంధవ్యాల నుంచి విడిగా, స్వతంత్రంగా వుండవు. అసలు సమస్య బాంధవ్యాల అవగాహన – ఆ అవగాహన వుంటే త్వరగా ఇమిడిపోగల మృదుత్వమూ, త్వరగా, సర్దుకొనిపోగల, తక్షణమే స్పందించగల శక్తిసామర్థ్యాలు స్వతహాగానే కలుగుతాయి.

సంబంధ బాంధవ్యం అంటే మిమ్మల్ని మీరే స్వయంగా కనుగొనకలిగిన దర్పణం అని గట్టిగా చెప్పచ్చు. బాంధవ్యం లేనప్పుడు మీరూ వుండరు. ఉండటము అంటేనే సంబంధం కలిగివుండటం. సంబంధం కలిగి వుండటమే అస్తిత్వం అంటే పరస్పర సంబంధాలలోనే మీ అస్తిత్వం వున్నది. అవి లేకపోతే మీ అస్తిత్వమూ వుండదు, అస్తిత్వానికి అర్థమూ వుండదు. మీ ఆలోచన మీరు వున్నారు అని అంటున్నది కాబట్టి మీరు అస్తిత్వంలోకి రావడం లేదు. సంబంధం కలిగి వున్నారు కాబట్టే మీరు అస్తిత్వంతో వున్నారు. ఈ సంబంధ బాంధవ్యాల అవగాహనా లోపం కారణంగా సంఘర్షణ జనిస్తున్నది.

సరే, బాంధవ్యాలను గురించిన అవగాహన మనలో వుండదు ; ఎందుకంటే, ఇంకా ఏవేవో సాధించడం కోసమో, మనలో పరివర్తన తేవడానికి సహాయంగానో, మరొకలాగా అవడానికి తోడ్పడటం కోసమో బాంధవ్యాలను ఒక సాధనంగా వుపయోగించుకుంటున్నాం. అయితే, సంబంధ బాంధవ్యాలు మనల్ని మనం కనిపెట్టడానికి, నన్ను నేను కనుగొనడానికి స్వీయ ఆవిష్కరణకు మార్గం. ఎందుకంటే, బాంధవ్యం అంటేనే వుండటం, అంటే బ్రతికి వుండటం. బాంధవ్యాలు లేకుండా నేను వుండను. నన్ను నేను అవగాహన చేసుకోవాలంటే సంబంధ బాంధవ్యాలను అవగాహన చేసుకోవాలి. కాబట్టి బాంధవ్యం ఒక అద్దం వంటిది. అందులో నన్ను నేనే చూసుకోవచ్చు. ఆ దర్పణం వక్రీకరించేదీ అవచ్చు, లేదా వున్నదానిని

ప్రతిబింబంగా, అంటే 'వున్నది వున్నట్లు' గానూ చూపవచ్చు. అయితే మనలో చాలామంది సంబంధ బాంధవ్యాలలో, ఆ దర్పణంలో, మనం చూడదలుచుకున్న వాటినే చూస్తుంటాం 'ఉన్నది'ని చూడం ఆదర్శీకరించుకోవడమైనా చేస్తాం, దూరంగా పారిపోవడమో, భవిష్యత్తులో జీవించడమో అయినా చేస్తాం తప్ప, ఆ వర్తమాన క్షణంలో వున్న బాంధవ్యాన్ని అర్థం చేసుకోము.

కాబట్టి, వర్తమానాన్ని భవిష్యత్తులోకి పోయే ఒక మార్గంగా మాత్రమే గతం వుపయోగించుకుంటున్నది. అందువల్ల బాంధవ్యానికి - అది ఎప్పుడూ వర్తమానానికే చెందివుంటుంది తప్ప, భవిష్యత్తులో గానీ, గతంలోగానీ వుండదు - కాబట్టి, ఆ బాంధవ్యానికి అర్థం లేకుండా పోతున్నది. ఆ కారణంగా సంఘర్షణ జనిస్తున్నది. వర్తమానాన్ని భవిష్యత్తులోకి గానీ, గతంలోకి గానీ పోవడానికి ఒక మార్గంగా మనం వుపయోగించుకుంటున్నాం కాబట్టి సంఘర్షణ పుడుతున్నది. మనస్సు గతం కారణంగా కలిగిన ఫలితం. గతం లేనప్పుడు ఆలోచన వుండదు. పూర్వరంగం లేకుండా, నిబద్ధీకరణం లేకుండా ఆలోచన వుండదు. అయితే, ఆలోచన - గతానికి ఫలితమైన ఆలోచన - వర్తమానాన్ని అవగాహన చేసుకోలేదు. ఎందుకంటే, అది భవిష్యత్తులోకి పోయే ఒక మార్గంగా మాత్రమే వర్తమానాన్ని వుపయోగించుకుంటుంది. ఎప్పుడూ కూడా భవిష్యత్తు అంటే మరొకలాగా అవడమే. అందువల్ల వర్తమానాన్ని - అవగాహన కలిగే అవకాశం వున్నది ఒక్క వర్తమానంలోనే - ఆ వర్తమానాన్ని జారవిడుచుకుంటున్నాం. మరొకటిగా అవడం వున్నంతవరకు సంఘర్షణ వుంటుంది. మరొకటిగా అవడం అంటే గతం వర్తమానాన్ని మరొకటిగా అవడం కోసమూ, సాధించడం కోసమూ వుపయోగించుకోవడం అనమాట. మరొకటి అవడం అనే ఆ ప్రక్రియలో ఆలోచన కాలపు జాలంలో చిక్కుబడిపోతుంది. కాలం మన సమస్యలకు పరిష్కారం కానే కాదు. ప్రస్తుత క్షణంలో మాత్రమే మీకు అవగాహన కలుగుతుంది తప్ప రేపులోనూ కాదు, నిన్నలోనూ కాదు. ఎప్పుడూ ప్రస్తుతంలోనే. అయితే ఆ ప్రస్తుతం రేపు అవచ్చు. కాబట్టి అవగాహన కాలరహితమైనది. రాబోయే జీవితాన్నో, రాబోయే సంవత్సరాన్నో మీరు అవగాహన చేసుకోలేరు.

కాబట్టి, సంబంధ బాంధవ్యాలను అవగాహన చేసుకున్నప్పుడే జీవితాన్ని అవగాహన చేసుకునే శక్తి సామర్థ్యాలు కలుగుతాయి. బాంధవ్యం ఒక దర్పణం. దానిలో ఒకరు వాస్తవంగా ఎట్లా వున్నారో ఆ ప్రతిబింబం కనబడాలి. ఎట్లా వుంటే ఇష్టపడతామో అటువంటి ఆదర్శ రూపమో, ఆకర్షణీయమైన కాల్పనిక రూపమో కాదు. అయితే, వాస్తవంలో అసలు తను ఏమిటో ఆ తనని సూటిగా చూసుకోవడం చాలా కష్టం.

ఎందుకంటే 'ఉన్నది' నుంచి దూరంగా పారిపోవడమే మనకి బాగా అలవాటయింది, 'ఉన్నది'ని చూసి గ్రహించడం, నిశ్శబ్దంగా పరిశీలించడం చాలా శ్రమతో కూడినది. ఎందుకంటే, మనకి ఎప్పుడూ ఖండించడమూ, సమర్థించడమూ, పోల్చి చూడటమూ, ఫలానాదిగా గుర్తించడమూ యే అలవాటయిపోయింది. సమర్థనా, ఖండనా అనే ప్రక్రియ జరుగుతున్నప్పుడు 'వున్నదాని'ని అర్థం చేసుకోము. 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడంలో మాత్రమే 'ఉన్నది' నుండి విముక్తి లభిస్తుంది.

కాబట్టి, బాంధవ్యాన్ని మీరు మరొకటి ఏదో అవడానికి సాధనంగా వుపయోగించుకున్నప్పుడే, అంటే సంబంధ బాంధవ్యాల ద్వారా 'నా'ను తృప్తి పరచుకోవడం చేస్తున్నప్పుడు, జీవితంలో సమస్యలూ, సంఘర్షణలూ, వేదనలూ పుట్టుకొస్తాయి. మరొక వ్యక్తిని కానీ, ఆస్తిపాస్తులను కానీ, ఒక భావాన్ని కానీ స్వీయ విస్తృతి కోసం, అంటే 'నా' సర్వదా తృప్తి చెందుతూ వుండటం కోసం – నేను వుపయోగించుకుంటున్నప్పుడు జీవితం అంతులేని సంఘర్షణల మయమూ, దుర్భరమైన బాధలమయమూ అయిపోతుంది. బాంధవ్యాన్ని నేను అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే – స్వీయజ్ఞానానికి ఆరంభం అదే – ఆ స్వీయజ్ఞానం 'ఉన్నది' ఎడల సబబైన ఆలోచనలకు తావు కల్పిస్తుంది. ఇటువంటి సవ్యమైన ఆలోచనలే మన సమస్యలను పరిష్కరిస్తాయి తప్ప గురువులూ కాదు, ఆదర్శ పురుషులూ కాదు, మహాత్ములూ కాదు. సాహిత్యం కూడా కాదు. కేవలం 'ఉన్నది'ని చూడగల శక్తి సామర్థ్యాలూ, 'ఉన్నది' నుండి పారిపోకుండా వుండటమూ మాత్రమే ఆ పనిని చేయగలవు.

'ఉన్నది'ని చూసి, అది వున్నదని ఒప్పుకోవడమే 'ఉన్నది'ని అవగాహన చేసుకోవడం అవుతుంది. అయితే 'ఉన్నది' వున్నదని అంగీకరించడం చాలా కష్టమైన సంగతి. మనసు 'ఉన్నది'ని చూడటానికీ, పరిశీలించడానికీ, ఆమోదించడానికీ తిరస్కారం చూపుతుంది. 'ఉన్నది'ని చూడటం, 'ఉన్నది'ని పరిశీలించడం జరగాలంటే క్రియ అత్యవసరం. ఆదర్శాలూ, మరొకలాగా అవాలనే ప్రయత్నమూ అంటే క్రియనుండి పారిపోవడం, క్రియనుండి తప్పించుకోవడం అనమాట. మన చుట్టూరా ఈ నిష్క్రియనూ, ఈ పలాయనాలనూ, ఈ ఆదర్శాలనూ మనం పోగేసుకోవడం వలన 'ఉన్నది' నుంచి, అంటే బాంధవ్యం నుంచి మనం దూరంగా పారిపోతూవుంటాం. అయితే ఈ బాంధవ్యాలలోనే వున్నదున్నట్లుగా మనల్ని మనం స్పష్టంగా చూసుకోవచ్చు. 'ఉన్నది' లోపలకు మనం పోయినకొద్దీ, చేతన లోపల వున్న నిగూఢమైన పొరలలోకి, అంటే జీవితం యొక్క వివిధ స్థాయిలలోకి వెళ్ళి చూడగలుగుతాం. అందులోనే స్వేచ్ఛ లభిస్తుంది. అది క్రమశిక్షణ అనే స్వేచ్ఛా కాదు, అలవరచుకున్న, మడిగట్టుకున్న

ఆలోచనలు అనే స్వేచ్ఛా కాదు. అది సత్యం అనే సద్గుణం తీసుకొని వచ్చే స్వేచ్ఛ. సత్‌గుణం లేకుండా స్వేచ్ఛ లేనే లేదు. అయితే, సద్గుణవంతుడుగా అవుతున్న వ్యక్తి స్వేచ్ఛగల వ్యక్తి కాడు. సత్‌గుణం ఎప్పుడూ వర్తమానంలోనే వుంటుంది తప్ప భవిష్యత్తులో కాదు. కాబట్టి, అస్తిత్వంలోని అసలు సారాంశం వర్తమానాన్ని తప్పించుకోవడం కాదనీ, పరస్పర సంబంధాలలో వర్తమానాన్ని ఆకళింపు చేసుకోవడం అనీ గ్రహిస్తాం. బాంధవ్యం వర్తమానంలో మాత్రమే వుంటుంది తప్ప మరెప్పుడో కాదు. సంబంధ బాంధవ్యాలలోని సౌందర్యం అదీ.

నిజంగా చూస్తే, ప్రేమ అంటే అదే. అవునా ? ప్రేమ రేపులో, ఎల్లుండిలో లేదు. రేపు ప్రేమించబోతున్నానని మీరు అనలేరు కదా. ప్రేమిస్తే ఇప్పుడు ప్రేమిస్తారు, లేదూ ప్రేమించరు. అంతే. ఆ అద్భుతమైన విషయం, ప్రేమలోని ఆ సౌందర్యమూ, ఆ విశిష్టతా బాంధవ్యంలో మాత్రమే అవగాహన చేసుకోగలం. అయితే, కేవలం నియమపాలన ద్వారా ప్రేమని అలవరచుకోవడం అంటే అది ప్రేమను తిరస్కరించడమే. అప్పుడు ప్రేమ కేవలం బుద్ధిని వుపయోగించి తయారు చేసినదవుతుంది. మనసుతో ప్రేమించే మనిషి హృదయం ఖాళీగా వుంటుంది. మనసు తనని తాను సర్దిపుచ్చుకుంటుంది. ఆలోచన తనని తాను సర్దుకుంటుంది. అయితే, ప్రేమ మాత్రం ఎప్పుడూ సర్దిపుచ్చుకోదు. అది ఒక అస్తిత్వపు స్థితి. స్వచ్ఛంగా వున్నది ఎప్పుడూ స్వచ్ఛంగానే వుంటుంది. దానిని పంచినా సరే. అటువంటి ఆ ప్రేమ, అటువంటి ఆ సత్యం విముక్తిని ప్రసాదిస్తుంది.

ప్రశ్న : అవగాహన కలగాలంటే ముందు మనసూ, స్మృతులూ, ఆలోచనా ప్రక్రియా ఆగిపోవాలి అని మీరంటున్నారు. అయితే మీరు మాతో సంభాషణ ద్వారా భావ ప్రసారం చేస్తూ వున్నారు. మీరు చెప్తున్నది గతంలో జరిగిన అనుభవమా, లేక మాతో సంభాషణ జరుపుతున్నప్పుడే అనుభూతి చెందుతున్నారా ?

కృష్ణమూర్తి : ఇతరులతో మీరు భావప్రసారం ఎప్పుడు చేయగలుగుతారు ? మీ అనుభవం గురించి ఇతరులకు ఎప్పుడు చెప్తారు ? అనుభూతి చెందుతున్న క్షణంలో కాదు, అనుభవం అయిపోయాక. ఈ భావప్రసారం, అంటే ఇతరులకు అందజేయడం అనుభవం అయిపోయాక మాత్రమే జరిగే సంగతి. మీరు పొందిన ఒక అనుభవాన్ని ఇతరులకు అందజేయాలంటే జ్ఞాపకమూ, మాటలూ, కళ్ళూ చేతులూ వుపయోగించి చేసే సంజ్ఞలూ అవసరం. కాబట్టి, మీరు అందజేస్తున్న సమాచారం అయిపోయిన అనుభవం యొక్క వ్యక్తీకరణ అనమాట.

సరే, మీకు అవగాహన ఎప్పుడు జరుగుతుంది, మీరు ఎప్పుడు అర్థం చేసుకుంటారు ? మనసు నెమ్మదించి వున్నప్పుడు, ఒక్క సెకండు కాలమైనా సరే నెమ్మదిగా వున్నప్పుడు అవగాహన జరుగుతుందని మీరు ఎప్పుడయినా గమనించారో లేదో నాకు తెలియదు. ఆలోచన వాచ్యరూపంలోకి రాకుండా వున్నప్పుడు అవగాహన మెరుపులా మెరుస్తుంది. మీరే ఒకసారి ప్రయోగం చేసి చూడండి. మనసు చాలా నిశ్చలంగా వున్నప్పుడు, మనసు తను చేసే గోలతో తనే బరువెక్కి లేకుండా వున్నప్పుడు అవగాహన మెరుపు మీలో తళుక్కుమనడమూ, అంతర్దృష్టికి గల ఆ అసాధారణమైన వేగమూ మీ అంతట మీరే గమనించవచ్చు, కాబట్టి, ఏదయినా అవగాహన అవడానికి - ఆధునిక వర్ణచిత్రాన్ని కానీ, పసిపాపను కానీ, మీ భార్యను కానీ, మీ పొరుగున వున్న వ్యక్తిని కానీ - లేక ప్రతి విషయంలోనూ వున్న సత్యాన్ని కానీ అవగాహన చేసుకోవడం - మనసు చాలా నిశ్చలంగా, పని చేయకుండా వున్నప్పుడే జరుగుతుంది అయితే, అటువంటి నిశ్చలనాన్ని మీరు అలవరచుకోలేరు. ఎందుకంటే అలవరుచుకున్న నిశ్చల మానసం అసలైన నిశ్చల మానసం కాదు. అది నిర్జీవమైన మనసు.

అవగాహన కలగాలంటే నిశ్చలమైన మనసు, నెమ్మదించిన మనసు వుండటం తప్పనిసరి. ప్రయోగం చేసి చూసుకున్నవారికి ఇది ఎంతో స్పష్టంగా తెలిసిపోతుంది. ఒక విషయంపై మీకు ఆసక్తి ఎక్కువైన కొద్దీ, అర్థం చేసుకోవాలనే దీక్ష మీలో ఎక్కువైన కొద్దీ, మనసు ఇంకా సరళంగా, స్పష్టంగా, మరింత నిరాటంకంగా అవుతుంది. అప్పుడు వాచ్యరూపం ఇవ్వడం ఆగిపోతుంది. నిజానికి ఆలోచన అంటే మాటలే. మాటలే మధ్యలో వచ్చి అంతరాయం కలిగిస్తాయి. మాటలతో అల్లిన తెర - అంటే అదే స్మృతులు - సవాలుకూ, ప్రతి స్పందనకూ మధ్యన అడ్డుతగిలి ఆటంకంగా నిలుస్తుంది. సవాలుకు మాటలతోనే ప్రతిస్పందిస్తుంటాం. ఆ మాటలనే మేధ పనిచేయడం అంటున్నాం. కాబట్టి, వాగుతూ వుండే మనసు, వాచ్యరూపీకరణ చేస్తున్న మనసు. సత్యాన్ని అవగాహన చేసుకోలేదు - నైరూప్యమైన సత్యాన్ని కాదు, బాంధవ్యంలో వుండే సత్యాన్ని. నైరూప్యమైన సత్యం అనేది లేనేలేదు. అయితే, సత్యం చాలా సూక్ష్మతమంగా వుంటుంది. ఆ సూక్ష్మత్వాన్ని పట్టుకోవడమే మహా కష్టం. కానీ, అది నిరాధారమైన వూహో, కల్పనో కాదు. అది ఎంతో చురుగ్గా, హఠాత్తుగా, చప్పుడు చేయకుండా వస్తుంది. మనసుతో దానిని పట్టుకోలేము. రాత్రివేళ దొంగలా సడిలేకుండా, చల్లగా ప్రవేశిస్తుంది. దానిని స్వీకరించడానికి మీరు సిద్ధంగా వున్నప్పుడు రాదు, మీ ఆహ్వానం అత్యాశ చేస్తున్న ఆర్భాటం మాత్రమే. కాబట్టి మాటల జాలంలో చిక్కుకొనిపోయిన మనసు సత్యాన్ని అవగాహన చేసుకోలేదు.

తరువాత ప్రశ్న ఏమిటంటే : ఒకరు అనుభూతి చెందుతూ వుండగానే అది ఇతరులతో పంచుకుంటూ అందజేయడం సాధ్యం కాదా ? ఇతరులకు భావప్రసారం చేయాలంటే వాస్తవాలను గుర్తుపెట్టుకోగల జ్ఞాపకశక్తి కావాలి. నేను మీతో మాట్లాడుతున్నప్పుడు, మీకూ నాకూ అర్థం అయే మాటలనే వుపయోగిస్తాను. నేర్చుకోవడం, మాటలను సేకరించి వుంచుకోవడం అనే గ్రహణశక్తిని అలవరచుకోవడం ద్వారా జ్ఞాపకశక్తి కలుగుతుంది. ఈ ప్రశ్నను అడిగినవారు తెలుసుకోవాలనుకుంటున్నది ఏమిటంటే - ఒక సంఘటన, అనుభవం జరిగాక దానిని బయటకు వ్యక్తం చేయగలిగిన, ఇతరులకు అందజేయగలిగిన మనసు మాత్రమే కాకుండా - అనుభూతి చెందుతూ వుండి, అదే సమయంలో ఇతరులకు అందజేసూ వుండగలిగిన మనసును కలిగివుండటం ఎట్లా అని అడుగుతున్నారు. అంటే అర్థం, ఒక నవ్యమైన మనసు, సరి క్రొత్తది అయిన మనసు, స్మృతి, గతం యొక్క స్మృతి ఆటంకంగా రాకుండా అనుభూతి చెందుతున్న మనసు అన్నమాట. ఇందులో వున్న ఇబ్బంది ఏమిటో ముందుగా చూద్దాం.

నేను ముందే చెప్పినట్లుగా, మనలో చాలామంది అనుభవం జరిగిపోయాక ఇతరులకు దానిని అందజేస్తారు. కాబట్టి, ఈ భావప్రసారం అనుభవం మరికొంత జరగడానికి అడ్డంగా నిలబడుతుంది. ఎందుకంటే, ఈ భావప్రసారం వల్ల, అనుభవాన్ని వాచ్యరూపంలో పెట్టడం వల్ల, ఆ అనుభవపు స్మృతి బలంగా తయారవుతుంది. ఒక అనుభవపు జ్ఞాపకాన్ని గట్టిపరచుకోవడం వల్ల, తరువాత జరిగే అనుభవాన్ని స్వేచ్ఛగా అనుభూతి చెందకుండా అది నిరోధిస్తుంది. ఒక అనుభవాన్ని బలంగా తయారు చేసుకోవడం కోసం గానీ, దానిని వదలకుండా పట్టివుంచుకోవడం కోసం గానీ మనం దానిని ఇతరులకు అందజేస్తాం. దానిని ఒక స్మృతిగా పట్టివుంచుకోవడం కోసం గానీ, ఇతరులను ప్రసారం చేయడం కోసం గానీ దానికి వాచ్యరూపాన్ని ఇస్తాం. ఈ విధంగా మాటల రూపంలో ఆ అనుభవాన్ని పట్టివుంచడమే జరిగిపోయిన అనుభవాన్ని బలంగా తయారు చేస్తుంది. అందువల్ల, స్మృతిని మీరు మరింత పటిష్ఠంగా తయారు చేస్తున్నారు. కాబట్టి, ఇప్పుడు స్మృతే సవాలును ఎదుర్కొంటున్నది. ఆ స్థితిలో సవాలుకు ప్రతిస్పందన మాటలే అయినప్పుడు, గతంలోని అనుభవమే ఒక ఆటంకంగా వుంటుంది. కాబట్టి, మన ఇబ్బంది ఏమిటంటే - అనుభూతి చెందుతూ వుండాలి, కానీ దానిని ఇతరులకు ప్రసారం చేయడంలో ఈ వాచ్య రూపీకరణ ముందు జరగబోయే అనుభవాలకు ఆటంకంగా తయారవకుండానూ వుండాలి.

ఈ చర్చలలోనూ, ప్రసంగాలలోనూ నేను కనుక గతంలో జరిగిన అనుభవాన్ని మాత్రమే మళ్ళీ పునరుక్తి చేస్తూవుంటే, అది మీకూ నాకూ కూడా పరమ విసుగ్గా వుండటమే కాకుండా, గతాన్ని మరింత బలంగా తయారుచేస్తూ వుంటుంది. అందువల్ల,

వర్తమానంలో అనుభూతి చెందకుండా అది అడ్డు తగులుతుంది. వాస్తవంగా జరుగుతున్నది ఏమిటంటే, అనుభవం జరుగుతూ వుంటుంది. అదే సమయంలో అది ఇతరులకు ప్రసారమవుతూ కూడా వున్నది. ప్రసారం జరగడం అంటే వాచ్య రూపంలోకి మారడం కాదు, అనుభవానికి తొడుగులు తొడగడం కాదు. అనుభవానికి మనం తొడుగులు వేస్తే, దానికి మంచి దుస్తులు వేసి, దానికో ఆకృతినిస్తే అనుభూతి చెందడంలో వున్న పరిమళమూ, గాఢత్వమూ లుప్తమైపోతాయి. కాబట్టి, అనుభూతికి మాటలతో వస్త్రధారణ చేయించకుండా వున్నప్పుడే సరిక్రొత్తది అయిన మనసు, ఒక నవ్యమైన మనసు వుండటానికి అవకాశం వుంటుంది. మాటల ద్వారా బయటకు వ్యక్తం చేస్తున్నప్పుడు, దానికి దుస్తులు తొడిగే ప్రమాదం, ఒక ఆకారాన్ని, ఒక రూపాన్ని ఇచ్చే ప్రమాదం వున్నది. ఆ విధంగా మనసును ఒక కాల్పనిక చిత్రంతో, ఒక సంకేతంతో నింపి భారంగా తయారుచేసుకోవడం జరుగుతుంది. మాటలు ప్రధానం కాకుండా, అసలు అనుభూతే ప్రధానం అయినప్పుడు మాత్రమే నవ్యమైన మనసును, సరికొత్తది అయిన మనసును కలిగివుండటం సాధ్యమవుతుంది. అనుభూతి ప్రతిక్షణమూ జరుగుతూ వుంటుంది. పోగుచేసుకొని నిలవచేసుకోవడంగా తయారయినప్పుడు మాత్రం అనుభూతి చెందుతూ వుండటం జరగదు. ఎందుకంటే అప్పుడు, ఈ 'పోగుపడిన నిలవ' అనుభవాన్ని పొందుతుంది తప్ప, అనుభూతి చెందుతుండటం జరగదు. నిలవలేనప్పుడు మాత్రమే క్షణక్షణమూ అనుభూతి చెందడం జరుగుతుంది. మాటలలోకి మార్చుకునే వాచ్య రూపీకరణే నిలవ చేసుకోవడం. మాటల జాలంలో చిక్కుకొనిపోకుండా వుంటూనే బయటకు వ్యక్తం చేయడం చాలా కష్టసాధ్యమైనది, శ్రమతో కూడుకున్నదీ.

మనసు అంటే ఏమీ లేదు – అది గతం – నిన్న – కారణంగా వచ్చిన ఫలితం. అయితే, కాలానికి చెందని దానిని, కాలం సహాయంతో అందుకోలేము. మహావేగం కలదీ, స్థలానికి కానీ, కాలానికి కానీ చెందనిదీ అయినదానిని మనసు అందుకోలేదు. అయితే, అనుభూతి చెందుతూ వున్న మనోస్థితిలో – అది మరొకటిగా అవుతుండే స్థితి కాదు – ఆ స్థితిలో అంతా నవ్యంగా వుంటుంది. 'ఉన్నది'ని పాతదిగా చేసేవి మాటలే. నిన్నని గురించిన స్మృతే వర్తమానానికి దుస్తులు తొడుగుతూ వుంటుంది. వర్తమానాన్ని అవగాహన చేసుకోవాలంటే, అనుభూతి చెందుతూ వుండటం తప్పనిసరి. అయితే, ...లకు అతి ప్రాముఖ్యం ఇచ్చినప్పుడు అది అనుభూతికి అవరోధమవుతుంది. ...ష్ట. మాటలను, గతాన్నీ మరొకలాగా అవడం కొరకు వుపయోగించుకోవడం లేనప్పుడు మాత్రమే నిరంతరంగా అనుభూతి చెందుతూన్న నవ్యమైన మనస్సు కలుగుతుంది. అక్కడ అనుభవం అనుభూతి చెందుతున్న మనసుకు ఒక ఆకృతిని ఇవ్వడం కానీ, అనుభవపు ఆకృతిని సరిదిద్దడం కానీ వుండవు.

ప్రశ్న : లైంగిక పవిత్రత వుంటే వివాహాల్లో సామరస్యం పెరుగుతుందంటారా ?

కృష్ణమూర్తి : అందరమూ కలిసి ఈ ప్రశ్నను ఆసాంతంగా అన్వేషిద్దామా ? ఇందులో చాలా విషయాలు కలిసిపోయి వున్నాయి.

శీలసంబంధమైన నీతి లేక లైంగిక పవిత్రత మనసు తయారుచేసినది కాదు. క్రమశిక్షణ ద్వారా లైంగిక విషయాల్లో శీలం అలవడదు. లైంగిక శీలం ఒక ఆదర్శం కాదు సాధించడానికి. మనసు తయారుచేసినదీ, మనసు చేత సృష్టింపబడినదీ ఏదీ కూడా స్వచ్ఛమైనదీ, పవిత్రమైనదీ కాదు. ఎందుకంటే లైంగిక పవిత్రత అనే ఆదర్శాన్ని తయారు చేస్తున్నప్పుడు, మనసు 'ఉన్నది' నుండి దూరంగా పారిపోతున్నది. పవిత్రంగా తయారవాలని ప్రయత్నిస్తున్న మనసు చాలా మలినమైన మనసు. అదీ ఇందులోని ఒక విషయం. ముందు ముందు దీనిని పూర్తిగా అన్వేషిద్దాం.

ఈ ప్రశ్నలో వున్న ఒక ముఖ్య విషయం ఏమిటంటే – లైంగిక సంబంధమైన మన రుచులూ, కోరికలూ – అదే సెక్స్‌లో వున్న అసలు సమస్య. ఈ సెక్స్ అనేది అందరికీ ఎందుకింత పెద్ద సమస్యగా తయారయిందో ఇప్పుడు మనం కనిపెడదాం. అంతే కాకుండా, ఈ కామవాంఛను ఒక సమస్యగా తయారు చేసుకోకుండా తెలివి తేటలతో వ్యవహరించగలగడం ఎట్లా అనేది కూడా కనిపెడదాం.

సరే, సెక్స్ అంటే మన అర్థం ఏమిటసలు ? కేవలం భౌతికమైన ఆ క్రియా, లేక ఆ క్రియను వుద్రేకపరచేవీ, ప్రేరేపించేవీ, ఇంకా పెంచి ఎక్కువ చేసేవీ అయిన ఆలోచనలా ? సెక్స్ మనసుకి సంబంధించినది అనడంలో సందేహం లేదు. అది మనసుకి సంబంధించినది కాబట్టే, నెరవేరాలి, సఫలమవాలి అని కోరుకుంటుంది. లేకపోతే ఆశాభంగం చెందుతుంది. ఈ విషయం గురించి మాట్లాడుతున్నామని అలజడి చెందకండి. మీరందరూ నరాలు బిగించి, వుద్రిక్తతతో వుండటం నేను గమనించాను. ఇదీ సాధారణమైన అన్ని విషయాల వంటిదే అన్నట్లుగా మాట్లాడుకుందాం. అంత విచారంగా, అయోమయంగా ముఖాలు పెట్టకండి. చాలా సరళంగానూ, సూటిగానూ ఈ విషయాన్ని చర్చించుకుందాం. సంక్లిష్టంగా వుండే విషయాలను చూడటానికి స్పష్టమైన ఆలోచన ఎంతో అవసరం ; సరళంగానూ, సూటిగానూ ఎదుర్కొనే దృక్పథం కూడా చాలా అవసరం.

మన జీవితాల్లో ఈ సెక్స్ ఎందుకింత పెద్ద సమస్యగా తయారయింది ? అదేమిటో వివరంగా చూద్దాం. ఏ నిర్బంధాలూ, ఏ ఆందోళనా భయమూ,

ఖండించడమూ ఏవీ లేకుండా చూద్దాం. ఎందుకింత సమస్యగా తయారయింది ? మీలో చాలామందికి నిస్సందేహంగా ఇది సమస్యే. ఎందువల్ల ? బహుశ, మీరెన్నడూ ఎందుకిది సమస్యగా తయారయిందని ప్రశ్నించుకొని వుండరు. ఇప్పుడు అది కనిపెడదాం.

సెక్స్ ఒక సమస్య ఎందుకయిందంటే, ఆ క్రియలో తను అనేది పూర్తిగా లేకుండా పోయినట్లుగా అనిపిస్తుంది. ఆ క్షణంలో మీరు చాలా సంతోషంగా వుంటారు. ఎందుకంటే, స్వీయ స్పృహ, 'నా' అనే స్పృహ ఆగిపోతుంది. అది ఇంకా ఎక్కువగా కావాలని కోరుకోవడం, స్వీయాన్ని వర్జించడం వలన కలిగిన ఆ సంపూర్ణమైన సంతోషం, గతమూ భవిష్యత్తూ లేకుండా పోయిన ఆ సంతోషం ఇంకా కావాలని కోరుకోవడం – ఇద్దరు ఒకటిగా కలిసిపోయి సంలీనం అవడం ద్వారా, సమైక్యం చెందడం ద్వారా కలిగిన ఆ నిండు సంతోషం ఇంకా కావాలని కోరుకోవడం – అందువల్ల దీనికి ఇంత పెద్ద ప్రాముఖ్యత కలగడం సహజమే. అంతేనంటారా ? ఏ మాలిన్యాలూ లేని ఇంతటి స్వచ్ఛమైన ఆనందాన్ని ఇచ్చేదీ, స్వీయాన్ని సంపూర్తిగా మరుపుకు తెచ్చేదీ కాబట్టే అది ఇంకా ఇంకా కావాలని నేను కోరుకుంటాను. సరే, అసలు ఇది ఇంకా ఎక్కువగా కావాలని నేను ఎందుకు కోరుకుంటాను ? ఎందుకంటే, తక్కిన అన్నిచోట్లా నేను సంఘర్షణల్లో మునిగిపోయి వుంటాను. తక్కిన అన్ని చోట్లా, అస్తిత్వపు స్థాయిలన్నింటిలో కూడా స్వీయాన్ని, 'నా'ను మరింత బలంగా చేసుకోవడమే వుంటుంది. ఆర్థికపరంగా, సామాజికపరంగా, మతపరంగా, అన్నిచోట్లా తను అనే స్పృహను పెంచుకోవడం, గట్టిపరచడమే ఎప్పుడూ జరుగుతూ వుంటుంది. అదే సంఘర్షణ. నిజంగా చూస్తే, సంఘర్షణ వున్నప్పుడే మీకు స్వీయ స్పృహ కలుగుతుంది. తను అనే స్పృహ కలగటం అనే లక్షణమే సంఘర్షణ కారణంగా కలుగుతుంది. కాబట్టి, ప్రతిచోటా, అన్ని విషయాల్లోనూ మనం సంఘర్షణలో వున్నాం. ఆస్తిపాస్తులతో, మనుష్యులతో, భావాలతో మనకు వున్న అన్ని సంబంధ బాంధవ్యాలలోనూ సంఘర్షణా, బాధా, పోరాటమూ, దుర్భర దైన్యమూ వున్నాయి. అయితే ఈ ఒక్క క్రియలో మాత్రం అవన్నీ పూర్తిగా ఆగిపోతాయి. అందుకే, అది ఒక్కటే మీకు సంతోషాన్ని ఇస్తున్నది. కాబట్టే, తక్కినవన్నీ కూడా మిమ్మల్ని వేదన వైపుగా, అల్లకల్లోలం వైపుగా, సంఘర్షణా, అస్తవ్యస్తతా, విద్వేషాలూ, చింతలూ, వినాశనమూ వైపుగా తీసుకొని వెళతాయి. కాబట్టి, ఈ క్రియ ఇంకా ఎక్కువగా కావాలని మీరు కోరుకోవడం సహజం. అందువల్ల, లైంగిక చర్యకు ఇంతటి మహా విశిష్టతా, ఇంతటి మహా ప్రాధాన్యమూ కలిగాయి.

కాబట్టి, అసలు సమస్య సెక్స్ కాదు, స్వీయాన్నుండి విముక్తి పొందడం ఎట్లా అన్నది. స్వీయం లేకుండా పోయిన ఆ అస్తిత్వ స్థితిని కొన్ని సెకండ్ల సేపే అయినప్పటికీ,

లేదా ఒక రోజో లేక ఎంతో కొంతకాలం - మీరు రుచి చూశారు. 'నా' వున్న చోట సంఘర్షణ వుంటుంది, బాధలు వుంటాయి, కలహాలు వుంటాయి. కాబట్టి ఆ 'నా' లేని, స్వీయ రహితమైన స్థితి మళ్ళీ మళ్ళీ పొందాలని నిరంతరమైన కాంక్ష రగులుతూ వుంటుంది. అయితే, అసలు కీలక సమస్య ఏమిటంటే వివిధ స్థాయిలలో వున్న సంఘర్షణలనూ, 'నా' నూ విసర్జించడం ఎట్లా అన్నవి. మీరు ఆ సంతోషాన్ని, ఆ స్థితిని, ఎన్నో రకాల సంఘర్షణలతో కూడుకున్న ఆ 'నా' లేని స్థితిని కోరుకుంటున్నారు ; ఆ స్థితి ఎటువంటిదో క్షణ మాత్రం సేపు ఆ క్రియలో మీరు కనిపెట్టారు. లేకపోతే ఆ స్థితికోసం మిమ్మల్ని ఒక క్రమశిక్షణలో పెట్టుకుంటారు, అవస్థపడతారు, అణచుకుంటారు, నిగ్రహం ద్వారా మిమ్మల్ని మీరే సర్వనాశనం కూడా చేసుకుంటారు. దీని అర్థం ఏమిటంటే, సంఘర్షణ నుండి మీరు విముక్తి పొందాలని కోరుకుంటున్నారు. ఎందుకంటే సంఘర్షణ ఆగిపోయినప్పుడు ఆనందం కలుగుతుంది. సంఘర్షణ నుండి కనుక విముక్తి లభిస్తే, అప్పుడు అస్తిత్వపు వివిధ స్థాయిలలోనూ సంతోషం వుత్పన్నమవుతుంది.

అసలు సంఘర్షణ వెనక వున్నదేమిటి ? మీ పనులలో, మీ బాంధవ్యాలలో, మీ అధ్యాపక సంబంధమైన కార్యక్రమాలలో, అన్నింటిలోనూ ఈ సంఘర్షణ ఎట్లా పుట్టుకొస్తున్నది ? ఒక కవితను రాస్తున్నా, పాట పాడుతున్నా, చిత్రాలు గీస్తున్నా కూడా మీలో ఈ సంఘర్షణ వుంటున్నది.

ఈ సంఘర్షణ ఎట్లా కలుగుతున్నది ? మరొకలాగా అవాలనే కోరికలో నుంచి ఇది పుట్టుకొని రావడం లేదూ ? మీరు వర్ణచిత్రం గీస్తుంటారు, రంగుల ద్వారా మిమ్మల్ని అభివ్యక్తీకరించుకోవాలనుకుంటారు. అందరికంటే గొప్ప చిత్రకారులుగా అవాలనుకుంటారు. దానిని గురించి బాగా అధ్యయనం చేస్తారు. ఎంతో ప్రయాసపడతారు. ప్రపంచమంతా మీ చిత్రకళని ప్రశంసించాలని ఆశిస్తారు. అయితే, 'ఎక్కువగా' అవాలనే కోరిక ఎక్కడయితే వుంటుందో అక్కడ సంఘర్షణ వుండి తీరుతుంది. 'ఎక్కువగా' కావాలని ఒత్తిడి చేసేది మనోతత్వపు వాంఛ. ఎక్కువగా కావాలి అనే కాంక్ష మనస్తత్వానికి సంబంధించినది. మనోతత్వ కేంద్రం, ఈ మనస్సు - మరొకలాగా అవుతూ, కాంక్షిస్తూ, ఒక గమ్యాన్ని, ఒక ఫలితాన్ని చేరాలని పరుగులు పెడుతూ వున్నప్పుడు. 'ఎక్కువగా' కావాలనే వాంఛ వుంటుంది గొప్ప మహాత్ముడిగా అవాలని మీరు కోరుకుంటున్నప్పుడు, పవిత్రాత్ములుగా అవాలని మీరు కోరుకుంటున్నప్పుడు, అవగాహన చేసుకోవాలని మీరు కోరుకుంటున్నప్పుడు, సద్గుణాలను మీరు సాధన చేస్తున్నప్పుడు, నేను వున్నత తరగతికి చెందిన జీవిని అనే వర్గాధిక్యతా భావాలు మీకు

వున్నప్పుడు, ఔన్నత్యం సాధించడం కోసమే, ఆ వుద్దేశ్యంతోనే మీరు పని చేస్తున్నప్పుడు – ఇవన్నీ మరొకలాగా అవాలని మనసు ప్రయత్నిస్తున్నది అనడానికి సుస్పష్టమైన సూచనలు. అందువల్ల 'ఎక్కువగా' యే సంఘర్షణ. 'మరింత ఎక్కువ'ను కాంక్షిస్తున్న మనసుకు 'ఉన్నది' గురించిన స్పృహే వుండదు. ఎందుకంటే ఆ మనసు ఎప్పుడూ 'మరింత ఎక్కువ'లో, తను ఎట్లా వుండటం తనకి ఇష్టమో దానిలో జీవిస్తూ వుంటుంది. 'ఉన్నది'లో ఎన్నడూ జీవించదు. ఈ సంఘర్షణలో వున్న సమస్త విషయాన్నీ కనుక మీరు పరిష్కరించుకోకపోతే, సెక్స్ ద్వారా స్వీయాన్నుండి లభించే ఈ ఒకే ఒక్క విడుదలా ఎప్పటికీ ఒక అసహ్యకరమైన సమస్యగానే మిగిలిపోతుంది.

సర్, సూక్ష్మదర్శిని కింద పెట్టి పరిశీలించడానికి పదార్థరూపంలో వుండే జీవి కాదు స్వీయం, 'నా' అంటే. పుస్తకాల్లో చదివి నేర్చుకోనూలేము. సూక్తులు వుదహరించడం ద్వారా – ఆ సూక్తులు ఎంత బ్రహ్మాండమైనవైనా సరే – అర్థం చేసుకొనేదీ కాదు. దానిని సంబంధ బాంధవ్యాల ద్వారా మాత్రమే అవగాహన చేసుకోగలుగుతాం. అసలు సంఘర్షణ వుండేది బాంధవ్యాలలోనే కాబట్టి. ఆస్తిపాస్తులతో కానీ, భావాలతో కానీ, మీ భార్యతో కానీ, మీ పొరుగువారితో కానీ వుండే పరస్పర సంబంధాలలో కాబట్టి. అసలు మూలంలో వున్న ఆ సంఘర్షణలను పరిష్కరించు కోకుండా, సెక్స్ ద్వారా కలిగే ఆ ఒక్క నివారణ మార్గాన్నే పట్టుకొని కూర్చుంటే, అది మతిస్థిరత్వం లేకపోవడం అవుతుంది. మనం సరిగ్గా అట్లాగే ప్రవర్తిస్తున్నాం. మనలో బుద్ధివిచక్షణ లోపించింది. ఎందుకంటే సెక్స్‌ను ఒకే ఒక్క పలాయనా మార్గంగా మనం తయారుచేసుకున్నాం కాబట్టి. పైగా, ఈ సమాజమూ, మనం ఆధునిక సంస్కృతి అని అనుకుంటున్నదీ కూడా ఈ విషయంలో మనల్ని ప్రోత్సహిస్తున్నాయి. వ్యాపార ప్రకటనల్ని చూడండి ; చలన చిత్రాలూ, అందులో వుండే ఆ శృంగార భంగిమలూ, ఆ వేషాలూ, అశ్లీల ప్రదర్శనలూ చూడండి ; అన్నీ దీనినే ప్రోత్సహిస్తున్నాయి.

మీలో చాలామంది చిన్న వయసులోనే వివాహాలు చేసుకొని వుంటారు. ఆ సమయంలో శరీర సంబంధమైన వాంఛలు బాగా బలంగా వుంటాయి. పెళ్ళి చేసుకొని భార్యనో భర్తనో తెచ్చుకుంటారు. ఇక ఆ భార్యతోనే, ఆ భర్తతోనే మీ తక్కిన జీవితకాలమంతా కళ్ళు మూసుకొని నెట్టుకురాక తప్పదు. ఇక్కడ మీ బాంధవ్యం కేవలం శారీరకమైనది. దానికోసం తక్కినవన్నీ సర్దుకొనిపోయి తీరాలి. కాబట్టి, ఏం జరుగుతున్నది ? మీరు బహుశ మేధావులై వుండచ్చు, ఆమె ఆవేశపరురాలు అవచ్చు. ఆమెతో మీకు అన్యోన్యత ఎక్కడ ఏర్పడుతుంది ? లేదా అంటే, ఆమె చాలా లౌకికమైన మనిషి, మీరు కలలు కంటూ, ఏవో లోకాల్లో విహరిస్తూ, చుట్టూ వున్నవి

పట్టించుకోని వారయి వుండచ్చు. మీకూ ఆమెకూ మధ్యన ఎక్కడుంది బాంధవ్య వారధి ? మీలో లైంగిక వాంఛలు ఎక్కువగా వుండచ్చు, ఆమెలో లేకపోవచ్చు. అయితే మీకు ఆ హక్కు వున్నది గాబట్టి ఆమెని వుపయోగించుకుంటారు. ఆమెని మీ అవసరాలకి వాడుకుంటున్నప్పుడు, ఇక ఆమెకీ మీకూ మధ్యన అన్యోన్యత ఎట్లా వుంటుంది ? మన వివాహాలన్నీ ఈ భావం మీదే, ఆ వాంఛ మీదే ఆధారపడి వున్నాయి. అయితే ప్రస్తుతం ఈ పరస్పర వైరుధ్యాలూ సంఘర్షణలూ ఎక్కువైపోయి బయటపడుతున్నాయి. అందువల్ల విడాకులూ ఎక్కువవుతున్నాయి.

కాబట్టి తెలివిగా ఈ సమస్యతో వ్యవహరించాలి. అంటే అర్థం - మన విద్యావిధానపు పునాదులనే మొత్తంగా మార్చివేయాలి. దానికి జీవితంలోని వాస్తవాలను గురించే కాకుండా, మన దైనందిన జీవితాన్ని గురించి కూడా అర్థం చేసుకోవడం చాలా అవసరం. దేహ సంబంధమైన వాంఛను, లైంగిక వాంఛను గురించి తెలుసుకోవడమో, అర్థం చేసుకోవడమో కాకుండా, దానితో తెలివిగా వ్యవహరించడం ఎట్లాగో కూడా తెలుసుకోవాలి. అయితే, ఇప్పుడు ఆ విధంగా మనం చేయడం లేదు. చేస్తున్నామా ? ఆ విషయాన్ని దాచి, మూసిపెట్టి వుంచుతాము అది ఒక రహస్యమైన విషయం అంటాం. ఎక్కడో చాటుగా కూర్చొని మాట్లాడుకునే విషయంగా చూస్తాం. ఆ వాంఛ బాగా తీవ్రంగా వున్నప్పుడు, తక్కిన విషయాలన్నీ ఎట్లా వున్నా సరే, ఒకరితో కలిసి కాపురం ఆరంభించి, ఇక జీవితమంతా అందులో పడివుంటాం. మీకు మీరు ఏం చేసుకున్నారో, ఇంకొకరిని ఏం చేశారో మీరే చూడండి.

మేధావి అయిన ఒకరు వుద్రిక్త స్వభావం గలవారితో, మందబుద్ధులతో, చదువూ సంధ్యా లేని వారితో అన్యోన్యతతో ఎట్లా జీవిస్తారు ? అటువంటప్పుడు వారిద్దరి మధ్యనా అన్యోన్యత ఏముంటుంది, ఒక్క లైంగిక సంబంధం తప్ప ? ఇందులో వుండే అవస్థ అంతా ఏమిటంటే - లైంగిక వాంఛలు, శరీర సంబంధమైన వాంఛలు తృప్తి చెందాలంటే కొన్ని సాంఘిక కట్టుబాట్లు వుండితీరాలీ అని. అవునా ? అందువల్ల వివాహ చట్టాలను మీరు తయారుచేసుకున్నారు. మీకు సంతోషాన్నీ, భద్రతనూ, సుఖాన్నీ సమకూర్చే సౌకర్యాలన్నీ చేసుకున్నారు. అయితే నిరంతరంగా సుఖాన్ని ఇచ్చేది మనసుని మందకొడిగా తయారుచేస్తుంది. ఎప్పుడూ బాధిస్తూ వుండే నొప్పి మనసును మందకొడిగా చేసినట్లుగానే. కాబట్టి నిరంతరంగా వుండే సుఖం వల్ల మనసూ, హృదయమూ వాడి, వడలిపోతాయి.

ఇక మీకు ప్రేమ ఎట్లా లభిస్తుంది ? ప్రేమ నిస్సందేహంగా మనసుకి సంబంధించినది కాదు, అవునా ? ప్రేమ అంటే కేవలం లైంగిక క్రియ కాదు, కాదు

కదూ ? ప్రేమ అంటే ఏమిటో విచారించి కనిపెట్టడం మనసుకు సాధ్యం కాదు. సూత్రాలలో ఇమిడ్చి చెప్పగలిగేది కాదు ప్రేమ. ఈ ప్రేమ లేకుండానే మీరు బాంధవ్యాలు పెంచుకుంటారు. ప్రేమ లేకుండానే వివాహాలు చేసుకుంటారు. ఆ పైన ఆ వివాహాల్లో మీరు 'ఒకరితో ఒకరు సర్దుకొని పోతారు' చాలా చక్కని మాట అది ! ఒకరితో ఒకరు సర్దుకొని పోవడం. ఇదంతా కేవలం బుద్ధితో ఆలోచించి చేస్తున్న పని. అవునా కాదా ? ఆమె మిమ్మల్ని పెళ్ళాడింది. అయితే మీరు వికారమైన వట్టి మాంసపు ముద్ద. మీలోని కామవాంఛలు ప్రేరేపిస్తుంటే మీకు ఒళ్ళు తెలియదు. ఆమె మీతో జీవించక తప్పదు. మీ ఇల్లూ, మీ పరిసరాలూ, మీలోని పాశవికత పరమ ఘోరంగా వుండి, ఆమె సహించలేదు. అయితే, అవును, నేను పెళ్ళి చేసుకున్నాను కాబట్టి, ఇవన్నీ భరించక తప్పదు' అని ఆమె అంటుంది. అందువల్ల, తన స్వీయరక్షణ కోసంగాను ఒక మార్గంగా ఆమె మీకు లొంగివుంటుంది. మెల్లిమెల్లిగా 'మిమ్మల్ని ప్రేమిస్తున్నాను' అని కూడా అనడం మొదలుపెడుతుంది చూడండి, భద్రత కోసం వుండే ఆరాటం వల్ల అసహ్యకరమైన వాటిని కూడా మనం భరిస్తూ వుంటే, కొంతకాలానికి ఆ అసహ్యకరమైనదే అందంగా అనిపిస్తుంది. ఎందుకంటే అదంతా స్వీయరక్షణ కోసం చేసుకున్న ఏర్పాటు కాబట్టి. అదే లేకపోతే మనం ఈ దెబ్బను తట్టుకోలేము. పూర్తిగా ముక్కలైపోయి నశించిపోతామేమో కూడా. అందువల్ల మొదట్లో అసహ్యంగా, ఘోరంగా వున్నది క్రమక్రమంగా అందంగా తయారవడం మనమే గమనించవచ్చు.

ఈ విధమైన సర్దుకుపోవడం మానసిక ప్రక్రియ అని స్పష్టంగా తెలుస్తున్నది. అసలు సర్దుకుపోవడాలు అన్నీ అంతే. అయితే ప్రేమకి ఈ సర్దుకుని పోవడాలు ఏ మాత్రం చేతకాదు. మీకు తెలుసు ; సర్ ! తెలియదూ ? ఒకరిని మీరు ప్రేమిస్తున్నప్పుడు, అందులో 'సర్దుకుపోవడం' వుండదని. అప్పుడు వుండేది సంపూర్ణమైన సంలీనత. ప్రేమ లేనప్పుడు మాత్రమే మనం ఈ సర్దుకుపోవడం మొదలుపెడతాం. ఈ సర్దుకొని పోవడాన్నే వివాహం అని అంటున్నాం. అందుకే వివాహాలు విఫలమవుతున్నాయి. ఎందుకంటే, సంఘర్షణకూ, ఇద్దరు మనుష్యుల మధ్య సమరానికీ అసలైన జన్మస్థలం అదే కాబట్టి. ఇది చాలా భయంకరమైన, మహా సంక్లిష్టమైన సమస్య. అన్ని సమస్యలలాగానే. అయితే దీనిలో తీవ్రత్వం ఇంకా ఎక్కువ, ఎందుకంటే, ఇక్కడ అవసరాలూ, వాంఛలూ చాలా బలంగా వుంటాయి.

కాబట్టి, తనను తాను సర్దుకొనిపోయేటట్లుగా చేసుకుంటున్న మనసు ఎప్పటికీ నిర్మలమైనదీ, పవిత్రమైనదీ కాదు. సెక్స్ ద్వారా సంతోషాన్ని పొందాలని కోరుకుంటున్న మనసు ఎప్పటికీ నిర్మలమైనది అవలేదు. ఆ క్రియలో క్షణికంగా స్వీయాన్ని త్రోసి

చేయడం వుంటుంది తప్ప, స్వీయాన్ని మరిచిపోవడం వుంటుంది తప్ప, కేవలం మనసుకు సంబంధించిన ఆ సంతోషాన్ని పొందడం కోసం పడే ఆరాటమూ, కోరికా మనసును మలినపరుస్తాయి. ప్రేమ వున్నప్పుడు మాత్రమే లైంగిక నిర్మలత్వం వుంటుంది. ప్రేమ లేకుండా ఆ నిర్మలశీలం వుండదు. ప్రేమ అలవరచుకునే విషయం కాదు. స్వీయాన్ని సంపూర్ణంగా మరచిపోయినప్పుడే ప్రేమ వుంటుంది. ప్రేమ అనే ఆ వరం పొందడానికి బాంధవ్యాన్ని అవగాహన చేసుకోవడం వల్ల వచ్చే స్వేచ్ఛను పొంది వుండాలి. అప్పుడు, ప్రేమ వున్నప్పుడు లైంగిక క్రియకు వుండే అర్థమూ, విలువా వేరుగా వుంటాయి. అప్పుడు ఆ క్రియ ఒక పలాయనం అవదు. అది ఒక అలవాటుగానూ వుండదు. ప్రేమ ఒక ఆదర్శం కాదు. ప్రేమ అంటే ఒక అస్తిత్వపు స్థితి. మరొకలాగా అవడం వున్నప్పుడు ప్రేమ అక్కడ వుండలేదు. ప్రేమ ఎక్కడయితే వుంటుందో అక్కడ మాత్రమే లైంగిక నిర్మలత్వం వుంటుంది. స్వచ్ఛత్వం, పవిత్రత వుంటుంది. అయితే మనసు మరొకటేదో అవాలనీ, లైంగిక నిర్మలత్వం పొందాలనీ ప్రయత్నిస్తుంటే, అటువంటి మనసుకు ప్రేమ వుండదు.

ప్రశ్న : యదార్థ తత్వాన్ని అవగాహన చేసుకోవడానికి అవసరమైన ప్రశాంత స్థితిని పొందాలంటే ఆలోచనలను అదుపులో పెట్టాలి అని మాకు బోధించారు. ఆలోచనలను ఎట్లా అదుపు చేయాలో దయచేసి మీరు చెప్పగలరా ?

కృష్ణమూర్తి : మొదటిది ఏమిటంటే సర్, ఏ ఆధిపత్యాన్నీ అనుసరించకండి. ఆధిపత్యం అంటేనే దుర్మార్గం. ఆధిపత్యం వినాశనకారి. ఆధిపత్యం వక్రమార్గంలో పెడుతుంది. ఆధిపత్యం చెడుకు దోహదం చేస్తుంది. ఆధిపత్యాన్ని అనుసరిస్తున్న మనిషి తనను తానే నాశనం చేసుకుంటున్నాడు. పైగా తాను ఆధిపత్య స్థానంలో కూర్చోబెట్టిన వారినీ నాశనం చేస్తున్నాడు. అనుసరించేవాడు అధిపతిని నాశనం చేస్తున్నాడు. అధిపతి తనను అనుసరించే వాడిని నాశనం చేస్తున్నాడు. విద్యార్థి గురువుని నాశనం చేస్తున్నట్లుగానే, గురువూ విద్యార్థిని చెడగొడుతున్నాడు. ఆధిపత్యం ద్వారా కొత్తదేమీ మీరు కనిపెట్టలేరు. యాదార్థ్యాన్ని కనిపెట్టాలంటే ఏ ఆధిపత్యంలోనూ పడివుండకుండా స్వేచ్ఛగా వుండాలి. బాహ్యమైనది కానీ, ఆంతరికమైనది కానీ ఎటువంటి ఆధిపత్యం కిందైనా సరే లేకుండా స్వేచ్ఛగా వుండటం చాలా కష్టతరమైన సంగతి. ఆంతరికమైన ఆధిపత్యం అంటే అనుభవం అనే స్పృహ, జ్ఞానం అనే స్పృహ. బాహ్యంగా వుండే ఆధిపత్యం అంటే ప్రభుత్వం, తన స్వపక్షం, సంఘం, సమాజం. యదార్థ తత్వాన్ని కనిపెట్టదలుకున్నవాడు అన్ని ఆధిపత్యాలనూ తోసిపారేయాలి, బాహ్యమైన ఆంతరికమైన ఆధిపత్యాలన్నింటినీ. కాబట్టి మీరు ఏం ఆలోచించాలీ అన్నది ఇతరులచేత

చెప్పించుకోవద్దు. ఇదంతా చదవడం వల్ల కలిగిన కీడు. మరొకరు రాసిన మాటలు అతి ప్రధానమై కూర్చుంటాయి.

ఈ ప్రశ్న అడిగినవారు ''అట్లా మాకు చెప్పారు'' అని మొదలుపెట్టారు. మీకు చెప్పడానికి ఎవరుంటారు ? సర్, నాయకులూ మహాత్ములూ, పరమగురువులూ అంతా విఫలమయ్యారని మీరు గమనించలేదా ? ఎందుకంటే మీరు మునుపు ఎట్లా వున్నారో అట్లాగే వుండిపోయారు. కాబట్టి వాళ్ళందరినీ వదిలేయండి. వారంతా ఎందుకు విఫలమయ్యారంటే, అసలు మీరే సత్యాన్ని అన్వేషించడం లేదు, మీకు కావలసినది మీ స్వీయ తృప్తి, మీరు తృప్తి చెందాలి. ఎవ్వరినీ అనుసరించకండి, నన్నయినా సరే. మీపైన ఆధిపత్య స్థానంలో మరొకరిని కూర్చోబెట్టకండి. మీకు మీరే గురువూ అవాలి. మీరే విద్యార్థీ అవాలి. మరొకరిని గురువుగానూ, మిమ్మల్ని విద్యార్థిగానూ అంగీకరించిన క్షణమే మీరు సత్యాన్ని వదిలేసినట్లు. సత్యాన్వేషణలో గురువులూ వుండరు, విద్యార్థులూ వుండరు. సత్యాన్వేషణ ముఖ్యం కానీ మీరు ముఖ్యం కాదు ; సత్యాన్ని కనిపెట్టడంలో మీకు సహాయం చేయబోతున్న గురువూ ముఖ్యం కాదు. చూడండి, ఆధునిక విద్యావిధానమూ. వెనకటి విద్యావిధానమూ కూడా మీరు ఏం ఆలోచించాలో నేర్పాయి తప్ప, ఎట్లా ఆలోచించాలో నేర్పలేదు. అవి మిమ్మల్ని ఒక చట్రంలో బిగించాయి. ఆ చట్రం మిమ్మల్ని సర్వనాశనం చేసివేసింది. ఎందుకంటే, మీరు గందరగోళ స్థితిలో వున్నప్పుడే ఒక గురువునో, ఒక ఆచార్యుడినో, ఒక రాజకీయ నాయకుడినో, మరో నాయకుడినో వెతికి పట్టుకుంటారు. ఆ గందరగోళమే లేకపోతే మీరు ఎవ్వరినీ అనుసరించరు. మీలో స్పష్టత వుంటే, ఆంతరికంగా మీకు మీరే వెలుగునిచ్చుకుంటూ వుంటే. మీరు మరొకరిని ఎవ్వరినీ అనుసరించరు. అట్లా లేరు కాబట్టే అనుసరిస్తారు ; గందరగోళంలో వుండటం వల్ల అనుసరిస్తారు. మీరు అనుసరిస్తున్న వారూ తప్పకుండా గందరగోళంలోనే వుండివుంటారు. మీ పెద్దలూ మీరూ అంతా గందరగోళంలోనే వున్నారు ; రాజకీయ పరంగానూ, ఆధ్యాత్మికంగానూ కూడా. అందువల్ల ముందుగా, మీలో వున్న గందరగోళాన్ని సరిచేసుకోండి. మీకు మీరే ఒక దీపమై వెలుగు నిచ్చుకోండి. అప్పుడు సమస్య మొత్తం మాయమవుతుంది. గురువు అనీ శిష్యులనీ విభజన చేయడం ఆధ్యాత్మికత కాదు.

సరే, ప్రశ్న వేసినవారు ఆలోచనలను ఎట్లా అదుపుచేయాలో తెలుసుకోవాలనుకుంటున్నారు. ఆలోచనలను అదుపుచేయాలీ అన్నప్పుడు, అసలు ముందుగా ఆలోచన అంటే ఏమిటో, అదుపు చేసేవాడు ఎవరో తెలుసుకోవాలి. అవి రెండూ భిన్నమైన ప్రక్రియలా, లేక సంయుక్తంగా జరిగే ఒక ఘటనా ? మొట్టమొదట

మీరు ఆలోచన అంటే ఏమిటో అవగాహన చేసుకోవాలి. చేసుకొని తీరాలి. కదూ ? 'నేను ఆలోచనలను అదుపుచేస్తాను' అనడానికంటె ముందుగా. అంతే కాకుండా, ఈ అదుపు చేసేది ఎవరు, ఏమిటి అనేదికూడా మీరు తెలుసుకోవాలి. ఆలోచనలు లేకుండా అదుపు చేసేవాడొకడు వుంటాడా ? మీలో ఆలోచనలు లేనప్పుడు ఆలోచించేవాడు వుంటాడా ? ఆలోచించేవాడే ఆలోచన. ఆలోచనా, ఆలోచించేవాడూ వేరువేరుగా లేరు. రెండూ కలిసి ఒకే ప్రక్రియ అవుతుంది.

కాబట్టి, మీ వద్ద వున్నది ఆలోచనలు మాత్రమే. ఆలోచించేవాడు కాదు. 'నేను ఆలోచిస్తున్నాను' అనే మాటలు మీరు వుపయోగించినా, అది మరొకరికి భావప్రసారం చేయడానికి వీలుగా వాడుకునే ఒక మాటే. అసలు వాస్తవంగా వున్నది ఆలోచన వున్న ఒక స్థితి ఆలోచనలే ఆలోచించేవాడిని తయారు చేస్తున్నాయి. అప్పుడు అతను తన ఆలోచనలను ఇతరులకు చెప్తాడు. ఆలోచనలకు మాటల రూపం ఇవ్వడమే ఆలోచించేవాడు అంటే. అంతే.

అందువల్ల, ఆలోచన అంటే ఏమిటో మనం కనిపెట్టాలి. అప్పుడు, దానిని అదుపు చేయడం సాధ్యమా కాదా, అసలు ఎందుకు దానిని అదుపు చేయాలనుకుంటున్నారు అనేవి మనం తెలుసుకోవచ్చు. ఆలోచనా ప్రక్రియను సమాప్తం చేయడానికి మరొక భిన్న దృక్పథమూ వుందేమో. అయితే అది అదుపు చేయడం మాత్రం కాదు. ఎందుకంటే, అదుపు చేయడం అనే ఒత్తిడి తెచ్చినా, ప్రయత్న పూర్వకంగా చర్య తీసుకున్నా ఆలోచనను అవగాహన చేసుకోలేరు. అటువంటి సమయంలో మీరు చేస్తున్నది కేవలం ఒక ఆలోచనను ఖండించడమూ, మరొక ఆలోచనను సమర్ధించడమూ. సమర్థించిన దానిని పట్టుకొని వుంచుకోవాలనుకుంటారు. ఖండించిన దానిని పక్కకి తోసేయాలనుకుంటారు. కాబట్టి, అసలు ఆలోచన అంటే ఏమిటో ఇప్పుడు కనిపెడదాం.

ఆలోచన అంటే ఏమిటి ? స్మృతి (జ్ఞాపకం) లేకుండా ఆలోచన లేదు, వున్నదా ? పోగుచేసుకున్న అనుభవాల ఫలితంగా వచ్చినదే ఆలోచన. అవునా కాదా ? ఆ అనుభవాలు అంటే గతం. గతం లేకుండా, వర్తమానంలో ఆలోచన అనేది వుండదు. ఉండగలదా ? కాబట్టి ఆలోచన వర్తమానంలోని సవాలుకు గతం ఇచ్చిన ప్రతిస్పందన. అంటే, నిస్సందేహంగా అది స్మృతి యొక్క ప్రతిచర్య. అయితే స్మృతి అంటే ఏమిటి ? జ్ఞాపకాల కొనసాగింపు అయిన స్మృతి అంటే మాటల రూపంలో – వాచ్య రూపంలో పెట్టిన అనుభవాలు ; అంతేనా కాదా ? సవాలు వున్నది, దానికి ప్రతిస్పందన జరిగింది –

అదే అనుభవం. ఆ అనుభవానికి వాచ్యరూపం ఇవ్వడం జరిగింది. ఆ మాటల రూపమే స్మృతిని తయారు చేస్తున్నది. సవాలుకు స్మృతి ఇచ్చే ప్రతిస్పందనే ఆలోచన. కాబట్టి, ఆలోచన అంటే వాచ్య రూపీకరణ ; అదేనా కాదా ?

పదాలు వాడకుండా ఆలోచించడం మీరెప్పుడయినా ప్రయత్నించి చూశారేమో నాకు తెలియదు. ఆలోచన ఆరంభమైన క్షణంలోనే మాటల వుపయోగం తప్పనిసరి అవుతుంది. అయితే, వాచ్య రూపీకరణ లేని స్థితి వుండనే వుండదని నేను అనడం లేదు. మనం చర్చిస్తున్నది అది కాదు. ఆలోచన అంటే మాటలు. వాచ్య రూపీకరణ లేకుండా, మాటలు లేకుండా ఆలోచన – మనకు ఇప్పుడు తెలిసిన రూపంలో వుండే ఆలోచనలు – వుండవు. కాబట్టి, మాటలు అంటే, వాచ్యరూపంలో పెట్టడం. అంటే ఆలోచనా ప్రక్రియ అని మీరు చూస్తే, అప్పుడు మనకు కావలసినది ఆలోచనలను అదుపుచేయడం కాదు ; అప్పుడు మనకు కావలసినది వాచ్యరూపంలో ఆలోచించడం ఆగిపోవాలని. ఒక అనుభవాన్ని వాచ్య రూపంలో పెట్టడం ఎక్కడయితే వుంటుందో అక్కడ ఆలోచనలు వుండక తప్పదు. ఆలోచించడం అంటేనే వాచ్య రూపంలో పెట్టడం. కాబట్టి, మన సమస్య ఆలోచనలను ఎట్లా అదుపు చేయాలి అని కాదు. ఆలోచనలను వాచ్య రూపంలో పెట్టకుండా వుండటం సాధ్యమా. ప్రతిదానినీ మాటల్లో అనకుండా వుండటం సాధ్యమా అనేది సమస్య. మన ప్రతి స్పందనలను, మనలో కలిగే ప్రతి చర్యలను ఎందుకు మాటల రూపంలో పెడతాం ? ఎందుకని ఆ పని చేస్తాం ? ఒక కారణం స్పష్టంగా కనబడుతుంది. భావప్రసారం చేయడం కోసం, మరొకరికి మన మనోభావాలను చెప్పడం కోసం. అంతేకాకుండా మన మనోభావాన్ని ఇంకా బలంగా, పటిష్ఠంగా తయారు చేయడం కోసం కూడా వాచ్యరూపంలో పెడతాం. పెడుతుంటాం కదూ ? దానిని గట్టిగా పట్టివుంచడం కోసం, దానివైపు పరికించి చూడటం కోసం, వెళ్ళిపోయిన ఆ మనోభావాన్ని మళ్ళీ ఒడిసి పట్టుకోవడం కోసమూ కూడా. వెళ్ళిపోయిన ఆ మనోభావం స్థానాన్ని ఇప్పుడు మాటలు ఆక్రమించాయి. కాబట్టి మాటలు ఇప్పుడు చాలా ప్రధానమై పోతాయి తప్ప అసలు ఆ మనోభావమూ కాదు, ఆ ప్రతిస్పందనా కాదు, ఆ అనుభవమూ కాదు. అనుభూతి చెందడం స్థానాన్ని మాటలు ఆక్రమించి కూర్చున్నాయి. అందువల్ల మాటలే ఆలోచనలు అవుతున్నాయి. అనుభూతి చెందకుండా అవి నిరోధిస్తున్నాయి.

ఇప్పుడు మన సమస్య ఇదీ : వాచ్యరూపంలో పెట్టకుండా వుండటం, ఫలానాది అని పేరు పెట్టడం లేకుండా, ఒక పదం వుపయోగించకుండా వుండటం సాధ్యమా అని. అది సాధ్యమే అని గట్టిగా చెప్పచ్చు. తరచు అది మనం చేస్తూనే వుంటాం. అయితే,

మనకే తెలియకుండా చేస్తూ వుంటాం. ఒక పెద్ద విపత్తు ఎదురైనప్పుడు, హఠాత్తుగా ఒక సవాలు మనల్ని నిలదీసినప్పుడు, వాచ్యరూపంలో పెట్టడం జరగదు. మీరు సంపూర్ణంగా దానితో తలపడతారు. కాబట్టి అది సాధ్యమే. అయితే, మాటలు ప్రధానం కానప్పుడే ; అంటే అర్థం – ఆలోచనలు ప్రధానం కానప్పుడు, భావాలు ప్రధానం కానప్పుడు అది సాధ్యం అవుతుంది. ఒక భావానికి కనుక ప్రాధాన్యం వచ్చిందంటే అప్పుడిక విధానానికి ప్రాధాన్యం వస్తుంది, సిద్ధాంతాలకు ప్రాధాన్యం వస్తుంది. అప్పుడు సిద్ధాంతాలను ఆధారం చేసుకొని వచ్చే విప్లవం ప్రధానం అవుతుంది. భావాల మీద ఆధారపడిన విప్లవం అసలు విప్లవం కానే కాదు. అది కేవలం కొనసాగించడం మాత్రమే. అది ఒక పాతభావం. నిన్నటికి చెందిన ఒక భావం తన రూపం మార్చుకుని కొనసాగడం.

కాబట్టి, అనుభూతి ప్రధానం కానప్పుడు మాత్రమే మాట ప్రధానమవుతున్నది. అనుభూతి చెందుతున్న స్థితిలో వాచ్యరూపంలో పెట్టకుండా, మాటల తెర లేకుండా సవాలును ఎదుర్కోవడం వుంటుంది. అటువంటి స్థితిలో మాటకు ప్రాధాన్యత వుండదు. మాటకి – అంటే స్మృతికి మీరే ప్రాణం పోస్తున్నారు. అప్పుడు సవాలును ఈ స్మృతి ఎదుర్కొంటున్నది. అసలు స్మృతికి తనకు తానుగా ప్రాణం వుండదు. ఉంటుందా ? మాటకి దానంతట దానికి అర్థం లేదు. గతం – అంటే స్మృతి సవాలును ఎదుర్కొన్నప్పుడు మాత్రమే మాటకు సజీవత్వమూ, బలమూ, ప్రేరణాశక్తీ, పరిపుష్టి పెరుగుతాయి. అందువల్ల మృతి చెందినది సజీవమైనదాని ద్వారా ప్రాణం పోసుకుంటున్నది. మృతి చెందినది ఈ విధంగా ప్రాణం పుంజుకుంటున్న కొద్దీ, ఆలోచన ప్రాముఖ్యం అత్యంతంగా పెరిగిపోతుంది. ఆలోచనకు దానికి అదిగా అర్థం లేదు. గతంతో సంబంధించి వున్నప్పుడు, అంటే వాచ్యరూపంలో వున్నప్పుడు దానికి ప్రాముఖ్యం వస్తుంది. అందువల్ల ఆలోచనలను అదుపుచేయడం కాదు అసలు సమస్య. పైగా అదుపులో వుంచిన మనసు ఆందోళన చెందుతూవుంటుంది. ప్రతిరోధం చూపుతూ, అణచుకుంటూ, మరొకదానితో తనను నింపుకుంటూ వుంటుంది. అటువంటి మనసు భయపడుతూ వుంటుంది. ఆందోళన చెందుతూ వున్న మనసు నిశ్చలంగా ఎట్లా అవుతుంది ? భయపడుతూ వున్న మనసు ప్రశాంతంగా ఎట్లా అవుతుంది ? మాటలు అనే జాలంలో చిక్కుకొని పోకుండా వుండిపోయినప్పుడే మనసుకి ప్రశాంత స్థితి కలుగుతుంది. ప్రతి అనుభవాన్నీ మనసు వాచ్యరూపంలోకి మార్చుకోకుండా వుంటూ వున్నప్పుడే, అప్పుడు చాలా సహజంగానే మనసు అనుభూతి చెందుతున్న స్థితిని పొందగలుగుతుంది.

అనుభూతి చెందుతూన్నప్పుడు – అక్కడ అనుభవం పొందుతున్నవాడూ వుండడు, పొందుతున్న అనుభవమూ వుండదు, అనుభూతి చెందుతున్న ఆ స్థితిలో,

ఎప్పుడూ కొత్తగా వుండే ఆ స్థితిలో, అది ఎప్పుడూ వుండటంగానే వుంటుంది - ఆ వుండటాన్ని మాటలు వుపయోగించి మనం మరొకరికి అందజేయగలగినప్పటికీ - ఆ మాటలే అనుభవం కాదనీ, మాటలు అసలు విషయం కాదనీ, మాటల్లో విషయం ఏమీ వుండదనీ, అసలు అనుభవమే విషయంతో నిండిపోయి వుంటుందనీ మనకి తెలుస్తుంది. అప్పుడు అనుభూతి చెందుతూ వుండటం వాచ్యరూపీకరణ కాదు. అనుభూతి చెందడం అంటే అత్యున్నత స్థాయికి చెందిన అవగాహన. ఎందుకంటే అది ఆలోచనలను లేకుండా రద్దు చేయడం. ప్రతికూలమైన విధంలో అంటే కాదు అని అంటూ ఆలోచించడమే వుత్తమోత్తమమైన ఆకళింపు.. ఆలోచనలకు వాచ్యరూపం ఇస్తున్నప్పుడు ప్రతికూలమైన విధంలో ఆలోచించడం సాగలేదు. కాబట్టి సమస్య ఆలోచనలను అదుపు చేయడం కానే కాదు. ఆలోచనలనుండి విముక్తి చెందడం. ఆలోచనలనుండి మనసు విముక్తి చెందినప్పుడే వున్నదిని గ్రహించే శక్తి కలుగుతుంది. ఏది నిత్యమైనదో, ఏది సత్యమైనదో దాని గ్రహింపు కలుగుతుంది.

ప్రశ్న : పరివర్తన అంటే మీ అర్థం ఏమిటి ?

కృష్ణమూర్తి : ఒక సమూలమైన విప్లవం రావలసిన అవసరం వున్నది. అందులో సందేహం లేదు. ప్రపంచంలో వున్న సంక్షోభమే విప్లవం అత్యవసరం అని సూచిస్తున్నది. మన జీవితాలు ఆ విప్లవం వచ్చి తీరాలి అంటున్నాయి. ప్రతిరోజూ మన జీవితాల్లో జరిగే సంఘటనలూ, మన వ్యవహారాలూ, మన ఆందోళనలూ ఆది జరిగితీరాలని అంటున్నాయి. మన సమస్యలు అది అత్యవసరం అంటున్నాయి. మన చుట్టూ వున్నవన్నీ కూలిపోయాయి, కాబట్టి ఒక సమూలమైన విప్లవం పునాదుల్లో నుంచే రావాలి. పైకి చూడటానికి అంతా సక్రమంగానే వున్నట్లు కనబడుతుంది. కాని, నిజానికి మెల్లిమెల్లిగా అంతా క్షీణించిపోతూ, నశిస్తూ వున్నది. వినాశనపు తరంగం జీవతరంగాన్ని నిరంతరంగా మింగివేస్తూ వున్నది. కాబట్టి, విప్లవం వచ్చి తీరాలి. అయితే అది ఒక భావనమీద ఆధారపడి జరిగే విప్లవం కాకూడదు. అటువంటి విప్లవం ఆ భావాన్ని అదనంగా విస్తరిస్తూ పోతుందే తప్ప సమూలమైన పరివర్తన తీసుకొని రాలేదు. భావాలను ఆధారం చేసుకొని జరిగే విప్లవాలు రక్తపాతాన్నీ, అలజడినీ, అస్తవ్యస్తతనీ తీసుకొస్తాయి, అస్తవ్యస్తతలోనుంచి క్రమతను తీసుకొని రాలేము. ప్రత్యేకంగా ప్రయత్నించి అల్లకల్లోలాన్ని సృష్టించి, ఆపైన ఆ అల్లకల్లోలంలో నుండి క్రమత వస్తుందని ఆశించడంలో అర్థం లేదు. గందరగోళంలో నుండి క్రమతను తయారు చేయడానికి మీరేమీ దేవదూతలు కారు. అవన్నీ కొందరు చెప్తున్న బూటకపు మాటలు. క్రమతను తీసుకొస్తామంటూ ఇంకా ఎక్కువెక్కువగా అస్తవ్యస్తతను సృష్టించదలుచుకున్న వారి

నాటకం అదంతా. అధికారం చేతిలోకి వచ్చాక క్రమతను తాము స్థాపించగలమనీ, అది తమకు తెలుసనీ వారి ధీమా. అయితే, జరుగుతున్న భయంకరమైన విపరీతాలన్నీ చూస్తున్నప్పుడు - ఒకదాని వెంట ఒకటిగా ఆగకుండా యుద్ధాలు జరగడం, భిన్న వర్గాల మధ్యా, మనుష్యుల మధ్యా సంఘర్షణలూ, దారుణమైన ఆర్థిక, సామాజిక అసమానతలూ, శక్తిసామర్థ్యాలలో, ప్రతిభా విశేషాలలో అసమానతలూ, కొందరు పరమ సంతోష సౌఖ్యాలతో, దేనికీ అలజడి చెందకుండా ప్రశాంతంగా వుండటమూ, మరికొందరు ద్వేషమూ, సంఘర్షణా, పరమదైన్యాలతో నిండివుండటమూ - ఇదంతా చూస్తుంటే విప్లవం తప్పక వచ్చితీరాలి, సంపూర్ణమైన పరివర్తన రావాలి అని గట్టిగా అనిపిస్తుంది. రావాలి కదూ ?

సరే, ఈ పరివర్తన, ఈ సమూల విప్లవం - అది ఒక అంతిమలక్ష్యమా, లేక అది ప్రతిక్షణమూ జరుగుతుందా ? అదే అంతిమగమ్యం అయితే బాగుండని మనందరి కోరిక - అది నాకు తెలుసు. ఎందుకంటే భవిష్యత్తులో ఎక్కడో దూరంగా వున్న విషయాన్ని గురించి ఆలోచించడం చాలా సులువుగా అనిపిస్తుంది. ఎప్పుడో చివరకు ఒకనాడు మనం పరివర్తన చెందుతాము ; సంతోషంగా వుంటాము ; చివరకు మనం సత్యాన్ని కనిపెడతాము. అయితే ఈ లోపల ఇట్లాగే గడుపుతూ వుందాం. అటువంటి మనసు, భవిష్యత్తు అనే కోణం నుంచి ఆలోచించే మనసు వర్తమానంలో క్రియ ఏమీ చేయలేదు, అనడంలో సందేహం లేదు. అందువల్ల అటువంటి మనసు పరివర్తన రావాలనుకోవడం లేదు : కేవలం పరివర్తన నుంచి తప్పించుకోవాలని చూస్తున్నది. అసలు పరివర్తన అంటే మన అర్థం ఏమిటి ?

పరివర్తన భవిష్యత్తుకి చెందినది కాదు. అది భవిష్యత్తులో జరిగేది కానే కాదు. అది ఇప్పుడే జరుగుతుంది, ప్రతి క్షణమూ జరుగుతుంది. సరే, పరివర్తన అంటే మన అర్థం ఏమిటి ? అందులో ఏ మాత్రం క్లిష్టత లేదు అని గట్టిగా చెప్పచ్చు - నిజాన్ని నిజంగా, అబద్ధాన్ని అబద్ధంగా చూడటం. అబద్ధంలో వున్న సత్యాన్ని చూడటమూ, సత్యం అని అందరూ అంగీకరించిన దానిలోని అసత్యాన్ని చూడటమూ. అసత్యాన్ని అసత్యంగానూ, సత్యాన్ని సత్యంగానూ చూడటమే పరివర్తన. ఎందుకూ అంటే ఒక విషయాన్ని ఇది సత్యం అని చాలా స్పష్టంగా మీరు చూసినప్పుడు, ఆ సత్యమే విడుదల ప్రసాదిస్తుంది. ఒక విషయాన్ని అది బూటకం అని మీరు చూసి గ్రహించినప్పుడు, ఆ అసత్యం రాలిపడిపోతుంది. సర్ ! కర్మకాండలు అంటే మళ్ళీ మళ్ళీ అదే పద్ధతిలో చేసే నిరర్థకమైన ఆచారాలు అని మీరు చూసినప్పుడు, అందులోని సత్యాన్ని గ్రహించినప్పుడు, వాటిని సమర్థించకుండా వున్నప్పుడు పరివర్తన జరుగుతుంది.

జరుగుతుంది కదూ ? ఎందుకంటే మరొక బంధం వదిలిపోయింది కాబట్టి. వర్గ వివక్షలో సత్యం లేదని మీరు గ్రహించినప్పుడు, దానివల్ల సంఘర్షణలు పుడుతున్నాయనీ, బాధలు వుత్పన్నమవుతున్నాయనీ, మనుష్యుల మధ్య విభజనలు సృష్టిస్తున్నామనీ గ్రహించినప్పుడు – అందులోని సత్యాన్ని చూసినప్పుడు, ఆ సత్యమే విడుదలని ప్రసాదిస్తుంది. ఆ సత్యం యొక్క పరిగ్రాహ్యతే అసలు పరివర్తన అంటే. అవునా కాదా ? మన చుట్టూరా ఎంతో అసత్యమూ, బూటకమూ కమ్ముకొని వున్నాయి కాబట్టి, ఆ అసత్యాన్ని క్షణ క్షణమూ చూస్తూ వుండటమే పరివర్తన. దాచుకొని, పేర్చుకొని, పెంచుకుంటూ పోయేది కాదు సత్యం అంటే. అది క్షణక్షణమూ వుండేది. పేర్చుకునిపోతూ వుండేదీ, నిలవచేసుకొనేదీ స్మృతులను మాత్రమే. ఆ స్మృతుల ద్వారా సత్యాన్ని మీరేనాటికీ కనిపెట్టలేరు. ఎందుకంటే స్మృతులు కాలంతో సంబంధించినవి – కాలం అంటే గతమూ, వర్తమానమూ, భవిష్యత్తూ. కాలం అంటే కొనసాగిపోతూ వుండేది కాబట్టి, అది అనంతంగా వుండేదానిని కనిపెట్టలేదు. అనంతమైనదీ, చిరస్థాయి అయినదీ కొనసాగింపు కాదు. తట్టుకొని నిలబడేది నిత్యమైనది కాదు. నిత్యత్వము క్షణంలో వుంటుంది. నిత్యత్వం ప్రస్తుతంలో వుంటుంది. ఈ ప్రస్తుతం గతం యొక్క ప్రతిబింబం కాదు. వర్తమానం ద్వారా భవిష్యత్తులోకి గతం కొనసాగడమూ కాదు.

భవిష్యత్తులో పరివర్తన జరగాలి అని కోరుకునే మనసు, పరివర్తన తన అంతిమలక్ష్యంగా ఎదురుచూసే మనసు, సత్యాన్ని ఎన్నటికీ కనిపెట్టలేదు. ఎందుకంటే సత్యం క్షణక్షణమూ గ్రహించవలసినదీ, ప్రతి క్షణమూ కొత్తగా ఆవిష్కరించుకోవలసినదీ. సేకరించి నిలవచేసుకొనడం ద్వారా కొత్తది కనిపెట్టడం జరగదని నిస్సందేహంగా చెప్పచ్చు. పాతదాని బరువుభారాలు మోస్తున్నప్పుడు కొత్తదానిని ఎట్లా కనిపెడతారు ? ఆ బరువు భారమంతా అంతమైనప్పుడే కొత్తదానిని ఆవిష్కరించుకోగలుగుతారు. కాబట్టి, కొత్తదానిని, నిత్యమైన దానిని వర్తమానంలో క్షణక్షణమూ ఆవిష్కరించుకోవడానికి చాలా అసాధారణమైన అప్రమత్తత కలిగిన మనసు వుండితీరాలి. మరొకలాగా అవుతూ వున్న మనసు కాదు. మరొకటి ఏదో అవుతూవున్న మనసుకు పరితృప్తి అనే సంపూర్ణ ఆనందం తెలియనే తెలియదు. అది తాను బాగున్నాను అనే సంతృప్తి వల్ల కలిగిన పరితృప్తి కాదు ; ఆశించిన ఫలితాన్ని సాధించడం వలన కలిగిన తృప్తీ కాదు. 'ఉన్నది'లోని సత్యాన్ని, ఉన్నది'లోని అసత్యాన్నీ కూడా మనసు చూసినప్పుడు కలిగే పరితృప్తి అది. ఆ సత్యాన్ని పరిగ్రాహ్యం చేసుకోవడం క్షణక్షణమూ జరుగుతుంది. ఆ క్షణానికి వాచ్యరూపీకరణ ఇవ్వడం వల్ల ఆ పరిగ్రాహ్యత ఆలస్యంగా అందుతుంది.

కాబట్టి, పరివర్తన చివరకు మిగిలే ఫలితం కాదు. పరివర్తన అసలు ఒక ఫలితం కాదు. ఫలితం అనగానే అవశేషం వున్నదనే అర్థం వస్తుంది. ఒక కారణమూ, దాని

పర్యవసానమూ అని. ఎక్కడయితే కారణం వుంటుందో దాని ఫలితంగా వచ్చే పర్యవసానం కూడా వుండి తీరుతుంది. పరివర్తన చెందాలనే కోరికకి ఫలితంగా వచ్చినది మాత్రమే ఈ పర్యవసానం. పరివర్తన చెందాలి అని కోరుకుంటూ వుంటే మీరు ఇంకా మరొక లాగా అవాలనే దృష్టితోనే ఆలోచిస్తున్నారనమాట. మరొకలాగా అవుతూన్నదానికి వున్నదిగా వుండటం గురించి ఏనాటికీ తెలియదు. క్షణక్షణమూ వుండటమే సత్యం. కొనసాగుతూ పోయే సంతోషం సంతోషం కాదు. సంతోషం అంటే కాలరహితమైన ఒక మానసిక స్తితి. విపరీతమైన అతృప్తితో వున్నప్పుడే ఆ కాలరహితమైన స్థితి కలుగుతుంది. పారిపోవడానికి ఏదో ఒక దారి కనిపెట్టి, దాని ద్వారా తాను పారిపోయే అసంతృప్తి కాదు ఇది. బయటపడటానికి ఏ దారీ లేని, ఏ పలాయన మార్గమూ లేనిది. సాఫల్యా సిద్ధికోసం ఆశపడటం లేని అసంతృప్తి ఇది. అప్పుడు మాత్రమే, అటువంటి అత్యున్నతమైన అతృప్త స్తితిలో మాత్రమే, యదార్థతత్వం వునికిలోకి వస్తుంది. ఆ యదార్థ తత్వాన్ని కొనలేము, అమ్మలేము, పునరావృతం చేయలేము. పుస్తకాలలో దానిని పట్టి వుంచలేము. ప్రతిక్షణంలోనూ దానిని కనిపెట్టాలి – చిరునవ్వులో, కన్నీటి బిందువులో, వాడి రాలిన ఆకు అడుగున, అల్లరి చిల్లరిగా తిరుగుతున్న ఆలోచనలలో, ప్రేమ పూర్ణత్వంలో దానిని కనిపెట్టాలి. ఎందుకంటే ప్రేమ వేరూ, సత్యం వేరూ కాదు. కాలమే తానుగా సాగే ఆలోచనా ప్రక్రియ పూర్తిగా అంతమైన స్తితే ప్రేమ అంటే. ప్రేమ ఎక్కడుంటుందో అక్కడ పరివర్తన వుంటుంది. ప్రేమ లేకుండా జరిగే విప్లవంలో అర్థం లేదు. అటువంటి విప్లవంలో కేవలం వినాశనమూ, శైథిల్యమూ, ఎక్కువైక్కువగా పెరిగిపోతూ వున్న దారుణ వేదనలూ వుంటాయి. ప్రేమ ఎక్కడ వుంటుందో అక్కడ విప్లవం వుంటుంది. ఎందుకంటే ప్రేమ అంటేనే ప్రతి క్షణమూలోని పరివర్తన.



# 1949 లో ప్రసంగాలు

## రాజమండ్రి

**డిసెంబరు 4**

వినడం కూడా ఒక కళే అని నేను అన్నాను. అది ఇంకొంచెం విపులంగా విప్పి చెప్తాను. ఎందుకంటే సవ్యంగా వినడం చాలా ముఖ్యమని నేననుకుంటున్నాను. మనం సాధారణంగా వినాలని ఇష్టపడేవాటిని మాత్రమే విని, మనలో అలజడి కలిగించేవాటిని వినకుండా వదిలేస్తుంటాం. అలజడి కలిగించే భావాన్ని ఏవిధంగా వెలిబుచ్చినా చెవులు మూసేసుకుంటాం. మరీ ముఖ్యంగా గంభీరమైనవీ, మతధర్మ సంబంధమైనవీ, జీవితంలో ప్రాముఖ్యత గలవీ అయిన విషయాలను చాలా తేలిగ్గా తీసుకోవడం మనకి అలవాటైపోయింది. ఒకవేళ మనం విన్నా కూడా కేవలం ఆ మాటలను వింటాం తప్ప, ఆ పదాల లోపలవున్న విషయాన్ని కాదు. ఎందుకంటే మనలో చాలామందికి తమలో అలజడి కలగడం ఇష్టం వుండదు. మనలో ఎక్కువ మంది పాత పద్ధతులలోనే కొనసాగుతూ వుండిపోవాలని ఇష్టపడతారు. ఎందుకంటే వీటిని మార్చివేస్తే, భిన్నంగా తయారుచేస్తే, అవి తమలో అలజడిని కలుగజేస్తాయి. మన దైనిక జీవితానికి అంతరాయం కలిగిస్తాయి. మన కుటుంబ జీవితంలో మార్పులు, భార్యాభర్తలలో కలతలు, మనకీ సమాజానికీ మధ్య అలజడి – ఇవన్నీ జరుగుతాయి. ఈవిధంగా అలజడి చెందడం అంటే మనలో చాలామందికి విముఖత్వం. అందుకని సునాయాసంగా గడిచిపోయే జీవనాన్ని మనం ఎన్నుకుంటాం. దీనివల్ల విపరీతమైన బాధలూ, అల్లకల్లోలాలూ, సంఘర్షణలూ కలిగినా కూడా మనం పెద్దగా లెక్కచేయం. మనకి కావలసినదల్లా ఒక సునాయాసమైన జీవితం – ఎక్కువ శ్రమ వుండకూడదు, ఎక్కువ అలజడులు వుండకూడదు. ఎక్కువ ఆలోచించడమూ వుండకూడదు. అందువల్ల, మనం ఆలకిస్తూనే వుంటాం కానీ నిజానికి ఏమీ వినం. గాఢంగా వినాలంటే చాలామందికి భయం. అయితే, గాఢంగా విన్నప్పుడు మాత్రమే, శబ్దాలు లోతుగా చొచ్చుకొనిపోయి నప్పుడు మాత్రమే, అప్పుడు మాత్రమే ఒక సమూలమైన, పునాదులను కదిలించే మార్పు రావడానికి అవకాశముంటుంది. పైపైన మాత్రమే వింటే అటువంటి మార్పు సాధ్యం అవదు. నేనొక సలహా ఇవ్వవచ్చునంటే – కనీసం ఈ ఒక్క సాయంత్రం అయినా, దయచేసి ఏ నిరోధమూ చూపకుండా, ఏ అపోహలూ లేకుండా వినడానికి ప్రయత్నించండి. వినడం మాత్రమే చేయండి. అవగాహన అవాలని బ్రహ్మాండమైన ప్రయత్నం చేయకండి. ఎందుకంటే ప్రయత్నం ద్వారా అవగాహన జరగదు. ప్రయాస పడటం వల్ల అవగాహన జరగదు. ప్రయత్నించకుండా అనాసక్తంగా వున్నప్పుడు వేగంగా

మనకి తెలియకుండానే చటుక్కున అవగాహన జరుగుతుంది. ప్రయత్నించేవాడు మౌనంగా వున్నప్పుడే అవగాహన అలలాగా వస్తుంది. కాబట్టి, నా సలహా మీకు నచ్చితే, ప్రవహిస్తున్న నీటి శబ్దాలను వింటున్నట్లుగా వినండి. మీరు వూహల్లో విహరించడం లేదు, వినాలనే ప్రయత్నమూ చేయడం లేదు – కేవలం వింటున్నారు, అంతే. అప్పుడు ఆ శబ్దమే తన అర్థాన్ని మీకు అందజేస్తుంది. అప్పుడు జరిగే ఆ అవగాహన చాలా గాఢమైనది. మేధాబుద్ధిని వుపయోగించడం ద్వారా మాటలను మాత్రమే అవగాహన చేసుకోవడం కంటే కూడా ఇది ఇంకా గొప్పది, ఇంకా స్థిరమైనది. మేధాశక్తితో మాటల అర్థాన్ని గ్రాహ్యం చేసుకోవడం అని మనం అంటున్నది పూర్తిగా నిరర్థకం. 'నా బుద్ధికి అది అవగాహన అయింది, కానీ దానిని నేను ఆచరణలో పెట్టలేను' అని మీరు అంటారు. అంటే దాని అర్థం మీకు అవగాహన అవలేదని. అవగాహన అయినప్పుడు దానిలోని విషయం మీకు అవగాహన అవుతుంది. మేధాబుద్ధితో అవగాహన జరగడం అన్నది లేనే లేదు. మేధకు అవగాహన అవడం అంటే కేవలం వాచ్యరూపాన్ని అవగాహన చేసుకోవడం అనమాట. మాటలను విన్నాము అంటే వాటిలోని విషయాన్ని అర్థం చేసుకున్నట్లు అవదు. మాట అసలు విషయం కాదు. అవగాహన అంటే మాట కాదు. మనసు ప్రయత్నం చేయడం ఆపివేసినప్పుడు అవగాహన జరుగుతుంది. అంటే అర్థం – మనసు ఏ నిరోధమూ చూపకుండా, ఏ అపోహలూ లేకుండా, స్వేచ్ఛగా, సంపూర్ణంగా వింటూ వుండటం. ఈ సాయంత్రం మనం ఇది చేసి చూద్దాం ; అట్లాగని మిమ్మల్ని అభ్యర్థించవచ్చునా ? ఎందుకంటే అప్పుడు ఆ వినడంలో గొప్ప వుల్లాసం వుంటుంది. ఒక కవితను, ఒక పాటను వినడంలో, ఒక చెట్టు కదలికలను చూడటంలో వుండే హాయి వుంటుంది. అప్పుడు ఆ పరిశీలనే, ఆ వినడమే జీవిత అస్తిత్వానికి అపూర్వమైన విశిష్టతను చేకూరుస్తుంది.

మతం అంటే యదార్థతత్వాన్ని తెరచి చూసుకొనడం, అందులో సందేహం లేదు. మతం అంటే విశ్వాసం కాదు. మతం అంటే సత్యాన్ని అన్వేషించడం కాదు. సత్యాన్ని అన్వేషించడం అంటే వున్న విశ్వాసాన్ని గట్టి చేసుకోవడం. ఆలోచించే వాడిని అవగాహన చేసుకోవడమే మతం. ఎందుకంటే ఆలోచించేవాడు ఏమిటో అతను సృష్టించేదీ అదే ; రెండూ ఒకేలాగా వుంటాయి. ఆలోచన చేసేవాడూ, ఆలోచనా అనే మొత్తం ప్రక్రియను అవగాహన చేసుకోకుండా, కేవలం ఒక విశ్వాసంలో చిక్కుకొని పోవడం నిస్సందేహంగా జీవన సౌందర్యాన్ని, అస్తిత్వ సౌందర్యాన్ని సత్య సౌందర్యాన్ని ఆవిష్కరించుకోవడం అవదు. సత్యం కోసం మీరు వెదుకుతుంటే, మీకు ముందే సత్యం ఏమిటో తెలిసినట్లు. ఒక విషయాన్ని వెదకాలని మీరు బయలుదేరారంటే మీరు ఏదో పోగొట్టుకున్నారు అని అర్థం ; అంటే అది ఏమిటో మీకు ముందే తెలుసూ అని. మీకు-

తెలిసినదల్లా ఏమిటంటే విశ్వసించడం. నమ్మకం సత్యం కాదు. విశ్వాసం ఎంతదైనప్పటికీ, సంప్రదాయం ఎంత గొప్పదైనప్పటికీ, ముందుగానే సత్యాన్ని గురించిన రకరకాల అభిప్రాయాల ఆధారంతో తయారుచేసి వుంచుకున్న ఈ మత సంబంధమైన కర్మకాండలు ఏవీకూడా మిమ్మల్ని మతం వద్దకు చేర్చలేవు. మతం అంటే నమ్మకం కాదు ; మతం అంటే ఏమిటో తెలియనివారూ, నమ్ముతున్నాము అని చెప్పినా నిజంగా విశ్వాసం లేనివారూ దైవంలాగా కొలిచే ఆ నమ్మకం మతం కానే కాదు.

సత్యాన్ని వునికిలోకి రానిచ్చేదే మతమని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆ సత్యం ఏదయినా అవచ్చు - అయితే అది మీరు కావాలనుకునే సత్యం కాదు. అప్పుడు అది కేవలం మీరు నమ్మకం అని పిలుస్తున్న ఆ మీ ప్రత్యేకమైన కోరికను నెరవేర్చుకోవడం అవుతుంది. కాబట్టి, సత్యం ఏదయినా సరే, దానిని స్వీకరించగల మనసు అత్యవసరం. నిరాసక్తంగా వింటున్నప్పుడు మాత్రమే అటువంటి మనసు సాధ్యమవుతుంది. ఏ ప్రయత్నమూ లేనప్పుడే, అణచుకోవడమూ, నిగ్రహించుకోవడమూ లేనప్పుడే అనాసక్తమైన ఎరుక వునికిలోకి వస్తుంది. ఎందుకంటే అభిప్రాయాల భారంతోనూ, తన సొంత వాగుడుతోనూ నిండిపోయి వున్న మనసు స్వీకరించే స్థితిలో వుండదు. ఆ భారం లేనప్పుడే సత్యాన్ని స్వీకరించే స్థితి మనసుకు కలుగుతుంది. ఒక అభిప్రాయంలో నుంచి గానీ, ఒక నమ్మకంలో నుంచి గానీ మనసు ఒక భావననో, దేవుడిని గురించి ఒక కాల్పనిక చిత్రాన్నో చిత్రించుకుంటుంది. అయితే ఆ చిత్రించుకున్న బొమ్మ తనదే, తన వాగుడు లోదే, తను సొంతంగా రూపనిర్మాణం చేసినదే. కాబట్టి, అది యదార్థమైనది కాదు. యదార్థమైన దానిని చిత్రించలేము, ఆహ్వానించలేము. మనసు - ఆలోచించేవాడు తనని తాను అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే అది వునికిలోకి వస్తుంది. ఆలోచననూ, ఆలోచించేవాడినీ అవగాహన చేసుకోకుండా సత్యాన్ని స్వీకరించడం సాధ్యం అవదు. ఎందుకంటే, ప్రయత్నాన్ని తయారుచేసేది ఆలోచనే, అంటే ఆలోచించేవాడే. ఆలోచన లేకుండా ఆలోచించేవాడు వుండడు. ఆలోచించేవాడు తన భద్రతను పెంచుకోవడం కోసం దేవుడనో, మతం అనో తను పేరు పెట్టుకున్న ఒక వ్యూహాను రక్షణ కేంద్రంగా చేసుకుంటాడు, అయితే అది మతం కాదు. అది కేవలం తన అహంభావాన్ని పెంచుకొని ఎక్కువ చేసుకోవడం. స్వీయాన్నే మతంగా ప్రదర్శించుకోవడం .తన ధర్మనిష్ఠనూ, తన గౌరవ ప్రతిష్ఠలనూ ఆ విధంగా ప్రదర్శితం చేసుకోవడం. గొప్పలూ, గౌరవాలూ సత్యాన్ని తీసుకొని రాలేవు. చాలామంది రాజకీయపరమైన, ఆర్థిక పరమైన, మత పరమైన అర్థంలో ఘనతా, గౌరవమూ సంపాదించి వుంటారు. మనం ఫలానా అనిపించుకోవాలి, ఇక్కడ కానీయండి, మరో లోకంలో కానివ్వండి. మరో లోకంలో జీవితం వున్నది, మరో రూపంలో జీవిస్తాం అనే కోరిక కూడా తన స్వీయ చిత్రకల్పనే. అది కూడా తన మీద తాను

గొప్పతనాన్ని ఆపాదించుకోవడమే - అటువంటి చిత్రణా, ప్రదర్శనా మతం కాదని గట్టిగా చెప్పవచ్చు. మతం అంటే స్వీయచిత్రణల కంటే, ప్రదర్శనల కంటే ఎంతో విశాలమైనది, ఎంతో లోతయినదీ. నిజంగా చూస్తే, మీ నమ్మకం కూడా ఒక చిత్ర ప్రదర్శనే.. మీ ఆదర్శాలు మీరు స్వయంగా కల్పించుకున్న భావాల ప్రదర్శనలు, అవి దేశభక్తికి చెందినవైనా సరే, మతపరమైన ఆశయాలైనా సరే. అటువంటి స్వయం కల్పిత చిత్రాలను అనుసరించడం అంటే తనను తాను తృప్తి చెందించుకోవడమే అనడంలో సందేహం లేదు. అందువల్ల అది మనసును ఒక నమ్మకంలో బిగించి బంధించడం అనమాట. కాబట్టి అది యదార్థం కాదు.

మనసు నిశ్చలంగా వున్నప్పుడే - నిశ్చలనంగా తయారు చేసినప్పుడు కాదు - యదార్థతత్వం వునికిలోకి వస్తుంది. కాబట్టి మనసును క్రమశిక్షణలో పెట్టి నిశ్చలంగా చేయడం కూడదు. మిమ్మల్ని మీరు క్రమశిక్షణలో వుంచుకుంటే, ఒక ప్రత్యేకమైన స్థితిలో వుండాలీ అనే మీ కోరికను ఆవిధంగా ప్రదర్శించుకుంటున్నారనమాట. అటువంటి స్థితి అనాసక్తంగా వుండే స్థితి కాదు. మతం అంటే ఆలోచించే వాడినీ, ఆలోచనలనూ అవగాహన చేసుకోవడం. ఆచరణలోని చర్యలను అవగాహన చేసుకోవడమే మతం. అంతే తప్ప, ఏదో ఒక భావాన్ని పట్టుకొని పూజించడం కాదు. అది ఎంత తృప్తి చెందించేదయినా సరే, ఎంత సాంప్రదాయికమైనదైనా సరే, ఎవరు చెప్పినదయినా సరే. మతం అంటే పరస్పర బాంధవ్యాలలోని చర్యలలో వుండే సౌందర్యాన్నీ, గాఢత్వాన్నీ, వాటిలో పరచుకొని వుండే విశిష్టతనూ అవగాహన చేసుకోవడం. ఎందుకంటే, ఎన్ని మాటలు చెప్పినా జీవితం అంటే సంబంధ బాంధవ్యం. ఉండటం అంటే సంబంధం కలిగి వుండటం. అది లేకపోతే మీకు అస్తిత్వమే వుండదు. మీరు ఒక్కరూ ఏకాకులుగా జీవించలేరు. మీ స్నేహితులతో, మీ కుటుంబంతో, మీ తోటి వుద్యోగులతో మీకు పరస్పర బాంధవ్యం వుంటుంది. దూరంగా పర్వతాల్లోకి వెళ్ళి మీరు కూర్చున్నా, అక్కడ మీకు ఆహారం తెచ్చి ఇచ్చే మనిషితో బాంధవ్యం వుంటుంది. మీరు చిత్రణ చేసుకున్న భావనతో మీకు బాంధవ్యం వుంటుంది. అస్తిత్వం అంటే వునికి, వుండటం - అంటే సంబంధ బాంధవ్యం. ఆ బాంధవ్యాలను కనుక మనం అవగాహన చేసుకోకపోతే యదార్థతత్వపు అవగాహన వుండదు. అయితే, బాంధవ్యాలు బాధాకరంగా వుంటాయి కాబట్టి, అలజడి కలిగిస్తాయి కాబట్టి, నిరంతరం కొత్త కొత్త ఒత్తిడులు చేస్తుంటాయి కాబట్టి - ఆ బాంధవ్యాల నుండి దూరంగా దేవుడు అని మనం పేరు పెట్టుకున్న దానివద్దకు పారిపోతూ వుంటాం. దానినే యదార్థతత్వపు అన్వేషణ అనుకుంటాం. అన్వేషి యదార్థాన్ని ఏనాటికీ అందుకోలేడు. అతడు తనే చిత్రణ చేసుకున్న ఆదర్శం వెనక మాత్రమే పరుగులు పెట్టగలుగుతాడు. కాబట్టి, మన సంబంధ బాంధవ్యాలు, వాటిని గూర్చిన మన

అవగాహనాయే నిజమైన మతం. మరేదీ మతం కాదు. ఎందుకంటే ఆ సంబంధ బాంధవ్యాల్లోనే అస్తిత్వంలోని మొత్తం సారాంశం అంతా వుంటుంది. మనుష్యులతో, ప్రకృతితో, చెట్లతో, నక్షత్రాలతో, భావాలతో, ప్రభుత్వంతో – వేటితోనైనా కానీ వుండే పరస్పర బాంధవ్యాలలోనే ఆలోచించే వాడినీ, ఆలోచనలనూ – అంటే మనిషిని – అంటే మనసును సమస్తమూ తెరచి చూడటం వుంటుంది. సంఘర్షణ పైకి తేలినప్పుడు తాను – తనత్వం వునికిలోకి వస్తుంది. సంఘర్షణ మీద దృష్టి కేంద్రీకరించడం వల్ల మనసుకు తాను అనే స్పృహ కలుగుతుంది. అట్లా లేనప్పుడు 'తాను' వుండదు. 'నేను'ను, తన'ను మీరు ఎంత వున్నత పీఠం మీద కూర్చోబెట్టినా, అది తాను తృప్తి చెందడం కోసం చూస్తున్న 'నేనే'.

కాబట్టి, యదార్థాన్ని స్వీకరించబోయే మనిషి – అది యదార్థాన్ని కోరుకోవడం కాదు – నిరంతరమైనదాని వాణిని వినబోయే మనిషి , ఆ నిరంతరమైనది ఏదయినా సరే – ఆ మనిషి సంబంధ బాంధవ్యాలను అవగాహన చేసుకొని తీరాలి. ఎందుకంటే బాంధవ్యంలో సంఘర్షణ వున్నది. ఈ సంఘర్షణే యదార్థాన్ని నిరోధిస్తున్నది. అంటే, సంఘర్షణలో తాను అనే స్పృహ బలంగా తయారవడం వుంటుంది. మళ్ళీ అదే సంఘర్షణను తగ్గించాలనీ, తప్పించుకొని పారిపోవాలనీ కోరుకుంటుంది. కానీ, మనసు ఈ సంఘర్షణను అవగాహన చేసుకున్నప్పుడే, యదార్థాన్ని స్వీకరించగలుగుతుంది. కాబట్టి బాంధవ్యాలను అవగాహన చేసుకోకుండా, యదార్థాన్ని వెతికి పట్టుకోవాలనుకోవడం పలాయనాన్ని కోరుకోవడమే అవుతుంది. అవుతుంది కదూ ? దానిని ముఖాముఖిగా ఎందుకు ఎదుర్కోరు ? అసలు వాస్తవంలో వున్నదానిని అవగాహన చేసుకోకుండా ఆవలగా ఎట్లా వెళ్ళగలుగుతారు ? మీరు కళ్ళు మూసుకోవచ్చు, దేవాలయాల్లోకి పరుగులు పెట్టచ్చు, వట్టి ప్రతిమలను పూజించచ్చు. అయితే ఈ ఆరాధనలూ, ఈ భక్తీ, పూజలూ, పూలు జల్లడం, త్యాగాలు చేయడం, ఆదర్శాలూ, నమ్మకాలూ – వేటికీ అర్థం లేదు, బాంధవ్యాలలోని సంఘర్షణను అవగాహన చేసుకోనప్పుడు వీటిలో వేటికీ అర్థం లేదు. కాబట్టి పరస్పర సంబంధాలలోని సంఘర్షణను అవగాహన చేసుకోవడమే చాలా ప్రధానమైన, అతి ముఖ్యమైన విషయం తప్ప మరింకేదీ కాదు. ఎందుకంటే, మనసు అనే మొత్తం ప్రక్రియను మీరు ఈ సంఘర్షణలోనే కనుగొంటారు. మీరు ఏమిటో ఆ మిమ్మల్ని తెలుసుకోకుండా – మీరు ఎట్లా వుండాలి అని శాస్త్రాలు చెప్పిన దానిని కాదు – అదృశ్యంగా పదార్థరూపంలో వున్న పరబ్రహ్మ, లేదా ఆ సిద్ధాంతం ఏదో ఒకటి – దానిని కాదు, అసలు వాస్తవంగా, రోజువారీ అస్తిత్వంలో, ఆర్థిక సామాజిక సైద్ధాంతిక అస్తిత్వంలో మీరు ఏమిటో దానిని – ఆ సంఘర్షణను అవగాహన చేసుకోకుండా, ఆవలగా దాటి వెళ్ళి, మీరు ఏం

కనిపెట్టగలుగుతారు ? ఆవలగా వున్నదాని అన్వేషణ కేవలం 'ఉన్నది' నుండి పలాయనం మాత్రమే మీరు కనుక పారిపోదలుచుకుంటే మతమూ, దేవుడూ కూడా తక్కిన మత్తు పానీయాల వంటి పలాయనాలే. మత్తు పానీయాన్నీ, దేవుడినీ ఒకే మెట్టుమీద కూర్చోబెట్టానని అభ్యంతరం లేవదీయకండి. పలాయనాలన్నీ ఒకే, సమానమైన స్థాయికి చెందినవే. మత్తు పానీయం తాగడం ద్వారా అయినా సరే, పూజల ద్వారా అయినా సరే, మరి దేని ద్వారా అయినా - అది పలాయనమే.

కాబట్టి, బాంధవ్యంలో వున్న సంఘర్షణని అవగాహన చేసుకోవడం చాలా ప్రధానమైన అవసరం. మరింకేదీ కాదు ఎందుకంటే ఆ సంఘర్షణలో నుంచే మనం ప్రతినిత్యం జీవించే ఈ ప్రపంచాన్ని తయారు చేసుకుంటున్నాం - ఈ దారుణ దైన్య స్థితినీ, పేదరికాన్నీ. అతిహేయమైన ఈ అస్తిత్వాన్నీ. జీవితపు కదలికలకు ప్రతిస్పందించడమే సంబంధ బాంధవ్యాలు. అంటే, జీవితం ఒక నిరంతరమైన సవాలు. దానికి తగినంతగా కనుక ప్రతిస్పందన లేకపోతే సంఘర్షణ కలుగుతుంది. అయితే, తక్షణమే, నిజాయితీతో, తగినంతగా ప్రతిస్పందించడం వల్ల పూర్ణత్వం చేకూరుతుంది. సవాలుకు సరిపోయేంతగా ప్రతిస్పందన రావడం వల్ల సంఘర్షణ ఆగిపోతుంది. కాబట్టి తనను తాను అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం ; ఒక నైరూప్యమైన భావనలాగా కాదు ; అసలు వాస్తవాన్ని, మన రోజువారీ అస్తిత్వాన్ని అవగాహన చేసుకోవాలి. మన నిత్య జీవితంలో మనం ఏమిటో దానికి అత్యున్నతమైన ప్రాధాన్యం వున్నది. మీరు దేనిని గురించి ఆలోచిస్తున్నారో దానికి కాదు ప్రాధాన్యం ; మీకు వేటిని గురించి వూహలు వున్నాయో వాటికీ కాదు. మీ భార్య ఎడల, మీ భర్త ఎడల, మీ పిల్లల ఎడల, మీవద్ద పనిచేసేవారి ఎడల మీరు ఎట్లా ప్రవర్తిస్తున్నారో - అదీ ముఖ్యమైనది. ఎందుకంటే మీరు ఏమిటో, దానిలో నుండే మీరు ప్రపంచాన్నీ తయారు చేసుకుంటున్నారు. ప్రవర్తన, ఆచరణ అంటే ఆదర్శవంతమైన ప్రవర్తన అని కాదు. ఆదర్శవంతమైన ప్రవర్తన లేక ఆచరణ అన్నది లేనేలేదు. అనుక్షణమూ మీరు ఏమిటో అదే మీ ప్రవర్తన. ప్రతిక్షణమూ మీరు ఎట్లా ప్రవర్తిస్తుంటారో అదీ. ఆదర్శం అంటే మీరు అసలు ఏమిటో ఆ దానినుంచి పలాయనం. మీ దగ్గర్లోనే వున్న దానిని గురించి తెలుసుకోకుండా, మీ భార్యను గురించిన స్పృహ లేకుండా దూరాలకు మీరు ఎట్లా వెళ్ళ గలుగుతారు ? దూరాలకు వెళ్ళాలంటే దగ్గిరతోనే ఆరంభించాలనడంలో సందేహం లేదు. అయినా కూడా, మీరేమో మీ దృష్టిని దిగంతరేఖ మీద సారించి వుంచుతున్నారు ; దాన్నే మతం అని అంటున్నారు. పారిపోవడానికి కావలసిన నమ్మకం అనే సామగ్రి, సరంజామా అంతా మీకు సహాయం చేయడానికి వుండనే వుంది.

కాబట్టి, అసలు ముఖ్యమైన సంగతి ఏమిటంటే పారిపోకుండా వుండటం. ఎందుకంటే, పారిపోయే మార్గాల్లో మంచివీ, చెడువీ లేవు. అవి మతపరమైన పలాయనాలవచ్చు, ఇహ ప్రపంచానికి చెందినవీ అవచ్చు – అన్నీ సమానమే. ఈ పలాయనా లేవీ మన సమస్యను పరిష్కరించలేవు. మన సమస్య సంఘర్షణ ; ఇద్దరు వ్యక్తుల మధ్య వుండేదే కాదు, ప్రపంచంలోని సంఘర్షణ కూడా. ప్రపంచంలో ఏం జరుగుతున్నదో మనం చూస్తున్నాం. పెచ్చు పెరిగిపోతున్న యుద్ధాలూ, సర్వనాశనమూ, దారుణ దైన్యమూ అనే సంఘర్షణలని చూస్తున్నాం. దానిని మీరు ఆపలేరు. మీరు చేయకలిగిందల్లా ప్రపంచంతో మీకున్న సంబంధ బాంధవ్యాలను మార్చివేయడం. ఇక్కడ ప్రపంచం అంటే యూరపో అమెరికానో కాదు. మీ భార్యా, మీ భర్తా, మీ పనులూ, మీ ఇల్లూ అనే ప్రపంచం. అక్కడ మీరు మార్పు తీసుకొని రావచ్చును. ఆ మార్పు విస్తరిస్తూ పోయి, ఇంకా విశాలమైన పరిధులలోకి కదులుతుంది. అయితే, మూలాధారమైన ఈ మార్పు లేకుండా మనశ్శాంతి దొరకదు. ఎక్కడో ఒక మూలన కూర్చునో, ఏదయినా చదువుకుంటూనో మిమ్మల్ని నిద్ర పుచ్చుకోవచ్చును. దీనినే చాలామంది ధ్యానం అని అంటుంటారు. అయితే అది యదార్థాన్ని ఆవిష్కరించుకోవడం కాదు, స్వీకరించడమూ కాదు. మనలో చాలామందికి కావలసినది తృప్తిని చేకూర్చే పలాయనం. మన సంఘర్షణలని ముఖాముఖంగా ఎదురుపడి చూడలేము, అవి చాలా బాధాకరమైనవి కాబట్టి. అవి ఎందుకు బాధాకరమైనవి అంటే అవి అన్నీ అసలు వేటిని గురించి అనేది మనం ఎన్నడూ పరిశీలించం. దేవుడు అని మనం పేరు పెట్టుకున్నదాని కోసం వెతుక్కుంటాం తప్ప సంఘర్షణకి గల కారణాలలోకి చూడం. మన దైనందిన అస్తిత్వంలో వున్న సంఘర్షణను కనుక అవగాహన చేసుకుంటే, అప్పుడు ఇంకా ముందుకు పోవచ్చు. ఎందుకంటే జీవితంలోని సారాంశం అంతా అక్కడే వుంది. సంఘర్షణలో వున్న మనసు వినాశకరమైనదీ, క్షీణించిపోయేదీ కూడా. సంఘర్షణలో వున్నవారు ఎప్పటికీ అవగాహన చేసుకోలేరు. అయితే, నిషేధాలతో గానీ, నమ్మకాలతో గానీ, క్రమశిక్షణలతో గానీ సంఘర్షణను ఆపలేము. ఎందుకంటే సంఘర్షణను సంఘర్షణగానే అవగాహన చేసుకోవాలి. మన సమస్య పరస్పర బాంధవ్యాలలో వున్నది, అంటే జీవితంలో. మతం అంటే ఈ జీవితాన్ని అవగాహన చేసుకోవడం. దానివల్లనే మనసుకు నెమ్మదిగా వుండే స్థితి కలుగుతుంది. అటువంటి మనసే యదార్థాన్ని స్వీకరించగలుగుతుంది.

అదీ అసలైన మతం అంటే – మీ పవిత్ర జంధ్యాలూ కాదు, మీ పూజలూ కాదు, మాటలనో, వాక్యాలనో మళ్ళీ మళ్ళీ వల్లిస్తూ మీరు చేసే జపాలూ కాదు, మీ మంత్రాలూ ఆచారకర్మలూ కాదు. నిస్సందేహంగా అదంతా మతం కాదు. అవన్నీ విభజించడాలు. అయితే, బాంధవ్యాలను అవగాహన చేసుకుంటున్న మనసుకు

విభజనలు వుండవు. సమస్త ప్రాణులూ ఒకటే అనే నమ్మకం కేవలం ఒక వూహ. కాబట్టి దానికి విలువలేదు. అయితే బాంధవ్యాలను అవగాహన చేసుకుంటున్న మనిషికి 'బయటివాడు', 'లోపలివాడు' అని విడిగా వుండరు. అన్యదేశీయుడూ వుండడు, సన్నిహితుడూ వుండడు. పరస్పర బాంధవ్యం అంటే తనని తాను అవగాహన చేసుకుంటూ వుండే ప్రక్రియ. నిత్య జీవితంలో తనని తాను అనుక్షణమూ అవగాహన చేసుకోవడమే స్వీయజ్ఞానం స్వీయజ్ఞానం ఒక మతం కాదు, అంతిమ గమ్యం కాదు. అంతిమ గమ్యం అనేది ఒకటి అసలు లేదు. పారిపోవాలనుకునే మనిషికి అటువంటిది ఒకటి వుంటుంది. సదా తెరలు తొలగించుకొని వికసితమవుతూ వుండే స్వీయజ్ఞానం పరస్పర బాంధవ్యాలలో వుంటుంది. ఆ బాంధవ్యాల అవగాహన కొలతలకు అతీతమైనది.

అందుకని, స్వీయజ్ఞానం అంటే ఏదో వున్నతమైన మెట్టుమీద కూర్చోబెట్టిన 'నేను'ను, 'తాను'ను తెలుసుకోవడం కాదు. స్వీయజ్ఞానం వుండేది ప్రతిక్షణమూ దినసరి ప్రవర్తనలో - అదే చర్య లేక క్రియ - అదే సంబంధ బాంధవ్యమూ. ఆ స్వీయజ్ఞానం లేకుండా సవ్యమైన ఆలోచన వుండదు. మీరు ఏమిటో మీకు తెలియకపోతే సవ్యమైన ఆలోచనకు ఆధారం వుండదు. నైరూప్యమైన భావనలలో, సిద్ధాంతవాదాలలో మిమ్మల్ని మీరు తెలుసుకోలేరు. మీ నిత్యజీవితంలోని సంబంధ బాంధవ్యాల్లో మాత్రమే మిమ్మల్ని మీరు తెలుసుకోగలుగుతారు. మీరు సంఘర్షణలో వున్నారని మీకు తెలియదూ ? దూరంగా పోవడం వల్ల, తప్పించుకొని తిరగడం వల్ల లాభమేమిటి ? ఒక మనిషి శరీరంలో విషం ప్రవేశించింది. దానిని అతను తీసిపారవేయడం లేదు. అందువల్ల అతను క్రమక్రమంగా చావుకి దగ్గిరవడూ ? కాబట్టి, స్వీయజ్ఞానం వివేకానికి ఆరంభం. ఈ స్వీయజ్ఞానం లేకుండా ఎక్కువ దూరం మీరు పయనించలేరు. పరమార్థాన్నీ, దేవుడినీ, సత్యాన్నీ, లేదూ ఏదో ఒకదానిని అన్వేషించడం అంటే అది కేవలం తనే చిత్రణ చేసుకున్న, తనకి తృప్తి నిచ్చే సాధనాన్ని వెదుక్కోవడం అన్నమాట. కాబట్టి, ఇక్కడే, దగ్గిర్లోనే ఆరంభించండి. మీరు మాట్లాడే ప్రతి మాటా వెతకండి. మీ ప్రతి భంగిమనూ, మీరు మాట్లాడే పద్దతినీ, క్రియ చేసే విధానాన్నీ, తినే పద్ధతినీ అన్నింటినీ వెతకండి. ఖండించకుండా ప్రతి ఒక్కదాని ఎడలా ఎరుకగా వుండండి. అప్పుడు, ఆ ఎరుకలో వాస్తవంలో వున్నదానినీ, 'వున్నది' యొక్క పరివర్తనాన్నీ తెలుసుకుంటారు. అదే విమోచనానికి ఆరంభం. విమోచనమే గమ్యం కాదు. 'ఉన్నది'ని క్షణ క్షణమూ అవగాహన చేసుకోవడంలో విమోచనం వున్నది - అప్పుడు మనసు స్వేచ్ఛను పొందుతుంది, మనసు స్వేచ్ఛగా చేయబడటం కాదు ఇది. స్వేచ్ఛగా వున్న మనసే ఆవిష్కరించుకోగలదు. నమ్మకం అనే అచ్చులో తన ఆకారాన్ని దిద్దుకున్న మనసు కాదు.

ఒక వ్యూహ ప్రతిపాదనను అనుసరించి ఆకృతిని మలచుకున్న మనసూ కాదు. అటువంటి మనసు దేనినీ కనిపెట్టలేదు. సంఘర్షణ వుంటే స్వేచ్ఛ వుండదు. ఎందుకంటే సంఘర్షణ అంటేనే పరస్పర బాంధవ్యంలో 'నేను'ను తీసుకొచ్చి స్థిరంగా కూర్చోబెట్టడం.

చాలామంది ప్రశ్నలు పంపించారు. వాటన్నింటికీ సమాధానాలు చెప్పడం సాధ్యపడే విషయం కాదు. అందువల్ల అన్ని ప్రశ్నలకూ ప్రాతినిధ్యం వహించేలా వున్నాయనిపించిన కొన్నింటిని ఎన్నుకున్నాము. ప్రత్యేకంగా మీ ప్రశ్నకు సమాధానం ఇవ్వకపోవడం వల్ల దానిని చూడకుండా వదిలేశామని అనుకోకండి. నిజానికి, సమస్యలన్నీ పరస్పర సంబంధం కలిగినవే. ఒక్క సమస్యను కనుక సమస్తంగా నేను అవగాహన చేసుకుంటే, దానితో సంబంధించి వున్న తక్కిన అన్ని సమస్యలనూ అర్థం చేసుకోగలను. కాబట్టి, ప్రసంగాన్ని విన్నట్లుగానే ఈ ప్రశ్నలను కూడా వినండి. ఎందుకంటే ప్రశ్నలు మిమ్మల్ని ఎదుర్కొనే సవాళ్ళు. వాటికి తగినట్లుగా, పూర్తిగా ప్రతిస్పందించినప్పుడే సమస్యలు పరిష్కారం అవుతూండటం గమనించవచ్చు. అవి మీకూ, నాకూ కూడా ఎదురుకోవలసిన సవాళ్ళు. అందువల్ల మనందరం కలిసి ఆలోచించుదాం. సంపూర్ణమైన ప్రతిస్పందనను చూపుదాం.

ప్రశ్న : సరియైన విద్యావిధానం అంటే ఏది ? అధ్యాపకుల్లోనూ, తల్లిదండ్రుల్లోనూ, అంటే మా అందరిలోనూ దీనిని గురించిన స్పష్టత లేకపోవడం వల్ల అంతా గందరగోళంగా వున్నది.

కృష్ణమూర్తి : సరే, ఈ విషయంలో నిజానిజాల్ని మనం ఎట్లా కనిపెట్టాలి ? ఏదో ఒక విధానంలోనో, పద్ధతిలోనో బలవంతంగా మనసును బిగించడం కాదు విద్య అంటే అని స్పష్టంగా తెలుస్తున్నది కదా. కాబట్టి, సరియైన విద్య అంటే ఏమిటో తెలుసుకోవాలంటే, అసలు 'విద్య' అంటే అర్థమేమిటో కనుక్కోవాలి. విద్య అంటే జీవితానికి గల ప్రయోజనం ఏమిటో నేర్చుకోవడం కాదు, అస్తిత్వం అనే ఈ ప్రక్రియకు గల అర్థాన్నీ, విశిష్టతనూ అవగాహన చేసుకోవడం. ఎందుకంటే, జీవితానికి ఒక ప్రయోజనం వున్నది అని మీరు అన్నప్పుడు, ఆ ప్రయోజనం మీరు సొంతంగా చిత్రణ చేసుకున్నదే అయుంటుంది. సవ్యమైన విద్య ఏది అని కనిపెట్టాలంటే మొట్టమొదట జీవితం యొక్క ప్రాధాన్యాన్ని గురించీ, జీవించడం యొక్క ప్రాధాన్యం గురించీ తరచి విచారించాలి. ప్రస్తుత విద్యావిధానం ఎట్లా వుంది ? పదిరూపాయలు ఏవిధంగా సంపాదించాలో నేర్చుకోవడం, ఒక వృత్తిలోనో వ్యాపారంలోనో ఆరితేరడం, ఒక ఇంజనీరు అవడం, ఒక సామాజిక శాస్త్రజ్ఞుడవటం, మనుష్యుల్ని ఎట్లా ముక్కలుగా కోయాలో

నేర్చుకోవడం, ఒక పద్యం ఎట్లా వప్పజెప్పాలో నేర్చుకోవడం - ఇవీ. విద్య అంటే ఒక వ్యక్తిని సమర్థతతో పనిచేసేవాడిగా తయారు చేయడం - అంటే సాంకేతిక విజ్ఞానం ఇవ్వడం అని మీరు అనుకుంటే కనుక అసలు సమర్థత అంటే ఏమిటి, దాని ప్రాధాన్యం ఏమిటి అనే విషయం అంతా మీరు పూర్తిగా అర్థం చేసుకోవాలి. ఒక వ్యక్తి చాలా సమర్థుడయిన పనిమంతునిగా తయారయిన కొద్దీ ఏమవుతుంది ? అతను ఇంకా కర్కశంగా తయారవుతాడు. దయచేసి నవ్వకండి. మీ నిత్యజీవితంలో మీరేం చేస్తున్నారు ? ప్రస్తుతం ప్రపంచంలో ఏం జరుగుతున్నది ? విద్య అంటే ఒక ప్రత్యేకమైన పద్ధతిని నేర్చుకొని, పెంపుచేసుకోవడం - అంటే అదే కార్య సమర్థత. దాని అర్థం పారి శ్రామికీకరణ, వేగంగా పని చేయగలగడం, వస్తువుల వుత్పత్తిని ఎక్కువెక్కువగా పెంచడమూ. ఇదంతా చివరకు యుద్ధానికి దారి తీస్తుంది. ప్రతిరోజూ ఇది జరగడం మీరు చూస్తూనే వున్నారు. ఇప్పటి విద్యావిధానమే యుద్ధానికి దారి తీయిస్తున్నది. అసలు ఇప్పటి విద్యావిధానంలోని ముఖ్యాంశం ఏమిటి ? ఒకళ్ళని నాశనం చేయడం, మనమూ నాశనమవడం. కాబట్టి, నిస్సందేహంగా ప్రస్తుతం వున్న విద్యావిధానం పూర్తిగా నిరర్థకంగా తయారయింది అందువల్ల, ముఖ్యమైన సంగతి ఏమిటంటే, విద్యాబోధకుడిని విద్యావంతుడిని చేయడం. ఈ మాటలు చమత్కారం కోసం నేను చెప్పడం లేదు. అవి విని మీరు నవ్వేసి వూరుకోవడం కోసం కాదు. అసలు అధ్యాపకుడికే గనక సరిగ్గా విద్య నేర్పించకపోతే, పిల్లలకు అతను నేర్పించేది ఏముంటుంది ? దోపిడీ చేసే సూత్రాలను తప్ప. ఎందుకంటే అతడిని పెంచినది కూడా వీటి ఆధారంగానే కదా ! మీలో చాలామంది ఎన్నో పుస్తకాలు చదివివుంటారు. ఎక్కడున్నారు మీరు ? మీ వద్ద డబ్బు వున్నది, లేకపోతే సంపాదించుకోగలరు. మీకు మీ సుఖాలూ, సంబరాలూ వున్నాయి. అయినా మీరు సంఘర్షణలో వున్నారు. మొత్తం మీ అస్తిత్వం అంతా దారుణమైన బాధలకూ, యుద్ధానికీ దారితీస్తున్నప్పుడు, ఈ విద్యా విధానం వల్ల జరిగేది ఏమిటి ? రూపాయలు ఎట్లా సంపాదించాలో నేర్చుకోవడమేనా ? కాబట్టి, సవ్యమైన విద్య అంటే బోధకుడితో, తల్లిదండ్రులతో, అధ్యాపకుడితో ఆరంభించవలసినది అని గట్టిగా చెప్పచ్చు. సవ్యమైన విద్యా విధానం గురించి తరచి శోధించడం అంటే జీవితం గురించీ, అస్తిత్వం గురించీ శోధించడం. అవును కదూ ? మీరు చదువుకొని ఒక న్యాయవాదిగా అయాక, కేవలం కలహాలనూ, ఘర్షణలనూ పెంచుకుంటూ పోయి, కోర్టు కేసులనూ తగాదాలనూ ఎక్కువ చేస్తూ వుంటే, ఇక అప్పుడు మీ చదువుకి అర్థం ఏమిటి ? అయితే అందులో డబ్బు సంపాదన వున్నది, దాని మీదే మీరు బతికి బాగుపడుతూ వుంటారు. కాబట్టి, సవ్యమైన విద్యావిధానం తేవాలని మీరు కోరుకుంటుంటే, ముందుగా మీరు అస్తిత్వం యొక్క అర్థం ఏమిటి, దాని ప్రాధాన్యం ఏమిటి అనేది అవగాహన చేసుకొని తీరాలి. అది కేవలం డబ్బు సంపాదన కోసమే కాదు, తీరిక సమయాన్ని కల్పించుకోవడం

కోసమూ కాదు. సూటిగానూ, నిజాయితీగానూ ఆలోచించగలగడం కోసం. అందరూ 'ఏకరీతి'గా ఆలోచించడానికి కాదు. మార్పులేకుండా ఏకరీతిగా ఆలోచించడం అంటే కేవలం ఒక పద్ధతికి అనుగుణంగా మాత్రమే ఆలోచించడం. ఏకరీతిగా ఆలోచించేవాడు అసలు ఆలోచనే లేని ఆలోచనా రహితుడు. అతను కేవలం కొన్ని వాక్యాలు పట్టుకొని అవే పునశ్చరణ చేస్తూ, ఒక గాడిలోనే ఆలోచిస్తూ వుంటాడు. సవ్యమైన విద్య ఏదో కనిపెట్టడానికి, అస్తిత్వం గురించిన అవగాహన వుండాలి. అంటే అర్థం, మిమ్మల్ని గురించిన అవగాహన. ఎందుకంటే అస్తిత్వాన్ని గురించి అదొక నైరూప్యమైన విషయంగా తీసుకొని అవగాహన చేసుకోలేము. విద్య అంటే ఇట్లా వుండాలి అని సిద్ధాంతాలు చేస్తూ, మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోలేరు. అధ్యాపకుడు తనని సవ్యంగా అవగాహన చేసుకోవడంలోనే సరియైన విద్య ఆరంభమవుతుంది అని గట్టిగా చెప్పచ్చు.

ప్రపంచంలో ఏం జరుగుతున్నదో చూడండి. ప్రభుత్వాలు విద్యావిధానాన్ని తమ అధీనంలోకి తీసుకుంటున్నాయి – అందులో ఆశ్చర్యం లేదు. ఎందుకంటే ప్రభుత్వాలన్నీ కూడా యుద్ధాలు చేయడానికే తయారవుతూ వున్నాయి. మీకు ప్రియమైన ఈ ప్రభుత్వమూ, విదేశ ప్రభుత్వమూ అన్నీ యుద్ధానికి సిద్ధమై వుండక తప్పదు. సర్వంసహా ప్రభుత్వానికి సైన్యమూ, వాయుసేనా, సముద్రాసేనా అన్నీ వుండి తీరాలి. పౌరులను యుద్ధం చేయడంలో సమర్థులుగా తీర్చిదిద్దటం కోసమూ, తమ విధులను క్షుణ్ణంగా, సమర్థవంతంగా, దయాదాక్షిణ్యాలు లేకుండా నిర్వర్తించడం కోసమూ వారిని సన్నద్ధం చేయాలి కాబట్టి, కేంద్ర ప్రభుత్వం పైనుంచి వారందరినీ తన అదుపు ఆజ్ఞల్లో వుంచుకుంటుంది. అందుకని, యంత్ర పరికరాలను తయారు చేయడంలో ఏ మాత్రం కనికరానికి తావులేని కర్కశమైన సమర్థత వుండేలా వారిని తయారు చేస్తారు. విద్యకి గల ప్రయోజనమూ, లక్ష్యమూ ఇతరుల వినాశమూ, ఇతరుల చేతిలో తాము వినాశనం పొందడమూ – ఇదే గనుక అయితే, అటువంటప్పుడు విద్య కర్కశంగానే వుండవలసి వుంటుంది. నిజంగా మీరు కోరుకునేది ఇది కాదు అని కూడా నేను అనుకోను. ఎందుకంటే, మీరంతా మీ మీ పిల్లల్ని ఇంకా ఈ పాత పద్ధతిలోనే చదివిస్తున్నారు. విద్యాబోధకుడికి, అధ్యాపకుడికి అవగాహన కలిగినప్పుడు సరియైన విద్యావిధానం మొదలవుతుంది. అంటే అర్థం, పాతుకుపోయిన ఆలోచనా పద్ధతులనుండి అతడు విముక్తి పొంది తీరాలి. చదువు అంటే కేవలం సమాచారాన్ని అందివ్వడం, చదవడం రాయడం నేర్చుకోవడం, విషయ సమాచారాన్ని పోగుచేసి, క్రోడీకరించడమూ కాదు. ఈ చదువు యొక్క , ఈ ప్రభుత్వం యొక్క, ప్రపంచ స్థితిగతుల యొక్క, రోజురోజుకీ ప్రపంచమంతటా వ్యాపించిపోతూ, అధికారం చలాయిస్తున్న నిరంకుశ శక్తుల యొక్క – సమస్తమైన ప్రాముఖ్యతనూ, అంతరార్థాన్నీ గ్రహించడం. మీరు గందరగోళంలో

వుండటం వల్ల విద్యాబోధకుడినీ అదేవిధంగా అయోమయంగా తయారు చేస్తున్నారు. మీరు విద్య అని అనుకుంటున్నదాని ద్వారా విదేశీ ప్రభుత్వాన్ని పడగొట్టటానికి కావలసిన శక్తియుక్తులను తయారు చేస్తున్నారు. అందుకని, సవ్యమైన విద్య ఏది అని ప్రశ్నించడానికి ముందు, మిమ్మల్ని మీరు అర్థం చేసుకోండి. మీకు నిజంగా కనిపెట్టాలని ఆసక్తి వుంటే, మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవడానికి ఎక్కువ సమయం కూడా అవసరం లేదని గ్రహిస్తారు. సర్, విద్యా బోధకులుగా మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోకుండా, ఒక కొత్తదైన విద్యావిధానాన్ని ఎట్లా తీసుకొని వస్తారు ? అందువల్ల మనం మళ్ళీ ఎప్పటి అంశానికే వస్తున్నాం - అది మీరే - మీరేమో ఆ అంశాన్ని దాటవేయాలని చూస్తుంటారు. బాధ్యతను అధ్యాపకుడి మీదకో, ప్రభుత్వం మీదకో నెట్టాలని మీరు కోరుకుంటారు. మీరు ఏమిటో అదే ప్రభుత్వం కూడా. ప్రపంచం అంటే వేరు కాదు, మీరే. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోకుండా సరియైన విద్యావిధానం ఎట్లా వస్తుంది ?

ప్రశ్న : ప్రతి క్షణమూ జీవిస్తూ వుండటం అంటే మీ అర్థం ఏమిటి ?

కృష్ణమూర్తి : కొనసాగుతూ వుండేది ఏదీ కొత్తది అవనే లేదు. మీరే ఒకసారి ఆలోచించి చూడండి. తెలుస్తుంది - ఇది అంత క్లిష్టమైన సంగతేమీ కాదు. ఏ రోజు కారోజు ఆ రోజును పూర్తిచేసి వేయగలిగితే, నా దిగుళ్ళను, నా కష్టనష్టాలను మరు రోజుకు మోసుకుంటూ వెళ్ళకపోతే కనుక, అప్పుడు రేపటి రోజును మళ్ళీ సరికొత్తగా ఎదుర్కోగలుగుతాను. సవాలును మళ్ళీ మళ్ళీ సరికొత్తగా ఎదుర్కోవడమే సృజనాత్మకత. ముగించడం లేకుండా కొత్తది సృష్టించడం వుండదు. అంటే కొత్తదానిని ఇప్పుడు మీరు పాతదానితో ఎదుర్కొంటున్నారు. కాబట్టి, కొత్తదానిని ఎదురుకోవాలంటే పాతదానిని సమాప్తం చేసితీరాలి. ప్రతి నిముషమూ సమాప్తమైపోతూ వుండాలి. అప్పుడే ప్రతి నిముషమూ కొత్తగా వుంటుంది. ఇదంతా కవి కల్పితమూ కాదు, వూహాగానమూ కాదు. ప్రయత్నించి చూడండి, ఏం జరుగుతుందో మీరే కనిపెట్టవచ్చు. అయితే, చూడండి, మనం మాత్రం ఎప్పుడూ కొనసాగుతూ వుండాలనే కోరుకుంటాం. ఒక క్షణం నుండి మరో క్షణానికి, ఒక రోజు నుండి మరో రోజుకు కొనసాగిపోతూ వుండాలని కోరుకుంటాం. ఎందుకంటే ఈ కొనసాగడం లేకుండా మనం జీవించలేమని అనుకుంటాం కాబట్టి.

సరే, కొనసాగుతూ వుండగలిగినది ఏదయినా సరే పునర్జీవనం పొందగలదా ? కొత్తది అవగలదా ? ముగింపు అంటూ వున్నప్పుడే, కొత్తది రాగలుగుతుంది అని నిస్సందేహంగా చెప్పొచ్చు. మీ ఆలోచన ఆగకుండా కొనసాగుతూ వుంటుంది. ఆలోచన గతానికి ఫలితం. ఆలోచన గతంమీద ఆధారపడి తయారవుతుంది. ఆలోచన గతానికి

కొనసాగింపు. అది వర్తమానంతో సంయోగం చెంది భవిష్యత్తును రూపుదిద్దుతుంది, తయారు చేస్తుంది. అయితే వర్తమానం ద్వారా భవిష్యత్తుకు ఒక కొనసాగింపుగానే గతం సాగిపోతున్నది తప్ప ఆగిపోవడం లేనే లేదు. ఏదయినా ఒకటి ఆగిపోతేనే మరో కొత్తదానిని మనం చూడగలుగుతాం. వర్తమానం చేత రూపంలో మార్పులు దిద్దించుకుంటూ, గతాన్నే కొనసాగించుకుంటూ వుండటం కొత్తదానిని గ్రహించడం అవదు. అందువల్ల, ఆలోచన కొత్తదానిని గ్రహించలేదు. కొత్తది కలగాలంటే ఆలోచన అంతమై తీరాలి. అయితే మనం ఏం చేస్తున్నామో చూడండి. భవిష్యత్తులోకి పోయే ఒక దారిగా వర్తమానాన్ని వుపయోగించుకుంటున్నాం. అదే కదూ మనం చేస్తున్నది ? వర్తమానం మనకి ముఖ్యం కాదు. ఆలోచన, అంటే ప్రస్తుత చర్య, అంటే ప్రస్తుత బాంధవ్యం ముఖ్యమైనవి కాదని మనం అనుకుంటాం. ఆలోచనకు ఫలితంగా జరిగే పర్యవసానం మాత్రమే, అంటే భవిష్యత్తో గతమో మాత్రమే అసలు ముఖ్యమైనవి అని మనం అనుకుంటాం. వృద్ధులు గతంలో జరిగిపోయిన వాటిమీదే దృష్టి నిలపడం, యువకులు కూడా గతం వైపో, భవిష్యత్తు వైపో మాత్రమే తరచూ చూస్తుండటం మీరు గమనించలేదూ ? వీళ్ళంతా తమని తాము గతంలోనో భవిష్యత్తుల్లోనో వూహించుకొని, ఆ వ్యాపకంలో పూర్తిగా పడివుంటారే తప్ప, వర్తమానానికి తమ పూర్తి ధ్యాసను ఇవ్వరు. కాబట్టి, మరొకదానిని చేరడానికి వర్తమానాన్ని ఒక త్రోవగా, దారిగా వుపయోగించుకుంటాం. అందువల్ల, వర్తమానాన్ని పరిగణనలోకి తీసుకోము, పరిశీలించము. వర్తమానాన్ని పరిశీలించాలంటే, గతం ముగిసిపోవాలి. 'ఉన్నది'ని చూడాలంటే గతం ద్వారా వర్తమానాన్ని పరికించడం వల్ల సాధ్యమవదు కదా ! అందులో సందేహం లేదు. మిమ్మల్ని నేను అవగాహన చేసుకోవాలనుకుంటే, మీ వైపు సూటిగా చూడాలి. గతంలో నేను ఏర్పరచుకున్న అపోహలను తీసుకొచ్చి, ఆ అపోహల గుండా మీ వైపు చూడకూడదు. అట్లా చేసినప్పుడు, నా అపోహలను మాత్రమే నేను చూస్తున్నాననమాట. అపోహలు ఏవీ లేనప్పుడు మాత్రమే నేను మిమ్మల్ని పరికించి చూడగలను. కాబట్టి, అపోహలన్నీ ముగిసిపోవాలి.

కాబట్టి 'ఉన్నది'ని – 'ఉన్నది' అంటే క్రియ, అంటే ప్రతి క్షణంలోనూ వుండే బాంధవ్యం – ఆ వున్నదిని అవగాహన చేసుకోవాలంటే ఒక సరికొత్తదనం వుండాలి. కాబట్టి గతం ముగిసిపోయి తీరాలి. అయితే ఇది ఒక సిద్ధాంతం కాదు. మీరే ప్రయోగం చేసి చూడండి. అప్పుడు సమాప్తం చేయడం మీరు అనుకున్నంత కష్టమేమీ కాదని మీరే గ్రహిస్తారు. ఇప్పుడే, వింటున్నప్పుడే ప్రయత్నించండి. ఎంత సునాయాసంగా, ఎంత సంపూర్ణంగా ఆలోచనను సమాప్తం చేయగలరో, ఆపైన కొత్తది కనిపెట్టగలరో మీరే చూస్తారు. అంటే, మరొకరి ప్రేరేపణ వలన కాకుండా మీ అంతట మీకే ఒక విషయాన్ని

గురించి శక్తివంతమైన, ప్రగాఢమైన ఆసక్తి వున్నప్పుడు, దానివైపు మళ్ళీ సరికొత్తగా చూస్తారు. ఆ ఆసక్తే గతాన్ని తరిమి వేస్తుంది. ఇప్పుడు మీ ధ్యాస కేవలం 'ఉన్నది'ని పరిశీలించడం పైనా, 'ఉన్నది'ని తన కథను చెప్పనీయడం మీదా మాత్రమే వుంటుంది. దీనిలోని సత్యాన్ని మీరు చూసినప్పుడు, అనుక్షణమూ మీ మనసు ఖాళీ అవుతూ వుంటుంది. అందువల్ల మనసు ప్రతిదానినీ సరికొత్తగా చూస్తూ వుంటుంది. ఈ కారణంగానే జ్ఞానం ఎప్పటికీ కొత్తది అవలేదు. కొత్తగా వుండేది వివేకం. జ్ఞానాన్ని పాఠశాలలో బోధించవచ్చు. కానీ వివేకాన్ని నేర్పించలేరు. వివేకాన్ని నేర్పించే పాఠశాల అనే మాటే అర్థం లేనిది. వివేకం అంటే, 'ఉన్నది'ని అనుక్షణమూ అవగాహన చేసుకోవడమూ, ఆవిష్కరించుకోవడమూ. అటువంటప్పుడు, 'ఉన్నది'ని పరిశీలించడం మరొకరు ఎట్లా నేర్పించగలుగుతారు ? నేర్పించినట్లవుతే అది జ్ఞానం అవుతుంది. అప్పుడు ఆ జ్ఞానం మీకూ, వాస్తవానికీ మధ్యన వచ్చి నిలబడుతుంది. కాబట్టి, కొత్తకి జ్ఞానం ఆటంకమవుతుంది. జ్ఞానంతో నిండిపోయిన మనసు 'ఉన్నది'ని అవగాహన చేసుకోలేదు. మీరంతా గొప్ప పాండిత్యం సంపాదించారు, అవునా ? మీ మనసు కొత్తగా వున్నదా ? లేక అందులో జ్ఞాపకాల రూపంలో సమాచారాన్ని నింపేసి వుంచారా ? ఇంకా ఇంకా ఎక్కువగా సమాచారాన్ని నిలవ చేసేదిగా మాత్రమే తయారవుతున్న మనసు - అటువంటి మనసు నవ్యమైన దానిని చూడగలుగుతుందా ? కొత్తదానిని చూడాలంటే, గతంలో సంపాదించిన జ్ఞానం అంతా ఖాళీ అయితీరాలి. అనుక్షణమూ 'ఉన్నది'ని ఆవిష్కరించుకోవడంలో మాత్రమే వివేకం వల్ల లభించే స్వేచ్ఛ వుంటుంది. కాబట్టి, వివేకం నవ్యత గలది. అది మళ్ళీ మళ్ళీ పునరుక్తి అయ్యేది కాదు. పాఠశాలలో చదివే పుస్తకాల్లో నుంచి కానీ, శంకరాచార్యుల నుంచి కానీ, భగవద్గీత నుంచి కానీ, ఏసుక్రీస్తు నుంచి కానీ నేర్చుకొనేది కాదు.

కాబట్టి, జ్ఞానం కొనసాగిపోతూవుంటే కొత్తదానిని అవగాహన చేసుకోవడానికి అది ఆటంకమవుతుంది. వింటున్నప్పుడు కనుక, మీరు ఇంతకు మునుపు ఆర్జించిన జ్ఞానాన్ని తీసుకొని వస్తుంటే, అవగాహన ఎట్లా జరుగుతుంది ? మొదటగా మీరు వినాలి. సర్, ఒక ఇంజనీరుకి నేలలో వుండే పీడనలను గురించిన, ఒత్తిడులను గురించిన విజ్ఞానం వుండి వుండవచ్చు. అయితే, అతను వంతెన నిర్మించడానికి పూనుకున్నప్పుడు, మొట్టమొదట ఆ ప్రాంతాన్నీ, ఆ నేలనూ అధ్యయనం చేయాలి. తను కట్టబోయే నిర్మాణంతో సంబంధం లేకుండా, ఈ నేలను మాత్రమే ప్రత్యేకంగా పరిశీలించి చూడాలి. అంటే అర్థం, దానిని సరికొత్తగా చూడాలి తప్ప, పుస్తకంలో వున్నదానినే మక్కికి మక్కీగా అనుసరించకూడదు. అయితే, వుపమానాల వల్ల చాలా ప్రమాదం వుంది. కాబట్టి, వాటిని

కొంతవరకే తీసుకోవాలి. ముఖ్యమైన సంగతి ఏమిటంటే, పునరుజ్జీవనం వుండాలి. అందులోనే ఒక సృజన, చటుక్కున మెరిసే సృజనాత్మక ప్రేరణా, నిరంతరంగా కొత్త జన్మ ఎత్తుతున్న ఒక భావమూ వుంటాయి. ప్రతి నిముషమూ మృతి చెందుతున్నప్పుడే ఇది జరగడానికి అవకాశం వున్నది. అటువంటి మనసే సత్యాన్ని స్వీకరించ గలుగుతుంది. సత్యం నిరపేక్షమైనదీ, తిరుగులేనిదీ, ఎక్కడో దూరంలో వుండేదీ కాదు. అది క్షణ క్షణమూ ఆవిష్కరించుకోవలసినది. కొనసాగుతూ వుండే స్థితిలో దానిని ఆవిష్కరించుకోలేరు. కొనసాగుతూ వుండిపోవడంలో స్వేచ్ఛ వుండదు. కొనసాగింపు అంటే స్మృతులే. అప్పుడు స్మృతి కొత్తది ఎట్లా అవుతుంది? స్మృతి అంటే అనుభవం – అంటే గతం – అటువంటి స్మృతి వర్తమానాన్ని ఎట్లా అవగాహన చేసుకుంటుంది? గతాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకున్నప్పుడే, మనసు ఖాళీగా వున్నప్పుడే అది – ఆ మనసు వర్తమానాన్నీ, అందులో వున్న మొత్తం ప్రాధాన్యాన్నీ అంతటినీ చూడగలుగుతుంది. అయితే చాలామంది మనుష్యుల మనసులు ఖాళీగా వుండవు. జ్ఞానంతో నిండుగా నిండిపోయి వుంటాయి. అటువంటి మనసు ఆలోచించే మనసు కాదు. అది కేవలం పునరుక్తులు వల్లించే మనసు. అది పరిస్థితులకు అనుగుణంగా రికార్డులను మార్చే గ్రామఫోను పెట్టె. అటువంటి మనసుకు కొత్తదానిని ఆవిష్కరించుకోవడం చేతగాదు. ముగింపులో మాత్రమే కొత్తది వుంటుంది. అయితే మీకు అదంటే భయం. ముగించాలంటే భయపడతారు. ఈ భయం నుంచి తప్పించుకోవడానికే, కాపాడుకోవడానికే మీ ఈ మాటలూ మీరు కూడబెట్టుకున్న ఈ సమాచారమూ వుపయోగిస్తున్నారు, అంతే. అందువల్లనే మీరు కొనసాగింపును కోరుకుంటున్నారు. అయితే, కొనసాగింపు మాత్రం ఎప్పటికీ కొత్తది అవదు. అందులో పునరుజ్జీవనానికి అవకాశం లేదు. కొత్తది స్వీకరించాలంటే అందులో ఎక్కడా ఖాళీ వుండదు. కాబట్టి మనసు ఖాళీగా వుంటేనే తప్ప, ప్రతిరోజూ మీ దిగుళ్ళతో దానిని నింపకుండా వుంటేనే తప్ప, మనసు తనని తాను పునరుజ్జీవింప చేసుకోలేదు. మనసుకు ముగింపు కలిగినప్పుడే కాలరహితమైన ఒక సృజన జరుగుతుంది.

ప్రశ్న.: మీ ప్రసంగాలు వింటున్న కొద్దీ – ఏసుక్రీస్తు, శంకరాచార్యులు, భగవద్గీత వంటి ప్రాచీన బోధనల్లోనూ, దివ్యజ్ఞానంలోనూ సత్యం వున్నదని నాకు మరీ మరీ అనిపిస్తూ వున్నది. నిజంగానే మీరు వాటినేవీ చదవలేదా ?

కృష్ణమూర్తి : మీ ప్రశ్నలోని రెండో భాగానికి ముందుగా సమాధానం చెప్పి, ఆ పైన మొదటి భాగానికి వస్తాను. ''నిజంగానే మీరు వాటినేవీ చదవలేదా ?'' లేదు, సర్, వాటిలో ఏవీ నేను చదవలేదు. ఇందులో తప్పేముంది? మీకు ఆశ్చర్యంగా వుందా ?

నమ్మలేనంత వింతగా వుందా ? అసలు అవన్నీ ఎందుకు చదవాలి ? ఇతరుల పుస్తకాలు చదవాలని మీరు ఎందుకనుకుంటున్నారు, చేతిలో మీ సొంత పుస్తకమే వుంచుకొని ? బైబిలునో, శంకరుడినో ఎందుకు చదవాలనుకుంటారు ? రూఢి చేసుకోవాలి, గట్టి చేసుకోవాలి – అందుకని. నిస్సందేహంగా అందుకే. చాలామంది అందుకోసమే చదువుతుంటారు – తాము నమ్ముతున్నదీ, తాము వ్యక్తం చేస్తున్నదీ మరొకరు కూడా రూఢి చేయాలనీ, బలపరచాలనీ, ఆ విధంగా క్షేమంగా, ఏ సందిగ్ధమూ లేకుండా వుండచ్చనీ. నిశ్చితత్వంలో అంటే అసందిగ్ధతలో కొత్తదానిని కనిపెట్టగలరా ? ఏ మాత్రం కనిపెట్టలేరు. మానసికంగా సునిశ్చితంగా వున్న మనిషి కొత్తది ఎప్పటికీ కనిపెట్టలేడు. అసలు మీరు ఎందుకు పుస్తకాలు చదువుతారు ? వట్టి కాలక్షేపం కోసమో, సమాచారం పోగుచేసుకోవడం కోసమో అయియుంటుంది. లేదూ మీరు వివేకం అని అనుకుంటున్నది ఈ చదవడం వల్ల సంపాదించవచ్చునేమో. శంకరాచార్యుల మాటలు వుదహరించగలరు కాబట్టి మీకు అంతా అర్థమైపోయిందని మీరు అనుకుంటారు. శంకరుడి వాక్యాలు వుల్లేఖించడంతో జీవితం సార్థకం అయిపోయిందని అనుకుంటారు. మాటలను వుల్లేఖించే మనిషి పూర్తిగా ఆలోచనా రహితుడు. ఎందుకంటే ఎవరో చెప్పిన మాటలను అతడు మళ్ళీ పునశ్చరణ చేస్తున్నాడు. సర్, మీ వద్ద భగవద్గీత లేకపోతే, శంకరుడు లేకపోతే, అసలు ఏ పుస్తకమూ లేకపోతే ఏం చేస్తారు ? మీ అంతట మీరే మీకు తెలియని ఆ అజ్ఞేయంలోకి ప్రయాణం చేయాలి. ఒంటరిగానే ఈ సాహసానికి తలపడాలి. అప్పుడు మీరు ఏదయినా ఆవిష్కరించుకుంటే, ఆ కనిపెట్టినది మీదే అవుతుంది. అప్పుడు మీకు ఏ పుస్తకమూ అక్కర్లేదు. నేను భగవద్గీత చదవలేదు. మరి ఇంకే మతగ్రంథాలు కానీ, మనోవైజ్ఞానిక, తాత్విక గ్రంథాలు కానీ చదవలేదు. అయితే, నేను ఒకటి ఆవిష్కరించుకొన్నాను. అటువంటి ఆవిష్కరణ స్వేచ్ఛలో మాత్రమే జరుగుతుంది. పునశ్చరణల వల్ల జరగదు. ఈ ఆవిష్కరణ మరొకరి అనుభవం కంటె ఇంకా ఎక్కువ వున్నతమైనది. ఎందుకంటే కొత్తదాని ఆవిష్కరణ అంటే పునశ్చరణమూ కాదు, మరొక దానికి అనుకరణా కాదు.

ఇప్పుడు ప్రశ్నలోని మొదటి భాగం – సర్, మీరెందుకు పోల్చి -చూస్తూ వుంటారు ? ఈ పోల్చి చూడటం అనే ప్రక్రియ ఏమిటి ? 'మీరు చెప్తున్నది శంకరుడు చెప్పినదిలాగే వున్నది' అని మీరు ఎందుకంటారు ? ఒకేలాగా వున్నాయా లేవా అన్నది ముఖ్యం కాదు. సత్యం ఎప్పుడూ ఒకేలాగా వుండదు. అది నిత్యనూతనంగా వుంటుంది. ఎప్పుడూ ఒకేలా వుంటే అది సత్యం కాదు. ఎందుకంటే సత్యం క్షణ క్షణంలో జీవిస్తూ వుంటుంది. నిన్న వున్నదానిలాగా ఇవాళ వుండలేదు. పోల్చి చూడాలని అసలు మీరు ఎందుకు కోరుకుంటారు ? సురక్షితంగా వున్నామనే భావం పొందడం కోసమూ,

శంకరుడు చెప్పిందే నేనూ చెప్తున్నాను కాబట్టి ఇంక ఆలోచించ నక్కరలేదనే నిశ్చింత పొందడం కోసమూ మీరు పోల్చి చూస్తున్నారు కదూ ? శంకరుడు చెప్పినది మీరు చదివారు. అంతా అవగాహన అయిపోయిందని మీరు అనుకుంటారు. అందుకని అదీ ఇదీ పోల్చి చూసి, హాయిగా వూపిరి పీల్చుకుంటారు. ఇదంతా చాలా త్వరగా, శ్రమపడకుండా చేసేస్తారు. నిజం చెప్పాలంటే, మీకు అవగాహన అవలేదు. అందువల్లే మీరు పోల్చి చూస్తున్నారు. పోల్చి చూస్తున్నప్పుడు అవగాహన జరగదు. అవగాహన చేసుకోవాలంటే మీ ముందు పరచినదానిని నేరుగా పరికించి చూడాలి. పోల్చి చూసే మనసు చాలా సోమరిపోతు. క్షీణించి పోతున్న మనసు. అది భద్రత కోసమే జీవిస్తున్న మనసు. తనని తాను తృప్తి పరచుకోవడంలో మూసుకొని పోయిన మనసు. అటువంటి మనసు సత్యాన్ని అవగాహన చేసుకోలేదు. సత్యం సజీవమైన విషయం. పోల్చి చూడటాలకు అతీతంగా వుంటుంది. దానిని గతంతో కానీ, భవిష్యత్తుతో కానీ పోల్చి చూడలేము. ప్రతి క్షణంలోనూ సత్యం పోలికలకు అతీతంగానే వుంటుంది. సత్యాన్ని పోల్చి చూడాలనీ, దాని విలువ తూకం వేసి చూడాలనీ, విమర్శించాలనీ ప్రయత్నించే మనసుకు సత్యం వుండదు. అటువంటి మనసుకు సిద్ధాంత ప్రచారమూ, చెప్పిందే మళ్ళీ వల్లె వేయడాలే వుంటాయి. పునరుక్తి అంటే అబద్ధం. అది సత్యం కాదు. అనుభూతి చెందడం లేదు కాబట్టి మీరు పునరుక్తులు పలుకుతుంటారు. అనుభూతి చెందుతున్న మనిషి ఎప్పుడూ మళ్ళీ మళ్ళీ అదే వల్లించడు. ఎందుకంటే సత్యాన్ని పునశ్చరణ చేయలేము. మళ్ళీ మళ్ళీ చెప్తే అది సత్యం కాదు. అయితే, దానిని గురించి మీరు చేసుకున్న తీర్మానాలనూ, అభిప్రాయాలనూ పునరుక్తి చేస్తూ వుండచ్చు. అందువల్ల పోల్చి చూసే మనసు, 'మీరు చెప్తున్నదీ శంకరుడు చెప్పినదీ అక్షరాలా ఒకటే' అని అంటున్న మనసు – అటువంటి మనసు కోరుకుంటున్నది ఎడతెగకుండా కొనసాగడం మాత్రమే. కాబట్టి అటువంటి మనసు నిర్వీర్యమైనదీ, నిర్జీవమైనదీ.

సర్ ! ఎవరో పాడిన పాటనే మీరు మళ్ళీ పాడుతూ, ఆ విధంగా ఆ గాయకుడిని అనుసరిస్తూ వుంటె మాత్రం మీ హృదయంలో గానం లేనట్లే. ముఖ్యమైనది ఏమిటీ అంటే, నేను పవిత్ర గ్రంధాలు చదివానా లేదా అన్నది కాదు ; నేను చెప్తున్నది శంకరుడు చెప్పినదానితో, భగవద్గీతతో, క్రీస్తుతో పోల్చదగినదా కాదా అన్నది కాదు – ముఖ్యమైనది ఏమిటీ అంటే – మీరు ఎందుకు మరొకరు చెప్పినది పునశ్చరణ చేస్తుంటారు, ఎందుకు మీరు పోల్చి చూస్తుంటారూ అన్నది. ఎందుకు మీరు పోల్చి చూస్తున్నారో అర్థం చేసుకోండి. అప్పుడు మిమ్మల్ని మీరు అవగాహన చేసుకుంటారు. శంకరుడిని అవగాహన చేసుకోవడం కంటే మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం ఇంకా చాలా ముఖ్యం. ఎందుకంటే శంకరుడికన్నా తక్కిన ఏ సిద్ధాంత వాదాలకన్నా కూడా మీరే చాలా ముఖ్యం.

మీ ద్వారా మాత్రమే సత్యాన్ని మీరు కనిపెట్టగలుగుతారు. సత్యాన్ని ఆవిష్కరించేది మీరే. శంకరుడూ కాదు, భగవద్గీతా కాదు - దాంట్లో అర్థం లేదు. మిమ్మల్ని మీరే సమ్మోహపరచుకోవడానికి అది ఒక పద్ధతి మాత్రమే. వార్తాపత్రిక చదవడంలాగా. కాబట్టి సత్యాన్ని స్వీకరించగలిగే మనసు పోల్చి చూడదు. ఎందుకంటే సత్యం పోలికలకు అందనిది. సత్యాన్ని స్వీకరించడానికి మనసు ఒంటరిగా వుండాలి. శంకరుడో, బుద్ధుడో మీ మనసుని ప్రభావితం చేస్తుంటే అప్పుడు అది ఒంటరిగా వున్న మనసు కాదు. కాబట్టి అన్నిరకాల ప్రభావాలూ, నిబద్ధీకరణ సమస్తమూ అన్నీ అంతమవాలి. అటువంటి స్థితిలో మాత్రమే, ఆర్జించిన జ్ఞానమంతా అంతరించినప్పుడే ముగింపు కలుగుతుంది. కాబట్టి, సత్యం అనే ఏకాంతత వుంటుంది.

ప్రశ్న : ధ్యానం అంటే అసలు మీరు చెప్పే అర్థం ఏమిటి ? సూటిగా చెప్పండి - అది ఒక ప్రక్రియా లేక ఒక స్థితా ?

కృష్ణమూర్తి : నేను మాట్లాడుతూ వుంటే మీరు వింటూ వున్నప్పటికీ, మనందరం కలిసి ధ్యానం అంటే ఏమిటో అనుభూతి చెందుతూ, ఆవిష్కృతం చేసుకుందాం. ధ్యానం ఎట్లా చేయాలో మీకు చెప్పబోవడం లేదు. అయితే అందరం కలిసి ధ్యానం అంటే ఏమిటి అనేది కనిపెడదాం. కాబట్టి, మనం ముందుకు పోతున్న కొద్దీ వింటూ, అనుభూతి చెందుతూ వుండండి. మనం కదులుతూ వున్నప్పుడే, కలిసి ప్రయాణం చేస్తూ వున్నప్పుడే మాటలకు అర్థం వుంటుంది.

ధ్యానం అంటే ఏమిటి ? ధ్యానం చేస్తున్న వాడిని అవగాహన చేసుకోవడమే ధ్యానం. ధ్యానం చేస్తున్నవాడే ధ్యానం . ధ్యానం అంటే కొన్నింటిని బహిష్కరించడమూ కాదు, కొన్నింటిపై ఏకాగ్రత నిలపడమూ కాదు. ఏకాగ్రత అంటే అర్థం ఏమిటి ? నేను మీకు వివరంగా చెప్తాను. మనం కలిసి ఒక ప్రయాణం చేస్తున్నాం. మీరూ కొత్తవి కనిపెడుతున్నారు, నేనూ కనిపెడుతున్నాను. అసలు ముఖ్య విషయం ఏమిటంటే కనిపెట్టడం. ఊరికే అనుసరించడమూ, అనుకరించడమూ ముఖ్యం కాదు. ఏకాగ్రత సాధించడమే ధ్యానం అని చాలామంది అనుకుంటారు. కాని అది సరి కాదు. ఎందుకు కాదో మీకు ఇప్పుడే చూపుతాను. ఏకాగ్రత అంటే బహిష్కరించడం. అంటే నెట్టివేయడం. ఆసక్తి గల ఒక విషయం మీద కేంద్రీకరించడం, తక్కిన విషయాలను బహిష్కరించడం. ఏకాగ్రత చూపుతుంటారు, నిరోధిస్తూ వుంటారు. కాబట్టి, ఏకాగ్రత అంటే ప్రత్యేకంగా నిరోధించడమే చేస్తూ వుండటం అనమాట. ఒక చిత్రపటం మీద కానీ, ఒక ప్రతిమ మీద గానీ, ఒక భావన మీద గానీ ఏకాగ్రత నిలపడానికి ప్రయత్నించండి. మీ మనసు ఇతరు

విషయాల మీదకు మళ్ళీ పోతూవుంటుంది. ఈ రకరకాలైన ఇతర విషయాలను నెట్టివేస్తూ జరిపే నిరోధాన్నే మీరు ధ్యానం అని అంటున్నారు. నిస్సందేహంగా అటువంటి ఏకాగ్రత నిలపడం ధ్యానం కాదు. ఎందుకంటే ఆ ప్రయత్నంలో నిరోధిస్తున్న దానికీ, మన ధ్యాసను ఆక్రమిద్దామని వస్తున్న వాటికీ మధ్యన సంఘర్షణ జరుగుతుంది. అంటే, నిరోధించడంలోనూ పోరాడటంలోనూ మరొకదాన్ని వ్యతిరేకిస్తూ కట్టడి చేయడంలోనూ మీ సమయాన్ని వెచ్చిస్తున్నారు. ఈవిధంగా రోజులూ, సంవత్సరాలూ ఇటువంటి పోరాటంలో గడుపుతుంటారు. చిట్టచివరకు మీ మనసును మీరు కోరుకుంటున్న విషయం మీద కేంద్రీకృతం చేసేవరకూ. మీరు కోరుకుంటున్న ఆ విషయం మీరు స్వయంగా చిత్రణ చేసుకున్నదే. అది మీ ఆలోచనా ప్రక్రియలోని భాగమే. అది మీరు స్వంతంగా తయారుచేసుకున్నదే. దాని మీద కేంద్రీకరించాలని మీరు ప్రయత్నిస్తూ వుంటారు. కాబట్టి మీరు ఏకాగ్రతను నిలుపుతున్నది మీ మీదనే. దానినే మీ ఆశయంగా మీరు చెప్పుకుంటూ వుంటారు. కాబట్టి ఇదంతా కొన్నింటిని లోపల వుంచి మూసివేస్తూ, కొన్నింటిని బయటకు నెట్టివేస్తూ వుండే ప్రక్రియ.

కాబట్టి, ధ్యానం అంటే బహిష్కరించడం కాదు. నిశితంగా ప్రశ్నించి తెలుసుకోవడం ద్వారా ధ్యానం అంటే ఏమిటో కనిపెడుతూ వున్నాం. అది ఫలానా అని అనడం కేవలం అనుకరణ మాత్రమే అవుతుంది. ఏది ధ్యానం కాదో చెప్పడంలో మాత్రమే ధ్యానమంటే ఇదీ అని చెప్పడం వుంటుంది. కాబట్టి, ఏకాగ్రత ధ్యానం కాదు. ఒక చిన్న పిల్లవాడికి ఒక ఆటవస్తువు మీద ఆసక్తి వున్నప్పుడు దానిమీద ఏకాగ్రత చూపుతాడు. అది ధ్యానం కాదనడంలో ఏ సందేహమూ లేదు. ఆటవస్తువు దేవుడు కాదు. ఒక సుగుణాన్ని పొందడం కోసం ప్రాకులాడటమూ ధ్యానం కాదు. దీని అర్థం ఏమిటో ఇప్పుడు చూద్దాం. సుగుణాలని అలవరచుకోవాలని ప్రయత్నించడం – అదేనా సుగుణం అంటే ? మంచితనాన్ని అలవరచుకుంటూ వుండటం – అది సుగుణమా ? 'నేను ఇకమీదట సహోదరభావంతో వుంటాను' అని అంటూ సహోదరభావం గురించి ధ్యానం చేయడం – అది సుగుణమా ? సుగుణాలను గురించి చేసే అటువంటి ధ్యానం కేవలం స్వార్థపు దురాలోచన. సద్గుణం వుండటం అంటే స్వేచ్ఛ వుండటం అని అర్థం. సుగుణవంతులుగా అవడం కోసం కుతంత్రాలు పన్నుతూ వుంటే మీరు స్వేచ్ఛగా లేనట్లే. కాబట్టి సుగుణవంతునిగా అవడం కోసంగాను ప్రతిరోజూ ధ్యానం చేసే మనిషిలో సద్గుణాలు లేవు. అది కేవలం గౌరవప్రతిష్ఠలు అనబడే ఒక ముసుగు మాత్రమే. సర్, వినయం గురించి మీరు మాట్లాడుతున్నప్పుడు మీరు నిజంగా వినయంగా వున్నట్లా ? లేక వినయం అనే ముసుగు కప్పుకున్నట్లా ? వినయంగా వుండటం అంటే ఏమిటో మీకు తెలుసునా ? దానిని మీరు అలవరచుకోలేరు. అత్యాశ లేకపోవడాన్ని మీరు

అలవరచుకోలేరు. మీలో అత్యాశ వున్నది కాబట్టి అత్యాశ లేకుండా వుండాలని కోరుకుంటారు. మూర్ఖత్వం తెలివిగలది ఎట్లా అవుతుంది ? మూర్ఖత్వం వున్నచోట తెలివి వుండదు. మూర్ఖత్వం వుంటే అన్ని పరిస్థితులలోనూ అట్లాగే వుంటుంది. మూర్ఖత్వం అంతమైనప్పుడు తెలివి వుంటుంది. అత్యాశ అంతమై పోయినప్పుడు అత్యాశ నుండి విముక్తి వుంటుంది. అందువల్ల సుగుణం అంటే స్వేచ్ఛ. మరొకటి ఏదో అవడం కాదు. మరొకటి అవడం అంటే అంతులేకుండా కొనసాగడం.

సరే, ఏకాగ్రత నిలపడం ధ్యానం కాదని, సుగుణాలను పొందాలని ప్రాకులాడటమూ ధ్యానం కాదని మనం చూశాం. భక్తి కూడా ధ్యానం కాదని స్పష్టంగా చెప్పచ్చు. ఎందుకంటే మీరు దేనిపై భక్తిని చూపుతున్నారో ఆ అంశం మీరు స్వయంగా చిత్రణ చేసుకున్నదే. మీ ఆలోచనలలో నుండి పుట్టుకొచ్చినదే మీ ఆశయం. సర్, మీ ఆశయం మీ స్వీయ చిత్రణే అని స్పష్టంగా తెలుస్తున్నది కదూ ; అవునా కాదా ? మీరు ఇట్లా వున్నారు, అట్లా అవాలనుకుంటున్నారు. మీరు అవాలనుకునే ఆ 'అట్లా' మీలో నుండే వచ్చింది ; మీ కోరికలో నుంచి వచ్చింది. మీలో హింస వున్నది. అహింసా పరులుగా అవాలనుకుంటున్నారు. ఆ ఆదర్శం మీ లోపల వున్నదే. అందువల్ల మీ ఆశయం లేక ఆదర్శం మీ స్వగృహంలో తయారుచేసినదే. కాబట్టి, ఒక ఆదర్శానికి, ఒక ఆశయానికి మీరు అంకితం అవుతుంటే, మీరు స్వయంగా తయారు చేసుకున్నదానికే మీరు అంకితం అయిపోతున్నారనమాట. అందువల్ల మీ భక్తీ, అంకిత భావమూ అంటే స్వార్థాన్ని తృప్తి చెందించుకోవడం. మీకు ఇష్టం లేనిదానికి మీరు అంకితమైపోరు. అది బాధాకరంగా వుంటుంది. మీకు సుఖసంతోషాలు కలిగించేదానికే అంకితమైపోతారు. అంటే అర్థం, అది స్వార్థం తయారీ అని స్పష్టంగా తెలుస్తున్నది. కాబట్టి, అది ధ్యానం కాదు. ఎందుకంటే మీకు తెలియని దానికోసం మీరు వెతకలేరు. మీకు తెలిసినదానిని మాత్రమే వెతకగలుగుతారు. సత్యం కనుక మీకు తెలుస్తే, ఇక అది ఆ పైన సత్యం అవదు. మీకు తెలిసినది గతంలో నుండి, స్మృతిలో నుండి వచ్చిన ఫలితం. అందువల్ల అది సత్యం కాదు. కాబట్టి, 'ధ్యానం ద్వారా నేను సత్యాన్ని అన్వేషిస్తున్నాను' అని మీరు కనుక అంటే, మీరే స్వంతంగా తయారుచేసుకున్నదాని భారాన్ని మనసుమీద మోపుతున్నారు, అంతే. అది సత్యం కాదు. కాబట్టి, ఏకాగ్రతా, అంకితభావమూ, సుగుణాల కోసం ప్రాకులాడటమూ, సత్యాన్వేషణా ఏవీ ధ్యానం కావు.

అప్పుడు, ధ్యానం అంటే ఏమిటి ? మనం ప్రతిరోజూ క్రమం తప్పకుండా సాధన చేస్తూ, క్రమశిక్షణలో పెట్టుకుంటూ, మనసు మీద రుద్దుతూ వున్న విషయాలు ఏవీ ధ్యానం కాదని స్పష్టమైంది. ఎందుకంటే ఇందులో స్వేచ్ఛ లేదు. స్వేచ్ఛలో మాత్రమే సత్యం

వునికిలోకి రాగలుగుతుంది. ఇంతకు ముందు మనం చర్చించుకున్నట్లుగా ప్రార్థన కూడా ధ్యానం కాదు. మనసులో నుంచి గాలి గోపురంలాంటి ఈ కట్టడ నిర్మాణాన్ని అంతటినీ తొలగించినప్పుడు – ఆదర్శసాధనకై ఆరాటమూ, సత్యం కోసం అన్వేషణా, సుగుణశీలం పెంచుకోవడమూ, ఏకాగ్రతా, ప్రయత్నం అనే ప్రయాసా, క్రమశిక్షణా, ఖండించడమూ, తప్పొప్పులు నిర్ణయించడమూ – ఇవన్నీ అంతమైనప్పుడు – అప్పుడు మనసు అంటే ఏముంటుంది ? అదే లేనప్పుడు ధ్యానించేవాడూ వుండడు. కాబట్టి ధ్యానం వుంటుంది. ధ్యానించేవాడు లేనప్పుడు ధ్యానం వుంటుంది. అంతేకాని, ధ్యానించేవాడు ధ్యానించలేడు. అతడు తన గురించి ధ్యానం చేసుకోవచ్చు. తననే తన ముందు ప్రదర్శించుకోవచ్చు. తనని గురించే ఆలోచించుకోవచ్చు. అయితే, అతనికి ధ్యానం తెలియదు. ధ్యాని తనని తాను అవగాహన చేసుకొని, సమాప్తం అయినప్పుడు, అప్పుడు మాత్రమే ధ్యానం వుంటుంది. ఎందుకంటే, ధ్యానించేవాడిని సమాప్తం చేయడమే ధ్యానం. ఏకాగ్రత, సత్యాన్వేషణ, సుగుణాలు పెంచుకోవడం, ఖండించడం, తప్పొప్పులు నిర్ణయించడం, క్రమశిక్షణ విధించడం – ఇదంతా ధ్యానం చేస్తున్నవాడు అనే ప్రక్రియా విధానం. ధ్యాని అనేవాడిని తయారుచేసే ఈ ప్రక్రియనంతా అవగాహన చేసుకోకుండా, ధ్యానం వుండదు. అందువల్ల, స్వీయజ్ఞానం లేకుండా ధ్యానం వుండదు. మనసు ప్రశాంతత చెందకుండా ధ్యానం వుండదు. అయితే ధ్యాని కోరుకోవడం వల్లా, ధ్యాని నిర్దేశిస్తూ వుండటం వల్లా ప్రశాంతత కలగదు. ధ్యాని అనే మొత్తం, సమస్త ప్రక్రియా లేనప్పుడు, ఒక నిశ్శబ్దం – ఒక మౌనం – వుంటుంది. అది మనసు ఒక వూహగానో, ఒక ఆదర్శంగానో తీసుకొచ్చినది కాదు. ఇవి అన్నీ స్వార్థం తనను తృప్తిచెందించుకోవడానికి చిత్రణ చేసుకొన్నవే. ఈ చిత్ర ప్రదర్శకుడు, ఈ ధ్యాని, ఈ స్వార్థి పూర్తిగా లేకుండాపోతే, మొత్తంగా సమాప్తం అయిపోతే, అప్పుడు మనసు చేసిన వుత్పత్తి కానటువంటి నిశ్శబ్దం వుంటుంది. ధ్యానినీ, అతని ప్రక్రియలనూ అవగాహన చేసుకున్నప్పుడు వునికిలోకి వచ్చే ఆ నిశ్శబ్దం ధ్యానం. ఆ నిశ్శబ్దంలో తరిగిపోని సంపూర్ణత్వం వుంటుంది. అది కాలానికి చెందినది కాదు. అందువల్ల అది కొలతలకు అందనిది. ధ్యానం చేసేవాడు మాత్రమే పోల్చి చూస్తూ, తప్పొప్పులు గణిస్తూ, కొలతలు వేస్తూ వుంటాడు. పరిమాణాలు కొలవడం లేనప్పుడే అప్రమేయమైనది వుంటుంది. అందువల్ల, మనసు పూర్తిగా మౌనంగా, నిశ్శబ్దంగా వున్నప్పుడే, పూర్తిగా నిశ్చలంగా, ప్రశాంతంగా వున్నప్పుడే, చిత్రణలు చేసుకోకుండా, ఆలోచనలు లేకుండా వున్నప్పుడే – అప్పుడు మాత్రమే కొలతలకు అతీతమైనది వునికిలోకి వస్తుంది. అయితే ఆ కొలతలకు అందని దానిని గురించి ఆలోచనలు చేయలేము. మీరు ఆలోచించ గలిగినది తెలిసినదానిని గురించి. తెలిసినది తెలియని దానిని అవగాహన చేసుకోలేదు. కాబట్టి, తెలిసినది సమాప్తమైనప్పుడే తెలియనిది వునికిలోకి వస్తుంది. అప్పుడు మాత్రమే నిశ్చలానందం కలుగుతుంది.